# విషయసూచిక

→కాళయుక్తి సంవత్సరము.←

సప్తమసంపుటము.

ఆంధ్ర సాహిత్యపరిషత్పత్రిక.

సంపుటము ౮. | శ్రీ సిద్ధార్థిసంవత్సరము. చైత్రవైశాఖ, జ్యేష్ఠాషాఢములు. | సంచిక ౧, ౨.

# విశాఖపట్టనమండలాంధ్రకవులు

## (2) శ్రీ పూసపాటి తమ్మభూపాలుఁడు

(About 1620—1700 A.D.)

శ్రీ పూసపాటి తమ్మభూపాలుఁడు, (ఉరఫు తమ్మిరాజు) "దుర్గాసాక్షాత్కారము పొంది తనతపఃప్రభావముచేఁ దా నేలురాజ్యమున నేడుగడియలకాలము సువర్ణవృష్టి గురిపించె"నని ప్రసిద్ధి గన్న మాధవవర్మసంతతివాఁడు. ఈ మాధవవర్మసంతతిలోని వాఁడును, 15వ శతాబ్ది కడపటిభాగమున దక్షిణహిందూస్థానములో రాజ్యము చేసినప్రౌఢదేవరాయలకు సమకాలికుఁడును నగు శ్రీ పూసపాటి రాచిరాజునకు నైదవపురుషుఁ డగు గోపాలకృష్ణమరా జీతమ్మ భూపాలునిజనకుఁడు. తల్లి జగ్గమాంబ. వీ రిరువురనుగూర్చియు నీకవి తన 'కృష్ణవిజయము'లోఁ గృత్యాదిని నిట్లు ప్రశంసించియున్నాఁడు.

గీ. సుకవినుతు లైనయారాజసుతులలోన, నీతికుశలుండు గోపాలనృపునిసుతుఁడు
కీర్తివహియించె గోపాలకృష్ణరాయ, విభుఁడు మజ్జనకుండు దోర్విజయశాలి.

సీ. నిత్యపాతివ్రత్యనియమంబునకు తావు సత్యవాక్యమునకు జన్మభూమి
దీనరక్షణదయాదృష్టి కాధారంబు భాగ్యలక్షణములపట్టుగొమ్మ
వినయవర్తనములవిహారణస్థాన మత్యౌదార్యమునకు నేకాశ్రయంబు
నిరుపమానక్షమానియతికి శరణంబు దాక్షిణ్యమునకు నాస్థానజగతి
యనుచు సుజనులు వర్ణింప నలరుఁగీర్తి, కృతివినుతుఁ డైనగోపాలకృష్ణరాయ
వసుమతీనాథుసతి భాగ్యవతి మదంబ, సకలసుగుణకదంబ శ్రీజగ్గమాంబ.

ఈకవి తనరాజ్యమునుగూర్చిగాని రాజధానినిగూర్చిగాని తన గ్రంథమం దెచ్చటను స్పష్టముగ వివరించియుండలేదు. కాని గ్రంథమునందు వేసికొనిన గద్యములోని 'మాధవవర్మవంశాలంకార శ్రీమన్మహామండలేశ్వర, మహీమండల

రాయ, మన్నెసులతాను' మున్నగు విశేషణములనుబట్టి యితఁ డొక గొప్ప మండలాధిపతిగఁ గన్పింపవచ్చును గాని యవి వంశపారంపర్యముగా వచ్చుచున్న బిరుదములై యుండవచ్చునని తోఁచెడిని. ఇంతియెకాక కృత్యాదియం దీతఁడు తన్నుగూర్చి సభ్యు లన్నపలుకులుగఁ జెప్పిన :—

సీ. అనిమేషవృత్తిఁ గైకొను వారి నిరసించి యనిమేషవృత్తిఁ గైకొనెడివారు
కౌశికసఖ్యంబు గాదని నిరసించి కౌశికసఖ్యంబుఁ గాంచువారు
సద్యోవిమానులై చనుట హైన్యం బని సద్యోవిమానులై చనెడివారు
జీమూతమార్గంబుఁ జెందుట తగదని జీమూతమార్గంబుఁ జెందువారు
నగుదురు రణాగ్రభూమి నీయహితనృపులు, గదిసి భేరీమహారవాకర్ణనమునఁ
జిత్తమును మెత్తనై భ్రాంతి చెందిరేమొ, ప్రకటభుజశౌర్య తమ్మభూపాలవర్య.

మున్నగుపద్యము లాతని విక్రమప్రాభవాతిశయములను స్థిరపఱచుచున్నను జరిత్రములయం దీతఁ డొకసామాన్యరాజుగా నెన్నఁబడియున్నాఁడు. విశాఖపట్టనపు డిస్ట్రిక్టుమ్యాన్యూయల్‌నందు సంగ్రహింపఁబడిన సమాచారమును బట్టి చూడఁగా 1652 సంవత్సరప్రాంతమున నీతమ్మభూపాలుఁ డుత్తరసర్కారులకు వచ్చినట్టును నాకాలమున శ్రీకాకుళములో ఫౌజుదారుగా నుండిన షేరు మహమ్మదుఖానునొద్దనుండి కుమిలిభోగాపురములను నిజారాకుఁ బుచ్చుకొని మహమ్మదీయప్రభుత్వమునకు లోఁబడినయొకచిన్నరాజై యుండినట్లును గనఁబడుచున్నది. ఈతనినిగూర్చి డిస్ట్రిక్టుమ్యాన్యూయలులో నిట్లున్నది :—"పూసపాటి వారి వంశములో మాధవవర్మగారు [?] అప్పుడు శ్రీకాకుళంసర్కారులో నొక భాగముగ నుండు విశాఖపట్టణముజిల్లాలోనికి వచ్చిరి. 1652 సంవత్సరములో ననగా రా రాజగు నవురంగజేబువారివలన గోలకొండరాజవంశము నశింపు చేయబడక పూర్వము 35 సంవత్సరముల క్రిందట నాయన వచ్చుట జరిగినది. అప్పటిలో షేరుమహమ్మదుఖాను శ్రీకాకుళములో ఫౌజుదారుగా నుండెను. ఆయనవద్ద మాధవవర్మగారు కుమిలిభోగాపురముల నిజారా చేసిరి." (కార్తికలఘోరవారి యింగ్లీషుగ్రంథమునకు విజాపురపు వేంకటకోదండ రావుపంతులగారి తెనుగు తర్జుమా-501 పుట-).

కార్తీకలుదొరవారిచే నీయఁబడిన మీఁదిసమాచారమునకుఁ బ్రమాణ మేదియో వారు చూపరైరి. క్రీ॥ శ॥ 1652 సంవత్సరప్రాంతమున శ్రీకాకుళము

సర్కారునకు షేరుమహమ్మదుఖానుఁడు ఫౌజుదారుగా నుండినట్టు*డిస్ట్రిక్టు గెజటీయరు (Disterict Gazetteer) నందుఁ గూడఁ గనఁబడుచున్నది. కుమిలె భోగాపురముల రెండింటిని షేరుమహమ్మదు తమ్మభూపాలున కిచ్చినట్టు మ్యాన్యూయల్ చెప్పుచున్నది గాని యంతకుమున్నీకుమిలె స్థానిక లగుపూసపాటివారి (The Local Pusapaties) యధీనములో నున్నట్టుగఁ గొన్ని యాధారములు గానఁబడుచున్నవి. విజయనగరమునకు సమీపమున నున్న వేంకటరాజపుర మనునామాంతరముగల కొతాంఅగ్రహారమును బ్రాహ్మణులకు దానముగ నిచ్చిన ఉషాభ్యుదయ గ్రంథకర్త లగుశ్రీపూసపాటి వేంకటపతిరాజు మహారాజులుంగారు వారిగ్రంథమునం దీతమ్మభూపాలునిగూర్చి ప్రశంసించియున్నారుగాని యాతనిరాజ్యమును గూర్చిగాని నివసించియుండిన పట్టణమునుగూర్చిగాని యేమియు వివరించియుండలేదు. ఈమీఁది కారణములచేత డిస్ట్రిక్టుమ్యాన్యూయలులో నీయఁబడినవృత్తాంత మెంతవఱకు విశ్వాసార్హమో బాగుగఁ బరిశీలింపవలసి యున్నది. అట్టిశోధన గావించి యందలి యథార్థమును గనుఁగొనువఱకును దమ్మభూపాలునికాలము పదునేడవశతాబ్దోత్తరభాగ మనుటయే సమంజసమని తలఁచెదను.

ప్రౌఢదేవరాయలకు సమకాలికుఁ డగుపూసపాటిరాచిరా జీతమ్మభూపాలునకు నాలుతరముల క్రిందటివాఁడు. తరమునకు 30 సంవత్సరముల చొప్పున లెక్కించి చూచినయెడల నీకవికాలము 17వ శతాబ్దముయొక్క యుత్తరభాగమునకు సరిపోవుచున్నది.

ఇంతియేకాక కొతాంఅగ్రహారపుదానశాసనముయొక్క కాలము క్రీ॥ శ॥ 1715. ఇదియే మొదటియానందగజపతిరాజుగారిరాజ్యకాలము. కొతాం అగ్రహారమును దానము జేసిన వేంకటపతిరాజుగారును నీయానందగజపతిరాజుగారును సోదరులు. వీరికి నడుమఁ దమ్మిరాజుగారి (alias తమ్మభూపాలుఁడు) తమ్ముని కుమారుఁడు సీతారామరాజుగారు పదునేనుసంవత్సరముల కాలముమాత్రము

---

* * * * * * * * Two of these chiefs were the cancestors of the present Maha Rajah of Bobbili and Raja of Vizianagram, who entered the district in the train of Sher Muhammad Khan (name-father of Sher Muhammad Puram near Chicacole), who was Foujdar in 1652. *(Gazetteer of the Vizagapatam District—Page 30.)*

రాజ్యముచేసిరి. దీనిని బట్టిచూచినను దమ్మభూపాలునికాలము 17వ శతాబ్దిచివరి భాగముగనే కనఁబడుచున్నది.

కృష్ణవిజయముకృత్యాదిపద్యములయందు నీయఁబడినకృష్ణానదీవర్ణనము, విజయవాటికాపురవర్ణనము, మున్నగువానిని బట్టిచూడఁగఁ నీ యాకృతిని 1652వ సంవత్సరమునకుఁ బూర్వమే—అనఁగా. 1640 సంవత్సరప్రాంతమున వ్రాసియుండవలయు నని తోఁచెడిని.

## గ్రంథకర్తృత్వమునుగూర్చి చర్చ.

ఈ కృష్ణవిజయకర్తృత్వమునుగూర్చి వివాదముకూడఁ గలదు. అచలాత్మజా పరిణయము, బృహన్నారదీయము మొదలగు గ్రంథములను రచియించినక్రొత్త లంక మృత్యుంజయకవి ధనాశకు లోనై దీనిని దమ్మభూపాలునిపేర రచించె నని కొందఱయభిప్రాయము. అట్టియభిప్రాయమును స్థిరపఱుపవలెననియో మఱి యేకారణముననో "అచలాత్మజాపరిణయము" నకుఁ *పీఠికవ్రాసినవా రెవరో శ్రీకృష్ణవిజయమును విజయనగరమహారాజుగారికిని, ధరాత్మజాపరిణయమును అల్లూరి అప్పలరాజునకును, షట్చక్రవర్తిచరిత్రమును మల్లారెడ్డికిని, ఈమృత్యుం జయకవి రచించి యిచ్చినట్టుగా వ్రాయుదురేకాని యట్టితమవ్రాఁతలకుఁ బ్రమాణము లేవో యందుఁ జూపరైరి. ఇట్టి సమాచారము రాజకవులకృతు లతో సంబంధించియుండుట మనకు వింతకాదు. ఆముక్తమాల్యదను రచించిన కృష్ణదేవరాయ లంతమహనీయునకుఁగూడ నిట్టివాదుక కలిగియున్నది కదా! రాయలు విద్యాధికుఁ డనుప్రసిద్ధియుండినను, మనుచరిత్రాముక్తమాల్యదలకు శైలి మొదలగువానియందు భేదము కనఁబడుచున్నను. "ఆముక్తమాల్యద" కర్తృత్వమును బెద్దనార్యునకే యారోపించుచు లక్షణగ్రంథములు వ్రాసిన మనపూర్వకవులు కొందఱు లక్ష్యములు జూపుపట్లను, "పెద్దన్నగారి ఆముక్త మాల్యద"యని వ్రాసియుండలేదా! కాని గ్రంథమును బాగుగఁ బరిశీలించి చూచినప్పుడును, యుద్ధాదివర్ణనలఁబట్టిచూచినను గవి క్షత్రియుఁడై యుండవల యునని తోఁపకమానదు. అంతియకాక శ్రీవీరేశలింగముపంతులుగారు తమ యాంధ్రకవులచరిత్రమునందు మూఁడవభాగమున నాధునికకవులలో నీమృత్యుం జయకవిని జేర్చియున్నారు. ఇతఁడు నూఱుసంవత్సరముల క్రిందటికాలమున

* కాకినాడ సుజనరంజనీ ముద్రాక్షరశాలలో ముద్రితము.

నున్నవాఁడనియు, గోదావరిమండలములోని "గోడి" యను గ్రామమున నితని మనిమనుమ లిప్పటికిని జీవించియున్నారనియు వ్రాసియున్నారు. అందుచే 18వ, శతాబ్దములో జీవించియున్నమృత్యుంజయకవి 17వ, శతాబ్దమధ్యభాగమున రచింపఁబడిన కృష్ణవిజయముతో సంబంధము కలిగియుండుట యసంభవము. ఇంకను నీపూసపాటివంశమునందలి రాజులు కొందఱు కవులై యుండుట యను శ్రుతముగా వచ్చుచున్నది. తమ్మభూపాలునకుఁ బూర్వ మొకరిద్దఱు కవు లున్న ట్టుగ వినియెదము. తరువాతివారిలో వేంకటపతిరాజుమహారాజులుంగారు ఉషాభ్యుదయమును, రేఁగులవలస పూసపాటికుటుంబములోని విజయరామ రాజుగారు విష్ణుభక్తిసుధాకరమును, హారాలక్షణమును రచియించియు న్నారు. అంతేకాక వంశమందలి రాజులందఱును విద్యాధికులు కవిపోషకులు. పద్మనాభయుద్ధమునందు వీరస్వర్గమును గాంచిన శ్రీచినవిజయరామ మహారాజు లుంగారు సంస్కృతాంధ్రములయందుఁ గవిత్వము చెప్పుసామర్థ్యము గలవారని మనకు లభ్యములైయున్న శ్లోకములవలనను బద్యములవలనను దెలియుచున్నది. ఆ ప్రభువరుని దసివాడుకలో నున్నయొక సంస్కృతశ్లోక మిందుఁ బొందుపఱుపఁ బడియున్నది.

శ్లో. అంభోజం కలయన్ సదృక్షు మవనే సాహిత్యరీత్యాం దృశో
　　ర్మాంధాతార మపారసంపది మహాభావే యశోరాశిషు
　　శత్రూణాం పురభంజనే ధృతిగుణే కిం చోరగేంద్రం మతి
　　ప్రాగల్భ్యే ప్రతిభాతి తిమ్మనృపతిః పాకాహితప్రాభవః.

ఆకారణముచేత నీకృష్ణవిజయకర్తృత్వము తగినన్ని ప్రబలనిదర్శనములఁ జూపక మార్చివేయుట న్యాయ్యము కాదు. ప్రాభవ మున్నచోట విద్యయుండఁ గూడదా? రెండును నొకచోట నిలిచియుండుట యరుదైనను గావచ్చును.

## —※ గ్రంథ ప్రశంస. ※—

ఈకృష్ణవిజయ మైదాశ్వాసముల యుత్తమ ప్రబంధము. దీనిని వ్రాయు టకుఁ దనసామాజికులప్రోత్సాహమే కారణ మని కవి యిట్లు చెప్పియు న్నాఁడు.—

ఉ. సంశయమేల యిచ్చటను సర్వగుణాధికు లైనయట్టినీ
　　వంశముభూవరుల్ సుకృతవంతులు కావున నందు నీవుదే

వాంశమునం జనించి చరితార్థులఁ జేసెదు వారి నెల్లఁ ది
గ్మాంశుకులావతంస! సమరార్జున! యర్జునకీర్తివైభవా.

చ. హరివివిధావతారములయందుఁ బ్రశస్తము కృష్ణమూర్తి య
క్కరివరదుండు లోకములు గావ సురేంద్రుఁడు విన్నవింపఁగా
నరకుని సంహరించి లలనామణులం బదియాఱువేల మున్
బరిణయమైనయక్కథఁ బ్రబంధముగా నొనరింపఁగాఁదగున్.

క. అనుసభ్యులవాక్యంబులు, విని నామదిలోనితలఁపు విబుధులవచనం
బును నొక్కటయ్యె నగునని, యనుమోదాపూరితాంతరాత్ముఁడ నగుచున్.

ఇంకఁ బ్రథమాశ్వాసమునఁ గృత్యాదిపద్యములును గృతికర్త వంశా
వళియు శ్రీకృష్ణపుర మగుద్వారకాపురవర్ణనమును శ్రీ కృష్ణునివర్ణనమును గలవు.

పురవర్ణనము.—

చ. బలరిపుపన్నగాధిపులపట్టనముల్ దమలోన హెచ్చుగుం
దులకయి పోరఁగా నది గనుంగొని మాన్పఁదదంతరంబునన్
నిలిపె విరించి యప్పురము నిశ్చయ మిట్టిది కాకయున్నచో
సలలితహర్మ్యశ్రేణిభేయజలసంతతి రెంటిని నంట నేటికిన్.

ద్వితీయాశ్వాసమున వినోదముగా నున్ననాయకులయొక్క సమరక్రీడాను
కూలమగుశరత్కాలవర్ణనము నాయకునియందుఁ గాలోచిత మయినభావపరిణా
మము, దేవలోకమందు నరకునిదుర్ణయములును, వానిబాధనుండి తమ్ము రక్షింప
శ్రీకృష్ణుని వేఁడుటకు దేవేంద్రుఁడు ద్వారకకు వచ్చుట, శ్రీకృష్ణదేవేంద్రుల పర
స్పరమర్యాదలును, నింద్రుఁడు నరకునియుద్రేకముల నుగ్గడించి చెప్పి యతని
సంహారమునకై శ్రీకృష్ణుని సిద్ధపఱుచుట, శ్రీకృష్ణుని నిశ్చయమును, వైనతేయుని
రాకయు, సత్యభామ కృష్ణునితో వచ్చుటకు నాతనిని వేఁడుకొనుటయు నందులకు
శ్రీకృష్ణునియంగీకారమును, సత్యభామా శ్రీకృష్ణులప్రయాణమును, మార్గమందలి
విచిత్రములను శ్రీకృష్ణుఁడు సత్యకు నిరూపించి చెప్పుటయు, నట నరకునిపట్టన
మున దుర్నిమిత్తములు పుట్టుట రాజనీతిప్రసంగము మున్నగునవి యభివర్ణింపఁ
బడినవి.

శరద్వర్ణనము :—

ఉ. ఏరులు గ్రుంగఁ గేకిరుతహేల లణంగ నవీనకాంతిఁ బం
కేరుహముల్ చెలంగ రణకేళికి శూరులు పొంగ మేఘసం

చారము గ్రుంగ గోపనలు శాంతియొయ్యంగ, వియోగిచిత్తముల్
సారెం గరంగ రంగలరుశారదవేళ గడంగె నత్తతిన్.

నరకుని దుర్ణయములు :—

సీ. కల్పితాభీష్టసం కల్పసంతతులట్ల కల్పసంతతులు వైకల్య మొందె
సుందరీసందోహ నందనశ్రీయట్ల నందనశ్రీ నిరానందమయ్యె
సమదనిర్జరచమూశతకోటిగతియట్ల శతకోటిగతి పరాహతిఁ దలంకె
నఖిలామరత్నహర్మ్యాభోగములయట్ల భోగంబులన్నియుఁ బొడవుదరిగెఁ.
గీ. పంకరుహనాభ ! నాభాగ్యపాటనంబు, లెన్నియువియెన్ని వర్ణింపనెట్లునేర్తు
శరణ మిఁక శరణాగతస్వాంతతోష, కరణమగునీదుకరుణయొక్కటియెమాకు.

ఈ సందర్భముననే నాచనసోముని యుత్తరహరివంశమున నిట్లున్నది :—

చ. చొరనిబిలంబులుం వెడలఁ జూడనిక్రంతలుఁ గాలు రాపడం
దిరుగనిత్రోవలుం విడియఁదీర్పనిగొందులు నాలు బిడ్డ లే
కరయనిరేలుఁ జీమ చిటుకన్నను విప్పనిమూశలుం బయిం
జిరుగని చీరలుం గలవె చేరినయీసురకోటి కచ్యుతా.
క. ఇటుమీఁద నాకు నరకుఁడు, కుటులమతిం గీడుచేయఁ గోరెడు నతనిం
జటులతరచక్రధారా, త్రుటితశిరఃకములఁ జేయు తోయజనాభా.

ఈ సందర్భమున నుత్తరహరివంశమునందుఁ గాని శ్రీ మద్భాగవతమునఁగాని సత్యభామా శ్రీ కృష్ణులసంభాషణము పెంచి వ్రాయఁబడియుండలేదు. ఈ గ్రంథమున మాత్రము పగునైదుపద్యములకుఁ దక్కువ గాకుండ నీ సంభాషణము విపులముగను జమత్కారముగను రసోదంచితముగను వ్రాయఁబడినది. ఉదాహరణమునకుఁగా నొకటిరెండుపద్యము లిచ్చటఁ జూపఁబడినవి :—

మ. చపలాలోకములుం బయోధరవిలాసంబుల్ రసోత్కర్షముల్
విపులానందము మీఱఁగా నెరపి ప్రావృట్కాలపుల్ లీల యే
రుపడం జేసి మదీయయాత్రకును సంరోధంబు గావించెదో
యిపు డీరాకకు నేమికారణము తన్వీ వేగ భాషింపుమా.

సీ. చిలుకపలుకులు గావు చెలిమితో విన నీకు సమదభటాట్టహాసములు గాని
చెలులభూషలు గావు చేరికన్గొన నీకు నమరారివికృతవేషములు గాని
గృహదీర్ఘికలు గావు క్రీడసేయఁగ నీకుఁ బ్రకటరక్తస్రవంతికలు గాని
విరులవేటులు గావు వేగ డాయఁగ నీకుఁ గఠినబాణప్రయోగములు గాని

చారుభసలీసలీలసంచారవనవిహారములు గావు వేడ్క సేయంగ నీకు
భయజనకసాహసావహక్రియలు గాని, జేలతన మేల నీకింత నీలవేణి.

ఈ సందర్భముననే భాగవతమున నిట్లున్నది.—

సీ. సమదపుష్పంధయఝుంకారములు గావు భీషణకుంభీంద్రబృంహితములు
వాయునిర్గతపద్మవనరేణువులు గావు తురగరింఖాముఖోద్ధూతరజము
లాకీర్ణజలతరంగాసారములు గావు శత్రుధనుర్ముక్తసాయకములు
కలహంససారసకాసారములు గావు దనుజేంద్రసైన్యకదంబకములు
కమలకహ్లారకుసుమసంఘములు గావు, చటులరిపుశూలఖడ్గాదిసాధనములు
కన్య నీ వేడ రణరంగగమన మేడ, వత్తు వేగమ నిలువుము వలదు వలదు.

తృతీయాశ్వాసమున శ్రీ కృష్ణునిపాంచజన్యరవముచేఁ బురమందలియోధులు యుద్ధసన్నద్ధు లగుట, మురాసురునియుద్ధము, నరకుఁడు శ్రీ కృష్ణుని నెదిరించుట, సత్యభామ యుద్ధమునకు సిద్ధమగుట, నరకునియదలింపు, శ్రీకృష్ణునిప్రత్యుత్తరము, శ్రీకృష్ణునివిజయము, భూదేవి ప్రత్యక్షమై పౌత్రునిచే మ్రొక్కించి శ్రీకృష్ణు నభయము వేఁడుకొనుట, శ్రీకృష్ణభగవానుఁడు ప్రసన్నుఁడగుట, భూదేవివర్ణనము, మొదలగునవి యభివర్ణింపఁబడినవి.

సత్యభామయుద్ధము :—

సీ. సకలసాధ్వీమణి సహజసౌశీల్యధర్మము పూనినట్లు ధర్మంబు పూనెఁ
దారకాభస్థూలతరమౌక్తికములందు గుణముగూర్చినయట్లు గుణముఁగూర్చెఁ
దరిఁ జేరుచున్నరత్నము లందుకొనఁ గేల శరధిఁ జూచినయట్లు శరధిఁ జూచె
జలకేళిఁ జాల మత్సరముతోఁ జెలిమీఁద శరము లేసినయట్లు శరము లేసె
వింతపని యన్నచింత యావంత లేక, తనకు నభ్యస్తమైనచైదంబుగతిని
సముదితాశ్చర్యసంభ్రమదమర మైన, సమరమొనరింపఁజొచ్చె నాచంద్రవదన.

* * * * * *

సీ. నవమందహాసకందళలీల హరిచోట నరిచోట నట్టహాసాంకురంబు
నమృతంబుఁ జిలుక నెయ్యపుఁబలుకు హరిచాయ నరిచాయఁ గోపనిష్ఠురతరోక్తి
విరితూపు . . . బిత్తరిచూపు హరిచెంత నరిచెంత శిఖిశిఖాభరనిరీక్ష
చటులవిద్యుల్లతాసమవృత్తి హరిపజ్జ నరిపజ్జ ననలకీలానువృత్తి

వెలయ శృంగారరసమును వీరరసము, నిరుదెసలయందు వెదచల్లునిగురుఁ జోడి
పోణిమి తెఱంగుఁ గాంచుగీర్వాణసీల, వేణులాశ్చర్యరసధుర్యవాణు లైరి.

ఈసందర్భమున నాచనసోముని “ఉత్తరహరివంశము”న నిట్లున్నది.

మ. అరిఁ జూచున్ హరిఁ జూచుఁ జూచుకములం దందంద మందారకే
సరమాలామకరందఘర్మసలిలస్యందంబు లందంబు లై
తొరఁగం బయ్యెదకొం గొకింత దొలఁగం దోడ్తో శరాసారమున్
దరహాసామృతపూరముం గురియుచుం దన్వంగి కేళీగతిన్.

ఉ. ఊఁచినకత్తి వంచనిపయోరుహలోచన మింటమింటలం
బూఁచినబాణజాలమునఁ బూర్వసుపర్వపురాణగర్వమున్
వేఁచినచందమున్ విపులవీరరసంబున నాత్మచిత్తముం
దోఁచినచందముం దెలియఁ దోఁచిన నచ్చెర లిచ్చ మెచ్చరే.

ఈసందర్భమున శ్రీమద్భాగవతమున.—

మ. పరుఁ జూచున్ వరుఁ జూచు నొంప నలరింపన్ రోషరాగోదయా
విరతభ్రూకుటిమందహాసములతో వీరంబు శృంగారమున్
జరగం గన్నుల గెంపుసొంపు పరఁగం జంద్రాస్త్రసందోహమున్
సరసాలోకనమూహము న్నెరపుచుం జంద్రాస్య హేలాగతిన్.

మ. అళినీలాలక చూడ నొప్పెసఁగెఁ బ్రత్యాలీఢపాదంబుతో
నలఘుస్వేదవికీర్ణజాలకలతో నాకర్ణకానీతస
ల్లలితజ్యానఖపుంఖదీధితులతో లక్ష్యావలోకంబుతో
వలయాకారధనుర్విముక్తవిశిఖవ్రాతాహతారాతియై.

ఈ “కృష్ణవిజయము”ను భాగవతముతోను నుత్తరహరివంశముతోను సరి
పోల్చిచూచినప్పుడు కవి భాగవతమునే చాలవఱకు ననుసరించినట్లుగను నందలి
కథనే తనప్రబంధమునకు ముఖ్యాధారముగాఁ జేసికొనినట్లును మనకుఁ దెలియఁ
గలదు.

ఇంతవఱకు జరగినకథతోనే గ్రంథము పూర్తికావలసియుండును గాని కవి
యీసందర్భము ననుసరించి వేఱొండువిజయమునుగూడ నిందుఁ జేర్చినాఁడు.
అయ్యది పారిజాతాపహరణకథ. భగవంతుఁ డగుశ్రీకృష్ణుఁడు దేవతల్లు తన
యందుఁ జూపినకృతఘ్నతను సహింపక వారి నుచితరీతిని శిక్షించె నని యిందు

స్పష్టపఱుపఁబడినది. పారిజాతాపహరణమునందలి నారదప్రవేశమును, సవతుల కయ్యమును, శ్రీకృష్ణుని సత్యభామ తన్నుటయు మొదలగునవి పూర్తిగ విసర్జింపఁబడినవి.

ఇందలిచతుర్థాశ్వాసమున శ్రీకృష్ణభగవానులు నరకునికుమారుఁడు చేయు నాతిథ్యమును బొందుటకై పురిలోనికిఁ జని యందలివైభవములను జూచుట, చెఱయం దున్న దేవకన్యకలు శ్రీకృష్ణుని మోహించుటయు, శ్రీకృష్ణునకు వారియం దలి యనురాగమును, దేవకన్యకలచిత్తము శ్రీకృష్ణునియందు లగ్నమగుటయు (కవి దీనిని సారూప్యమోక్షముగా వర్ణించినాఁడు) పిదప సాయంకాలము, చీఁకటి, చంద్రుఁడు, రాజనీతి మొదలగు వానివర్ణనము, ద్వారకకు సురకన్యకల ప్రయాణము, దేవేంద్రునిఁ జూడఁ గృష్ణుఁ డమరావతికిఁ బోవుట, అమరావతీపురవర్ణనము దేవనదీవిలాసాతిశయము నగరునందు జరిగినరాజమర్యాదలు మొదలగునవి.

స్వర్ణదీవర్ణనము :—

సీ. అంగీకృతాభంగసంగీతభంగీకభృంగీకులానోన్యసంగమంబు
కేళీపరాళీమరాళీవరాళీచిరాలింగితరథాంగబాలికంబు
భూమామరస్త్రీరామాకరగ్రాహ్యహేమారవిందాభిరామతమము
ధీరానిలాధూతతీరాధికస్ఫీతసారాగసౌరభోద్గారయుతముఁ

గీ. త్రిజగదకళంకవిదళనోదీర్ణపూర్ణ, వారి యనివారితోగ్రభూవారి యచల
దారినగరేందిరామహోదారహీర, కాంచి యిదెకాంచితే యభ్రగంగయబల.

చ. అలజలజోద్భవుం డనిలజాదుల గెల్వఁగలేనిచిత్తజుం
దెలియఁగఁ గాంచి తజ్జయము దిగ్గన వానికి నీఁ దలంచి యీ
నలినశరంబు లన్నియుఁ గనత్కనకంబునఁ జేసెఁ జూచితే
వలయుఁగదా జగంబుల సువర్ణుల గెల్వ సువర్ణకాండముల్.

శచీసత్యభామలయన్యోన్యమర్యాదలు :—

ఉ. అంతట సత్యభామ వినయం బమరంగ సుపర్వదూతికా
సంతతివచ్చి తోకొనుచుఁ జయ్యన నేఁగఁ దదీయమైన శు
ద్ధాంతగృహంబుఁ జొచ్చి యమరాధిపునమ్మకు నర్మిలిన్ శచీ
కాంతకు మ్రొక్కి వారుఁ దను గౌఁగిటఁజేర్చి బహూకరించుచున్.

పంచమాశ్వాసమున వసంతాగమము, శృంగారరసోద్రేకము, పారిజాతాపహరణము, దేవేంద్రునిపై శ్రీకృష్ణునివిజయము, ద్వారకాపురాభిగమనవా, దేవకన్యకలవిరహము, పెద్దలయనుమతిని శ్రీకృష్ణుఁడు వారినందఱను వివాహమాడుట, కల్యాణమహోత్సవము, వనవిహారము, పుష్పాపచయము మొదలగునవి వర్ణింపఁబడినవి. పారిజాతమును పెకలించుట శ్రీకృష్ణుని విలాసముగనే యిందుఁ గవి వర్ణించెను గాని సత్యభామను దానితోఁ బ్రసక్తి యున్నట్లు వ్రాయుట లేదు.

గీ. అమితనిజదానమహిమతో సమతఁగాంతు, నంచుగర్వించునిదియన్న యలుకఁ
కృష్ణుఁ డవ్వేళఁ దనవలకేల లీలఁ, బట్టిపెకలించె నాదివ్యపాదపంబు. [బోలె,

చ. వనిత యొకర్తు కృష్ణుఁ గనువాంఛ మదిం బెనఁగంగ నేగి త
త్కనకగవాక్షపంక్తినెడగానక యొక్కలతాంగి మూఁపుపై
ననువుగ నెక్కి చూచె నది యాభర మేమియుఁ గానదయ్యె నా
ఘనునెడ లగ్నమై మనసు గ్రమ్మర వచ్చుట లేక యుండఁగన్.

సీ. వకులాగమాశోకముకులాగ్రగానేకసకులాంగనానీకచంచరీక
మమితాసవాసారసుమితాగ్ర్యసహకారదమితౌర్యమునిసారధైర్యసార
మసమానవిటపాంతలసమానసుమసంతతిసమానతానంతతిలకవంత
మటనానలసమీరనటనాయితవిహారఘుటనాధికోదారకర్ణికార

గీ. మదయహృదయజశిఖిసముదాయనిరత, దళితవిచలితనిజయుతికలితవిరహ
కటులలితమృదునవరవచటులశుకపి, కానసము గాంచి రొకకేలికాననంబు.

సీ. శ్రుతిపారగతపురోహితముఖోదితమంత్రమధురరావము లన్నిమందిరములఁ
సరసచిరంటికాసందోహ కల్యాణగీతంబు లన్నినికేతనముల
పణవడిండిమశంఖపటహాదివాద్యనినాదంబు లన్నిగృహాంతరముల
గాఢసమ్మదయుతప్రౌఢవందిస్తోత్రకోలాహలము లన్నిశాలలను

గీ. హెచ్చువేడుకఁ గానుకల్ దెచ్చుధరణి, పభులసందడు లన్నిప్రదేశములను
గలుగ నక్కన్యకల నెల్లఁ గౌతుకమున, నన్నిమూర్తుల హరి పెండ్లియాడెనపుడు.

ఈతీరున నీకథల రెంటిని మిగుల మనోహరముగా సమ్మేళనము చేసి యీ తమ్మభూపాలుఁడు తనకల్పనాకౌశలమును జూపి యున్నాఁడు. ఇంతవఱకు నీయఁబడిన పద్యములనుబట్టి కవికిఁ గలనిరుపమానసాహితీపటిమయుఁ గల్పనాకౌశల

మును దేటపడఁగలవు. కవికి సంస్కృతాంధ్రములయందుఁ జక్కనిపైదుష్యము కలదు. ప్రథమాశ్వాసమునందు దండకమునఁ జేయఁబడిన దుర్గాస్తవము కవికిఁ గల సంస్కృతసాహిత్యము వెల్లడిచేయుచున్నది. కాళిదాసమహాకవి శ్యామలా దండకము ననుకరింత మనునుద్దేశముతో దానిచాయనే యీదండకమును నితఁడు చెప్పియున్నాఁడు. తృతీయాశ్వాసమున వివిధవృత్తములను వాడి బంధకవిత్వమునఁ దనకుఁ గలసామర్థ్యము వెలడించుచు నొక సీసపద్యమున నిష్టదేవతా నామగోపనమును జేసియున్నాఁడు. వసుచరిత్ర మొదలగు గ్రంథములఫక్కిని గవిత్వము చెప్పవలయుననెడియభిలాష కవికిఁ గలదని యిందుఁ బెక్కుచోట్లఁ గాన వచ్చుశ్లేషయే సాక్ష్య మీయఁగలదు. మొత్తముమీఁదఁ దమ్మభూపాలునికవిత్వము కదళీపాకమై సంస్కృతపదభూయిష్ఠమై యనర్గళధార గలదై విరాజిల్లుచున్న యది. ఆధునికప్రాబంధికకవులలో నీతఁ డుత్తమస్థాన మలంకరింపఁదగినకవిరాజని నాయభిప్రాయము.

అడిదము రామారావు.

# ఆంధ్రసాహిత్యపరిషదష్టమవార్షికోత్సవ

## స్వాగతోపన్యాసము

(నెల్లూరు, సమ్మానసంఘాధ్యక్షులచేఁజదువఁబడినది.)

నేఁడు ఈవిక్రమసింహపురంబున జరుగనైయుండు నాంధ్రసాహిత్యపరిషదష్టమ వార్షికోత్సవసమ్మానసంఘాధ్యక్షపదవికి నాకంటెను విద్యాధికులును వయోవృద్ధులును గ్రంథావలోకనతత్పరులును కుశాగ్రబుద్ధులు నగు మహనీయు లెందఱో యర్హులై యుండ మామండలవాస్తవ్యులబహుమానదృష్టి నాపైఁ బరఁగుటచేతఁ, గించిద్జ్ఞానము గల నే నీపదవికి ననర్హుఁడ నని నా యంతరాత్మ యెంత ప్రబోధించుచున్నను మహాజనుల నియమనము నతిక్రమింపఁజాలక యెడతెగనియాంధ్రభాషాభిమానము నన్నుఁ బురికొల్పుటచేత విద్యాభిమానులకు విద్వద్వరులకు విద్యాపోషకులకు విద్యాప్రచారకులకు స్వాగతం బీయఁగల భాగ్య మైనను చేకూరు ననుసంతసముతో దీని నంగీకరించితిని.

ఏదయామయునికరుణాకటాక్షవీక్షణంబులచే మన మీసభాస్థలిని భాషాభివృద్ధికరములును భాషోన్నత్యప్రదములును భాషాస్ఖాలిత్యనిర్మూలనదోహదములును ప్రాచీనౌన్నత్యప్రదాయకములును భాషాపోషకంబులును నజ్ఞానతిమిరభాస్కరంబులు శ్రేయోదాయకంబులు నగు విషయంబులం బ్రసంగింప నిర్విఘ్నముగ సమావేశమైతిమో, యట్టిదీనమందారుండును దయానిధియు భక్తవత్సలుండును నగుపరాత్పరుని యవధీరితశారదారవిందము లగుచరణపంకేరుహంబులకు భక్తిపూర్వకనమస్కారంబుల నొసరించుచున్నాఁడ.

దేశారాధనతత్పరులును స్వార్థత్యాగులును బరోపకారపారీణులును నాంధ్రభాషాసేవాభిమానులును నగు తాము దూర మనక, వ్యయ మనక, ప్రయాస మనక, ఎండ యనక, వేసట యనక, మావిన్నప మాలించి యీమండువేసవి నింతదవ్వుల కేతెంచి మాపైఁబఱపిన కృపాకటాక్షములకు మామండలవాసులపక్షమునఁ దమకు నేను వందనసహితస్వాగతము నర్పించుచున్నాఁడను. అస్మదీయసపర్యలలో భ్రమప్రమాదజనితదోషంబు లున్న మన్నింప వేఁడెద,

మాసింహాపురిమండలవాసు లాదినుండియు, నాంధ్రసారస్వతమునందేమి, రాజకీయవ్యవహారనైపుణ్యమందేమి, బలశౌర్యప్రదర్శనముల నేమి, కృషివాణిజ్యాదులందేమి యాంధ్రదేశమునందలి పరమండలములవారలకు వెనుదీసినవారు కారు.

కవిబ్రహ్మ యని మహాకవులచేఁ బొగడంబడి, హరిహరనాథారాధనపరుఁడై భారతమునందలిపదునేనుపర్వంబులను నసమానముగ రచించినతిక్కనమహాకవియును, నెవ్వనికావ్యామృతరస మనుభూతపూర్వ మయ్యు, నెల్లనాగరకుల కెప్పటికప్పుడు శ్రోత్రపేయమై హృదయాకర్షకమగునో యట్టి సకలాగమవేదియు, నష్టాదశపురాణాభిజ్ఞాతార్థవేది యును, నష్టభాషాకవిత్వశ్రీయుతుఁడు ను సర్వజ్ఞుఁడును నగు నాచనసోముఁడును, ఎవ్వఁడు, తన కావ్యచమత్కృతిచే వేమభూపాలునిఁ దన్మయునిఁగాఁ జేసి ధీరోదాత్తుం డై యాంధ్రప్రపంచక మాతయు వీడనాడినభారతారణ్యపర్వశేషమును బూరించి ప్రబంధపరమేశ్వరుఁ డనుబిరుదనామంబు గడించి శాశ్వతకవిత్రయఖ్యాతికిఁ బాత్రుఁడయ్యెనో, యట్టి యెఱ్ఱాప్రెగ్గడయును, నెవ్వఁడాంధ్రభాషకుఁ బ్రథమమున లక్షణగ్రంథము నేర్పఱిచి కవిబ్రహ్మ యగుతిక్కన మెచ్చునట్లు దశకుమారచరితమును జెప్పి “ సంస్కృతాద్యనేకభాషాకావ్యరచనావిశారదుం ” డనియు, “ అభినవదండి ” యనియు బిరుదంబుల గడించెనో, యట్టి కేతనమహాకవియును, ఎవ్వఁడు తాను రచించినవిక్రమార్కచరిత్రంబునఁ జిత్రవిచిత్రంబులగుకథలఁ జొప్పించి రసోదంచితంబుగఁ జేసి, దేవరాయమహారాయమంత్రిసత్తముఁ డగువెన్నెలకంటి సిద్ధనకు నంకిత మిచ్చి మహాకవి యని పేరుగాంచెనో యట్టిజక్కనయు, నెవ్వఁడు క్రీ. శ. పదునేడవ శతాబ్దారంభమునం దుండి మహామహోపాధ్యాయబిరుదము నంది పాండిత్యమహిమచే నలరారి పెక్కుమహాకావ్యముల నొనర్చి ప్రథమాంధ్రద్వ్యర్థి కావ్య మొనర్చి యాంధ్రమాతకు భూషణం బై శాశ్వతకీర్తిని గడించెనో యట్టి యెలకూచి బాలసరస్వతియు, నెవ్వఁడు రాజకీయోద్యోగియై కవియై మహాకవుల పరంపరలో నించుమించుగాఁ జేరఁగల్గెనో యట్టి కంకంటి పాపరాజుగారును, వీరి సమకాలీనుఁడును మిత్రుఁడును సమీరకుమారవిజయాదిగ్రంథకర్తయుఁ బండితుఁడును నగు పుష్పగిరితిమ్మన్నయు, దశావతారచరిత్రమును నింపుగ రచించిన ధరణిదేవుల రామమంత్రి యు, నెవ్వఁడు మొన్నమొన్న భారతముతోఁ దులఁ దూఁగఁదగినరామాయణాదిగ్రంథములు రచించి శ్రీవేంకటగిరిప్రభువును మెప్పించి

యగ్రహారాదిసత్కారంబులఁ బడసెనో యట్టి గోపీనాథము వేంకటకవియు, నీ నెల్లూరుమండలమునందే జన్మించి యీజలాస్వాదనమే చేసి యిందే తమకవితా ధారలఁ గురిపించి యాంధ్రవాఙ్మయాభివృద్ధికిఁ దోడ్పడిరి.

ఏయమ యాంధ్రకవయిత్రులలోఁ బ్రథమస్థానమును గైకొని నిరుపమానకీర్తిని గడించెనో, యేయమ యసమానమృదుమధురలలితపదకవిత్వ మాహాత్మ్యమున ఖ్యాతిఁ గాంచెనో యట్టి మొల్లయు, నేయమ పురుషులకును గూడ నజ్ఞేయ మగు వేదాంతమును కీర్తనలుగ రచించి యింకను గొన్ని గ్రంథములకుఁ గర్తృత్వమును వహించెనో యట్టి తరిగొండ వేంగమాంబయును

క. పగఱకు వెన్నిచ్చినచో, నగరే నిను మగతనంపునాయకు లెందుఁ
ముగు రాఁడువార మైతిమి, పగ పేటికి జలకమాడ వచ్చినచోటన్

అని యాశువుగఁ బద్యమును జెప్పి రణతిక్కనకు వీరోద్రేకమును గల్పించిన వీరపత్నియును, నీవిక్రమసింహపురీమండలనివాసినులే

నెల్లూరుమండలమందలి ధూర్జటి, వెన్నెలకంటి, చిత్రకవి వంశములు పెక్కుసుకవుల నొసంగియున్నవి. ఇట్లే వర్ణింపఁదలఁచినచో మామండలమందలి కవుల పేరులు పుంఖానుపుంఖంబులుగ బయలుదేఱును. కనుక విస్తరభీతిచే సంక్షేపించువాఁడను.

శ్రీనాథమహాకవి యాంధ్రుఁడు కాఁడని కొందఱు వాదించుచుండఁగా నీమహాసభలో నీతం డాంధ్రుండనుటయే కాక మామండలవాసుఁ డని కూడ రుజువు పఱుచుటకు నేను సాహసించుచున్నాఁడ. శ్రీనాథుఁడు రచించిన గ్రంథములలో (1) పండితారాధ్యచరిత్రమును వేమభూపాలునిదండనాయకుఁ డగు ప్రెగడామాత్యునకును, (2) శృంగారనైషధమును వేమభూపాలుని ముఖ్యమంత్రి యగుసింగనామాత్యునకును నంకితములు. (3) శృంగారనైషధమునకుఁ దరువాత రచించిన హ విలాసమును శ్రీనాథుని బాలసఖుఁ డగునవచిదేవయ కుమారుఁడు తిప్పయ కంకిత మిచ్చినట్టు లీక్రిందిపద్యమువలనఁ దెలియుచున్నది.

గీ. ఉభయభాషాకవిత్వప్రయోగకుశలు, బాలసఖు గారవించి తాత్పర్య మొప్ప
నవచిదేవయ త్రిపురారి యతఁడు రాజు, హితకుఁడుక్తులు వెలయఁగ నిట్టు లనియె.

గీ. ఆగమజ్ఞాననిధివి తత్త్వార్థఖనివి, బహుపురాణజ్ఞుఁడవు శుభభవ్యమతివి
బాలసఖుఁడవు శైవప్రబంధ మొకటి, యవధరింపుము నాపేర నంకితముగ.

ఈయవచిదేవయ నెల్లూరువాస్తవ్యుఁడును, గోటీశ్వరుఁడును గుమారగిరి సుగంధభాండాగారాధ్యక్షుఁడును నగు వైశ్యశిఖామణి. ఈ సుప్రసిద్ధవణిగ్వంశమును గూర్చి ముందు చెప్పెదను. పై గ్రంథములకు ముందు రచింపఁబడిన శాలివాహనసప్తశతియును, మరుత్తరాట్చరిత్రమును బాల్యమున రచింపఁబడిన వగుటచే వానిని గూర్చినప్రఖ్యాతి యంతగ లేదు. కాని శ్రీనాథునివార్ధక దశలో రచింపఁబడినభీమపురాణము వీరభద్రారెడ్డిమంత్రి యైన బెండపూఁడి అన్నయకును, కాశీఖండమును వీరభద్రారెడ్డికి నంకితము నొనర్పుటచే నీ రెండు గ్రంథములును రాజమహేంద్రవరమున రచింపఁబడిన వనుటకు సందియము లేదు. ఈమహాకవి రాజమహేంద్రవరమునం దంత్యదశ గడపినట్లును, మధ్యదశ కొండవీడు ప్రాంతములలోఁ గడపినట్లు నీగ్రంథరచనచేతనే తెలియుచున్నది. కాని బాల్యదశ యెందుఁ గడపెనో చూతము. హరవిలాసకృతికర్త యైనయవచి తిప్పయ యీ మహాకవికి బాలసఖుఁడు. అవచితిప్పయ నెల్లూరివాఁ డనుట నిక్కము. కనుక శ్రీనాథుఁడు బాల్యదశయంతయు నెల్లూరునఁ గడపెను. ఇదియును గాక యీ కవి తాను బాకనాటింటివాఁడ నని పలుమాఱు చెప్పికొనియున్నాఁడు. విక్రమసింహపురియుఁ బాకనాటిలోఁ జేరిన దని చరిత్రఁ జదివినమీ కెల్లరకు విదితము. అందుచే బాల్యదశ గడపిన నెల్లూరు పత్తనమే యీ మహాకవికి జన్మస్థానము కాక మఱియొక టెట్లు కాఁగలదు? అదియును గాక యీ మహాకవికి మఱఁది యగు దగ్గుపల్లి దుగ్గనకవి—

సీ. కవిసార్వభౌముఁడై కర్ణాటవిభుచేతఁ గనకత్నాభిషేకములు గనిన
శ్రీనాథసుకవి కూరిమిసేయుమఱఁదివి—

అని తననాచికేతోపాఖ్యానమున వ్రాసియున్నాఁడు. ఈదుగ్గకవి నాచికేతోపాఖ్యానమును నెల్లూరుమండలమునందలి యుదయగిరిప్రభు వగుబసవభూపాలునిమంత్రి యగునవంతామాత్యునిగంగయకు నంకిత మిచ్చియున్నాఁడు. కనుక నీదుగ్గకవియు నెల్లూరు మండలములోనివాఁ డనియే నిశ్చయముగఁ జెప్పవచ్చును గనుగ బాల్యము గడపినట్టియు బాంధవ్యముఁ జేసినట్టియుమండల మీ కవికి జన్మస్థానముకాక మఱియొకమండల మెట్లు కాఁగలదు? కనుక నావాదమునకుఁ బ్రబలము లగుప్రతికూలసాధనములు చిక్కువఱకు శ్రీనాథమహాకవి నెల్లూరు పట్టణవాసుఁడని కాని లేక నెల్లూరుమండలవాసుఁడని కాని నిస్సందిగ్ధముగాఁ జెప్ప

వలెను. ఈ మండలమే భారతకవిత్రయములో నిద్దఱి నిచ్చుటచేతను, దత్తుల్యులగు మఱికొందఱి నిచ్చుటచేతను సలక్షణగ్రంథకర్త్రి యగు ప్రప్రథమకవయిత్రినే యిచ్చుటచేతను భాషాకల్పవృక్షమునకుఁ బెంపు సంపాదించి పల్లవితత్వ కుసుమితత్వ ఫలితత్వదశలను సమకూర్చె నని మనవిచేయువాఁడను.

ప్రస్తుతనెల్లూరుమండలము పూర్వము కొంతకాలము వేఁగినాఁడు, కొంతకాలము వెల్నాఁడు, కొంతకాలము కమ్మనాఁడు, అనునామములను ధరించి వ్యవహరింపఁబడుచువచ్చెను. కాని పాకనాఁడే దీని నిక్కమైననామముగఁ గన్పట్టుచున్నది. మొదట నెల్లూరుమండలము పల్లవరాజులకు లోనై యుండెను. వీరి తరువాతఁ జాళుక్యరాజులకు స్వాధీన మయ్యెను. వీరిపాలనలోఁ గొన్నిదానములు చేయఁబడి శాసనములు వ్రాయఁబడుట తప్ప నెల్లూరుమాండలికుల ప్రతిభ యంతగాఁ గానరాదు. వీరి తరువాత స్వచ్ఛాంధ్రరాజులైన వెలనాటిచోడులకుఁ గొంతకాలమును, గుంటూరు మండలమునందలి కొణిదెన రాజధానిగాఁ గలచోడులకుఁ గొంతకాలమును, కడప మండలమందలి పొత్తపి రాజధానిగాఁ గలచోడులకుఁ గొంతకాలమును, మామండలము వశమై యుండె. పొత్తపి చోడులలో నొకతెగవారు కొంతకాలము స్కందపుర మనుకందుకూరు రాజధానిగాఁ బరిపాలనముఁ జేసిరి. నెల్లూరు రాజు లనందగి నెల్లూరుమండలమునకుఁ గీర్తి తెచ్చిన రాజులు నెల్లూరు తెనుఁగుచోడులై యున్నారు. భుజబలవిక్రమములకుఁ బ్రసిద్ధికెక్కి కాంచీపురమును జయించి యారాజుచేఁ గప్పముం గైకొనిన భుజబలవీర ఎఱ్ఱసిద్ధచోడమహారాజును, బృథ్వీశ్వరరాజును జంపిన తిక్కరాజును నీవంశములోఁ జేరిన ప్రసిద్ధరాజులు. ఈతిక్కరాజుకడనే వీరాగ్రేసరుఁ డగు రణతిక్కనకుఁ దండ్రియుఁ గవితిక్కనకుఁ బెదతండ్రియు నగు సిద్ధమంత్రి యమాత్యపదవి నుండె. కావున వీరాగ్రేసరుఁ డని పేరెన్నికఁ గాంచి వైరివీరులను జెండాడి పశువులబీటికై మనుమసిద్ధికిని గాటమరాజునకును అలవలపాటిలో జరిగినకదనరంగమునఁ గాయమును విడిచి వీరస్వర్గము నధిష్ఠించిన కలియుగపరశురాముఁ డనందగు రణతిక్కనకు మామండలమే జన్మస్థానము. భుజబలదర్పములకుఁ బేరెన్నికఁ గాంచకపోయినను గవిబ్రహ్మను దనయాస్థానమునం దుంచుకొని యాతనిచే భారతాదిగ్రంథములను రచియింపఁజేసి తనకీర్తి చతురాశాకుడ్యంబులఁ జిత్రితంబుగఁ జేసి యాంధ్రమహాజనులకు స్మరణీయుఁడై నెగడిన

మనుమసిద్ధిరాజు నీవంశములోనివాఁడే. మానెల్లూరుమండలమున నెల్లూరు తరువాత అద్దంకి, గుడ్లూరు, ఉదయగిరి, తెట్టు, మోచెర్ల యీపట్టణములును బవిత్ర స్థలములు. ఈపట్టణరాజములు రాజుల కాస్థానము లగుటయే కాక మహాకవుల కునికిపట్టులై యొప్పెను. అద్దంకిపట్టణము రెడ్డిరాజులకుఁ బ్రథమరాజధాని యై మాయెఱ్ఱాప్రెగడ మహాకవిని వెన్నెలకంటి పెదసూరన మహాకవిని నాదరించిన పట్టణము. వినుకొండయందలి రెడ్డిరాజులకును, రాజమహేంద్రమునందలి రెడ్డి రాజులకును నిదియే జన్మస్థానము. రాజమహేంద్రపుర రెడ్డిరాజులు విక్రమసింహపురి, దువ్వూరు, గండవరాళిపత్తనంబుల రెడ్లతో సంబంధబాంధవ్యములను జేసిరని చరిత్ర ముద్ఘోషించుచున్నది, కనుక జగద్విఖ్యాతులును, బండితకవిపోషకులును, నగు రెడ్డిరాజులకు మామండలమే జన్మస్థానము. గుడ్లూరు పూర్వకాలమునుండి ముఖ్యస్థానమై యుండెననుటకు నందలి శాసనములే సాక్ష్యము. ఈపురము ప్రబంధపరమేశ్వరునకు జన్మస్థానమగుటయే కాక వెన్నెలకంటి సూరనచే విష్ణుపురాణమును గృతి నందిన రాఘవరెడ్డికి రాజధానియై కూడ నలరారె. ప్రస్తుతము కందుకూరుతాలూకాలో నున్న గుడ్లూరుపట్టణ మొకానొకప్పుడు గొడగు చక్రవర్తికి రాజధాని యయి యుండె నని విష్ణుపురాణములోని యీక్రిందిపద్యము వలనఁ దేటపడఁగలదు.

సీ. గౌరీసమేతుఁడై గరిమతో నేవీట నేపాకు నీలకంఠేశ్వరుండు
వారాశికన్యతో వర్తించు నేవీట గిరిభేదినుతుఁడైన కేశవుండు
యోగినీసహితయై యొప్పారు నేవీటఁ బసిఁడిపోలేరమ్మ భవునికొమ్మ
పాపవినాశయై ప్రవహించు నేవీట మన్నేఱు మిన్నేటిమాఱటగుచుఁ

గుంజరములు వేయి గొలువంగ నేవీట, గొడగుచక్రవర్తి పుడమి నేలె
నట్టిరాజధాని యై యొప్పు గుడ్లూరు, నొనర నేలుచుండి యొక్కనాఁడు.

తదుపరి తెట్టురాజు లగు వేజెళ్లవా రను క్షత్త్రియరాజులు గుడ్లూరును గొన్నిరోజులు పరిపాలించిరి. ఈవేజెళ్లవారి యాస్థానముననే మోచెర్ల దత్తప్ప, వెంకన్న యను సుప్రసిద్ధకవు లుండిరి. దత్తప్ప వేంకటగిరిపండితప్రభువర్యుని సన్నిధికేగి పండితులఁ బరాభవపఱుచుటకుఁగాఁ బరిపూర్తి చేసికొనియున్న సమస్యల నన్నిటి నపర్గళాశుధారచేఁ బూరించి పండితప్రభువులచేఁ బారితోషికమందెను.

ఉదయగిరిరాజ్యము విద్యానగరరాజులకు మొదటిఖండమై యుదయగిరి దుర్గము కడుముఖ్యమైన దుర్గమై యుండె. వారిప్రతినిధు లుదయగిరియందుఁ గాని నెల్లూరునందుఁ గాని యుండి నెల్లూరుమండలమును బాలించుచుండిరి. వేదభాష్యకర్తయు విద్యారణ్యుల సోదరుఁడును నగు సాయణాచార్యులు రెండవసంగముని మంత్రిగానుండి కొంతకాలము విక్రమసింహపురియందు వసించియుండెను. ఆంధ్రరాష్ట్రము గజపతుల స్వాధీనమై యుండినపు డుదయగిరిని బసవభూపాలుఁడను మాండలికప్రభువు పరిపాలించుచుండెను. ఈతని కాలమున నుదయగిరి, ప్రబోధచంద్రోదయమును రచించిన నంది సింగయ్య ఘంట మల్లయ్య యను కవిద్వయమునకును, బంచతంత్రమును రచించిన దూబగుంట నారాయణకవికిని, నాచికేతోపాఖ్యానమును రచించిన దగ్గుపల్లి దుగ్గనకవికి నునికిపట్టై చెలంగె. ఒంగోలు కనిగిరి పట్టణములు కూడ నతిబలశాలు లగు మందపాటివారను క్షత్రియ రాజులకు రాజధానులై యుండె. శ్రీ వేంకటగిరి వెలమరాజులు పూర్వమునుండి యిప్పటివఱకు నెన్నియో కృతుల నందియు, గ్రంథరచనమునకుఁ బ్రోత్సాహమును జేసియుఁ బండితులఁ బోషించియు, నాంధ్రమాతకు నచ్చినపుత్రులైరి.

రాజకార్యధురంధరు లనియు, భాషాపోషకు లనియు, ఖ్యాతిగడించిన తిక్కయొజ్జయు, దేవరాయమహారాయమంత్రిసత్తముఁ డగు వెన్నెలకంటి జన్నయయు, నుదయగిరి బసవభూపాలునకు నమాత్యుఁడగు వసంతామాత్యునిగంగనయు వేమభూపాలుని మంత్రి యగు రామామాత్యుఁడును మున్నగు ధీమంతులు మా మండలమందలి ప్రసిద్ధమంత్రులై యున్నారు. పెఱమండలముల కేగి యమాత్యపదవుల వహించి శృంగారనైషధమును గృతినందిన మామిడి సింగనామాత్యునకును నాంధ్రకవితామతల్లిని బోషించినవారిలోఁ గార్వేటినగరప్రభువుల యొద్ద నమాత్యపదవి నొంది కృష్ణదేవరాయలయాస్థానంబున నల్లసాని పెద్దన ప్రభువునుం గూర్చి యిట్లు చెప్పెను.

మ. శరసంధానబలక్షమాదివివిధైశ్వర్యంబులుం గల్గి ని
　ర్భరషండత్వబిలప్రవేశచలనబ్రహ్మఘ్నతల్ మానినన్
　నరసింహక్షితిమండలేశ్వరుల నెన్నన్వచ్చు నీ సాటిగా
　నరసింహక్షితిమండలేశ్వరుని కృష్ణా! రాజకంఠీరవా!
　అను పద్యమురీతిఁ దన్నుం గూర్చి

మ. వసుసంపత్తి సువృత్తి భూభృతి దయావైదగ్ధ్యము ల్గల్గి మే
షసముచ్ఛ్రత్వ ఖగత్వ జాడ్యబుధశిక్షాచౌర్యము ల్మానినం
గసవత్క్ష్మాధరరామకృష్ణులను బల్కన్వచ్చు నీ సాటిగాఁ
గసవక్ష్మాధరరామకృష్ణనృపతీ! కాంతామనోజాకృతీ!

అని పద్యము చెప్పిన పాలమంగలము అప్పయ్యకవీశ్వరునకు నాలుగు నూర్లవరా లొసంగి సత్కరించిన మంత్రిసత్తముం డగు కసవరాజు రామకృష్ణమ రాజు, వీరలఁ బోలిన బుద్ధిబలసముపేతుల కెందఱకో మూమండలము జన్మ స్థానమై యలరారెను, గనుక మూమండలమే యాంధ్రకవితామతల్లికిఁ బుట్టి నిల్లని చెప్ప సాహసించెద. కొలిత్తురై యనియు గండగోపాలపురమనియు నామ ములు గలిగి నెల్లూరునకుసమీపమున నుండు కృష్ణాపట్టణ మను రేవుపట్టణము పూర్వము గొప్ప రేవుపట్టణమై, స్వదేశవర్తకులకును విదేశవర్తకులకును నాటపట్టై విరివిగ విదేశవర్తకవ్యాపారములతోఁ బ్రకాశించుచు ధనధాన్యములతోఁ దులఁ దూఁగుచుండెను. ఇందలి వర్తకులు సమావేశమై, మనుమసిద్ధీశ్వరుని యాలయ నిర్మాణముకొఱకును, ధూపదీపనైవేద్యాలంకారములకొఱకును నెగుమతిచేయఁ బడునట్టియు, దిగుమతిచేయఁబడునట్టియు బస్తాలయొక్క మదింపును బట్టి నూటికి నాలుగువంతున నిచ్చునట్లు లొడంబడికలు చేసికొనినట్లులు కృష్ణాపట్టణములోని శాసనము తెల్పుచున్నది. దీనినిబట్టి పూర్వము నెల్లూరు విదేశవర్తకమునకుఁ బ్రసిద్ధి చెందుటయే కాక వర్తకసంఘములు గూడఁ గలిగియున్నట్లు స్పష్టమగుచున్నది.

నెల్లూరుపట్టణమునందు "అవచి" వారను ప్రఖ్యాతివైశ్యు లుండిరి. వారి లో నవచితిప్పయసెట్టి కుమారగిరిరెడ్డికి సుగంధభాండాగారాధ్యక్షుఁడుగా నుండి యాప్రభువర్యునిచే నాందోళికాదిచిహ్నంబులం బడయుటయే కాక ఫిరోజిషా హాంహా రాయలు మెచ్చునట్టి వసంతోత్సవనిర్వాహకుఁడుగ నుండెను. ఈతని కుమా రులును, సోదరులును విదేశవర్తకవ్యాపారములు సల్పుటయందుఁ గడునేర్పరులుగా నుండిరి. ఈ యవచి తిప్పయసెట్టియే కవిసార్వభౌముని హరవిలాసకృతికర్తృత్వ మును వడసినవాఁడు. ఈవంశముయొక్క పూర్వచారిత్రమును దెలిసికొనవలె నని శ్రీయుతులగు చిలుకూరి వీరభద్రరావుగారి యాంధ్రులచరిత్రము మూఁ డవభాగమును జూడనగు. కాని యీవణిక్ఛిఖామణి యొక్క వ్యాపారపు విరివియు, ధర్మబాహుళ్యమును దెలియఁజేయు శ్రీనాథవిరచితపద్యములను కొంటి నిందుఁ బొందుపఱిచెద.

సీ. కట్టించె నొకతాత కంచిహర్మ్యంబులు హరిణాంకమౌళి కేకామ్రపతికి
బాలార్క మనియెడి పద్మరాగము డాఁచె నొకతాత కంచినాయకునినాభి
నొకతాత గట్టించె యోజనత్రయదీర్ఘతరతటాకాంభోధిఁ దిరువళూరఁ
గావేరిఁ గట్టించెఁ గారాపసరాసుల నుబ్బి చోడఁడు మెచ్చ నొక్కతాత
ప్రతిదినముఁ గప్పురంపుదీపములు వేయు
వ్రతముగా నొక్కతాత యీశ్వరున కొసఁగె
నిఖిలలోకప్రసిద్ధవాణిజ్యవంశ
ధరులు మాతాత లుభయగోత్రములవారు.

సీ. పంజాబు కర్పూరపాదపంబులఁ దెచ్చి జలనోగి బంగారు మొలకఁ దెచ్చి
సింహళంబున గంధసింధురంబులఁ దెచ్చి హురుమంజి బలు తేజి హరులఁ దెచ్చి
గోవ సంశుద్ధసంకుమదద్రవముఁ దెచ్చి యాపగ నాణిముత్యాలు దెచ్చి
చోటంగి గస్తూరికాటంకములఁ దెచ్చి చీనిచీనాంబరశ్రేణిఁ దెచ్చి
జగదగోపాలరాయవేశ్యాభుజంగ
పల్లవాదిత్య భూదాన పరశురామ
కొమరగిరిరాజదేవేంద్రు కూర్మిహితుఁడు
జాణ జగజెట్టి దేవయ చామిసెట్టి. హరవిలాసము.

" పెన్నదాటఁగనె పెరుమాళ్లు సేవ " యనుసామెతకు నిదర్శనముగా, నెల్లూరున నెలకొనియున్న శ్రీ రంగనాయకులు మూలప్పేటయందలి మూలస్థానేశ్వరుఁడు వేదగిరియందలి నృసింహస్వామి మొదలగు నిధులును గవిబ్రహ్మచే నుతుల నందిన హరిహరనాథాలయమును గర్భస్థముగాఁ జేసికొని మఱింత పవిత్రయగు పినాకినియు మా మండలమును ప్రకాశింపఁజేయుచున్నవి. హరిహరనాథాలయము నేఁడు దృగ్గోచరము కాకపోయినను నాయాలయ ముండిన చోటు నందఱు నేఁటికి నిది యని చూపించుచుందురు. ఈహరిహరనాథుఁ డొక్క తిక్కనసోమయాజికే కాక నాచనసోమనాథునకును, బంచతంత్రకృతికర్త యగు దైచరాజు వేంకటనాథకవికినిఁ గూడ నిష్టదైవంబై యలరారె.

మనుజున కన్నిబలములకన్న ముఖ్యమైనది బుద్ధిబలము. శక్తి యందులో నున్నది. వ్యక్తి యందులో నున్నది. యుక్తియు నందులోనే యున్నది. భక్తియు నందె కలదు. ధనముకూడ నందే కలదు. గౌరవమును నానందము నందే

కలవు. అట్టి బుద్ధిబలమును పెంచుటకు భాషయొక్క తోడ్పా టత్యవసరము. భాష పెరుఁగనిది బుద్ధి పెరుఁగదు. బుద్ధి పెరుఁగనిదియు భాషయుఁ బెరుఁగదు. ఒక్కొక్క దేశమున నొక్కొక్క భాష యేర్పడి యున్నది. సాధారణముగా భాషను బట్టియే జాతు లేర్పడి యున్నవి. ఒకభాషను మాటలాడుజనులు తమ భాషాభివృద్ధికై సమావేశ మగుట కలదు ; అట్టి సమావేశములకే పరిషత్తు లని పేరు. దేశకాలములనుబట్టి మహాజనాభిప్రాయానుసారముగ భాషయందు పలయు మార్పులు చేయుటచేతనే భాషాభివృద్ధి యగుచున్నది. కవిత్వవిషయమునఁ బూర్వ మేర్పఱుపఁబడిన నియమము లనవసరము లని కొందఱు తలంచుచున్నారు. అది సమంజసము కాదు. నియమరహిత మగు కార్య మెద్దియు రాణింపదు. అది సూత్రము తెగినగాలిపటమువలె స్వోన్నతిం గోలుపోయి యధోగతిం జెందును. మనుజుఁడు, విద్యలందును, వృత్తులందును, నీశ్వరదత్త మగు బుద్ధిబలమునకు లోకానుభవము తోడ్పడుడు, నూత్నాంశములఁ గనిపెట్టుచున్నాఁడు. కవియొక్క యభిప్రాయము లాశ్రయవిశేషముచే గావ్యరూపమున శాశ్వతస్థితి నొందుచున్నవి. కనుక భాషావిషయమున మార్పు లెవరిచిత్తమునకు వచ్చినట్లు వారు చేయక యిట్టిపరిషత్తులలోఁ బండితులతోఁ జర్చించి తేలిన పర్యవసానముల నాచరణలోనికిం గొనివచ్చుట భాషకు శ్రేయోదాయకము.

ప్రస్తుతము ప్రత్యేకముగ నాంధ్రము కఱపఁబడు పాఠశాలలు బొత్తిగా లేవు. సంస్కృతోద్ధరణమునకై యందందుఁ బాఠశాలలు కలవు గాని యాంధ్రముమాట తలపెట్టుకొనినవారే లేరు. ఇఁక నాంధ్రమునకు శరణ్యము మనయాంగ్లపాఠశాల లైనవి. అందును బ్రవేశపరీక్షవఱకు నాంధ్రము నొకవిధముగాఁ గఱపి తరువాత నైచ్ఛికముగఁ జేసిరి. ఆంధ్రభాషం గొని పట్టభద్రుఁడైన, నంతప్రయోజన ముండమిచే బి. ఏ. తరగతిలో నాంధ్రమును గైకొనువిద్యార్థులే యరుదైరి. అందుచే "కుక్క, నక్క, గాడిద" పాఠములతోనే యాంధ్రము ముగియుచున్నది. ఇట్టి పాఠశాలలనుండి బయలుదేఱు విద్యార్థులే మనకుఁ గవులుగా వచ్చుచున్నారు. పదియైన నొకపద్దెమును వ్రాయుద మనిన సమాసములకొఱకు మొదలు చించి చించి నిఘంటువులు వెదకివెదకి యేదియో యొకవిధముగ వ్రాయవలసినవారే గాని పండితాదరణమునకు మాత్రము పాత్ర మగునట్లు వ్రాయఁగలవారుగారు. ఇది యిట్లుండ వ్యాసరచన యొకటి పరీక్షలలో నేర్పాటు కాఁబడియున్నది. ఏ

రుత్కృష్టములైన భాషాగ్రంథములు చదువకుండ నొకగురువునొద్ద శుశ్రూష చేయకుండ వ్యాసరచనఁ జేయవలసినవా రగుచున్నారు. అది యెట్లో తెలియదు.

వ్యాసరచనయు సామాన్యమైనది కాదు. సలక్షణమైన వ్యాసరచనకు నెన్నియో గ్రంథములను జదువవలెను; ఎన్నిటినో నిఘంటువులను వల్లింపవలెను; ఎందఱియొద్దనో విద్యాభ్యాసము చేయవలెను. ఇవి యేవియు లేక యుత్కృష్టవచన రచనఁ గావించు యత్నములు సల్పఁబడుచున్నవి. అది దుస్సాధము. పూర్వకాలంబున నాంధ్రవిద్యాగురువులు పెక్కు రుండి శిష్యులఁ జేరఁదీసి యాంధ్ర విద్యా దక్షులనుగాఁ జేసి రాజాస్థానముల కంపుచుండెడివారు. ఇప్పు డట్టి గురువర్యులు కానరా రైరి. కాన నాంధ్రవిద్య యడుగంటవలసినకాలము వచ్చినది. మన యాంధ్రకవు లల్లసాని పెద్దన తరువాతఁ బ్రబంధములు కుప్పలుకుప్పలుగ నొకేవిధముగ వ్రాసి రనుదోషము మనము వారి కారోపించినను నూతనాభిప్రాయానుసారముగ మనము చేసిన దంతగాఁ గానరాదు పూర్వపుఁ గవులు వారు చేపట్టినదాని నంతయు నతిసమర్థతతో నిర్వహించిరి. "ఉభయవాక్ప్రౌఢి"చే నలరారు నన్నయకవిత్వమును, "రసాభ్యుచితబంధము"లచే నొప్పు తిక్కయజ్వకవిత్వమును "సూక్తివైచిత్రి"చేఁ బ్రకాశించు ప్రబంధపరమేశ్వరుని కవితయు, గంభీరార్థపదజటిలప్రభాభాసురం బైన నాచనసోముని కవిత్వమును, ననర్గళమృదుధారాప్రసారం బైన శ్రీనాథుని కవితయు, శ్లేషార్థభూయిష్ఠం బైన భట్టుమూర్తికవితయు మఱియొకరికి లభించునవి కావు. ఇవి సంస్కృతాంధ్రపూర్ణ పాండిత్యముచే నలవడినవే కాని యల్పజ్ఞానముచే నలవడినవి కావు. కనుక నీ సాహిత్యపరిషత్తునందుఁ జర్చింపవలసిన రెండవ విషయము మన భవిష్యదాంధ్ర గ్రంథకర్తలను సంస్కృతాంధ్రములయందుఁ బూర్ణపాండిత్యము కలవారిఁగాఁ జేయు టెట్లనునది యై యున్నది. రాజపోషితసాధారణపాఠశాలలం దాంధ్రభాష ప్రథమభాషగను, ఆంగ్లభాష ద్వితీయభాషగను గఱపినచో నీకార్యము సులభముగ నెఱవేఱవచ్చును. ఇట్లు చేసినచో నల్పజ్ఞానముగల మన ప్రథమపరీక్షాపట్టభద్రు లాంధ్రమునం దైనను నిప్పటికన్నఁ గొంచె మధికజ్ఞానము కలవారగుదురు.

తరుచుటచేతనే మంచికార్యము లన్నియు నెలునడినట్లు చరిత్ర ముద్ఘోషించుచున్నది. తరుచుటచేతనే యగ్ని ప్రజ్వరిల్లె; తరిపిడిచేతనే రత్నమునకు విలువ హెచ్చె; తరుచుటచేతనే పాలలోనుండి వెన్న వెల్వడియెను; ఒరపిడిచేతనే బంగా

రమునకు వన్నె తెలుచున్నది. అట్లే విమర్శించుటచేత భాషాగౌరవము హెచ్చుచున్నది. ఆంధ్రభాషకు విమర్శనగ్రంథములు లేవు. ఒక్క నరసభూపాలీయ ముండినను నందు వాఙ్మయవిమర్శనము లేదు; నాటకవిమర్శనము పొత్తిగాఁ గానరాలేదు. కొలఁదికాలముక్రిందట నీమండలవాస్తవ్యులగు పూండ్ల రామకృష్ణయ్యగారు తమ యముద్రితగ్రంథచింతామణియందు సంస్కృతఫక్కితో విమర్శనలను జేయ నమకట్టిరి గాని నిక్కముగాఁ జింతామణియే యనందగు నా 'చింతామణి' యచిరకాలములోనే యదృశ్యమయ్యె. సంస్కృతాంగ్లములకు విమర్శనగ్రంథములు చాలఁ గలవు గనుక నాంధ్రమునకు నట్టిగ్రంథము లుండుట యత్యావసరము. శ్రీయుత కట్టమంచి రామలింగారెడ్డిగారు పాశ్చాత్యవిమర్శనా పద్ధతిని "కవితత్త్వ విమర్శన" మను నొకపొత్తమును నూతనమార్గమున వ్రాసి యాంధ్రప్రపంచమున కందఁజేసిరి. ఇట్టిగ్రంథము లాంధ్రమునకు లేనిలోటు నివారింప మార్గదర్శకులై యట్టిమార్గమును జేకొని గమ్యస్థానమును జేరఁ బరిషత్తువా రుద్యమింపవలెను. ఆంధ్రమునకు సంస్కృతవ్యాకరణము ననుసరించి లక్ష్యము చేయఁబడినను సంస్కృతమున కుండు పరిమితియగు నియమము లాంధ్రమునకు లేవు. అన్యభాషామిశ్రపదము లెన్ని చేరినను భాష కొంచెమైనను మాఱక వ్యాకరణమును శబ్దసౌష్ఠవమును జెడక జగద్విఖ్యాతయశోవిరాజితుం డగు శ్రీకృష్ణదేవరాయలచే నాముక్తమాల్యదయందుఁ జెప్పఁబడిన 'దేశభాషలందుఁ దెనుఁగు లెస్స' యనునానుడి యిప్పటికిని సార్థక మగుచున్నది. ఇట్టి తెనుఁగునకు వ్యాకరణములు బహుస్వల్పము. వానిలోను బూర్వకాలంబున గీర్వాణమున కుండు నాధిక్యమును బట్టి నన్నయభట్టీయాథర్వణకారికాదులు సంస్కృతముననే వ్రాయఁబడుటచే నాంధ్రమునే యభ్యసించువిద్యార్థుల కందరాని వయ్యెను. తెనుఁగున కొక్క బాలవ్యాకరణమే శరణ్య మయ్యె. సూర్యరాయనిఘంటువును వ్రాయించి యాంధ్రప్రపంచముయొక్క గొప్పలోటును దీర్ప నమకట్టిన పరిషత్తువారు, ఆంగ్లసంస్కృతములకుం బలె నాంధ్రమునకు సలక్షణమై లేని సంపూర్ణ మగు వ్యాకరణమును రచియింపఁజేసి యాలోటునుగూడఁ బాపవలసినవారై యున్నా రని విన్నవించెద. ఇచ్చటికి విచ్చేసినసభ్యుల కందఱకును మఱియొకమాఱు నామనఃపూర్వకస్వాగతము నిచ్చి యింతటితో విరమించెదను.

రాజా సీతారామచంద్ర శ్రీరంగభూపాలబాలేరావు.

# సాహిత్యము.

(నెల్లూరు పరిషద్వార్షికసభలోఁ జదువఁబడినది.)

సహితభావము సాహిత్య మగును. విగ్రహమువలననే సాహిత్యమున నేయేవి చేరుచున్న వనునాకాంక్ష స్వతస్సిద్ధముగఁ బుట్టుచున్నది. ఆయావిద్యలందును, కళలందును, బరిచయాతిశయమును, నైపుణమును నుద్దేశించి యాయాపురుషుని కయ్యయిదానియందు సాహిత్యము గల దని వాడుట గలదు. అసమర్థత వలన సాహిత్యము చాల దని చెప్పుటయుఁ గలదు. ఈసాహిత్య మేకదేశము.

ఈవిద్య, యావిద్య, యీకళ, యాకళ యను నిర్దేశము లేక యనిర్వచనీయ మగు "సాహిత్య" మనునొకానొకస్వతంత్రవస్తు వున్నటులు సాహిత్యశబ్ద ముపయోగింపఁబడుట గలదు.

సంగీతప్రపంచమునను సాహిత్యప్రచారము గలదు. కేవల సరిగమాదుల ప్రస్తారము స్వరమనియు స్వరముల కాశ్రయమయి భావప్రబోధకము నర్థవంతము నగు మృదుమధురపదఘటిత మగు గీతము (పాట) సాహిత్య మనియు వ్యవహారము కలదు. గాయకసాహిత్య మిట నప్రస్తుతము.

హైదరాబాదు ప్రాంతములలోఁ బుణ్యసతు లతిథుల కర్పించు భోజనద్రవ్యముల సాహిత్యమందురు. భోజనసాహిత్యవైభవ మెన్నఁ దఱిగాదు.

లాక్షణికులు గొందఱు దమ గ్రంథబిరుదనామముల "సాహిత్య"ముం జేర్చుకొని యున్నారు. సాహిత్యదర్పణ సాహిత్యరత్నాకరము లిందు కుదాహరణములు. ఈ రెంట సాహిత్య మననేమో తెలుపఁబడియుండలేదు. సాహిత్యనిర్వచనము వెలుగఁజేయనక్కఱలేక యే గ్రంథస్థ విషయమే ప్రతిజ్ఞానిర్వాహక మగుచున్న దని వీరి యభిప్రాయము గాఁబోలును. అట్లయిన వీరిసాహిత్యము కావ్యరచనయందే పర్యాప్త మగుచున్నది. కావ్యప్రకాశికయు నీవిషయమున నీరెండు గ్రంథములతో సాటియే యగుచున్నది.

సాహిత్యశబ్దవ్యాప్తి కావ్యలక్షణపరిచ్ఛిన్న మగుటయందే సమాప్తమా లేక దీని కితోఽధిక వ్యాప్తి కలదా? సాహిత్యపథకమున మల్లినాథసూరిని మించిన వారిప్రశంస మెచ్చుటను గానరాదు. స్వవిషయమున.

వాణీం కాణభుజీ మజీగణ దవాసాసీచ్చ వైయ్యాసికీ
మన్తస్తంత్రమగం స్తపన్నగగవీగుంఫేషుచాజాగరీత్
వాచామాకలయ ద్రహస్య మఖిలం యశ్చాత్తపాదస్ఫురాం ।

* * * * *

అని చెప్పుకొనియున్నాఁడు.

సాహిత్యరత్నాకరతరంగములు ధర్మసూరిని బదవాక్యప్రమాణపారావారపారీణ శ్రీమహామహోపాధ్యాయుఁ డని యుద్ఘోషించుచున్నవి. మల్లినాథసూరియు నీబిరుదములను వహించియున్నాఁడు. పదవాక్యప్రమాణము లనుక్రమమున వ్యాకరణ పూర్వమీమాంసా న్యాయ వైశేషిక పర్యాయము లనియు మహామహోపాధ్యాయుఁడన సాంగవేదాధ్యేత యనియుఁ బూర్వాచార్యులుగ్రహించియున్నారు. సాహిత్యవిశిష్ట మగుసహితభావము తర్కవ్యాకరణాది సకలశాస్త్ర సమవాయమున కన్వయించుచున్నది. ఈగణమున కుపలక్షణముగ మల్లినాథసూరిని గ్రహించి చూచిన నివన్నియు నాయనయం దొప్పియున్నవి. ఆయన వ్రాసిన సంజీవని ఘంటాపథ సర్వంకష జీవాతు ప్రభృతులనన్నింటిని బరీక్షింప నక్కఱ లేదు. మాఘవ్యాఖ్య యగు సర్వంకష మొకటియే సాహిత్యవైభవమును బ్రకటింపఁజాలియున్నది. పదవాక్య ప్రమాణ పారావార పారీణతకు స్థానమైనదియె సాహిత్య మననగు. అట్టిసిద్ధి గలవిద్యాగరిష్ఠునకే మహామహోపాధ్యాయ బిరుదము లభించుచుండెను. "సాహిత్య"మునకే "సాహితీ" యను స్త్రీలింగరూపమును గలదు. ఈరెంటికి నర్థభేదముగానరాదు. "తర్కాలంకారశబ్దానాం సంహతి స్సాహితీ మతా" యను నొకవాక్యముగలదు. సాహిత్యపరిధికి బహిర్గత మయిన విషయమే లేదని పూర్వుల యభిప్రాయము. కవియందును నిట్టినిరీక్షణయే యుండినది.

"నతచ్ఛాస్త్రంనతచ్ఛిల్పంనసావిద్యా నసాకళా । జాయతే యన్నకావ్యాంగం" అను కవిభారముకంటె సాహిత్యభరము లఘుతరము గాఁజాలదు. ఇట్టి ప్రజ్ఞావ్యాప్తియె సాహిత్యవిషయము.

ఇట్టి సర్వజ్ఞత్వమునె "వ్యుత్పత్తి" యనియుఁ జెప్పుదురు. ఈరెండింటి యాశయములు సామాన్యప్రతిపత్తిగలవిగనె కన్పడుచున్నవి.

రుద్రటుఁడు శక్తివ్యుత్పత్త్యభ్యాసములను గావ్యకర్తకు విధించియున్నాఁడు. "ఛన్దోవ్యాకరణ కళాలోకస్థితి పదార్థ విజ్ఞానాత్ । యుక్తాయుక్తవివేకో వ్యుత్పత్తి

రియం సమాసేన ” యని వ్యుత్పత్తిలక్షణముం జెప్పియున్నాఁడు. ఇదియే సమాస లక్షణ మఁట. “ విస్తరతస్తు కిమన్యత్తత ఇహవాచ్యం । నవాచకం లోకే నభవతి యత్కావ్యాంగం సర్వజ్ఞత్వంతతోఽన్యేషాం ” ॥ ఇందువలన వైదుష్య పక్షమున వ్యుత్పత్త్యతిరిక్తవస్తువు లేదని చెప్పనగును. సాహిత్యప్రకర్ష మట్టిదిగాకున్న నది గాయకుని చిలుకపలుకుల సాహిత్యమో లేక పైఁజెప్పిన స్వయంపాక సాహిత్యమో గాఁదగును. వాల్మీకికాలముననే సంస్కృతమునకుఁ గొలఁదిగ దుర్గతి ప్రారంభించినది కాఁబోలు. అటుగాకున్న “ సంస్కారేణ యథాహీనాం వాచమర్థాంతరంగతా ”మను నుపమానముతోఁ బ్రవాసక్లేశితయగు సీత నేల వర్ణించియుండును. ప్రాచేతసుని భాషానుభవమెట్లుండినను వివక్షితమగు సాహిత్య శబ్దమునకు సంస్కారహైన్యము లేక యర్థచ్యుతి గలుగుట విపరీతముగ నున్నది. “ వాణీంకాణభుజీ ” మిత్యాది శ్లోకాభిప్రాయముల కాకరమై ఛన్దోవ్యాకరణ కళాలోకస్థిత్యాది ప్రమాణముల కాదర్శమై సర్వతః పూర్ణమై సర్వజ్ఞత్వ లక్షితమైనట్టి “ సాహిత్య ” మెట్టకేలకు సంకుచితమై పాండిత్య భిన్నమైన యవ్యవస్థపాలైనటులు దోఁచుచున్నది.

సంగీత సాహిత్య విహీనుని బుచ్ఛవిషాణహీన మగుసాక్షాత్పశువుగ భర్తృహరి వర్ణించియున్నాఁడు. ఈవాక్యములోని సాహిత్యశబ్దార్థ మెద్దియైనను భర్తృహరికాలమునకు సంగీత కళలు సాహిత్యాతిరిక్తములుగ భావింపఁ బడినట్లు స్పష్టమగుచున్నది. వ్యాఖ్యాత యొకఁడు సాహిత్య మనఁగాఁ గావ్యాలంకారాదు లని యర్థము వ్రాసియున్నాఁడు.

విశ్వగుణాదర్శరచనా కాలమునకు సాహిత్య ముభయచరముగ నుండినటులున్నది. గ్రంథకర్త కవిప్రశంసచేయుచు విబుధోత్తంసప్రశంసాస్పదమగు కొన్ని ద్వంద్వములకు సాహచర్యము నపేక్షించి “ సంపన్నిర్మద భావయో రనఘయోస్సాహిత్యపాండిత్యయో ” రిత్యాది పఠించియున్నాఁడు. సాహిత్యపాండిత్యములన్యోన్యాభావము లగుభిన్నవస్తువులని దీనివలన సూచన యగుచున్నది. ఇందు సాహిత్యమన నెట్టిదోయని చూడ “ సాహిత్యంకావ్యాలంకారాది ” యనియు “ పాండిత్యం తర్కాది శాస్త్రేషు ప్రావీణ్య ” మనియుఁ బదార్థచంద్రికాఖ్యవ్యాఖ్య పలుకుచున్నది.

ఈ గ్రంథముననే శ్రీ వేదాంత దేశికులవారి పారమ్యవర్ణనమున నిటు లున్నది.

శ్లో॥ "నానామ్నాయ పరిశ్రమం కలయతాం నాస్త్యేవ శాస్త్రేషుధీః
సత్యోరవ్యుభయోస్తయోర్న సులభా సాహిత్యతాసాహితీ
అప్యేతాసు సతీషు నాస్తివినయో నాచారభక్తిక్షమా
చాతుర్యస్సచ సాచ సాచ సచతాశ్చాలంబ్య ఖేలన్త్యముమ్ ॥

ఇచ్చట "సాహితి"యనఁగఁ "బదార్థవ్యుత్పత్తి"యని వ్యాఖ్యాతమైయున్నది.

ఒకకవిప్రయోగమునందే సాహితీసాహిత్యములకు వెవ్వేఱుగ నర్థకల్పనలు చేయఁబడియున్నవి. మఱియు సాహిత్యపాండిత్యములు భిన్నవస్తువులుగఁ జెప్పఁబడియున్నవి.

భోజచరిత్ర మేకాలమున రచింపఁబడినదో స్పష్టము గాకున్నది. అందును వీణాకవి—

"తర్కవ్యాకరణాధ్వనీనధిషణో నాహం నసాహిత్యవి న్నోజానామి విచిత్రకావ్యరచనా చాతుర్యమత్యద్భుతం"

అని తనదైన్యమును వెలిఁబెట్టుకొనెను.

ఈశ్లోకమున "సాహిత్యము" తర్కవ్యాకరణాదులకంటెను గవిత్వము కంటెను వేఱుగఁ జెప్పఁబడియున్నది.

"సంచర సాహితి వత్సే శ్రవసో రుపకంఠమేవ రసికానాం। నోచే దానఖమూడం తార్కికభల్లూకమల్లదష్టాస్యాః॥"

అని యొకరు సాహితివత్సకు హితోపదేశముఁజేసి యుండుటను జూడ వారి మతమున సాహిత్యము శాస్త్రపాండిత్యము నెదుట నిలువఁజాలని పసి కూనయైనట్లు తోఁచెడిని.

శ్రీహర్షనైషధమున భీమరాజునకుఁ బ్రసన్నమైన సరస్వతీదేవి "గంధర్వవిద్యాధరకంఠనాళాత్రయీమయీభూతవళీవిభంగా। సాహిత్యనిర్వర్తిత దృక్తరంగా॥" యని వర్ణింపఁడియున్నది. నారాయణీయవ్యాఖ్యలో "సాహిత్యేన మహాకావ్యనాటక చంపూప్రభృతినా శుక్ల నీల రక్త వర్ణసాహిత్యేన వా నిర్వర్తితా నిర్మితా"యని శ్లేషానుగణితముగ నర్థము వ్రాయఁబడియున్నది.

మల్లినాథసూరి 'జీవాతువు' లభింపలేదుగాని తదనుసారియగు జీవానంద విద్యాసాగరుని టీకయందు "సాహిత్యేన" యనుపదమునకు "కవిత్వేన" యని యున్నది.

వేదవిద్యలును సంగీతవిద్యయుఁ గాని వన్నియు " సాహిత్య " శబ్దమున నిమిడియుండినవని శ్రీహర్షుని యాశయముగ నుండవచ్చును. అట్లుగానిచో వేదములను గంధర్వవిద్యను మాత్రము వేఱుగ నుచ్చరించి కవిత్వమును మాత్రమె సాహిత్యమునఁ జేర్చుటచేఁ దర్క వ్యాకరణ మీమాంసాదులకు సారస్వతపవిత్రత లేదని చెప్పవలసియుండును.

స్థాలీపులాకన్యాయముగఁ జూపఁబడిన సంస్కృతాధారములలో సాహిత్య స్వరూపము నైకవిధమని యేర్పడుచున్నది. సాహిత్య సంవిధానమున నిట్లు భావ వ్యత్యయము గానవచ్చుచున్నది. సాహిత్యశబ్దమున కెన్నఁడు యౌగికార్థ ముండఁజాలదు. గౌణముగ నేవిషయమున కనువర్తింపఁజేయఁబడియుండిన నయ్యదియు రూఢిగాక వికృతిఁజెందుచున్నది.

ఇఁక నీసాహిత్యమును దెలుఁగుకంటఁ జూచినచోఁ బద్యరచనయందుఁ దప్ప వేఱువిషయమున దీనికిఁ బ్రచారమే లేనట్లు కన్పడుచున్నది. కేతన భాస్కరమంత్రిని సాహిత్యవిద్యాపారీణుఁ డని స్తుతించియున్నాఁడు. ఆవిద్య యేదిగ నుండునో విచారింపవలయు.

విక్రమార్కచరిత్రము నంకితము నొందిన సిద్ధమంత్రి " జనితసాహిత్య సౌహిత్య సరసగోష్ఠిఁ జిత్త మిగురొత్తఁ గూర్చుండి " పెద్దయామాత్యుని నెల్లూరి తిరుకాళమనుజవిభుని సమ్ముఖమున సాహిత్యసరణి మెఱసినవానిగఁ బ్రశంసించియున్నాఁడు. ఇచటి సాహిత్యముల కర్థ మేమిగా నుండును ?

శృంగారనైషధమున శ్రీనాథుఁడు సరస్వతీదేవిని " గాంధర్వవిద్యాకళాకంఠనాళాం త్రివేదీవళీం సారసాహిత్య సౌహిత్య నిర్వర్తిత ప్రోల్లసద్వృత్తరంగాం " అనివర్ణించి యున్నాఁడు. ఈదండకభాగము హర్షనైషధములోని పూర్వోదాహృత శ్లోకమున కాంధ్రీకరణము. " శబ్దం బనుసరించియు, నభిప్రాయంబు గుఱించియు, భావం బుపలక్షించియు, రసంబు పోషించియు " నను మొదలగు శ్రీనాథుని ప్రతిజ్ఞల కిది యొకనిదర్శనము. ఇందుఁగల " సాహిత్య "మునకుఁ గవిత్వ మనియె సర్వంకషావ్యాఖ్యానమై యున్నది.

వసుచరిత్రమున, "సంగీత సాహిత్యనామకవిద్యాయుగళంబు పల్కుఁజెలికింబాలిండ్ల జోడై "నటులు వర్ణితమై యున్నది. సాహిత్యస్వరూపమెట్టిదో సోమకవి వ్యాఖ్యానమునఁ గానరాదు. సాహిత్య మనఁగా సాహితి యని యర్థము వ్రాసి

యున్నాఁడు. గ్రంథకర్త 'చతుర్విధకవితానిర్వాహకసాహిత్యరసపోషణుఁ డను బిరుదు వహించియున్నాఁడు. ఈతఁడు రసపోషణ గావించిన సాహిత్యము కవిత్వనా వేఱొండగునా తెలియవలయు.

కళాపూర్ణోదయంబున "సారవత్సాహిత్య సౌమనస్యంబు" తెలుఁగుట సత్కవి లక్షణముగఁ జెప్పఁబడియున్నది.

ఆంధ్రసాహిత్యస్వరూప మెట్టి దని స్పష్టముగ నిరూపించుటకు సాధన మేర్పడలేదు. పదవాక్యప్రమాణపారావారపారీణుఁడును, జతుర్దశవిద్యాపారంగతుఁడును నగు మహోపాధ్యాయబిరుదాంకితుని విశిష్టస్వత్వ మగు సాహిత్యము కవనశక్తికిఁ బర్యాయ మయినది. రుద్రటుఁడు గన్న "వ్యుత్పత్తి" యీనాఁటి "సాహిత్య" మనఁ జెల్లునా ? గురూపదిష్టవిధముననో లేక పరమగురూపదేశమగువ్యాఖ్యానసాహాయ్యముచేతనో ప్రతిపదార్థముఁ జెప్పఁగలుగుటయే యాంధ్రసాహిత్యపరాకాష్ఠ యన నేరికైన నోర్వఁదరమా ?

"చత్వారో వేదధర్మజ్ఞా పర్షత్త్రైవిద్య మేవవా" యని పరిషల్లక్షణము యాజ్ఞవల్క్యస్మృతియందున్నది. ఇట్టిపరిషత్తు, ఆంధ్రసాహిత్యమునకు ఘటింపదు. పలువురు విద్యాధికులు విద్యాభిమానులుఁ జేరిన సభయె పరిషత్తని గ్రహింపనగు. పరిషత్తనఁగ సభయనియె యమరుఁడు చెప్పియున్నాఁడు. దానికేలాటి విశేషములఁ జేర్పలేదు.

ఈపరిషత్తునకు నెనిమిదవయేఁడగుటచే సంస్కారార్హ మగుదశ ప్రాప్తించియున్నది. ఆంధ్రసాహిత్యాభివృద్ధికై నెలకొన్న యీమహాపరిషత్తు "ఆంధ్రసాహిత్యము పరాపేక్ష లేకుండ స్వతంత్రమై నిలువఁగల స్థితిఁజెందునట్లు, యత్నింపవలయును. స్వారాజ్య దిదృక్షతో నున్నవారు భాషాప్రపంచమునను స్వారాజ్యము నధిగమింపవలెను. సంపాదింపవలెను. వ్యాకరణాలంకారములపైఁ దప్ప నితరవిషయముల స్వతంత్ర గ్రంథములు తెలుఁగున లేవు. "శిశుపాలవధ"కు మల్లినాథసూరి వ్రాసిన సర్వంకషాఖ్యవ్యాఖ్యాన మంతయుఁ బరికించిచూచిన నాయన పాండిత్యాతిశయమటుండ సంస్కృతవాఙ్మయమునఁ గలవివిధశాస్త్రపరిచయమును గలుగును.

తిక్కనభారతము పోతనభాగవతము గాక శృంగారప్రబంధములే ప్రాయశః ఆంధ్రభాషాసంతతికిఁ బైతృకమహార్థికము లయి యున్నవి. మరుస్థలములోని

జలాశయములవలెఁ గ్వాచిత్కముగ మనుచరిత్రాదు లగుకొన్ని యుత్తమకావ్యములును గలవు. తెలుఁగుశతకములు, యక్షగానములు, ద్విపదలు, మంజరులు, నసమానములు. నాటకభాషకుఁ దెలుఁగు పనికిరా దని మునుపటితరమువారి యభిప్రాయమై యుండెను. ఇటీవలఁ బ్రబలిన నాటకజాల మీయపవాదమును దూరీకరించుచున్నది. స్కాటు, డికెన్సు, ఫీల్డింగు, థాకరె, లిట్టను మొదలగు వారి యుత్తమనవలలం బోలిన నవల లింకను బయలువెడలకపోయినను గొలఁది పాటిగఁ బాఠయోగ్యమైన నవలల నాంధ్రాభిజ్ఞులు వ్రాయుచున్నారు.

జ్యోతిష శారీరక జంతుశాస్త్రాది పరిజ్ఞానసంపాదకముగఁ గీర్తిశేషు లగు రావు బహదూరు వీరేశలింగముగారు కొంతవడి త్రోవఁజూపిరి. విజ్ఞానచంద్రికా మండలివారును భౌతికాది శాస్త్రగ్రంథముల యత్నించుచున్నారు. ఆంధ్రుల చరిత్రము, నాంధ్రకవులచరిత్రము, నాంధ్రజనమున కధికోత్కర్షము గలిగించు చున్నవి, ఆంధ్రవిజ్ఞానసర్వస్వము భాషాప్రపంచమున కమూల్యనిధానము. బ్రహ్మశ్రీ వేంకటరాయశాస్త్రులవారిచేఁ బ్రకటితములయిన గ్రంథములు భాషా విశుద్ధస్వరూపమున కాలవాలములై వెలయుచున్నవి. ఇట్టిసహాయసాధనసంపత్తి గలిగియు సాహిత్యపూర్తికిఁ గావలయుపరికరము లాంధ్రమునకుఁ జాలవు. ఆంధ్ర వాఙ్మయము పేదయైయున్నది. ఒక గడియారములోనివస్తువు లన్నిటిపేర్లు తెలుఁగునఁ జెప్పఁజాలము. ఒకపారిశ్రామికవిషయమై ప్రసంగింపవలయునన్న నాద్యంతము లింగ్లీషు మాటలతో ముగియును. ఒక సివిల్ కోర్టు దావా అర్జీ పూర్ణముగఁ దెలుఁగున వ్రాయవలయునన్న సాధ్యపడుటలేదు. ఒకగవర్నమెంటుశాసనమునకు సరియగుతెనుఁగుఁజేసిన నది మనుష్యమాత్రున కర్థముకాదు. శృంగార కావ్యములకును బాటలకును దప్ప నితరవిషయములఁ జర్చించుటకు భాషా ప్రతిభ చాల దనఁదగునా? భాషాలోపము గాదు. లోపము మనవారియందే యున్నది. పనిపూనువా రరిదియైయున్నారు.

వేదములఁ దెలిఁగించినయెడ నపౌరుషేయాది ప్రామాణ్యములు సంభవింపక పోవచ్చుఁగాని వేదములలోని విషయము తెలిసికొన నీతెలుఁగుముక్కలు చాలవా? వేదముల నటుండనిండు. తర్కమీమాంసాదులు తెలుఁగున నేల యుండరాదు. అందేప్రత్యవాయమును లేదు. సంస్కృతమునఁజేసిన నే తర్కవాదము లగునా? అధ్యాత్మవిద్యయందుఁ దెనుఁగున నెన్నియో గ్రంథములు గలవు. మనవేమన

యోగినుషువులు వేదములవలె నున్నవి. బ్రహ్మసూత్రముల ననుసరించి దివాన్ బహదూరు వల్లూరు జగన్నాథరావుగారు, ఆంధ్రశారీరక మను స్వతంత్రగ్రంథమును వ్రాసియున్నారు. ఛందోవ్యాకరణములు తెలుఁగున నున్నవి. గణిత జ్యోతిష వైద్యములందు స్వతంత్రము లగుప్రమాణగ్రంథములు పెక్కులు గావలయు. భౌతికాధ్యాత్మికశాస్త్రములును శిల్పార్థవార్తావ్యావహారిక శాస్త్ర గ్రంథములును గావలయు. శబ్దచరిత్రమును శబ్దములలోని చరిత్రమును దెలుపు ప్రౌఢనిఘంటువును, దెలుంగు గ్రంథములలోఁ దగులు పురాణపురుషచరిత్రాదులును గాథలును దెలుపు కోశమును ముఖ్యముగఁ గావలసియున్నవి.

దేశచరిత్రములు మహాపురుషచరిత్రములు భూగోళఖగోళ వర్ణనములు దేశాచారములు నిత్యాది విషయములపైఁ దెలుంగున నుద్గ్రంథములు లేవు. బాలబోధలు పాఠశాల తరగతులకొఱకై తరతమభేదముల నుద్దేశించి వ్రాయఁబడినట్లు ప్రకటించు పీఠికలు గలయుంగడిపొత్తములు గలవు. పట్టపరీక్షార్థ ముపయోగించున దొక్కటియు లేదు. భాషాసామ్రాజ్యమున కివి ముఖ్యములై యున్నవి.

ఇంగ్లీషువారి నాదర్శముగఁ గొన్నపక్షమున నన్నిదేశముల వాఙ్మయములు, నన్నిశాస్త్రములును, నన్నికళలను బోధించు గ్రంథములును వారి వాఙ్మయమునఁ గలవని తెలిసికొననగును. మహమ్మదీయులు దాదాపెనిమిది శతాబ్దములనుండి మనదేశమున నున్నను వారిఖురానులో, నేమున్నదో తెలుపఁగల గ్రంథము తెలుఁగునలేదు. మనయుపనిషత్తులను, రామాయణాది కావ్యములను, శాకుంతలాది నాటకములను, బంచతంత్రాది నీతిగ్రంథములను మహమ్మదీయులు, తమభాషలోనికిఁ బరివర్తించుకొని యున్నారు. ఆల్బరూని పదునొకండవ శతాబ్దమున వ్రాసిన "ఇండికా" యనుగ్రంథములో నీకాలమున మనమెఱుఁగని గ్రంథములఁ గొన్నిటిఁ బ్రస్తావించియున్నాఁడు.

సూదిచేయు విధము మనకమ్మరవానికిఁ దెలిసియుండునుగాని దానిబోధించు గ్రంథము గలదా ? ఇటులే యంత్రసాధనములఁ జేయుపద్ధతులను వాని యుపయోగములను వానిప్రయోగములను దెలుపు గ్రంథము లన్నియుఁ గావలయు. ఆంధ్రజనుల నితోధికజ్ఞానవిజ్ఞానసంపన్నులఁ జేయుటయే పరమప్రయోజనమై యుండవలెను. ఇవన్నియు సాహిత్యమున కంగములాయనిన నిట్టివి లేని వాఙ్మయ

మునకుఁ బూర్ణత్వము లేదని చెప్పనొప్పును. గ్రంథములఁ బెంచు టెందులకన్న జ్ఞానవృద్ధికొఱకే యని ప్రత్యుత్తర మబ్బును.

ప్రభువులయభిమానము లేక మన మేమియుఁ జేయఁజాలము. సర్వేశ్వరుండె "కృతిపతిత్వ మర్థింపఁగఁ" దిక్కన్‌శర్మ యాపరమేశ్వరుని గృతినాథుంజేసి భారత సంహితం జెప్పె. తెలుఁగురాయుని ప్రేరణమునఁ గర్ణాటరాయఁడొకఁ డాముక్త మాల్యదం జిత్రించె. నన్నయాదులు రాజపోషణ నంది గ్రంథముల వ్రాసిరి. ఆసేతుహిమాచలమునఁ గలనానాభాషలవారిని బాలించుదొరతనము వారేక దేశముగ మనభాషనె యాదరింపవలయునని కోరఁజనదు. పలువురు బిడ్డలు గలతల్లి వలెఁ బక్షపాతములేక సమత్వమునఁజూచుటయె భాగ్యము.

భాషాంతరాపేక్షలేక యాంధ్రులకైన రాజకీయసాంఘికవ్యావహారికాదిప్రక్రియ లన్నియుఁ దెలుఁగుననే జరుగవలసినట్లున్న మనమాతృభాష సర్వతోముఖమై సర్వతోభద్రమై సర్వతః పూర్ణమై నిర్విక్రమముగ నిరతంశముగ వివర్ధమాన మగుచుండును. ఈఫలసిద్ధికై ప్రత్యేకాంధ్రరాష్ట్రసంపాదన కన్న వేఱొండు తరణోపాయము లేదు.

తీవ్రేచ్ఛాప్రచోదితు లగునారురుక్షువులవలె నాంధ్రరాష్ట్రసిద్ధియె పరమ పురుషార్థముగనుపాస్య మనునిశ్చయజ్ఞానమును దత్ప్రాప్తికి భాషాజనయిత్రిసేవయే పరమసాధన మనుప్రబోధయు నాంధ్రపుత్రుల నావేశించి వారిని సిద్ధసంకల్పులఁ జేయుఁగాత.

వంగోలు వేంకటరంగయ్య.

శ్రీమదుమారమణాయనమః

# ఆంధ్ర భాగవతకర్తృత్వము.

ఆంధ్రసాహిత్యపరిషద్గ్రంథాలయమునకుఁ దాళపత్రగ్రంథసంపాదనమునకై, దక్షిణదేశమున హారి సేతురామయ్యగారు మధుర, తిరిచినాపల్లి, తిరునల్వేలి జిల్లాలకును, సింగోటి రంగనాథరావుగారు కడప, చిత్తూరుమండలములకును దూపాటి శేషాద్రిరమణకవులు గుంటూరు, నైజాము రాజ్యములకును శేషగుప్తపు భరద్వాజముగారు, మంత్రిప్రెగడ వేంకటరమణయ్యగారు గోదావరి కృష్ణా జిల్లాలకును నియమింపఁబడిరి. వారువారు సంపాదించిన పెక్కుగ్రంథములు పరిషద్భాండాగారమున నున్నవి. సంపాదకులకుఁ దెలియకుండను దెలియునట్లును గొన్ని సాధారణగ్రంథములతో నపూర్వగ్రంథములును వచ్చినమాట సత్యము. వానిని బరిషత్పత్రిక ప్రకటించుచున్నది. ఆనడుమ శేషాద్రిరమణకవులు బమ్మెరపోతరాజకృత మగుభాగవతప్రతిని సంపాదించి పరిషత్తున కిచ్చితి మని పలువురతో నుడివిరి. పత్రికలలోఁ గూడఁ బ్రకటించి యుందురు. దానింబట్టియే కావచ్చును బలువురు చేర్యాలభాగవతము, వేల్పుగొండభాగవతము నని నామకరణము లొనర్చి వానిం జూపుఁ డని మ మ్మడుగుచున్నారు. భారతము, రామాయణము వీని యనేకకవికర్తృత్వమునకుఁ గారణము వేఱుగా నున్నది. ఏదోవిధముగ భాగవతమునకు ననేకకవికర్తృత్వము పట్టినది, వెలిగందల నారపరాజు, గంగరాజు, సింగరాజులచేయి తగులకమును పున్నపోతరాజుగారి మూలప్రతి యున్న దని శేషాద్రిరమణకవులతలంపు. వా రేయాధారములంబట్టి యట్లు నిర్ణయించిరో తెలియదు, కాని, యీ ప్రవాదము లోక మంతట నిండినది. భాగవతవిమర్శమునకుఁ బెక్కురు కడంగుచున్నవారు. ఎవ్వ రయిన నడిగినఁ గొంత సమాధానము చెప్పుటకు మనముం గూడ నొక్కింత మనయొద్ద నున్నపుస్తకములం గూర్చియైనఁ దెలిసికొనుట లెస్స యని భాగవతకర్తృత్వముగుఱించి యనేకగ్రంథములు తీసి చదివితిమి. అందలి వివాదభాగములు ద్వితీయపంచమషష్ఠస్కంథములును నేకాదశద్వాదశస్కంథములు నని తెలిసికొని యేఁబదియాఱుగ్రంథములు పరిశోధింపఁగలిగితిమి. భాగవతము నచ్చువేసినవా రెల్లరును బహుకవికృతభాగములు

నిరూపించియున్నారు. ఐతిహ్యమునుబట్టి భాగవతమును బోతరాజు రచియించి నట్లును శైథిల్యము నొందినతావుల నారపరాజాదులు పూరించినట్లును బొడకట్టు చున్నది. శైథిల్య మనఁ జెదపురుగులు పట్టుట కావచ్చును. కావుననే:—రెండవస్కంధములోఁ గొంతపోవుట, ఐదాఱుస్కంధములు నిండుగఁ బోవుట, పదునొకండు పండ్రెండుస్కంధములలో నడుమనడుమ మాటలు బంతులును బోవుట సంభవించినది. పదియవస్కంధము నుత్తరభాగాంతమును గొంత పోయెనని చెప్పుదురు. మేము చూచినయంతమట్టుకు మూలగ్రంథచిహ్నము లెందును గనఁబడలేదు. పైఁగా నేర్పూరిసింగరాజుది గాక వేఱొకరిషష్ఠస్కంధము కనఁబడుచున్నది. హరిభట్టు రచించిన యేకాదశద్వాదశస్కంధములు చూపట్టినవి. మాపరిశీలన మునఁ గనఁబడిన యీయావిశేషము లిందు విశదపఱుచుచున్నారము.

## పుస్తకములు, నవి దొరకినమండలములు.

గోదావరిజిల్లాప్రతులు—పరిషత్పుస్తకభాండాగారమునందలి క్రమసంఖ్య.
546, 864, 897, 928, 976, 1170, 3928—7

గుంటూరుజిల్లాప్రతులు—2939, 3060, 3092, 3632, 3696, 3878, 3922—7

కడపజిల్లాప్రతులు—677, 728, 730, 735, 1317, 1318, 1533, 1583, 1614, 1640, 1645, 1755, 2449, 2530, 2538, 2645—17

చిత్తూరుజిల్లాప్రతులు—644, 1487, 1496—3

చెన్నపట్టనపుఁబ్రతులు—1191, 1196, 1201, 3378, 3390—5

నైజాముదేశప్రతులు—1203, 2728, 2737, 2846, 3456, 3503, 3505, 3507, 3537, 3539, 3941—11

అనంతపురము ప్రతులు—4081, No. I. No. II.—3

దక్షిణదేశప్రతులు—13—113, 310—3

## స్కంధవిభాగము.

ద్వితీయస్కంధములు—No. I. 13, 646, 728, 846, 1170, 1191, 1201, 1317, 1318, 1487, 1533, 1614, 1645, 2530, 2645, 2728, 2931, 3092, 3378, 3505, 3507, 3537, 3922, 4087—25

పంచమస్కంధములు—No. I. 13, 310, 677, 897, 976, 1191, 1201, 1317, 1318, 1496, 1533, 1645, 2449, 2530, 2531, 2728, 3060, 3092, 3378, 3505, 3507, 4087—23

షష్ఠస్కంధములు—No. I. No. II. 13, 310, 546, 677, 897, 976, 1191, 1201, 1203, 1317, 1318, 1496, 1533, 1645, 2449, 2530, 2531, 2538, 2728, 2846, 3060, 3092, 3378, 3505, 3507, 3632, 3941, 4087—30

ఏకాదశద్వాదశస్కంధములు—113, 310, 735, 928, 1191, 1196, 1583, 1640, 1645, 1755, 2449, 2531, 2538, 2638, 2737, 3390, 3456, 3503, 3505, 3539, 3696, 3878, 3922, 3928, 3941,—25

### —* ద్వితీయస్కంధవిమర్శనము. *—

ఇరువదిరెండుప్రతులలో ద్వితీయస్కంధము శోధింపఁబడినది. 646, 728, 1191, 1201, 1317, 1318, 1533, 1614, 1645, 2645 ఈపదింట "అట్టియనంతశక్తి "యను పద్యమునకు మీఁద వెలిగందల నారపరాజుకవిత్వ మని లేదు. 728లో "అట్టియనంతశక్తి" యనుపద్యము గూడ లేదు. అచ్చు ప్రతులలో నున్నటులే పోతరాజుపేరు గద్యములలోఁ గనఁబడుచున్నది.

### →* పంచమస్కంధవిమర్శనము. *←

ఇరువదిమూఁడుప్రతులలోఁ బంచమస్కంధము పరిశోధింపఁబడినది. 677, 1496, 2530, 2531, 3060, 3092, 3378 ఈయేడింటమాత్ర మాశ్వాసవిభాగ మున్నది. అశ్వాసాంతముల గద్యములలో గంగరాజు పేరున్నది. తక్కిన వానిలో నాశ్వాసవిభాగము లేదు. ప్రారంభమున.

క. శ్రీకరకరుణాసాగర, ప్రాకటలక్ష్మీకళత్ర భవ్యచరిత్రా
లోకాతీతగుణాశ్రయ, గోకులవిస్తార నందగోపకుమారా.
అనుదానికి మాఱుగ

క. శ్రీసీతానయనోత్పల, శ్రీసతిసహజన్మ త్రిదశసేవిత యాశా
వాసప్రకాశ జయభా, సాసురపతిహరణ రామచంద్రనృపాలా.
అనుక్రొత్తపద్యము చేర్చి యేకస్కంధము చేసి స్కంధాంతపద్యములుగా.

చ. జనకసుతామనోవిమలసారసకోమలచంచరీక చం
దనశరదిందుకుందహారధామమరాళపటీరచంద్రికా
వినుతయశోవిశాలరఘువీర దరస్మితపద్మపత్రలో
చననిటలాంబకప్రకటచాపవిఖండన వంశమండనా.

తరల. పరమపావనవిశ్వభావన బాంధవప్రకరావనా
శరధిశోషణ సత్యభాషణ సత్కృపామయభూషణా
దురితతారణ సృష్టికారణ దుష్టదూరవిదారణా
ధరణిపాలన ధర్మఖేలన దైత్యమర్దనఖేలనా.

మాలిని. దివిజరిపుశరణ్యా దీపితానంతపుణ్యా
పరివిమలగుణలోలా భక్తలోకానుపాలా
భవతిమిరదినేశా భానుకోటిప్రకాశా
కువలయహితకారీ ఘోరదైత్యప్రహారీ.

అనుతృతీయస్కంధాంతపద్యములు వ్రాసి, "ఇది శ్రీపరమేశ్వరకరుణా కలితేత్యాది పోతరాజుగద్యము వ్రాయఁబడియున్నది.

—※ షష్ఠస్కంధవిమర్శనము. ※—

ముప్పదిప్రతులలో షష్ఠస్కంధములు శోధింపఁబడినవి. 310, 677, 897, 976, 1203, 1533, 1645, 2728, 2846, 3507, 3941, 4087, No.I No.II. ఈ పదునాల్గుపుస్తకములలో నేర్చూరి సింగరాజు రచించినట్లు లేదు. స్కంధాదిని.

క. శ్రీవిశ్వభారభరణ, ప్రావీణ్యవిభాసమానఫణిరాణ్నిభబా
హావిపులవిజయదోహల, రావణమదకరిమృగేంద్ర రామనరేంద్రా.

అనుపద్యమును మఱికొన్నింటిలో

క. శ్రీరామనామపావన, కారుణ్యసరోజనేత్ర కౌసల్యసుతా
భారతపతిముని సేవిత, చారుకృపాలోల రామచంద్రనృపాలా.

అనియును జేర్చి "మహనీయగుణగరిష్ఠు"లనువచనముతరువాతఁ గొన్నింటిలో సింగరాజు 6వ స్కంధములోని "దంతిపురనాథ విను మొక మంతన మెఱిఁగింతు"నను 54 పద్యమునుండియుఁ, గొన్నింటిలో "కడఁది వేదనలకుఁ గారణంబై" యను 40వ పద్యమునుండియుఁ బ్రారంభించి స్కంధాంతమునఁ జాలవఱకు సింగరాజు పద్యములే వేసి "ఇది శ్రీపరమేశ్వరకరుణాకలిత"యనుగద్యము చేర్పఁబడి

యున్నది. ఇందలి 3941 గ్రంథములో షష్ఠస్కంధము పోతరాజు పేరితో నున్న క్రొత్తస్కంధము. దీనింగూర్చి షష్ఠస్కంధవిశేషములలో వ్రాయఁబడును.

—✻ ఏకాదశద్వాదశస్కంధవిమర్శనము. ✻—

ఇరువదియైదుప్రతులు పరిశోధింపఁబడినవి. వెలిగందలనారపరాజుపే రేపుస్తకములోను లేదు. స్కంధాద్యంతపద్యము లచ్చు పుస్తకములలో నున్నట్లే యున్నవి. వీనిలో 310లో హరిభట్టు విరచించిన యేకాదశద్వాదశస్కంధములుమాత్రమే కలవు. 928లో దశమస్కంధము పోతరాజుది, ఏకాదశస్కంధము హరిభట్టుది.

→✻ ఇఁక నాయాస్కంధములవిశేషములం దెలిపెదము. ✻←

(1) పంచమస్కంధము:—కొన్నిప్రతులలో " భూనాథుఁ డుత్తరాత్మజుఁ డైన " యనుకందపద్యము కనఁబడదు. 976లో స్కంధాంతమున, గంగరాజు రెండాశ్వాసముల చివర వేసినపద్యములను వేసి పరమపావనవిశ్వభావన యను పూర్వోక్తపద్యమును జేర్చినారు. 1201లో, జనకసుతామనోవిమలసారస—పరమపావన-దివిజరిపువరేణ్యా-యనునవియేకాక గంగరాజు ద్వితీయాశ్వాసాంతమున వ్రాసిన రెండుపద్యములు నిందుఁ గలిపినారు. గద్యములో ఇది శ్రీమదుభయకవిమిత్ర పరమేశ్వరుణాకలిత యని చేర్చినారు. 897లో గంగరాజు రెండాశ్వాసములచివర వ్రాసినవియేగాక మఱికొన్నిక్రొత్తవియుఁ గూర్చిరి. గద్యము లెన్ని తికమకలుగా మార్చినను బోతరాజుగారిపేరు సర్వత్ర మాన లేదు.

(2) షష్ఠస్కంధము :—No. Iలో సింగరాజు కృత్యాదిపద్యములు 53 లేవు, అచ్చులో నున్న 56-57 పద్యము లీప్రతిలో లేవు. స్కంధాంతమునఁ గల మూఁడుపద్యములలోఁ గడపటితోటకము లేదు. No. II లో ద్వాదశస్కంధాది నున్న " శ్రీమరుదశనపతినుత " అనుదానితోఁ బ్రారంభమైనది. సింగరాజు కృత్యాది 40 పద్యము లిందును దీసివేయఁబడినవి. చివరఁ దోటక మిందున్నది. గద్యములో " సింగయనామధేయ యనుదానిపై గీఁతగీచి పోతరాజుగద్యము ముక్క లిఖికించి వ్రాయఁబడినవి. 2728లో సింగరాజుకృత్యాదిపద్యములు తీసివేసినను గద్యము సింగరాజుపేరనే యున్నది. 2846లో స్కంధాంతపద్యములు సింగరాజువే, 4087లో సింగరాజుపద్యములును బోతరాజుగద్యము. 310లో స్కంధాంతమున,

చ. సరసిజమిత్రవంశఘనసాగరపూర్ణసుధామయూఖ ని
ర్జరరిపుగంధనాగహరిచారుసుదేహ విదేహధారుణీ
వరవరసుందరాహృదయవారిజవారిజమిత్ర మేదినీ
ధరవరధైర్య దేవనుతదానవశోషణసాధుపోషణా.

క. దశకంఠశిరఃఖండన, దశశతకిరణాభతేజ దాససురకుజా
దరశరథరాజకుమార శ్రీ, దశవంద్య యఘాపహార దైత్యవిదారా.

అనుక్రొత్తవియును, రాజీవరాజపూజ్య,... మురవిదారణముఖ్య....,కరుణాకర.... యనుప్రాంతవియును,

మాలిని.

శరనిధిమదహారాజానకీచిత్తచోరా,సురవిమతవిదారాక్షోణిభృద్రాజధీరా
నిరుపమశుభగాత్రానీరజాతాభనేత్రా,తరణికులపవిత్రాధారుణీజాకళత్రా.

అనుతలవిఱుపులపద్యమును, నిట్లు క్రొత్తవి, ప్రాంతవి చేర్చి "పరమేశ్వర కరుణాకలితకటాక్ష సకలసుకవివినుత, శ్రీవత్సగోత్రపవిత్ర కవితావిచిత్ర కేసన మంత్రిపుత్ర సహజపాండిత్య పోతనామాత్య యని పెంచినారు. 1203లో స్కంధాంతమున "రాజీవరాజపూజ్య" యనుపద్యమునకుఁ బిదప-

మాలిని. అనుపమగుణహారా హన్యమానారివీరా
వనరుహదళనేత్రా వర్ణితోద్యచ్చరిత్రా
ఘనరుచినిభదేహా ఖండితాజ్ఞానమోహా
జనకదుహితృరంతా చారులక్ష్మీనిశాంతా.

అనునొకపద్యము గలదు. ఇట్టిది ప్రథమస్కంధాంతమునఁ గలదు. దాని కిది ప్రతిపద్యము. 677లో మొదటి 11వ పద్యము 'వరకవితోవ్రదేకి వాల్మీకి' యనుదానిపిమ్మట నుండు 20 పద్యములు (షష్ఠ్యంతములవఱకు) తీసివేసినారు. దీనికిఁ గారణ మిందు సింగరాజువంశాదిక ముండుటయే. 3941లో నాఱవ స్కంధము క్రొత్తది, తక్కినవన్నియు నచ్చులోనున్నట్లే యున్నవి. ఈక్రొత్తషష్ఠ స్కంధము మొదటఁ గొన్నిపద్యములు పోయినవి. అజామిళునికథ, కన్యాకుబ్జ పురవర్ణమునుండి కలదు. గద్యము పోతరాజుపేర నున్నది. వర్ణనాదికము సింగరాజుషష్ఠస్కంధమునందుకంటె విరివిగానున్నది. కథలోఁ గొన్నిసందర్భములలో స్వల్పభేదము లున్నవి. కవులషష్ఠమేమో యని శంకించితిమి-కాదు మూఁడు పుస్తకములనుండి మూఁడుపద్యములు చిత్తగింపుఁడు.

సింగరాజు——వ....ఆత్మీయార్థంబైన యవిష్ణుపాదాభివందనంబు నిందితంబుగా దని
వేద వాక్యంబుగలదు గావున.

క్రొత్తదానిలో——గీ. పిన్నవాఁడవైనఁ బ్రియమున భవదంఘ్రి
వందనంబు సేయవలయు మాకు
నవని మిగులనార్తులగునట్టి పెద్దలు
వంద్యులధికులకును వరుసతోడ.

కవులషష్ఠము——చ. వయసునఁజిన్నవాఁడనభివంద్యుఁడనౌదునె మీకునంచుసం
శయమొనరించెదేని మునిసత్తమ కార్యములందు నాగమా
ధ్యయనములందు మంత్రములయందుఁగనిష్ఠుఁడ యేని పెద్దని
శ్చయమిది వానియందఖిలసన్నుతమైన సువిద్యగల్గినన్.

గద్యలోఁ బోతరాజుపే రున్నను గవిత్వము పోతరాజు దగునా కాదా యను సందియము కొందఱకుఁ దీనింజూచినపిమ్మటఁ గలుగుచున్నది. శైలీభేదము విద్వాంసులు చిత్తగించుతురుగాక ! సింగరాజువియు నీక్రొత్తపుస్తకములోనివియుఁ గొన్ని పద్యములు మచ్చునకై చూపఁబడుచున్నవి-క్రొత్తదానిలో-

ఉ. ఆసభ కేగుదెంచినబృహస్పతిఁ జూచి మదాంధచిత్తుఁడై
వాసవుఁ డమ్మహాత్మునకు వందన మేర్పడఁ జేయకున్న దు
ర్వాసునిభంగి నాతఁ డనివారితరోషకషాయితాత్ముఁడై
భాసుర మైనతద్విబుధపట్టనరాజ్యము మాని మానియై.

క. సతితోడఁ గూడి యాగురుఁ,డతివేగము మెఱయ నరిగె నంచితపుష్ప
ప్రతతులు గలభూజములకు,సతతము నెల వైనమలయశైలంబునకున్

గీ. ఆగిరీంద్రమందుఁ నాగురుఁ డప్పుడ,ధ్యాత్మమాయబలిమి నమరులకును
గానరాక చక్రకరునిపైఁ జిత్తంబు,చెందఁజేసి తపము సేయఁదొడఁగె.

సింగరాజువి-

చ. అమితతపఃప్రభావుఁ గరుణాత్ముని గీష్పతిఁ జూచి రాజ్యదు
ర్దమమదరేఖ నింద్రుఁడు వృథా తనగద్దియ లేవకుండె నె
య్యమున నెదుర్కొనం జనక యాసన మీయక గౌరవోపచా
రములఁ బ్రసన్నుఁ జేయక తిరంబుగ దివ్యసభాంతరంబునన్.

క. అప్పుడు సురపతికన్నులఁ,గప్పిన సురరాజ్యమదవికారంబునకుం
జప్పుడు సేయక గృహమున,కప్పుణ్యుఁడు తిరిగిపోయె నతిఖిన్నుండై.

సీ. ...తనయింటికేతెంచు దేవతాపతిరాక యీబృహస్పతి యెఱింగి
యధ్యాత్మమాయచే నడఁగి యదృశ్యుఁడై పోయెనప్పుడు........
ఇత్యాదులు చిత్తగింపవలయును.

గ్రంథమధ్యమునఁ బోతరాజెక్కడను నిరోష్ఠ్యసీసములుఁ జతుర్విధకందములును జొనుపునభిలాషము కలవాఁడుగాఁ గనఁబడఁడు. ఇందట్టివి గలవు. సింగరాజుది సంస్కృతమూలమునకు మేముచూచినతావుల సరిపోవుచున్నది. సావకాశముగాఁ బరిశీలింపఁదగును.

(3) ఏకాదశద్వాదశస్కంధములు.

ఏపుస్తకములోను బమ్మెర పోతనామాత్యుని పేరేగాని 'పోతనామాత్యప్రియ శిష్య వెలిగందల నారయ, యనుమాటలు లేవు. కాని, 310లో నీరెండు స్కంధములు హరిభట్టు రచించిన ట్లున్నది. 928లో దశమము పోతరాజుది, ఏకాదశము హరిభట్టుదియుఁ గలవు. 1583లో నేకాదశద్వాదశములలో హరిభట్టు పద్యములు నారపరాజుపద్యములుఁ బోతరాజుపద్యములు నున్నట్లు తెలియవచ్చుచున్నది. ఈహరిభట్టు మత్స్యపురాణము వరాహపురాణములను రచించినయాతఁడే యని గద్యములంబట్టి తెలిసికొనవచ్చును. 11వ స్కంధములో హరిభట్టు పీఠిక వ్రాసినాఁడు. అందు.

శా. బంధూకప్రసవాతిరిక్తవదనుం బ్రఖ్యాతునిఁ రామహ్మా
ద్బంధుఁ వాయుతనూభవుం దలఁచి విద్వల్లోకోటి మద్వాగ్విభూ
తిం ధాత్రి న్నుతియింప భాగవతమం దేకాదశద్వాదశ
స్కంధంబుల్ దెనిఁగింతుఁ బూర్వకథితస్కంధానుసారంబుగ౯.

క. మారుతసుతుఁడఁట కృతిపతి, పారీణత భాగవతము పలికెడిదఁట యా
సారస్య మిచటఁ గలుగ౯, వేఱొకమార్గమునఁ బోవువెఱ్ఱియుఁ గలఁడే.

క. శ్రీరాఘవపదసేవా, పారాయణ భక్తలోకబహుళాపన్ని
స్తారక రజనీచరసం, సారాధికజయసనాథ హనుమన్నాథా.
అనిచెప్పి.

వ. నారాయణచరణకమలధ్యానామృతపానపరవశు లగుశౌనకాదిమునివరులకు వేదవేదాంతపురాణేతిహాసకథావ్యాఖ్యానవైఖరీసమేతుం డగుసూతుం డిట్లనియె నట్లుపరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుం డిట్లనియె.

క. జననవ్యాధులకౌషధ,మనయంబును గర్మబంధహరణము తిరమై
వినుము నృపాలక హరికథ,వినిపించెదఁ గర్ణములకు వేడ్కఁ దలిర్పన్.
అని యున్నదానికి, వెలిగందల నారయ.

వ. మహనీయగుణగరిష్ఠులగు సమ్మునిశ్రేష్ఠులకు...పరీక్షిన్నరేంద్రుం గనుంగొని శుకయోగీంద్రుం డయ్యా జన్మకర్మవ్యాధివిమోచనంబునకుఁ గారణం బగు దివ్యౌషధంబుగావున శ్రీమన్నారాయణకథామృతంబుఁ గ్రోలుమని యిట్లనియె.

అని యొకవచనము వ్రాసెను. మఱియు.

మ. బలవత్సైన్యముతోడఁ గృష్ణుఁడు మహాబాహాబలోపేతుఁ డై
కలనన్ రాక్షసవీరవర్యుల వడిన్ ఖండించి భూభార ము
జ్జ్వలమై యుండఁగ ద్యూతకేళికతనం జావంగఁ గౌరవ్యస
ద్బలముం బాండవసైన్యము న్నడఁచె భూభాగంబు గంపింపఁగన్.

వ. అంత.

క. మునివరులు సంతసిల్లిరి,యనయము నందాదులకును హర్షం బయ్యెన్
తననిజభక్తులు యాదవ,ఘనవీరసమూహ మపుడు కడు నొప్పెనఁగన్.
అనుభాగమునకు హరిభట్టు.

సీ. అంతట శ్రీకృష్ణుఁ డధికసైన్యముఁగూడి సకలరాక్షసబలక్షయము సేసి
హర్షంబుతోడుత నఖిలభూభారంబు మానిచి సురలు సమ్మదము నొంద
దుర్ద్యూతహేళనాదులు నిమిత్తము సేసి పాండవకురుభూమిపాలబలము
లను జంపి నందాదులకును సంతోషంబు గావించి లోకరక్షణము సేసి
యంతలోపల నిజభక్తులైనయాదవులసమూహంబు చెలరేగి పొడవఁ జూచి
ఋషులశాపంబుఁదలపోసిరోషమంది,తద్వినాశంబుసేయంగఁదలఁచియపుడు.

అని సీసపద్యములో నిమిడ్చినాఁడు. చెడిపోయినభాగముల నిరువురు వేఱువేఱుగా వ్రాసినభాగ మిది. ఉన్నపద్యములలోని లుప్తభాగములు పూరించిన విధముం దిలకింపుఁడు.

నారాయణకవి.

మ. విదితుండై సకలామరుల్గొలువ నుర్వీభారము న్మాన్ప దు
ర్మదసంయుక్తవసుంధరాధిపతులన్ మర్దించి కంసాదులం

దుదిముట్ట నవధియించి కృష్ణుఁ డతిసంతుష్టాత్ముఁ డై యున్నచో
యదుసైన్యంబులు భూమి మోవఁగ నసహ్యాంబయ్యె నత్యుగ్రమై
హరిభట్టు.

మ. విదితుండై సకలామరు ల్బొగడ నుర్వీభారము న్మాన్పి దు
ర్మదసంయుక్తవసుంధరాధిపతుల న్మర్దించి కంసాదులం
దుదిముట్ట నవధియించి కృష్ణుఁ డతిసంతుష్టాత్ముఁడై యున్నచో
యందుసైన్యంబులు భూమి లోన నవిషహ్యాంబయ్యె నత్యుగ్రతఁ.

నారాయణకవి దీనితరువాత "ఈరీతి శ్రీకృష్ణుఁ"డని వ్రాసిన సీసపద్యమునకు
హరిభట్టు—వ. ఇవ్విధంబున యశోదానందనుండు పూతనాకేశిప్రలంబ...
ఇత్యాదివచనమును వ్రాసెను.

ఈతీరునఁ బద్యములకు గద్యములు గద్యములకుఁ బద్యములు నున్నవి.

1583లో గద్యము పోతరాజుగారిపేర నున్నను, నారపరాజు వ్రాసిన పెద్ద పెద్దవచనములకు హరిభట్టు వ్రాసినపద్యములుగూడ నిం దెక్కింపఁబడినవి. కాఁబట్టి హరిభట్టుప్రతియును బ్రచారములోనే యున్నదని తోఁచుచున్నది. హరిభట్టు సంబంధము గలమూఁడుప్రతులలో 310 మధురజిల్లాలోనిది, 928 గోదావరిజిల్లాలోనిది, 1583 కడపజిల్లాలోనిది.

ఏకాదశస్కంధము తుద నచ్చులో "శ్రీరమణీరమణకథా" యనుపద్యము పిమ్మట నున్న పెద్దవచనము (కొన్ని) తాళపత్రపుస్తకములలోఁ గనఁబడదు.

ఇరువురును లుప్తభాగములను బూరించినపద్యములంబట్టి యందందెంతెంత పోతరాజుభాగ మున్నదో యెంతెంత నారపరాజుది హరిభట్టుది గలదో విశద మగును.

ఈప్రకారము, తూరుపు, దక్షిణము, పడమర, యుత్తరము నీనాల్గుదిక్కులనుండి వచ్చియున్నయన్నిప్రతులను నేర్చినంతవట్టు శోధించితిమి. గద్యములు పోతరాజుపేర నున్నంత నే పోతరాజుకవిత్వ మని నిర్ణయించుటకు వీలు కనఁబడదు. పోతరాజువంటి భక్తుని భాగవతములో నితరులపేరు లే మని మార్చినవెఱ్ఱివారి మార్పులుగాని వేఱు కాదని యూహింపవచ్చును. సింగరాజు పేరుమీఁద గీఁతగీచి పోతరాజుపేరి నిఱికించివ్రాయుట, గద్యములు మార్చుట, కృత్యాదిపద్యములు తీసివేయుట, తుదివఱకు సమర్థించి వ్రాయ లేకపోవుట, గంగరాజుగద్య

ములోని దొకముక్క సింగరాజుగద్యములోని దొకముక్క పోతరాజుగద్యము లో గుదిగ్రుచ్చుట యిట్టివి ప్రతులువ్రాసికొనువా రంధపరంపరగాఁ బోతరా జుపైఁ గలభక్తితాత్పర్యములచేఁ బడినప్రమాదముగాని వేఱు కాదని మాకుఁ దోఁచుచున్నది. ఇవి యన్నియు మేము పుస్తకములలోఁ జూచినవిషయములం బట్టి చూపినకారణములు. యుక్తు లిందేమియు లేవు. మాస్వకపోలకల్పితగాథ కిం దించుకంతయు నెడ మీయలేదు. శేషాద్రిరమణకవులు చెప్పినట్లు చేర్యాల పుస్తకములోను వేల్పుగొండపుస్తకములోనుగూడ విశేషము లేమియు మాకుఁ గనఁబడలేదు. మామాటలను నమ్మరేని బహుకవికర్తృత్వము నంగీకరింపఁజనదు. ఇంక నేమూల నేపుస్తకమున్నదో చూచి మేము చూచిన పుస్తకములనే మరల విమర్శించి శైలీభేదములంబట్టికాని ప్రత్యంతరములంబట్టికాని మఱి యేయితర కారణములంబట్టికాని పండితులీ భాగవతకర్తృత్వము నొక్కరిపైఁ బెట్టెదరో యెందఱిపైఁ బెట్టెదరో !

క్రొత్తపల్లి సూర్యారావు.

# ఆంధ్ర వ్యాకరణములు.

(నెల్లూరు, పరిషద్వార్షికసభలోఁ జదువఁబడినది.)

జనులు తమతమ యభిప్రాయముల నొండొరులకుఁ దెలిపికొనుటకై, మొదటఁ గొన్నిధ్వనులను బిదప నాయాధ్వనుల కనుమాపకము లగు రేఖావిశేషములను నుపయోగించుకొనెద రని భాషాతత్త్వశాస్త్రజ్ఞులసిద్ధాంతము. భాషలలోనిధ్వనుల కనుమాపకము లగు రేఖావిశేషములను జనులు కల్పించుకొన్న పిదపఁ గొంతకాలమునకు వాఙ్మయ మేర్పడును. లేఖన మేర్పడకముందుఁగూడ స్వల్పము లగుపాటలు మున్నగువాఙ్మయ మేర్పడుటయుఁ గలదు.

భాష భాషణావస్థలోమాత్ర మున్నపుడునైత మందుఁ గొన్నినియమము లేర్పడియే యుండును. అట్టినియమము లుత్తమవృద్ధాదులవ్యవహారాదికమును బట్టి మాత్రమె యధమవృద్ధులు గ్రహించుచుందురు.

భాషలలో ననుగతము లై యుండు నియమము లెత్తి వ్రాసిన నదియె వ్యాకరణమనిపించుకొనును. భాషయొక్క భాషణావస్థలోని వ్యాకరణమును (భాషానుగతనియమసముదాయము) పూర్వపూర్వవ్యవహర్తలవ్యవహారములనుబట్టి యుత్తరోత్తరులు దెలిసికొనుచుందురు.

భాష దేశకాలాదులమార్పులనుబట్టి స్వభావసిద్ధము లైనపలువిధము లగు మార్పుల నందుచుండును. అట్లు మాఱునపు డవ్యవహిత పూర్వపూర్వభాషణములె యుత్తరోత్తరులకుఁ దెలియుచుండును గాని పూర్వతరపూర్వతమాదిస్థితులు తెలియఁజాలవు. అయ్యవి సామాన్యముగా, నశించు ననియె చెప్పవచ్చును. ఒకవేళ వానిలోనియలంతివిషయములుమాత్రము భాషాతత్త్వశాస్త్రజ్ఞులయూహలకు గోచరము లయినం గావచ్చును, మఱికొన్ని యలంతివిషయములు పాటలు మున్నగువానివల్ల నిలిచి యుండిన నుండవచ్చును. కాని యధికవిషయములకుమాత్రము నాశము దుర్నివార మై యుండును.

లేఖనావస్థ నొంది వాఙ్మయ మేర్పడినపిదప భాష కిట్టియపాయము వాటిల్ల నేరదు. పూర్వతరపూర్వతమాదికాలములందలి వాఙ్మయము లాయాకాలములందలి భాషల కాదర్శకము లై యుండనోపును. కాన భాషయొక్క పూర్వత

రపూర్వతమాదిస్థితులు నశింపనేరవు. మనుష్యాదిశరీరముల పూర్వపూర్వస్థితుల (ఆకారముల) కాయాకాలములందలి ప్రతిబింబము (ఫొటోగ్రాఫు) లాదర్శకము లై యుండునట్లు భాషాయోషయొక్క పూర్వపూర్వావస్థల కాయాకాలములందలివాఙ్మయము లాదర్శకము లై యుండును.

గనిలోనిరత్నములలో రత్నశాస్త్రజ్ఞుఁడు ప్రశస్తతరరత్నముల నేర్చుకొనురీతిని వ్యవహారభాషలోని పదసముదాయములో విచక్షణు లగుమహాకవు లాయాగ్రంథసందర్భముల కనుకూలము లగుపదముల నేర్చి కూర్చుచుందురు. కావుననే కావ్యభాషకును నితరవిషయములభాషకును మిక్కిలి భేదము గన్పట్టుచుండును.

వ్యాకరణములను రచించువిమర్శకు లాయాకాలములందలి వాఙ్మయములోనిభాషలయొక్క యాయాస్థితిగతులను విశదీకరింపవలయును. వ్యాకరణరచనలో నిట్టిభేదమును బాటించి రచించునాచారము మనప్రాచీనాంధ్రవ్యాకరణములం దున్నట్లగపడదు. కాలభేదములందలి భాషాభేదములను జూపునాచారము ప్రాచీనాంధ్రవ్యాకరణములందు లేదు, సరేగదా, భాష యెన్నఁటికి నేకవిధముగనే యుండు నని కూడ దానిఁయందుఁ జెప్పఁబడియున్నది. "సిద్ధి ర్లోకా ద్దృశ్యా లోకోఽ నన్యాదృశ శ్చ నిత్య శ్చ" అని యిట్లాంధ్రశబ్దచింతామణియందును; 'సిద్ధి రాంధ్రదేశభాషాసిద్ధిః లోకా ద్దృశ్యా లోకవ్యవహారా ద్ద్రష్టవ్యా; లోకవ్యవహారమూలేతి యావత్. లోకస్య తద్ధేతుత్వమేవ ప్రతిపిపాదయిషతి లోకః అనన్యాదృశః అన్యాదృశో నభవతీ త్యనన్యాదృశః. అనన్యప్రకారః. ఏకరూప ఇత్యర్థః, నిత్య శ్చ, భాషాకవితావత్త్వేన ఆప్రళయం వర్తమానః తేన లోకా త్సిద్ధిరిత్యర్థః" అని యిట్లు చింతామణివ్యాఖ్య యగునహోబలపండితీయమునందును జెప్పఁబడియున్నది. పైసందర్భమునుబట్టి చూచినచో లోకసిద్ధ మగుభాష యాకల్పము నొక్కరీతిగనే యుండు ననియు మార్పుల నొందనేర దనియుఁ దద్గ్రంథకర్త లభిప్రాయపడి రని తేలుచున్నది.

ఒకవేళ తత్తత్కాలికభాష తత్తత్కాలికవాఙ్మయస్థ మై యుండును గాన నయ్యది యనన్యాదృశము, నిత్యమును గానోపు నని తద్గ్రంథకర్తలయాశయమని గ్రహింప రాదా యని యనుటకును వలనుపడదు. "శబ్దానుశాసనకృతే నహి ఘారతస్య పరమ్త్రయేణ కథితం పద మేవ యోగ్యం। నాన్యత్ప్రయోగసరణా

వనుశాస్త్రదృష్టే, రేవం కృతోపి నియమః కవిరాక్షసేన ॥ ‹ శ్రీతిక్కయజ్వ ప్రముఖా విచక్షణసుధాంశవః । తదభ్యుపగమాయ తచ్చేతసః కవనే రతాః" అను నీశ్లోకము లప్పకవీయములోనియీక్రింద వ్రాయఁబడుపద్యములకు భాషాంతరీకరణములై యున్నవి.

‹‹ ఉ. ఆదిని శబ్దశాసనమహాకవి చెప్పినభారతంబులో
నేది వచింపఁగాఁబడియె నెందును దానినె గాని సూత్రసం
పాదన లేమిచేఁ దెనుఁగుపల్కు మఱొక్కటిఁ గూర్చి చెప్పఁగా
రా దని దాక్షవాటకవిరాక్షసుఁ డీనియమంబు చేసినన్.

క. "ఆమూఁడుపర్వములలో,నామాన్యుఁడు నుడువుతెనుఁగు లరసికొని కృతుల్
దామ రచించిరి దిక్కన్న,ధీమణి మొదలైనతొంటితెనుఁగుఁగవీంద్రుల్."

(అప్పకవీయము)

అను మొదలగు చింతామణ్యాదులవివరణకర్త లగునప్పకవ్యాదులధోరణిని బట్టిచూడఁగాఁ, బదునొకొండవశతాబ్దములోని నన్నయభాషయె యాకల్పము నిత్యమై యనన్యాదృశమై వాఙ్మయమునందు వెలయుచుండవలయు నని, వారు సిద్ధాంతము చేసికొన్నట్లు స్పష్టపడునుగదా !

ఆయాకాలములందలి పండితవ్యవహారవాఙ్మయము లాయాకాలములందలి భాషల వ్యాకరణములరచనకు సామగ్రిగా గ్రహించుటకు మాఱుగా, మనవా రాంధ్రభాషాసామాన్యమునకు నన్నయభట్టారకునియా రెండున్నరపర్వములభాషయే సామగ్రిగా గ్రహింపఁ దలఁచుట మిక్కిలి వింతగా నున్న దనుట సాహస మగునా ?

ఆంధ్రపండితులకుఁ గలవాఙ్మయమాత్రస్థ మై వ్యవహారభ్రష్ట మగు సంస్కృతభాషాపరిచయాతిశయమునంజేసి, యాంధ్రభాష కిట్టిచిక్కు వాటిల్లె నని తోఁచుచున్నది. గీర్వాణభాషయొక్క పూర్వావస్థ యెట్టు లుండెడిదో నేను జెప్పఁ జాలను గాని, యది వేదకాలమునందుఁ బొందియున్న యాకారమును మాత్రము వేదవాఙ్మయము విశదీకరింపఁగలదు. దానినుండి మార్పునొందిన కావ్యభాష యనఁగా లౌకికసంస్కృతభాషయొక్క స్థితిని, గాళిదాసాదికృత కావ్యములును, పాణినీయాదివ్యాకరణములును, విశదీకరించుచున్నవి. తుద కట్టిసంస్కృతభాష వ్యవహారభ్రష్ట మై వాఙ్మయమాత్రస్థమై యుండునవస్థ

లోనికి వచ్చినందున నద్దానిస్వరూపమును, దద్బోధకవ్యాకరణములును, ననన్యా
దృశము లై నిత్యము లై యాకల్పము నుండవలసివచ్చెను. అట్టి యవస్థ వ్యవ
హారస్థ మైన మనయాంధ్రభాషకుఁగూడ సంభవింపఁ జేయుట యర్హమా ?

సంస్కృతవ్యాకరణాది పరిచయాతిశయమున నిట్టితదనుసారివిషయము
లనేకము లాంధ్రభాషయందు మనవారు నెలకొల్పుచువచ్చిరి. సంస్కృతవ్యాకర
ణములకుఁ బూర్వభావ్యము లై మూలము లనఁదగు గ్రంథము లివి యనునిర్ణయము
లుండనందుననో, మఱి యేకారణముననో, శాస్త్రప్రయోగములకు విరోధము
వచ్చునవుడు సామాన్యముగా శాస్త్రమునకే ప్రాబల్యము నిత్తురు. దీనిని జూచి
మనవారు భారతాదికవిప్రయోగముల నాధారముగాఁ జేసికొని రచించిన తెనుఁగు
వ్యాకరణములకుసైతము సంస్కృతవ్యాకరణములవంటి ప్రాబల్యమునే యంగీ
కరించుచు "శాస్త్రప్రయోగవచసో శ్శాస్త్రం బలవ దుచ్యతే, అనిష్పన్నే పదే
తేన ప్రయోగాశ్రయణం హితం" అనుసిద్ధాంతము నవలంబించుచున్నారు.

"తం పాతయాం ప్రథమమాసపపాత పశ్చాత్" అనుకాళిదాస ప్రయోగ
ములోని పాతయాం ప్రథమ మాస" అనునది వ్యాకరణవిరుద్ధ మని చర్చించుచు,
"అపప్రయోగ ఇత్యే వాహుః పాణినీయాః" అని మల్లినాథుఁడు వ్రాసియు
న్నాఁడు. "విమాననా సుభ్రు కుతః పితు ర్గృహే" అనుకాళిదాసప్రయోగము
వంటి "హాపితః క్వాసి హేసుభ్రు" అను భట్టిప్రయోగములోని సంబోధనాంత
మగు 'సుభ్రు' అనుదానిసాధుత్వమును జర్చించుచు, "ప్రామాదిక ఏవాయ
మితి బహవః" అని భట్టోజీదీక్షితులవారు వ్రాసియున్నారు. ఇట్టివానినిజూచి
మన తెనుఁగుపండితులుసైత మాంధ్రశబ్దచింతామణ్యథర్వణకారికలకు లొంగని
తిక్కయజ్వాది మహాకవులప్రయోగములకుసైత మసాధుత్వమును గల్పించు
చున్నారు. ఆద్యుఁడు హిరణ్యగర్భునం దంతకంటె" నిత్యాదికపి పితామహాద్యు
క్తిస్తు నిర్మూలైవ (అహో, 315పుట) మధుకైటభారాతి మఱఁది రమ్మని పిల్చి
పనిగొంట నీకుఁ బ్రాభవము గాదె, ఇత్యాది శ్రీనాథవచనస్య ప్రామాదికత్వమే
వేత్యవధేయం" (అహో, 499పుట) "సుతులఁ గనియెదుకొఱకు" నీవు
ఘటించుకంటె" ఇత్యాదీనాం భాస్కరతిక్కయజ్వాదికవివచనానాం కిం మూల
మితి వయం నవిద్మః" (అహో, 500పుట) అని యిట్లాంధ్రవైయాకరణశేఖరుఁ
డగుననహోబలపండితుఁడు వ్రాసియున్నాఁడు. ఇట్టిధోరణులనుబట్టిచూడఁగా

నాంధ్రవ్యాకరణములకుఁ దిక్కయజ్వాదిమహాకవుల ప్రయోగములు మూలము లనుమాట యడుగంటె ననియు భావకు వ్యాకరణమె మూల మను వెఱ్ఱియభి ప్రాయము బలపడె ననియు నెట్టివారికిని స్ఫురింపకపోదుగదా !

సంస్కృతవ్యాకరణములకుఁ బూర్వభావులయి మూలము లనఁదగుకవుల గ్రంథము లివి యనునిర్ణయము లేకుండుటనో మఱియేకారణముననో పాణిన్యాదు లకు ఋషిత్వము నంగీకరించి వారలౌకికజ్ఞానసంపన్నులనియు వారినోట మిథ్యా వాక్యము రానేరదనియు వారిసూత్రములలోని యక్షరలేశ మైన వ్యర్థము కానే రదనియు సిద్ధాంతము చేసికొని, సంస్కృతవైయాకరణులు తుదకు రూపసాధన ప్రక్రియలో యుక్తివశమున వ్యర్థములు కాకతీరని సూత్రాదులకు సైతము పారా యణమువలనఁ బుణ్యము వచ్చు ననుఫలము నంగీకరింతురు. సూత్రమువలన సహజముగా సాధువులు కాని ప్రయోగములను సూత్రములలోని ప్రయోగాదు లకు జ్ఞాపకత్వాదికముం గల్పించి సాధింతురు. ఇట్టివానిని జూచియే కావలయు మనయాంధ్రవైయాకరణులుసైత మిట్టివింతలలోఁ గొన్నిటిని దెనుఁగువ్యాకరణ ములందును జొనుపుచున్నారు. సంస్కృతమునఁ బాణిన్యాదులప్రయోగములకు వలెనే యాంధ్రమున నొక్కనన్నయభట్టారకునిప్రయోగములకుఁ బ్రామాణ్యము నంగీకరించుచు వచ్చిరి. "నను, నెలఁతముద్దుమోము నెఱికురుల్ గుబ్బలు" ఇత్యాదిప్రయోగే ష్వసమాసేపి షష్ఠీ ద్వితీయాంతుల్యైవ వర్తతే తత్ర కిం మూల మితిచేత్" "మహాత్ము నభూపతులయు విప్రముఖ్యులసభఁ" ఎవ్వనియేని ముఖామృతాంశుబింబంబున" నిత్యాద్యాచార్యవచనమేవ మూలం. ఏనిశబ్ద ప్రయోగేష్వైవాత్ర భిన్నతా స్పష్టీక్రియతే తత్ర తద్వచనమహిమ్నైవ ద్రుతస్య లుగితి ధ్యేయమ్,.........వస్తుతస్తు ఆచార్యప్రయుక్తస్యైవ తాదృశవాక్యస్య నిపాతన్యాయేన ప్రామాణ్య మన్యేషాంతు నైవసాధుత్వమి త్యనుసంధేయమ్.. ....(అహో°, 218పు) ఈరీతి నొక్కనన్నయభట్టారకునికే యంతప్రామాణ్య మిచ్చి తక్కినమహాకవుల కట్టిప్రామాణ్యము నీయకుండుట సరియా ? ఇంకొక చిత్రము. తిక్కయజ్వాది మహాకవీశ్వరులప్రయోగములు సైతము నన్నయ భట్టారకుని భారతభాగముచేతఁ గాని యాంధ్రశబ్దచింతామణిచేతఁ గాని సాధిం పఁబడునేని సాధువు లఁట. అట్లు కాకున్నఁ దన్మతమున నసాధువులే యఁట. అదృష్టవశమున నొకవేళ నాప్రయోగము లథర్వణకారికలచేతనైన సాధింపఁబడు

నేని వానికిఁ గొంతవఱకు సాధుత్వము గలదఁట. చిత్తగింపుఁడు. “ అగ్గలంబు నాయెదుట బాహుప్పళించి; పర్వములేకయును రాహుభానుని బట్టెఁ ; తన తనువు రాహుసోమామృతంబు ద్రింగె; దిక్పాల తనువెత్తి తిరిపెంబు తను తోఁన;’ ఇత్యాద్యా స్తిక్కయజ్వాదికవిప్రయోగాః, అస్త్రియా మిత్యథర్వణ వచనే స్త్రీవాచకవ్యతిరిక్తానా ముదంతానా మితి వ్యాఖ్యానా త్తన్వాదిభ్యో పువర్ణకవికల్పో విరుద్ధః “ విద్యుత్సహస్రము ల్వెలసిల్లె మఱిరాహు పర్వంబు లేకయు భానుఁబట్టె” నిత్యాదిప్రయోగాచ్ఛబ్దశాసనస్యాపి పువర్ణకవికల్ప స్సమ్మత యేవ, అనుతాం స్త్రియామిత్యుక్తే రాచార్యస్య మతే తు తన్వాదిభ్యో నేష్ట యేవ వికల్పః, జరత్కారు న్మదీయానుజన్నితి తదుక్తే స్తన్మాత్రస్య సాధుత్వ మితి బోధ్యం ” (అహో, 296పుట) ఆహా ! యెంతవింత ! తిక్కయజ్వకన్నఁ దక్కిన వారికిఁ గలఘనత యేమో తెలియకున్నది ! వారు వ్యాకరణములను వ్రాయఁ బూనుటయు నితఁడు పూనకుండుటయుఁ గదా ! యిట్టి తారతమ్యము గల్గుటకు సాధకములు. మహాకవులప్రయోగములను మూలముగాఁ జేసికొని యాంధ్ర వ్యాకరణములు వెలయవలయు ననుసిద్ధాంతమును స్మరించిన నిట్టిప్రసంగములను జేసియుండరు గదా !

ఎట్టిమేధాశాలికైనను దనకుఁ దెలిసినభాషానియమములెల్ల నెత్తివ్రాసినపుడు కొన్ని స్ఫురింపకపోవుట వింతకాదు. ఒకగ్రంథము వ్రాయునపుడు సందర్భాద్యుద్బోధకములచే స్ఫురించు భాషానియమవిషయములు వ్యాకరణరచనాకాలమున స్ఫురింపకపోవచ్చును. వేయేల ! మన మెఱిఁగిన ప్రపంచమునెల్ల నిపుడు వరుసగాఁ జెప్పుఁడన్నఁ గొఱంతలేకుండఁ జెప్పఁగలమా ? అది యాయాకాలములందలి యాయాయుద్బోధకసామగ్రీవిశేషమున నప్పుడప్పుడు గోచర మగుచుండును. ఇట్లె వ్యాకరణకర్తలకును దమకుఁ దెలియనివానిమాట యటుండఁగాఁ దెలిసిన విషయములుకూడ వ్యాకరణరచనాకాలమున స్ఫురింపక కొఱవడి యుండిపోవచ్చును. పాణినిసూత్రములకు లొంగనిసాధుప్రయోగము లెన్నెన్ని యాతని సూత్రములలోఁ బ్రయోగింపఁబడలేదు ? అట్టివానినెన్నిటిని వార్త్తికకారాదులు పూరింపలేదు ? పాణిన్యాదులుసైతము బాహుళకవిధానములను నాకృతిగణములను ననేకములను గల్పింపలేదా? “కృత్తద్ధితసమాసానా మభిధానం నియామకం । లక్షణం త్వనభిజ్ఞానాం తదభిజ్ఞానసూచకమ్ ” “ సంజ్ఞాసు ధాతురూపాణి

ప్రత్యయాశ్చ తతఃపరే। కార్యాద్విద్యా దనూబంధ మేతచ్ఛాస్త్ర ముణాదిషు" అనునిట్టి యసమర్థతాసూచకసూక్తులు ప్రసిద్ధములై యుండలేదా? వేయేల! సూరిగారిబాలవ్యాకరణమునకు లొంగనియనేకప్రయోగము లాయనరచించిన నీతిచంద్రికలో నుండుట లేదా? కేతనవ్యాకరణమునకు లొంగని యనేక ప్రయోగము లాతనిదశకుమారచరిత్రాదులలో నుండలేదా? అట్లె నన్నయభట్టారకుఁ డొకవేళ చింతామణిని రచించుట సత్యమే యయినను నందుఁ గొన్నిటిని జెప్ప మఱవవచ్చును. అట్లె యాతనిభారతభాగములోఁ గొన్నిప్రయోగములకుఁ బ్రసక్తి లేకపోవచ్చును. అంతమాత్రమున వానికి లొంగని తిక్కయజ్వాదిమహాకవిప్రయోగము లసాధువు లనఁదగునా?

ఇంకను దెనుఁగుభాషకు సంస్కృతభాషావ్యాకరణముల సంబంధ మెంతవఱకుఁ గలదో చూపుచున్నాను.

"గతిబుద్ధి ప్రత్యవసానార్థశబ్ద కర్మాకర్మకాణామణికర్తాసణౌ" (సిద్ధాంతకౌముది, కారకపరిచ్ఛేదము) "గతిబుద్ధిప్రత్యవసానార్థ శబ్దకర్మాకర్మకంబులకు ప్రేరణంబునంగర్తయగునది ప్రేరణంబునంగర్మంబగు" (బాల, క్రియా) "డుఙతౌతునప్లుతస్స్యాత్సంబుద్ధావిత్యుతాంవిదుః కేచిత్॥ వ్యాః......ననుప్లుతేకృతే కథంసులోప ఇతిచేత్, సర్వేభ్యోవిధిభ్యోలోపవిధిర్బలీయానితి పరిభాషయా ప్లుతాత్పూర్వమేవసులోపః। సచపఙ్హ్రస్వాదితి సంస్కృతీయేన సోర్లుగితి ప్రాకృతీయేనవా సూత్రేణ భవతి. నచసూత్రే సంబుద్ధావితి పదం ప్రత్యయపరం. కింతు సంబోధనార్థపరమేవ. ఏవంచ సంబోధనార్థేవిషయే ఇతి తదర్థ ఇతి నకశ్చిత్కళంకః" (అ-హో. 295, పుట).

"ఉకారాంతవ్యతిరిక్తేభ్యః ప్రకృతిద్వయతుల్య స్త్రీలింగశబ్దేభ్యః పరస్య సోర్లోపస్స్యాత్, అంబ, రమ, గౌరి, వాణి, జడ, మేర, ఇత్యాది. హ్రస్వేకృతే అనంతర మనేన సోర్లోపః. అన్యథా హాల్ఙ్యాభ్యఇతి సూత్రేణసోర్లోపః ప్రాప్తఏవేతి సూత్ర మనావశ్యకం స్యాత్. నచస్థానివద్భావేనానంతరమపి ప్రాప్తిః. అలః పరత్వేనస్థానివద్భావాభావాత్. దీర్ఘాయాజ్యాపావితితత్ర విశేషణాచ్చ. నన్విదం సూత్రమనావశ్యకమేవ. ప్రథమమేవ హాల్ ఙ్యాదిసూత్రేణ సులోపః. అనంతరమేవ హ్రస్వ ఆస్తామితిచేత్, సత్యం, తల్లితండ్రిప్రముఖశబ్దానాం, సులోపఏతత్సూత్రాభావేనసిధ్యతీతి జ్ఞేయమ్, అనుతామిత్యత్ర ఉద్గ్రహణమోకారాంతస్యాప్యుపలక్షణం. సర్వత్రోదోరితిసూత్రేసహైవవిధానాత్ (అ-హో. 345పుట

పయివిషయములను బరిశీలించినచో, సంస్కృతప్రాకృతవ్యాకరణ సూత్రములు పరిభాషలు సంజ్ఞలు తెనుఁగువ్యాకరణములలోఁ జొనుపఁబడుటయేగాక, సంస్కృతప్రాకృత వ్యాకరణసూత్రములుసైతమాంధ్రశబ్దసాధనవిషయములో నుపయోగింపఁబడుచునువచ్చె నని విశదపడుచున్నదిగదా !

సంస్కృతవ్యాకరణ పరిచయాతిశయముననె త్రిలింగశబ్దానుశాసనము, ఆంధ్రకౌముది మున్నగువ్యాకరణములలో నాంధ్రభాషావ్యాకరణములకుఁ గూడ ననాదిత్వాపౌరుషేయత్వములు, వేదప్రామాణ్యవత్త్వమును బ్రతిపాదింపఁబడియున్నవి.

“ ఆంధ్రవిష్ణు స్సురయుతో । దనుజేన నిశంభునా । యుద్ధ్వా త్రయోదశ యుగాన్ । హత్వాతం రాక్షసోత్తమం । అవసత్తత్ర ఋషిభిః । యుతో గోదావరీ తటే । తత్కాలప్రభృతి క్షేత్రం । త్రిలింగమితివిశ్రుతం । తత్రత్యాస్తత్సమాలాపాస్తత్కాలేనమహర్భిభ్రష్టాః । కాలేనమహతాసర్వం । తత్సమంస్వల్పబుద్ధిభిః । అస్ఫుటోచ్చారితాసీతి । తద్భవానీతిసమ్మతిః ।..... బ్రహ్మణానిర్మితావాచః । పూర్వమాంధ్రేశితుర్హరేః । అచ్ఛాఇతిచకథ్యన్తే । సుప్తిఙ్ధాతుసమన్వితాః । ...త్రిలింగశాస్త్రవిహితస్య లక్షణ స్యాపిప్రయోగేణహైన్యంనకారయేదితి నాగరాజః ।...యుగభేదాదాంధ్రభాషాచార్యభేదః ప్రకీర్త్యతే । కృతేసుధాయనః ప్రోక్త । స్త్రేతాయాం శుకనాభకః ।........” అని యిట్టిధోరణులు వెలయుచున్నవి ఇయ్యవి భాషాతత్త్వశాస్త్రమునకుఁ గేవలము విరుద్ధములనియుఁ, బురాణాదిపరిచయాతిశయమున నిట్టిధోరణులు బయలువెడలుట కవకాశము గల్గెననియు విమర్శకు లగుపండితశిఖామణులు గ్రహింపకపోరు.

సంస్కృతభాష పవిత్రమైనదని తలఁచియో లేక తెనుఁగులక్షణములు తెలియంగోరువారికి సంస్కృతభాష వచ్చియుండవలయుననితలఁచియో వ్యాకరణ విషయములను సంస్కృతభాషతోఁ జెప్పుట సుకరమనియెంచియో మనవారనేకులు సంస్కృతభాషతో నాంధ్రవ్యాకరణములను వానివ్యాఖ్యానములను రచింపనారంభించిరి. సంస్కృత భాషాతద్వ్యాకరణములను మూలములుగాఁ గొని రచించుటచే మొదట మొదట నట్లు చేయుటయేగాక మొన్న మొన్నటివఱకును నదే రీతిని సంస్కృతభాషతోడనే యాంధ్రలక్షణములను రచించుచువచ్చిరి. త్రిలింగశబ్దానుశాసనము, ఆంధ్రశబ్దచింతామణి, వికృతివివేకము, నృసింహపండితీయము,

ఆంధ్రకౌముదీద్వయము. అహోబలపండితీయము మున్నగువ్యాకరణములెల్ల సంస్కృతభాషామయములై యయి యున్నవి. వీనిలో నహోబలపండితీయకర్త సుమారు రెండువందలయేండ్ల క్రిందటివాఁడుగదా. ఇంతయేల! నేఁటికిని నట్టివారు లేకపోలేదు. అరయనరయ నీవిషయ మంత వింతయగువిషయము కాదని చెప్పవచ్చును. ఆంధ్రభాషావ్యాకరణములతో నంతగా సంబంధము లేనియింగ్లీషుభాష మహోన్నతపదవిలో నుండుటచేత నిప్పు డాంధ్రభాష నుద్ధరింపనున్న యనేకపండితప్రభువులు తెలుఁగుభాషను వాడుకచేయవలసిన సందర్భములలో నెల్ల నింగ్లీషుభాష నుపయోగించుచుండుటయు నింగ్లీషువ్రాసినట్లు తెనుఁగున వ్రాయఁజాలకుండుటయు మనము చూచుచున్నారము గదా.

ఇఁక సంస్కృతసంబంధమునఁ దెనుఁగులోఁ బ్రవేశించినవిషయముల విమర్శనము నటుంచి యాంధ్రవైయాకరణు లెట్టియాంధ్రవాఙ్మయము నాధారముగాఁ జేసికొని యేయేరీతుల నాంధ్రవ్యాకరణముల రచించిరో యట్టివ్యాకరణము లెంతవఱకు సమగ్రములై యుపయోగించుచున్నవో యను మొదలగువిషయములఁ బరిశీలింతము. ఆంధ్రకావ్యభాషయుఁ దదితరగ్రంథభాషయుఁ బరస్పరవిభిన్నములై యుండుట సహజమై సంప్రదాయసిద్ధమై యున్న ట్లగపడుచున్నది. ఇప్పటిసంస్కర్తలు సవరించి ముద్రించినగ్రంథముల నటుండనిచ్చి ప్రాచీనతాళపత్రమాతృకలలో నున్నవ్యాఖ్యానములు మున్నగువానిని బరిశీలించిన నీవిషయము స్పష్టపడఁగలదు. పండితవ్యవహారములో వినఁబడుచున్నభాషయె యీవ్యాఖ్యానాదులభాషయై యున్నది. కాని యాంధ్రవైయాకరణులు లక్షణకల్పనము చేయుటకు మహాకవిరచితము లగునాంధ్రకావ్యములనే యాధారముగాఁ దీసికొనిరిగాని పండితరచితములైనను నిట్టివ్యాఖ్యానాదులలోనిభాషను మూలముగా గ్రహించి నట్లగపడదు. ఆకారణమున నాభాష సరికాదని తలఁచి కావలయు మన సంస్కర్తలు సవరించి ముద్రించుచున్నారు. ఈవిషయమును విశదపఱుచుటకై యిచ్చట "చిత్రకవి యనంతవిరచిత మగుహరిశ్చంద్రనలోపాఖ్యానవ్యాఖ్యలోని మొదటిపద్యపువ్యాఖ్యయొక్క తాళపత్రమాతృకాస్థితియు, దానిని సంస్కర్తలు సంస్కరించినపిమ్మటిస్థితియుఁ జూపుచున్నాఁడను.

వ్రాంతప్రతి.-పూ. రా. గారిప్రతి.

| | |
|---|---|
| సీతనున్ను = సీతను ... | స్నేహాంచాతను = స్నేహాముచేత ... |
| లక్ష్మినిన్ని = లక్ష్మిని ... | సరిగావున్నది = సరిగానున్నది ... |
| గలుగుటచేతనున్ను = గలుగుటచేతను. | వారుయిద్దరు అన్యోన్య = వారిద్ద అన్యోన్య. |
| వొప్పుచున్న = ఒప్పుచున్న ... | తోస్తున్నది = తోఁచుచున్నది ... |
| ఎప్పుడునూ = ఎప్పుడున్ ... | ఆరణ్యానకు = ఆరణ్యమునకు .... |
| ఆనందనియ్యు = ఆనందనీయ ... | చెరించేటట్టు = చరించునట్టుగాను ... |

పైచోట్ల సీతను, లక్ష్మిని, అనుమొదలగు వ్యాకరణసమ్మతరూపములె యుండియున్నయెడల నట్టిమాతృకలను సవరించి యెవ్వరైన నిట్లు లక్షణవిరుద్ధభాషలో వ్రాయుదురా ? ఒకప్పుడు కొన్నిచోట్ల వ్యావహారికభాషావాసనావశమున నొకటి రెండు ప్రమాదములు పడినఁ బడవచ్చును గాక. ఇట్లొక్క యీమాతృకయందేగాక సామాన్యముగా మాతృకలందెల్ల నిట్టిభాషయే వ్యాఖ్యానాదులందు వెలయుచున్నది. ఇంతయేల ! కావ్యభాషను నియమించుచున్నచింతామణికి బాలసరస్వతివంటి వైయాకరణశిఖామణి వ్రాసినబాలసరస్వతీయభాష్యమునందు సైత మిట్టిభాషయే యుపయోగింపఁబడియున్నది. శ్రీసాహిత్యపరిషత్తువారు సేకరించినపుస్తకభాండాగారములో నున్నబాలసరస్వతీయటీకలోని మొదటిశ్లోకము టీకలో నున్నవ్యావహారికపదముల నిట నుదాహరించుచున్నాఁడను. "హాసవిలాసాదికమున్ను. అదిన్ని, అంటే, కవియనేవ్యవహారము. ఇదిన్ని, గనుకనున్ను. సర్వపాపహరంగనుకాను, నిత్యకీర్తికరంగనుకాను, కావ్యాలుగుణాలంకారయుక్తమైనా, ఏయేరూపానైనాను, ఐకమత్యము గల్పించుకొనేది, గనుక యీలక్షణాలు, వోయి కల్పనాసమర్థుండై తేనే చాలును. కులీనత్వాదిగుణము లేవోయి అంటేను, తెలిసేది, వోయీరసస్థితివుంటే భాషాకావ్యాలైన, అదిమెప్పవలెనుండెను. మ్లేచ్ఛనము శ్రుతిగర్హితమైనాగాని అవివిడిస్తే, రసవత్కావ్యాలైతే."

సామాన్యముగా వ్యాఖ్యానములభాషయెల్లఁ బైరీతినే యున్నదిగాన మొదట గ్రంథకర్త సలక్షణముగానే వ్రాసినను లేఖకాదు లిట్లు పాడుచేసి రనితలఁచుట యుక్తముకాదు. కావున నిట్టిభాషయే యిట్టివాఙ్మయమున నుండుట సంప్రదాయమని యంగీకరించుటయే యుచితమని తోఁచుచున్నది. ఇట్లు పండితకృతగ్రంథముల కెక్కియున్న యీభాషను సంస్కర్తలు నిర్మూలముచేయఁ దలఁచి

కావలయును బైనుదాహరించినరీతిని నిస్సందేహముగా సవరించుచున్నారు. ఇట్టి వాఙ్మయము నట్లు కావ్యభాషావ్యాకరణములచొప్పున సవరించుట యుక్తమో లేక యథాస్థితిగాఁ బ్రకటించుటయు దానియందు సహజమైభాషాతత్త్వశాస్త్రానుసారియై యున్నస్వరూపమును వెల్లడించుట యుక్తమో విచక్షణు లగుపండితులే విమర్శింతురుగాక.

ఇఁకఁ గావ్యభాషకు లక్షణకల్పనముం జేయుటలో నాంధ్రవైయాకరణులు తీసికొన్నసామగ్రి యెట్టిదో విచారింతము.

సామాన్యముగా వ్యాకరణరచన భాషకు వాఙ్మయ మేర్పడినపిదపనే తటస్థించునని యీవఱకే వ్రాసియున్నాను. శాసనములు, పాటలు, వ్యాఖ్యానములు, వ్యవహారసంబంధము లగుపత్రములు మున్నగునవియు, వాఙ్మయములోఁ జేరినవే యైనను నాంధ్రపండితులు భాషాలక్షణరచనావిషయమునఁ దఱచుగా భారతాది కావ్యభాష నె ముఖ్య మగునాధారముగా గ్రహించిన ట్లగపడుచున్నది.

ఆంధ్రకావ్యవాఙ్మయమునే యాధారముగాఁ జేసికొని సామాన్యముగా నాంధ్రవైయాకరణులందఱును వ్యాకరణములను రచించినను వారిలో మొదటిమొదటి వారు ప్రయోగోదాహరణపూర్వకముగా లక్షణరచనమును జేసియుండలేదు. అంతకంతకు నట్లు మహాకవిప్రయోగోదాహరణపూర్వకముగా, వ్యాకరణరచన చేయునాచారము ప్రబలెను. అట్టిప్రయోగములను జూపుటలో దొరకినంతవఱకు సామాన్యముగా ఛందోయతిప్రాసశ్లేషయమకాదులనిర్బంధమున మార్పరానిప్రయోగములనే చూపుట సంప్రదాయసిద్ధ మయ్యెను. ఈకారణముచేతనే ఛందోయతిప్రాసశ్లేషయమకాదిస్థలములందలి ప్రయోగములు నిర్బంధజనితములగుటచేఁ బ్రమాణములు కాఁజాల వని చెప్పుట కెంతమాత్రమును వలనుపడదు. అట్టి మార్పరానిప్రయోగము లొక్కొక్కవిషయమున ననేకములు దొరకుట దుర్లభముగాన నొకటిరెండుమహాకవిప్రయోగములు దొరకినపుడు వానిని బ్రమాణములనుగా గ్రహించి తత్సజాతీయప్రయోగములకుఁగూడ సాధుత్వము సంభవించునట్లు సూత్రరచన చేయుటయు నాచారమై యున్నది. పైవిషయముల కిచటఁ గొన్ని యుదాహరణములను జూపుచున్నాను.

## ——* సరళాదేశము. *——

కచటతపలకు వచ్చుగజడదబాదేశమును, గసడదవాదేశమును, సామాన్యముగా వ్యవహారమున వినఁబడవు "రాఁగా, కాఁగా, కాఁబట్టి, చెప్పఁబోవు.

కాఁగల, వెలయఁజేయు,' మున్నగుస్థలములందుమాత్రము గజడదబాదేశము వ్యవహారస్థమై యున్నది. "కాదుసుమీ, నిజముగా, తెల్లగా, తెల్లవాఱు, మొదలగుచోట్లమాత్రము గసడదవాదేశము వ్యవహారస్థమై యున్నది. తక్కిన స్థలములయందు సామాన్యముగా నీయాదేశద్వయమును, వ్యవహారస్థము కాదు. తాళపత్రమాతృకలందుఁ బెక్కుచోట్ల నీయాదేశద్వయమును జేసివ్రాయునా చార మగపడదు. అట్లయినను బాహిస్థలములలో నీయాదేశాక్షరములె ప్రయో గింపఁబడుచుండుటచే, విశేషప్రయోగములు కానని మొదటిమొదటి వైయాకర ణులందఱును నీయాదేశములు నిత్యములే యని సూత్రించిరి.

క. అంబాలికకును గుణాకరత్వాంబుధి పాండురవిరాజితాంగుఁడు ప్రభవిం
చెం బాండురాజు కురువంశంబుప్రతిష్ఠింప ధర్మసర్వజ్ఞుండై.

(భార,—.ఆది, 4, ఆ, 257ప)

క. కావలియై సురరాజ్య, శ్రీపాలింప....(భార. ఉద్యో 1ఆ,)

ఇట్టిప్రయోగములను జూచియే ప్రాచీనవైయాకరణులు పైయాదేశద్వయ మును, నిత్యముగా సూత్రించిరి, "పరుషా ద్రుతప్రకృతికాత్ సరళాస్సుర్వ్యస్త ద్రుతంచ బిందుస్స్యాత్" (ఆంధ్రి. చింతా) "గసడదవాస్స్యుః ప్రథమామాత్రా దాత్మ్యాస్తదోర్విసై వైతే" (ఆంధ్రి. చింతా.)

క. నాంతం బైనపదంబుల,పొంతం బైనున్నశబ్దములకచటతపల్
దొంతిగజడదబ లగున,య్యంతనకారమగు సున్న యభినవదండీ.

(ఆంధ్రి. భా, భూష.)

క. పొసగంబల్కెడుచోఁబ్రా, ల్పెసఁగినప్రథమాంతములపయిఁగదిసికదుం
బనగుకచటతపలమును, గసడదవల్ద్రోచి నిల్పుఁగవిజనమిత్రా.

(ఆంధ్రి. భూష.)

ఈనిత్యత గజడదబాదేశవిషయమున నేఁటికిని, మాఱలేదుగాని గసడవాదేశ విషయమున మాత్రము పెక్కువిశేషప్రయోగములు దొరకినందున "నవికృతి శబ్దాత్పరతస్సంస్కృతికానాం భవంతి గసడదవాః"పరుషావా స్వరూపేణ ప్రథ మాంతోపరిస్థితాః ! కాకా సంబోధనేచాపి । హ్యావ్యయేకర్మధారయే । అచేత నార్థకేశబ్దే ఇతిశృంగారభూషణః । కేచిద్యతౌవికల్పత్వం । ప్రాసేష్వపిచకశ్చన । కేచిద్ద్వయోర్వికల్పత్వమ్" అనియిట్లుపెక్కు వికల్పములు విశ్వతివివేకమునఁ

చేర్కొనఁబడినవి. ఇట్టివికల్పములెల్లఁ బుట్టుటకుఁ దగినప్రయోగవిశేషములనెల్ల నిట నుదాహరించినచో గ్రంథవిస్తరమగునని యింతతో విరమించుచున్నాను.

పూర్వస్థితనకారము నిండుసున్నగా మాఱినపుడే ప్రాసస్థలములలో గజడదబాదేశము కన్పట్టుచున్నది. అట్లయినను నాంధ్రవైయాకరణు లనేకులు ద్రుతమునకు స్వత్వాదిస్థితులలోనైత మీగజడదబాదేశమును నిత్యముగానే విధించియున్నారు. ఒక్కచిన్నకోటపెద్దనార్యుఁడుమాత్రము సహజముగా నున్నసోఁకున నీగజడదబాదేశము గల్గు నని చెప్పియున్నాఁడు. రెండుపదములసంధిని సున్న నిల్చినపు డుత్తరపదాది నున్నపరుషములను సరళములనుగా నుచ్చరించుటలో సౌకర్య మధిక మనువిషయ మనుభవసిద్ధమే గదా.

గీ. తద్ద్వితీయావిభక్తిపొంతలఁ జరించు, గట్టిగలసున్నసోఁకున కచటతపలు
గజడదబలగునూరటగలుగుకవుల, యనుమతంబుననొక్కొకయవసరమున.

(కావ్యాలం. 8 ఆ).

ప్రాసస్థలములందలి ప్రయోగములం దెల్లెడను నిండుసున్నమీఁదనే యీయాదేశ మగపడుచున్నది. అర్ధానుస్వారాద్యాకారములలో ద్రుతమున్నపుడీయాదేశము వచ్చినప్రయోగము లింకను బ్రాసస్థలములలోఁ బ్రాచీనమహాకవుల గ్రంథములం దగపడకున్నవి. వైయాకరణు లెవ్వరును నుదాహరించియుండలేదు, అయినను వైయాకరణుల సజాతీయ విధానసామర్థ్యమున నట్టిస్థలములందును నీయాదేశమును వ్రాయుట ముద్రితగ్రంథములం దెల్ల విస్తరించెను. వైయాకరణుల కలవాటుపడియున్న యీసజాతీయవిధానప్రాబల్యముననే యువయువనకారమునకు ద్రుతత్వము లేదనుసిద్ధాంతమును, దన్మూలమున 'అన్తపసి' మొదలగు చోట్ల సరళాదేశము రాదనుసిద్ధాంతమును నానకారమునకు సున్నరాదనుసిద్ధాంతమును బయలువెడలినవి. "ఎందేడెందము" 'కందోయి' మున్నగు చోట్ల లేనిపోనిద్రుతమును దెచ్చిపెట్టుకొనుటయు నీసజాతీయవిధానబలముననే సంభవించినదికాని 'కమ్మందేనె' 'చక్కంబడునే' మున్నగుప్రయోగములం దవయువనకారమునకు ద్రుతకార్యము దుర్నివారమయి వైయాకరణాంగీకృతమయి యుండఁగా "అన్తపసి" మున్నగుచోట్ల నట్లంగీకరింపకుండుటకుఁ దగినయాధారమేమో తెలియకున్నది. అట్లు ద్రుతకార్యము లేనిప్రాసస్థలములందలి ప్రయోగము లెచ్చటను నగపడకున్నవి. వైయాకరణు లెవ్వరును నట్టివాని నుదాహరింపలేదు. ఇంక నీసజాతీయవిధానప్రాబల్యముననే యుచ్చారణానుభవవిరుద్ధములును గావుననే

భాషాతత్త్వశాస్త్రవిరుద్ధములును నగు "ఏఁగియేఁగియనుచోఁ గ్త్వార్థకంబగుట సంధిలేదు" తెచ్చెందస్రరుచు." వచ్చెంగ్షత్రియుఁడు" అనుమొదలగుచోట్ల వెత్తి వెత్తిసరళాదేశములను జేయుటకును సంస్కర్తలు వెనుదీయకున్నారు. ఇట్టివాని నెల్లఁ బ్రాచీనాంధ్రమహాకవుల ప్రయోగములను వెదకి నిర్ణయింపవలసియున్నది. ఈసందర్భమున నిట్టిదే యింకొక యుదాహరణము చూపి విరమించుచున్నాను.

'వచ్చెంధాత్రీపతి.' 'పాడెంగంధర్వుఁడు' మున్నగుప్రయోగములనుబట్టి "బిందుం ప్రవదంతి తంక్వచిత్కేచిత్" అని క్వాచిత్కముగా సరళస్థిరపూర్వస్థన కారమునకు బిందువు చింతామణిలో విధింపఁబడెను. వర్గయుగ్భిన్నస్థిరములకు ముందు బిందువు నిల్పుట యాంధ్రభాషావ్యాకరణ సంప్రదాయవిరుద్ధమును ననుభవవిరుద్ధమును నని మాత్రము తలఁచి సూరిగారట్టిచింతామణిసూత్రమును సవరించి వర్గయుక్సరళములకు ముందున్న నకారమునకుమాత్రము క్వాచిత్కబిందు విధానమును జేసిరి. సూరిగారిసూత్రములోని సజాతీయవిధానమునైత మింకను సంస్కారము నపేక్షించుచునేయున్నది. సూరిగారిసూత్రములోని వర్గయుక్చ్ఛబ్దముచే వర్గద్వితీయములు గూడ లభించును. వర్గద్వితీయములకు ముందు వేఱొక పదము తుదినకారమునకుఁ బూర్ణబిందువు వచ్చుట యనుభవవిరుద్ధము. అట్లు పూర్ణబిందువే వచ్చినచో నాసున్నపోఁకున దానితరువాత నున్నయావర్గద్వితీయము వర్గచతుర్థముగా మాఱుట సహజము. వర్గప్రథమములకు నాదయోగమున వర్గతృతీయము లగుననియు, వర్గప్రథమతృతీయములలో హకారాంశము (మహాప్రాణాంశము) కలియుటచే వర్గద్వితీయచతుర్థము లగు ననియు శబ్దతత్త్వజ్ఞులు చెప్పుదురు. ఈసిద్ధాంతమునుబట్టి వర్గప్రథమములు సున్న పోఁకున వర్గతృతీయము లగునట్లె వర్గద్వితీయములును సున్నపోఁకున వర్గచతుర్థములు కావలసివచ్చును. ఇయ్యది యనుభవసిద్ధ మనుటకు సందేహము లేదు. కాని యీపద్ధతిచొప్పున "మెఱసెన్ ఖడ్గము" అనుచో "మెఱసెంఘడ్గము" అని యిట్లనిష్టరూపము పుట్ట వలసివచ్చును. అట్లుకాక 'మెఱసెంఖడ్గము' అనురీతిగల ప్రయోగములు బిందు పూర్వకఖకారప్రాసములో నున్నట్లగపడదు, మఱియు "మెఱసెంఖడ్గము" అనునుచ్చారణ మనుభవవిరుద్ధమనుటకు సందేహము లేదు గదా ! కావున, "వచ్చెంధాత్రీపతి" అనుదానివంటి సహజమగుప్రయోగము నాధారముగాఁ జేసికొని తత్ప్రయోగసజాతీయములకు సాధుత్వమును సూత్రించుటలో ధకార మునం దున్న వర్గద్వితీయచతుర్థసాధారణ మగు వర్గయుక్తధర్మమును బురస్క-

రించుకొని సూత్రింపఁదగదనియు, తన్నిష్ఠమగు వర్గచతుర్థతాథరమ్మును మాత్రమె పురస్కరించుకొని నియమించుట యుక్తమనియు గ్రహింపవలసి యున్నది. ఒక్కొక్కమార్పరాని ప్రయోగము నాధారముగాఁ జేసికొని తత్సజాతీయములను సాధింపకున్న వ్యాకరణరచనమే దుర్ఘటమగును. కాన నట్లు చేయక తీరదు గాని యట్లుచేయుటలో వాఙ్మయమును బాగుగాఁ బరిశీలించి యాయాప్రయోగము లందలి యనన్యవ్యాప్తము లగు నసాధారణధర్మములను స్థిరపఱిచికొని నియమింపవలయు నని మాత్రము గ్రహింపవలయును.

పైరీతి నసాధారణధర్మముల నేర్పఱుచుటలో మొదటిమొదటివారికన్న నుత్తరోత్తరుల కవకాశ మెక్కువయై యుండుట సహజము. పూర్వవైయాకరణులు సామాన్యధర్మపురస్కారమున సామాన్యవిధానములను జేయుచుండుటయు నుత్తరోత్తరులు విశేషప్రయోగాన్వేషణమున విశేషసూత్రములను విధించుచుండుటయు సంభవించుచు వచ్చును.

"స్యాద్ దమహతాం విభక్తౌ సోశ్చుమ్" అనుసూత్రముచొప్పున నమహత్సామాన్యముగా ముప్రత్యయము మాత్రము విధింపఁబడుటచే "ధర్మము" అనురూపము మాత్రము సిద్ధించియుండెను.

చ. ........ధ। ర్మువులుదొలంగు దేవమునిముఖ్యులు వాయుదు రోలి వృష్టిలే
　　దవు మఱి యర్థువుల్ దఱుఁగు........" (భార. ఆది.)

అను మొదలగు ప్రయోగములను జూచి యుత్తరోత్తరవైయాకరణులు "భవేద్ధర్మాదిశబ్దానాం। ముశ్చ వుశ్చాత్ర కుత్రచిత్" అని యిట్లువిశేషవిధానములను జేయుచువచ్చిరి.

పయిరీతిని రచింపఁబడినయాంధ్రవ్యాకరణములలో మూలఘటికకేతనాదులు రచించినయాంధ్రభాషాభూషణ ప్రభృతులు తెనుఁగుభాషతో రచింపఁబడినవి. ఈకేతనార్యుఁడు తన యాంధ్రభాషాభూషణమే యాంధ్రవ్యాకరణములలోని కెల్ల మొట్టమొదటి దని చెప్పికొనియున్నాఁడు.

క. మున్ను తెనుఁగునకు లక్షణ, మెన్నఁడు నెవ్వరును జెప్ప రేఁ జెప్పెద వి
　　ద్వన్నికరము మది మెచ్చఁగ, నన్నయభట్టాదికవిజనంబులకరుణన్.

తే. గీ. సంస్కృతప్రాకృతాదిలక్షణము చెప్పి
　　తెనుఁగునకు లక్షణముఁ జెప్పకునికియెల్లఁ

గవిజనంబుల నేరమి కాదు నన్ను
ధన్యుఁ గావింపఁ దలఁచినతలఁపు గాని.

(ఆంధ్రభా. భూషణము. 5,6.)

ఆంధ్రభాషతోఁ రచింపఁబడిన ప్రాచీనాంధ్రవ్యాకరణములలోఁ గేతనార్యుని యీయాంధ్రభాషాభూషణ మొక్కటి దక్కఁ దక్కిన విన్నకోట పెద్దనార్యుని కావ్యాలంకారచూడామణి, యనంతుని ఛందోదర్పణము, తాతంభట్టుగారికవిచింతామణి, కాకునూర్యప్పకవిగారియప్పకవీయము మొదలగువానిలోఁ గావ్యలక్షణములును, ఛందోలక్షణములును, వ్యాకరణవిషయములునుగూడఁ జెప్పఁబడియున్నవి. ఆకారణముచేతనే కావలయు వానిలోనివ్యాకరణవిషయము లత్యల్పములై యున్నవి. అరయనరయ వ్యాకరణరచన కారంభదశ యగుటచే వానియందు వ్యాకరణవిషయము లత్యల్పములై యున్న వనుట యుక్తము. కేవలవ్యాకరణవిషయములను మాత్రమె చెప్పినకేతనార్యుని యాంధ్రభాషాభూషణమునైత మత్యల్పవిషయక మేగదా.

సంస్కృతభాషతోఁ రచింపఁబడిన యథర్వణునిత్రిలింగశబ్దానుశాసన మింకను నత్యల్పతమవిషయకమై యున్నది. ఇఁక నాంధ్రశబ్దచింతామణిని సంబంధించి పుట్టినవ్యాకరణముల శాఖయె యాంధ్రవ్యాకరణములలోనికెల్ల మిక్కిలి విపులమైన దని చెప్పవచ్చును. సంస్కృతభాషతోఁ రచింపఁబడిన యాంధ్రశబ్దచింతామణియు నాంధ్రభాషతోఁ రచింపఁబడిన యద్దానిటీక లగుబాలసరస్వతీ యాప్పకవీయకవిజనాంజనాంధ్రకౌముదీప్రభృతులును బైవానివలెనె యత్యల్పవిషయకములె యైనను జింతామణిలోఁ గొఱవడియున్న యనేకవ్యాకరణవిషయములు వికృతివివేకమున వెలయుచున్నవి. ఈవికృతివివేకమునఁ గేవలము చింతామణిలో లేనివిషయములె చెప్పఁబడియుండుటంజేసి పాణినిసూత్రములకుఁ గాత్యాయనునివార్తికములవలె నియ్యది చింతామణికి శేషగ్రంథమని గ్రహింపవలసియున్నది. ఈవిషయములెల్ల నా రచించినయథర్వణకారికల పీఠికలో సోదాహరణముగా విశదపఱచియున్నాను. వికృతివివేకము చింతామణికి శేషగ్రంథమే యైనను నట్లు రెండుగ్రంథములను నేకీభవింపఁజేసిన మాతృక లభింపకున్నది. కాని యహోబలపండితీయమున నొకవిధముగా జోడించినరీతినే యీవికృతివివేకమును సధ్వరణకారిక లుదాహరింపఁబడినవి. కాన, నహోబలపండితీయ మనునాకవిశిరోభూషణ మనుటీకతోఁ గూడిన యాంధ్రశబ్దచింతామణి యొకవిపుల

మగునాంధ్రవ్యాకరణ మని చెప్పవచ్చును. కాని, చింతామణియు వికృతివివేక మును నహోబలపండితీయమును సంస్కృతభాషలో మిక్కిలి ప్రౌఢమగుశైలిని నుండుటచేత నిది యాంధ్రభాషాసేవకుల కంత యుపయోగించునది కాఁజాలదు. ఇంతియకాక యహోబలపతి చింతామణి, వికృతివివేకములకును నన్నయభట్టా రకునిభారతభాగమునకును లొంగని యాంధ్రమహాకవి ప్రయోగముల నెల్ల నిరసిం చుచువచ్చుటచేఁ గూడ నిది యాంధ్రభాషాసంప్రదాయమునకుఁ గొంత విలక్షణ మైనదనుట సాహసముకాదు.

ఇఁకఁ బరవస్తు చిన్నయసూరిగారు చింతామణివిషయములను నహోబలపండి తీయాథర్వణకారికలలోని మఱికొన్నివిషయములను నాధారముగాఁ జేసికొని బాల వ్యాకరణ మనునొకమంచితెనుఁగు వ్యాకరణమును దెనుఁగుభాషలో రచించిరి. ఇయ్యది మిక్కిలిగఁ బటుత్వసంపదగలిగి వ్యర్థపదవిదూరమై సందర్భశుద్ధిగలిగి కృ త్యవిచారణ చేయఁదగినసూత్రములతో నలరారుచున్నది. కాని, చిన్నయసూరి గారు కూడఁ గేవలప్రాచీనాంధ్రమహాకవులను జింతామణినిమాత్రమె ప్రమాణీ కరించువారగుటచేతను, సంస్కృతవ్యాకరణపరిభాషల నత్యధికముగా బాలవ్యా కరణమున నుపయోగించి యుండుటచేతను, నింకను ననేకాంధ్రవ్యాకరణవిషయ ములు—తుదకు వికృతివివేకాహోబలపండితీయగతవ్యాకరణవిషయములె యిందుఁ గొఱవడి యుండుటచేతను నిదియు నంత యుపయోగకారి యనిగాని సమ గ్రమైన దనిగాని చెప్పుటకు వలనుపడదు. కాని చింతామణికి వికృతివివేకము వలెనె దీనికి శేషగ్రంథముగా బహుజనపల్లి సీతారామాచార్యులవారు ప్రౌఢవ్యా కరణమనునొక తెనుఁగువ్యాకరణమును దెనుఁగుబాషతోనె రచించిరి. కావున బాలవ్యాకరణప్రౌఢవ్యాకరణములను నేకీభవింపఁజేసి జోడించినచో నదియు నొక మంచియుపయోగకారి యగు తెనుఁగువ్యాకరణము కాఁగలదు. బహుజనపల్లి సీతారామాచార్యులవారేకారణమున నట్టియభిప్రాయమును వెల్లడింపకుండిరో తెలియకున్నది. అగయనరయ సీతారామాచార్యులవారు తమగ్రంథము తెనుఁగు వ్యాకరణములకెల్ల శేషగ్రంథమై యున్నట్లు నటించిరనియుఁ 'గావుననే యద్దానికిఁ త్రిలింగలక్షణశేషమని నామాంతర మిడిరనియు స్ఫురించుచున్నది, గాని, యందు వికృతివివేకాహోబలపండితీయములలో నున్నవిషయములె యనేకము లుండుట చేత నది త్రిలింగలక్షణగ్రంథములకెల్ల శేష మనిపించుకొనఁజాలదు. ఇఁక నన్న యభట్టారకకృతమని ప్రసిద్ధినొందియున్న చింతామణికి శేషగ్రంథమై తనగ్రంథము

ప్రసిద్ధికెక్కవలయునని తలఁచి యాతఁడు పెక్కుచోట్లఁ జింతామణిసూత్రములను బరిభాషలను ననుసంధించుచు వచ్చెనని యూహింపవలసియున్నది. కాని, చింతామణిలో లేని బాలవ్యాకరణమునందలి పెక్కువిషయము లిందు విడువఁబడియుండుటచేతను, సామాన్యముగాఁ జింతామణిలో నున్నవిషయములెల్ల బాలవ్యాకరణములోనుండుటచేతను స్త్రీత్రిలింగలక్షణశేష మొక్క బాలవ్యాకరణమునకే శేషగ్రంథమని గ్రహించుట చాలవఱకు యుక్తియుక్తమై యుండును.

ఇఁక నట్లు బాలవ్యాకరణప్రౌఢవ్యాకరణములను జోడించినను నందు ననేకాంధ్రవ్యాకరణవిషయములు—తుదకు వికృతివివేకాహోబలపండితీయముల లోనివిషయములైనఁ గొఱవడియుండుటచేత నదియు నాంధ్రభాషకు సమగ్రమైన వ్యాకరణము కాఁజాలదు. ఈవిషయము సహృదయులహృదయములందు నెలకొల్పుటకై యిట దిఙ్మాత్రముగ నొకరుస్థల ముదాహరించుచున్నాను.

"పరుషే సరళే చైవ సమాసే నుముత్తో భవేత్ । అద్రుతాత్సరళాదందు పట్టి కూర్చి విభక్తిషు । తనేచ కుత్రచిదతో । వికారాచ్చాపి కేచన ।" అనువికృతివివేకసూక్తిచొప్పున "జ్ఞానముంబట్టి" మొదలగుచోటులందు విధింపఁబడిన నుమాగమము బాలవ్యాకరణప్రౌఢవ్యాకరణములలో విధింపఁబడలేదు. కాఁగా, జ్ఞానముంబట్టి మొదలగు ప్రయోగము లీవ్యాకరణమునకు నసాధ్యములై యున్నవి. ఇట్టి సామాన్యవిషయములనుగూడ సంగ్రహింపఁజాలనివ్యాకరణము లెంతవఱకు సమగ్రము లనఁదగినవో యట్టివానికి లొంగనిప్రయోగము లెల్ల గ్రామ్యము లనుట యెంతవఱకుచితముగా నుండునో విచక్షణులు సహృదయులై యాలోచింతురుగాక.

ఈనడుమ బాలవ్యాకరణమునకు గుప్తార్థప్రకాశికయను నొకటీక రచింపఁబడెను, గాని, దానియందుఁ బయివిషయము లెవ్వియు గమనింపఁబడినట్లె యగపడదు. సరేగదా మీఁదుమిక్కిలిగ దురదృష్టవశమున నంధ్రవ్యాకరణ సంప్రదాయ విరుద్ధము లగు ననేకాపసిద్ధాంతములు చొరఁబడినవి. నిజముగా నిది బాలవ్యాకరణమునకును దత్పాఠకులకును గొప్పయనర్థము నొదవించుననుటకు సందేహము లేదు. ఈవిషయమును సోదాహరణముగా మన యాంధ్రసాహిత్యపరిషత్పత్త్రికలోనే నీవఱకుఁ బలుమాఱు చూపియే యుండుటచేతను, బ్రకృతమున నదియొక్కటే ప్రసక్తవిషయమై యుండకుండుటచేతను నిచట మరలవిపులముగావిశదీకరింపలేదు. ఒకరుస్థలమునుమాత్రము చూపెదను "త్రిలింగలక్షణశేషమునందు,

సీ॥ విశ్వకర్మనికూఁతు విశదలావణ్యసముజ్జ్వలఁ జేకొని మూరిఁబోయి" హరి-ఉ. 4. అ అనులక్ష్యంబునుజూపి, 'విశ్వకర్మఁడు' అనురూపంబును గలదని తద్గ్రంథకర్త గారు నుడివిరి. కాని "విశ్వకర్మకూఁతు" అని సవరించినచో గణభంగముగలుగక సలక్షణంబుగానుండు నని యెఱుంగునది. ఉ॥ ఇమ్ముగవిశ్వకర్మసృజియించిన కాంచనహర్మ్యతుంగశృం। గమ్ములు.... భార. ఆది. 8 ఆ." అని యిట్లు "విశ్వకర్మాదులకు స్త్రీత్వం బగు" (బాల. తత్స. 75నూ) అనుసూత్రమునొద్ద సుప్రార్థ ప్రకాశికాకారులు వ్రాసియున్నారు. పైసీసపద్యభాగ మేపద్యభాగ మనుకొని వ్యాఖ్యాత లట్లు నిరసించిరో తెలియకున్నది. ఏమాత్రమును జాగ్రత్త లేక తాము పొరవడి యిట్లు నిర్దుష్టస్థలముల నిరసించుట యెంతయసంగతమో యరయుఁడు. విస్తరభీతిని విరమించితిని గాని యిట్టి ప్రమాదము లాగ్రంథమున నెల్ల యెడలం గలవు.

ఒక్క బాలవ్యాకరణమునఁదప్ప నప్పకవీయము మొదలుకొని పుట్టినయాంధ్రలక్షణగ్రంథములలో నెల్ల మహాకవిప్రయోగోదాహరణ పూర్వకముగా లక్షణరచన చేయునాచారమె ప్రబలి యున్నది. ఆంధ్రవ్యాకరణరచనావిషయమున ని యొకమంచి యుపయోగకర మగుమార్గ మని చెప్పుటకు సందేహము లేదు. ఈమార్గమున వ్రాయఁబడిన యప్పకవీయప్రౌఢవ్యాకరణములవిషయము నీవఱకుఁ దడవియే యున్నాను. ఇఁక సర్వలక్షణసారసంగ్రహము, కవిసంశయవిచ్ఛేదము, ననురెండు మంచిగ్రంథములు గలవు. కాని, యవియు ననుక్రమణిక గలస్వతంత్ర గ్రంథములు కావు. వేఱొకగ్రంథముతో జోడింపఁ దగినశేషగ్రంథములును గావు. ఆంధ్రకావ్యవాఙ్మయములోఁ గొన్నిగ్రంథములందుఁ దమకు దొరకిన కొన్ని విశేషప్రయోగములను, వానిచే సూచితము లగువ్యాకరణవిషయవిశేషములను దద్గ్రంథకర్త లేర్చి కూర్చిరి. అవియు నత్యల్పవిషయకములె యగుటం జేసి బాలవ్యాకరణముపాటి యుపయోగమునుగూడఁ గల్గింపఁజాలవు.

మన యాంధ్రవైయాకరణులకు గ్రంథము లన్నియు దొరక కుండుటచేతనో దొరకిన వానినిసైతమాంధ్రవైయాకరణులజాగ్రత్తతోఁ బరిశీలించి యుండుట చేతనో, లేక కొందఱు గ్రంథపరిశీలనమును బ్రత్యేకముగాఁ జేయకయే కొన్ని లక్షణగ్రంథములలో నుదాహరింపఁబడిన లక్ష్యములనే తీసికొని యందలివిశేషములం గొన్నింటిని గనిపెట్టి విశేషసూత్రములను రచించుచువచ్చుటచేతనో, లేక

మఱియే కారణములచేతనో గాని యే వ్యాకరణమందును దానికిఁ బూర్వభావులై యున్న గ్రంథములలోని ప్రయోగవిశేషములుసైతము సాకల్యముగా సంగ్రహింపఁబడలేదు. తుదకు భారతప్రయోగవిశేషములనుసైతము సాకల్యముగా సంగ్రహించువ్యాకరణము నేఁటికిని బుట్టదయ్యెను. ఇంతయేల! పూర్వపూర్వవ్యాకరణములలోఁ జేర్పఁబడినవిషయములుసైతము త్తరోత్తరవ్యాకరణములలోఁ గొఱవడుచునే వచ్చుచున్నవి. మిఁగులమిక్కిలి వానిలో వాని కెన్నెన్నో పరస్పరవిరోధములు వెలయుచున్నవి. ఒకరొప్పునుదానిని వేఱొకరు తప్పనుచుందురు.

సీ. "పితరులఋణము తీర్పెడుసూనుఁజెందని దౌర్భాగ్యశీలుగోత్రమ్ము త్రమ్ము.
(రాఘవ.)

సీ. కనకంపురుచిపెంపుకడనుంపు బలితంపుఁ బఙ్క్తికాంతివనాంతపదవిఁబొదువ॥
(హరి. నలో. 2-40)

సీ. కనకంపుననసొంపు కడనుంపురుచిపెంపుపసిఁడితీవలగుంపు మొనవలేదో॥
(వసు. 3-63)

సీ......తే. గీ. ఒనర్పుదురు...(హ. న. 2-51)

అనుమొదలగు మహాకవిప్రయోగములచే రూఢములము లగుచున్నను,

క. కోపింపుట కోపించుట, కాపింపుట పసులనొప్పఁగాపించుటనా
నేపారు నిట్టిపలుకులు, లోపుగ బహుళములు జగతిలో నెఱుఁగఁదగున్.
(కావ్యా. 8 ఉ.)

క. కావించుట కావింపుట, భావించుట మఱియు దీని భావింపుటనం
గా వెలయుఁ గృతులఁదుహిన, గ్రావసుతాప్రాణనాథ ప్రమథసనాథా.
(సర్వల. 7 ఆ. 705)

అనుమొదలగు లక్షణవిశేషములును దక్షిణవ్యాకరణములందు సంగ్రహింపఁబడలేదు.

చ. ........అ। చ్చెరువుగఁబూని యప్ప్రమదశీర్ణమహాయఱియయ్యెనెంతయున్.
(హ. న. 1-69).

సీ. ....। మానసాధ్యులమిన్నమహనీయ భక్తినక్షత్త్ర కులసితప్రకాశుఁ బ్రాణ ॥......(హ. న. 3-26).

తే. గీ. వఱలునచ్యుతనఖ్యాతివర్ణితాతు, లప్ప్రదీప్తి నిట్లలరుసీవిప్ప్రభావ
మొందు..................(రాఘ. 2-91.)

అను మొదలగు మహాకవిప్రయోగములచే రూఢమూలమగుచున్న త్రిక పూర్వసంయుక్తాక్షరద్విత్వ మేవ్యాకరణమందును సంగ్రహింపఁబడలేదు.

“చెట్టులు = చెట్లు, అబ్బురము = అబ్రము. తెడ్డులు = తెడ్లు” మొదలగు స్థలములలో నున్నసంయుక్తాక్షరలోపమును, “శా” అద్ధావాగ్విభవమ్మహో... సిద్ధమ్మాః కృతితాంగతః.... ఇద్ధాద్ధత్యమగాల్లయంహి......। అర్ధీరాగ్రణి” (ఆము). అను మొదలగుమహాకవిప్రయోగములలో రూఢమయి యున్నజస్త్వమును నేవ్యాకరణమునందును జేర్కొనఁబడలేదు.

“ఆకర్ణింపుఁడు పెద్దలతివార్ష్ణమునన్” అను భాగవతప్రయోగము బాలవ్యాకరణము చొప్పున సాధువు. చింతామణ్యహోబలపండితీయములచొప్పున నసాధువు ‘నుతింపుచున్నాఁడు’ అను మొదలగుచోట్ల “పత్వము” చింతామణిచొప్పున సాధువు. బాలవ్యాకరణముచొప్పున నసాధువు. అట్లె, నుతించుచున్నాఁడు’ అనుచోట “పత్వాభావము బాలవ్యాకరణముచొప్పున సాధువు. చింతామణిచొప్పున నసాధువు.” చొచ్చిచొరములు; ఎఱిఁగియెఱుఁగములు” అను మొదలగు ప్రయోగములు (ద్వంద్వః కేషాంచిదిష్టంస్యాత్। క్త్వార్థశబ్దేనకుత్రచిత్) వికృతివివేకముచొప్పున సాధువులు. బాలవ్యాకరణ ప్రౌఢవ్యాకరణముల చొప్పున నసాధువులు. ప్రౌఢవ్యాకరణసమ్మతము లగు “చొచ్చుచొరములు, వచ్చురాములు” మున్నగునవి వికృతివివేకము చొప్పున సాధ్యములు కావు.

క. రవడవల పైనకారము, కవియనుమతిఁబోవురడలు కడునిడుపులగున్
 శివుమఱివండుమఱాఁడుగ, డవఁబలికెనువాఁడు శివుఁగడాఁబలికెనన్.

(ఆంధ్రభాషాభూషణము. 17.)

పయివిషయము లితరవ్యాకరణములందు సంగ్రహింపఁబడలేదు. కవిబ్రహ్మయగుతిక్కయజ్వగారు “మఱాఁకుము” అనిప్రయోగించియున్నారు.

చ. అనుటయునప్డుగొంతి హృదయంబునశోకమునివ్వటిల్లని
 ట్లనునిది దైవసంఘటన మక్కట యెట్లునుదప్ప నేర్చునే
 యనుపమసత్యవిస్ఫురణనాడినమాటమఱాఁకుమన్ననీ
 యనుజులనల్వురం గడపు మర్జును నేఁ తకుసమ్మతించితిన్.

క. తినుటకునుదింటయగుమఱి, కొనుటకుఁగొంటయగుఁగనుటకుంగంటయగున్
 వినుటకువింటయగుందా, ననుటకునంటయగువలసినప్పుడు కృతులన్.

(ఆంధ్రభాషాభూషణము 158)

అని కేతనార్యుఁ డంగీకరించినవిషయములు వికృతివివేకాహోబలపండితీయములమతమున నుష్టములు.

“ పూర్వస్య న వికారోనోః ” ఇత్యనేన ‘ అంటపింటకంట ’ ఇత్యాది ప్రయోగస్య భావార్థే న సాధుత్వం కింతు ‘ అనుట ’ ఇత్యాదిరేవ. “ ఏతేన మధుకైటభారాతి మఱఁది రమ్మని పిల్చి పనిఁగొంట నీకుఁ బ్రాభవముకాదె ” ఇత్యాదిశ్రీనాథవచనస్య ప్రామాదికత్వమేవే త్యనుసంధేయమ్.

(అహో. 499-పుట.)

బాలవ్యాకరణమున గ్రామ్యములని నిరసింపఁబడిన “ కూఁతురులు, కూఁతురును, కూతురుచే ” మున్నగుప్రయోగములు విన్నకోటపెద్దనార్యునిమతమునందును, నథర్వణాహోబలులమతమునందును సాధువులై యున్నవి.

సీ. పరఁగఁ గూఁతురుశబ్దంబుపై రుకార, మొకట పలుకున నైనను నుండఁబోయిఁ
బెక్కుపలుకులనైనను దక్కిపోవుఁ, గూఁతురుఁబడసెఁ గూఁతుఁ గాఁగోరెననఁగ.

క. కూఁతులచేఁ గూఁతురుచే, ఁగూఁతులకై
కూఁతుకొఱకుఁ గూఁతులవలనన్.........(కావ్యా. 8 ఆ. 79 తాళ.)

“ జనస్థానేరురత్రస్యాత్ । క్వచిదత్వంభవేల్లులే । ఏకత్వేచభవేద్వారు । స్తథాతాచభవేత్క్వచిత్ ”.....కూఁతు, కూఁతురులు, కూఁతులు “ఇత్యాది.”

(అహో. 308 పుట.)

అహోబలపండితీయములో సాధువు లని యుదాహరింపఁడిన “ చేసితినచ్యుతార్చనము ” = చేసితచ్యుతార్చనము. (190పుట) కొలిచితినబ్ధిజని=కొలిచితబ్ధిజని (194పుట) కాఁపది (197) విష్ణువునిచేతను, విష్ణువునికిఁ (296పుట) రాయులు రాళ్లు (327) అవ్వతె, ఇవ్వతె, (329పుట) ఎల్లంద్రు (335పుట) పందిలి, పందిళ్లు, రాళ్లు (341పుట) ఆనాని, అలసలసి, ఆడాడి, సాధుసాధు (361) మొదలగు పెక్కుప్రయోగములు బాలవ్యాకరణవిరుద్ధములై యున్నవి. సభ్యులారా ! విస్తరభీతిని విరమించితినిగాని యిట్టిచిక్కులు పెక్కులాంధ్రవ్యాకరణములందుఁ గలవు. వేయేల! సాహస మని సహృదయులకుఁ దోఁపవచ్చునుగాని, యొకరిద్దఱు గొప్పతెనుఁగుపండితులయొద్ద జయము పొందుటచే నీక్రిందిమాటలు వెల్లడించుచున్నాను. క్షమించి చిత్తగింతురుగాక. ఆంధ్రశబ్దచింతామణి, ఆంధ్రభాషాభూషణము మున్నగు ప్రాచీనాంధ్రవ్యాకరణములను మాత్రమె ప్రమాణి

కరించి వానికి లోఁగని వెల్ల గ్రామ్యములెయన్నచో వెదకివెదకి యిచ్చినం జెప్పఁ జాలనుగాని సామాన్యముగా నేగ్రంథమందైన గ్రామ్యపదమును జూపఁగలను.

ఆంధ్రవ్యాకరణములకెల్ల నాంధ్రవాఙ్మయమె మూలమై యుండఁగా, నిట్టి లోపములు, నిట్టిపరస్పరవిరోధములు రానేల ? ఇట్టివిచారించునపుడు ప్రాచీనాంధ్రవైయాకరణు లాంధ్రవాఙ్మయమును సాకల్యముగాఁ బరిశీలించి వ్యాకరణరచనము చేయలేదని స్ఫురింపకతీరదుగదా !

కావున నిట్టిలోపములనెల్ల సవరించి యొకయాంధ్రవ్యాకరణమును రచించుట యావశ్యకమని విన్నవించుటయె నాయీవ్యాసమునొక్క ఫలితార్థము. ఇట్టి యుద్దేశమున కుపష్టంభకముగా నుండునని తలఁచియే యాంధ్రవ్యాకరణముల లోనిలోపములను గొంతవఱకుఁ జూపితినిగాని యాగ్రంథములం దొకనిరసనబుద్ధితోఁ జూపలేదు. నిజముగాఁ జెప్పవలసివచ్చునపు డాయావైయాకరణులజ్ఞానములో శతాంశమైన మనజ్ఞానము కాఁజాలదని నేను మనస్ఫూర్తిగా విన్నవించుకొనుచున్నాను. అట్లయినను వారు తీర్థకరు లగుటచేతను వారికిఁ గలసామగ్రీభేదముచేతను వారిగ్రంథములలోఁ గొన్నిలోపములు చొచ్చినవి. అంతమాత్రమున వారి కది యొకలోపము నొదవింపఁజాలదు. నిజముగా వారు మిక్కిలి శ్రమపడి మాతృభాషాసేవచేసి భాషావాఙ్మయసముద్రములను మథించి దుర్లభమగు నమృతమువంటి వ్యాకరణవిషయపరంపర నాంధ్రలోకమునకుఁ బ్రసాదించినమహానుభావులు. మనలో నెవ్వరికేమాత్రపుజ్ఞానము గల్గినను వారియనుగ్రహముచేతనేగదా గల్గినది.

అట్లయినను "శ్రేయసి కేన తృప్యతే" అనురీతిని నితోధికోత్తమవ్యాకరణలాభమును గోరియు నున్నస్థితిని జెప్పుట నిందాస్తుతులలోఁ జేరదనితలఁచియు నిష్కళంక మగునుత్తమవ్యాకరణరచన కధునాతనాంధ్రపండితశిఖామణులను, మాతృభాషాభిమాను లగువిద్వత్ప్రభువులను బ్రోత్సాహపఱచుటకై యీరీతి నుపన్యసింపసాహసించితినిగాన నన్ను క్షమించి మన్నింప సహృదయులను నమస్కారపురస్సరముగాఁ బ్రార్థించుచున్నాఁడను.

మఱియు నుత్తమవ్యాకరణరచన కిపుడు మంచిసామగ్రి యలవడియున్నది. మునుపటివలెఁగాక యిప్పు డాంధ్రవాఙ్మయమెల్లఁ బ్రచురమై సర్వజనసులభమై ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారములోను పరిషత్పుస్తకాగారమందును మఱికొన్నిస్థల

ములలోని పుస్తకభాండాగారములలోను వెలయుచున్నది. ముద్రణయంత్రములు మున్నగునాంగ్లేయ నాగరకత వ్యాపించియుండుటచే గ్రంథములు మఱింత సులభములై సుబోధములై యలరారుచున్నవి. భాషాంతరములజనులతో సంబంధము విస్తరించియుండుటచే నితరభాషలతత్త్వమును వానియందలివాఙ్మయమును సులభమై సుగ్రహమై వెలయుచున్నది. అభినవకృష్ణదేవరాయలవా రనఁదగు శ్రీపీఠికాపురాధీశ్వరులు తెనుఁగుభాష నుద్ధరింప నెంచి యొకగొప్పయాంధ్రనిఘంటువును రచింపఁజేయుచున్నారు. అట్లె మఱికొందఱు ప్రభుశిఖామణులు సయితము మాతృభాషాభిమానము గలవారై తద్వృద్ధికి బద్ధకంకణులగుచున్నారు. ఆంధ్రాంగ్లేయాదిభాషలు బాగుగాఁ దెలిసినట్టి శ్రీజయంతి రామయ్యపంతులవారు మున్నగు భాషాభిమానులు కేవలభాషాభివృద్ధినే గోరుచు సాహిత్యపరిషత్తు నలంకరించుచుఁ బండితలోకము నాదరించుచు భాషాసేవన మొనరించుచున్నారు. మూర్తీభవించిన వాగ్దేవతలె యనఁదగు బ్ర॥ శ్రీ॥ వేదము వెంకటరాయశాస్త్రులవారు మున్నగుపండితశిఖామణులు భాషాసేవామాత్రపరతంత్రులై యమూల్యగ్రంథరత్నములను వెలయించుచున్నారు. ఇట్టిసమయము మనఁ గాకున్న మ ఱెప్పుడాంధ్రభాషకుఁ దగినవ్యాకరణము పుట్టఁగలదు. కావున శ్రీసాహిత్యపరిషత్తువారు భాషాభిమానముతోను నధికోత్సాహముతోను నొకసమగ్ర మగునాంధ్రవ్యాకరణమును రచింపఁజేయుదురుగాక. నేఁటికి లభించియున్నయాంధ్రవాఙ్మయము నెల్లఁ బరిశీలించి తాళపత్రమాతృకాభేదములను బరిశోధించి ముఖ్యముగా ఛందోయతిప్రాసశ్లేషయమకాది స్థలములలో నిబద్ధము లగుమహాకవిప్రయోగములను బ్రతిపదమును బ్రమాణముగాఁ జూపుచు రచించినయాంధ్రవ్యాకరణ మచిరకాలమున వెలసి మనల నానందింపఁజేయుఁగాక.

ఇట్లు సుజనవిధేయుఁడు,

వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రి.

శ్రీరస్తు.

# ఆంధ్రసాహిత్యపరిషదష్టమ వార్షికోత్సవసభావృత్తాంతము.

ఆంధ్రసాహిత్యపరిషదష్టమవార్షికోత్సవము 1919 సంవత్సరము జూన్ నెల 7-8 తేదు (శనివారాదివారము) లందు నెల్లూరుపురమున లక్ష్మీనరసారెడ్డిగారి పురమందిరమున జరగినది. బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు సభాధ్యక్షులు. శ్రీరాజా సీతారామచంద్ర శ్రీరంగభూపాలభాలేరావుబహదర్ (పెదపవనిజమీందార్) గారు సమ్మానసంఘాధ్యక్షులు. మ. శ్రీ. ముత్తరాజుసుబ్బారావుగారు ఎమ్.ఏ. ఇంగువ శ్రీకృష్ణయ్యగారు, బి.ఏ., బి.ఎల్. పొణకాపట్టాభిరామరెడ్డిగారు, గునుపాటియేనాదిరెడ్డిగారు, మన్నేపల్లిరామకృష్ణరావుగారు వీరు సమ్మానసంఘకార్యదర్శులు. ఈసభకుఁ బలుతావులనుండి యనేకులు ప్రేక్షకులు విచ్చేసిరి. పండితులు కవులు మున్నగువారనేకులు వచ్చిరి. కొందఱు పండితులకుఁ బ్రయాణవ్యయములు పరిషత్తువారిచే నీయఁబడినవి.

సభకు వచ్చినవారినామములు కూడినంతమట్టునకుఁ గ్రిందఁ జూపఁబడినవి.

## సభకువిచ్చేసినవారు.

మ॥రా॥రా॥

వేదము వేంకటరాయశాస్త్రిగారు, అధ్యక్షులు.

శ్రీరాజా సీతారామచంద్ర శ్రీరంగభూపాలభాలేరావుగారు, (పెదపనిజమీందారు) సమ్మానసంఘాధ్యక్షులు.

శ్రీరాజా సూరానేని సూర్యప్రకాశరావుగారు.

త్రిపురాన సూర్యప్రసాదరావుగారు, సిద్ధాంతము, గంజాము.

అడపా వాసుదేవరామానుజులు నాయఁడుగారు, చోడవరము, గంజాము.

మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రిగారు, విజయనగరము.

వఝల చినసీతారామస్వామిశాస్త్రిగారు ... ... ,,

యస్. టి. జి. వరదాచారిగారు, ఎం. ఏ. ... ... ,,

జయంతి రామయ్యపంతులుగారు, బి.ఏ., బి.ఎల్. ముక్తీశ్వరము.

చిలుకూరి వీరభద్రరావుగారు, రాజమహేంద్రవరము.

ఏలూరుపాటి రామభద్రచయనులుగారు, తాళ్లపూఁడి.
పింగళ లక్ష్మీకాంతముగారు, బందరు.
కాటూరి వేంకటేశ్వరరావుగారు, ,,
కె. వి. రంగాచారియర్‌గారు, గుంటూరు.
పెద్దిభట్ల వీరయ్యగారు, బి.ఏ., బి.ఎల్. బెజవాడ.
చింతలపల్లి నరసింహశాస్త్రిగారు, బళ్లారి.
కురుడి గుండురావుగారు, బి.ఏ., బి.ఎల్., కడప.
పిరూరి పిచ్చయ్యగారు, బి.ఏ. ,,
మలహరిరావుగారు, బి.ఏ., బి.ఎల్. ,,
వావిలాల చినవేంకటశివావధానిగారు, బి.ఏ., బి.ఎల్. కడప.
దోమా వేంకటస్వామి గుప్తకవిగారు, కర్నూలు.
సముద్రాల వేంకటప్పలాచార్యులుగారు, అనంతపురము.
యాలేరు వేంకటరావుగారు, ,,
అనంతగిరి పేరనార్యకవిగారు ,,
కోలారు శ్రీకంఠశాస్త్రిగారు ,,
వెదలువాడసుందరరామశాస్త్రిగారు, చెన్నపురము.
దండిగుంట సూర్యనారాయణశాస్త్రిగారు ,,
కే. ఏ. వీరరాఘవాచార్యులుగారు బి.ఏ., ,,
వావిళ్ల వేంకటేశ్వరులుగారు ,,
వావిలికొలను సుబ్బరావుగారు ,,
యన్. వి. రంగాచార్యులుగారు ,,
కొండూరు శ్రీరాములుగారు ఎం.,ఏ. ,,
పురాణము సూర్యనారాయణతీర్థులుగారు ,,
గరిమెళ్ల సత్యగోదావరిశర్మగారు ,,
డాక్టరు ఆచంట లక్ష్మీపతిగారు, బి.ఏ., ఎం.బి.సి.యం., చెన్నపురము.
యం. యస్. వెంకయ్యగారు ,,
యమ్. యస్. దొరస్వామయ్యగారు ,,
అప్పలాచార్యులుగారు ,,
ఏ. రంగస్వామిసరస్వతిగారు, బి.ఏ. ,,

బాలకళానిధి డి. శేషాచార్యులుగారు చెన్నపురము.

ముత్తనూతలపాటి గోపాలకృష్ణయ్యగారు ఒంగోలు.

వత్రి శ్రీనివాసయ్యగారు ,,

టి. డి. కృష్ణరావుగారు, బి.ఏ., యల్.టి. సబు అసిస్టెంటు ఇన్‌స్పెక్టరు అఫ్‌స్కూల్సు.

బి. రామయ్యగారు, బి.ఏ., ఎల్‌టి. అసిస్టంటు ఇన్‌స్పెక్టరు అఫ్‌స్కూల్సు.

కోట నరసింహముగారు, బి.ఏ., నెల్లూరు.

కే. దక్షిణామూర్తిఅయ్యగారు, బిఏ. బిఎల్., కర్నూలు.

అద్దేపల్లి లక్ష్మీనారాయణగారు, బిఏ. యల్‌టి., ఒంగోలు.

టంగుటూరి నాయనశాస్త్రిగారు, బిఏ. బిఎల్., కందుకూరు.

కొండముది నరసింహముగారు, అప్పికట్ల.

దువ్వూరి రామరెడ్డిగారు, గూడూరు.

పెళ్లేటి వేంకటసుబ్బారెడ్డిగారు ,,

గునుపాటి యానాదిరెడ్డిగారు, కొత్తూరు.

పాణకాపట్టాభిరామరెడ్డిగారు ,,

బెజవాడ సుందరరామరెడ్డిగారు, బుచ్చిరెడ్డిపాళెము.

వేబూరి సుబ్బరామరెడ్డిగారు ,,

బెజవాడ చంద్రశేఖరరెడ్డిగారు ,,

మేనకూరి దశరథ రామరెడ్డిగారు ,,

ఉగ్గుమూడి సుబ్బరెడ్డిగారు విడవలూరు.

దొడ్లా రామరెడ్డిగారు ,,

పట్నం వేంకటసుబ్బారామరెడ్డిగారు కొరుటూరు.

దొడ్లా వేంకటరామిరెడ్డిగారు, కావలి.

చివుకుల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ,,

కసవరాజు నరసింగరావుగారు ,,

తిక్కవరపు రామరెడ్డిగారు పొట్టెయ్యపాలెము.

పొన్నలూరి వేంకటరెడ్డిగారు కొమరిక.

దువ్వూరి సుబ్బరామరెడ్డిగారు పల్లెపాడు.

అన్నదేవుల గోవిందరెడ్డిగారు ,,

పర్వతరెడ్డి రామచంద్రారెడ్డిగారు అల్లూరు.
నూకలపాటి కృష్ణారెడ్డిగారు ,,
తిక్కవరపు వెంకురెడ్డిగారు జగదేవుపల్లి.
నావురెడ్డి వెంకురెడ్డిగారు ,,
సెనగవరపు శేషయ్యశాస్త్రిగారు కనిగిరి.
అల్లాడిసూర్యరామయ్యగారు బి.ఏ. ,,
అనంతపద్మనాభరెడ్డిగారు, బి.ఏ., బి.ఎల్. నెల్లూరు.
రత్నాకరము వేంకటరాజుగారు, చుక్కలనిడిగల్లు ; కాళహస్తి.
ప్రతాపరామకోటయ్యగారు, అమ్మృతలూరు.
ఏలూరు నాగశర్మగారు, ఈపూరు.
ఆమంచర్ల కృష్ణారావుపంతులుగారు, బి ఏ., బిఎల్. అల్లూరు.
యస్. సింగరాచార్యులుగారు ,,
కే. శ్రీనివాసంగారు ,,
టి. వి. నారాయణస్వామిరాజుగారు వెంకటగిరి.
తూములూరి శివరామయ్యగారు బి.ఏ., నెల్లూరు.
ప్రా. సుబ్రహ్మణ్యముగారు చిత్తూరు.
కొండూరికుమారస్వామిశాస్త్రిగారు, బి.ఏ., బి.ఎల్. నెల్లూరు.
కొ. వేంకటప్పయ్యగారు ,,
వి. సీతారామశాస్త్రిగారు, పుదూరు.
ఒంగోలు వేంకటరంగయ్యపంతులుగారు, బి.ఏ., బి.యల్., నెల్లూరు.
టేకుమళ్ల అచ్యుతరావుగారు, బి.ఏ., ఎల్ టి. .. ,,
దుర్భాసుబ్రహ్మణ్యశర్మగారు .... .... ,,
దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు .... .... ,,
మైనంపాటి హనుమంతరావుగారు .... .... ,,
ముదలి లక్ష్మీనరసింహముగారు, బి.ఏ., బి.ఎల్. .... ,,
మాడభూషి నరసింహాచార్యులుగారు, బి.ఏ., బి.ఎల్. నెల్లూరు.
కేసరిగురుమూర్తిశాస్త్రిగారు .... .... ,,
రేబాల సుబ్బరావుగారు, బి.ఏ., బి ఎల్. .... .... ,,
చక్రవర్తులశ్యామయ్యంగారు .... .... ,,

| | | | |
|---|---|---|---|
| వేటూరి శ్రీనివాసాచార్యులుగారు | .... | .... | నెల్లూరు. |
| ఓరుగంటి వెంకటసుబ్బయ్యగారు | .... | .... | ,, |
| సరస్వతి రంగాచార్యులుగారు, బి.ఏ. | .... | .... | ,, |
| గట్టుపల్లి ఆదిశేషయ్యగారు, బి.ఏ., బి.ఎల్. | | .... | ,, |
| మజ్జిగ బలరామరెడ్డిగారు, బి.ఏ., బి.ఎల్. | | .... | ,, |
| ఎరగుడిపాటి వేంకటరంగయ్యపంతులుగారు, బి.ఏ., బి.ఎల్. | | | ,, |
| వావిలికొలను నరసింగరావుగారు, బి.ఏ., బి.ఎల్. | | .... | ,, |
| ,, కృష్ణస్వామిరావుగారు, బి.ఏ., బి.ఎల్. | | .... | ,, |
| శే. వీరరాఘవాచార్యులుగారు బి.ఏ. బి.ఎల్. | | .... | ,, |
| ముత్తరాజు శివకామయ్యగారు, బి.ఏ., యల్‌టి. | | ... | ,, |
| కైప సుబ్రహ్మణ్యశర్మగారు | .... | .... | ,, |
| ముంగమూరి వేంకటసుబ్బరావుగారు బి.ఏ., బి.ఎల్. | | .... | ,, |
| కనుపర్తి రామకృష్ణయ్యగారు, బి.ఏ., | .... | .... | ,, |
| ముత్తరాజు సుబ్బరావుగారు, ఎం.ఏ., | .... | .... | ,, |
| మర్నేపల్లి రామకృష్ణరావుగారు | ... | ... | ,, |
| పురిగెళ్ల ఆదినారాయణయ్యగారు, బి.ఏ., బి.ఎల్. | | ... | ,, |
| కాసుఖేల సీతాపతిరావుగారు | ... | ... | ,, |
| కాసుఖేల అప్పాస్వామిరావుగారు, బి.ఏ., బి.ఎల్. | | ... | ,, |
| జి. సాంబశివరావుగారు, బి.ఏ., బిఎల్. | ... | ... | ,, |
| కనవరాజు నారాయణయ్యగారు | ... | .... | ,, |
| మొదలి శ్రీరాములుగారు | ... | ... | ,, |
| ధూళిపాళ యజ్ఞనారాయణగారు, రేపల్లె. | | | |
| వేమూరి సీతారామశాస్త్రిగారు, చల్లపల్లి. | | | |
| పుచ్చాశివరామకృష్ణశాస్త్రిగారు | ,, | | |
| దివాన్‌బహాదర్. స్వామికణ్ణుపిళ్లెగారు | | | |

మఱియు ననేకులు విచ్చేసియుండిరి.

సభా కార్యము.

7వ తేది యుదయమున మ. శ్రీ. గునుపాటి యేనాదిరెడ్డిగారు చదివిన (1) శ్రీవాణీగిరిజాశ్చిరాయదధతో వక్షోముఖాంగేషుయే ॥ (నన్నయభట్టుభారతాది

పర్వము) (౨) శ్రీయనగారినాఁ బరఁగుచెల్వకుఁజిత్తముపల్లవింప ॥ (తిక్కయజ్వ, భారతవిరాటపర్వము) "నీటనుడాగికొండ" (వేదము వేంకటరాయశాస్త్రిగారు ప్రతాపరుద్రీయము) అను దైవప్రార్థన పద్యములతోడను,

ఉ. శ్రీమహితుండు తిక్కకవిసింహుఁడు పుట్టినచోటు సత్, వి
స్తోమముఁ గన్నమండలము సోముఁడు శ్రీకవిసార్వభౌముఁడుం
బ్రేమఁ జరించి వర్థిలినవిక్రమసింహపురంబు స్వాగతం
బోమహనీయులార తమ కొప్పుగ నిప్పు డొసంగెఁ బ్రీతితోన్.

అనుస్వాగతపద్యముతోడను సభ ప్రారంభమయినది. పదపడి చింతలపల్లి నరసింహశాస్త్రిగారు, నేలటూరిపార్థసారథిఅయ్యంగారు, మైనంపాటి హనుమంత రావుగారు, పింగళిలక్ష్మీకాంతముగారు, ప్రతాపరామకోటయ్యగారు మున్నగు వారు స్వాగతపద్యములఁ జదివినతరువాత సమ్మానసంఘాధ్యక్షులు తమస్వాగ తోపన్యాసముం జదివిరి. పుస్తకముగా ముద్రింపఁబడినయావ్యాసము లెల్లరకుఁ బంచిపెట్టఁబడియెను.

మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రిగారు "మన మిపు డాంధ్రభాషాభివృద్ధికొఱకై యిచ్చోటను సమావేశమైనారము. ఆంధ్రభాషకు సంస్కృతభాషతోడను అఱవము మొదలగు ద్రావిడభాషలతోడనుగూడ సం బంధ మతిదృఢముగాఁ గలదు. ఆంధ్రభాషాభివృద్ధికై చేయునిట్టిసభలకు ముఖ్య ముగా నాభాషల బాగుగ నెఱింగినవా రధ్యక్షులు గా నర్హులు. అట్టివా రిపుడు బ్రహ్మశ్రీ. వేదము వేంకటరాయశాస్త్రిగారే. శాస్త్రిగారిని నే నిరువదిసంవత్సర ములనుండి యెఱుఁగుదును. శాస్త్రిగారికి సంస్కృతాంధ్రద్రావిడభాషలందు విశేషపాండిత్యము గలదు. ఆంగ్లభాషయందుఁగూడ వీ రధికపరిశ్రమముచేసి యున్నారు. ఇంతియ కాక రసవంతముగఁ గవితఁ గూర్చియు నుపయుక్తము లగు సంస్కృతకావ్యములకును బ్రౌఢములగునాంధ్రకావ్యములకును వ్యాఖ్యల రచించి యున్నారు. వీరు చేయునాంధ్రభాషాసేవ యమూల్యము. కావున శ్రీశాస్త్రి గారే యీసభ కధ్యక్షులయి సభాకార్యముల నిర్విఘ్నముగ నెఱవేర్పుట యావ శ్యకమగుటచే వారిని సభాధ్యక్షులు గాఁ గోరుచున్నాఁడ"నని యుపపాదించిరి.

మ. శ్రీ. వావిలికొలను సుబ్బరావుపంతులుగారు మహామహోపాధ్యా యులవారి యుపపాదనమును బలపఱుచుచు నీసభకు వయోవృద్ధులు విద్యా

వృద్ధులు "ఆంధ్రమల్లినాథ" బిరుదమున కన్నివిధముల నర్హులు నగువేంకట
రాయశాస్త్రిగా రధ్యక్షులుగా నుండుట యుక్తమని చెప్పుచు హారములోని
నాయకమణికిని సభలోనినాయకునకును నౌపమ్యము నెంతయు సరసముగ
మృదుమధురవచనరచనములతో వెల్లడించిరి. పిదప నీయుపపాదనమును బ్ర. శ్రీ
చింతలపల్లినరసింహశాస్త్రిగారును మ. శ్రీ. కురిది గుండురావు, బి.ఏ., బియల్.
గారును నామోదముతోఁ బ్రశంసింపఁగా శ్రీవేంకటరాయశాస్త్రిగారు "ఏకారణ
ముచేతనో యింతటిమహాసభకు శక్తిసామర్థ్యములు చాలనిన న్నధ్యక్షునిగాఁ
గోరుచున్నారు. నాయం దధికమయినవిద్య కలదని మహనీయులు పలుకు
చున్నారు. పరమార్థమున నాయం దట్టిగుణము లేకున్నను బెద్దలయాజ్ఞ నంగీ
కరింపకుండుట యోగ్యముగాదు. "ఋషీణాం పున రాద్యానాం వాచ మర్థోఽ
నుధావతి" యనుసూక్తిబలమును నమ్మి మహనీయుల యాజ్ఞాపనము ననువర్తించి
చెప్పినపని చేయనున్నాఁడను, వారి చేతికి మెత్తనిజాయివలె దొరకినాఁడను, వారు
నా చే నేవిధము చేయించిన నావిధమే చేసెదను, ఇవి మొదలగువాక్యములతోఁ
బ్రత్యుత్తరము చెప్పి యధ్యక్షతవహించి ప్రారంభోపన్యాసముం గావించిరి.

మధ్యాహ్నము శతావధానులు తిరుపతివేంకటకవులు రానికారణమున
వారియాంధ్రకవులయౌన్నత్య మనువ్యాసము చదువఁబడలేదు.

సభలోఁ జదువఁబడినవ్యాసములు.

(1) ఆంధ్రీకరణతత్త్వము—దుర్భ సుబ్రహ్మణ్యశర్మగారు.

(2) ఆంధ్రవ్యాకరణములు—వఝలచిన సీతారామస్వామిశాస్త్రిగారు.

(3) తిక్కన—మాడభూషినరసింహాచార్యులుగారు, బి.ఏ., బిఎల్.

మఱునాఁ (8 తేది, ఆదివారము) డుదయమున నారాయణశతకము—బమ్మె
రపోతరాజు, అనువ్యాసమును కడప, బమ్మెరపోతనామాత్యసమాజప్రతినిధియు,
'కవిత్రయకృతిప్రశంస, యనుదానిని దండిగుంటసూర్యనారాయణశాస్త్రిగారు
ను, దేశభాషాప్రాధాన్యము, అనువ్యాసమును కొండూరి కుమారస్వామి
శాస్త్రి, బి.ఏ., బిఎల్. గారును, జక్కనకవినిగూర్చిన వ్యాసమును తేకుమళ్ల
అచ్యుతరావు బి.ఏ., ఎల్.టి. గారును జదివిరి.

మధ్యాహ్నము సభాధ్యక్షులయనుమతి ననుసరించి వారువచ్చువఱకు
మ. శ్రీ. వావిలికొలను సుబ్బరావుగా రగ్రాసనాధిపతులుగా నుండిరి. ఆసమయ

మున జరగినపరిషత్కార్యనిర్వాహకసభలో నీక్రిందితీర్మానములు చేయఁబడినవి.

1. కాళయుక్తిసంవత్సరపరిషత్కార్యనివేదన మంగీకరింపఁబడినది.

2. సిద్ధార్థిసంవత్సరమునకు గతసంవత్సరమునకువలెనే రు 8950 లు వచ్చినయెడల రు 5360 రులు వ్యయపఱచుటకు నిర్ణయింపఁబడినది.

3. కోశాధ్యక్షులుగా నుండు దివాన్ బహదర్ కంచి కృష్ణస్వామిరావు పంతులు సి. ఐ. ఇ. గారును దివాన్ బహదర్ పిట్టి త్యాగరాయసెట్టి బి.ఏ. గారును దమపదవులకు రాజీనామా యిచ్చినందున వారికి బదులు మ. శ్రీ. వేపా రామేశముపంతులు బి.ఏ., బిఎల్. గారును, రావుబహాదర్ ధర్మవరపు శేషాచార్యులు బి.ఏ., బిఎల్. బి. సి. ఇ. గారును గోశాధ్యక్షులుగా నెన్నుకొనఁబడిరి.

4. ఇదివఱకుఁ గార్యనిర్వాహకసభ్యులుగా నుండిన శ్రీ మొక్కపాటిసుబ్బారాయఁడుగారు, శ్రీరాజా, కొచ్చెర్లకోట రామచంద్ర వేంకటకృష్ణారావుబహదర్ గారు, కొణదలరామచంద్రారెడ్డిగారు రావుబహదర్ కందుకూరివీరేశలింగము పంతులుగారులకు బదులుగా మ. శ్రీ. వేపా రామేశముపంతులు బిఏ., బిఎల్. గారును, రావుబహాదర్ ధర్మవరపు శేషాచార్యులుగారును, నాళము లక్ష్మీకాంతముగారును, కే. ఏ. వీరరాఘువాచారి, బి.ఏ., గారును గార్యనిర్వాకసభ్యులుగా నెన్నుకొనఁబడిరి.

5. బ్రహ్మశ్రీ దుర్భసుబ్రహ్మణ్యశర్మగారు, నేలటూరిపార్థసారథిఅయ్యంగారు, చిలుకూరివీరభద్రరావుగారు, నెమలూరి వేంకటశాస్త్రిలుగారును, గౌరవసభ్యులుగాఁ జేర్చికొనఁబడిరి.

మ. శ్రీ. శ్రీరాజా. సీతారామచంద్ర శ్రీరంగభూపాలభాలేరావు బహదర్ (పెదపవనిజమీందారు), గారు సిద్ధార్థిసంవత్సరమునకుఁ బరిషదధ్యక్షులుగా నెన్నుకొనఁబడిరి.

ఇంతటితోఁ గార్యనిర్వాహకసభ ముగియఁగా వార్షికసభ తిరిగి యారంభమయ్యెను సభాముఖమున.

ఆంధ్రవాఙ్మయము ననేకవిధముల నభివృద్ధినొందించి యాంధ్రలోకమునకు మహోపకారమొనరించిన రావుబహదరు కందకూరి వీరేశలింగముపంతులు గారియొక్కయు, శ్రీరాజా కొచ్చెర్లకోట వేంకటరామచంద్రకృష్ణారావు బహా

దరుగారియొక్కయు మరణములవలన నాంధ్రలోకమునకు గొప్పలోటు వాటిల్లి నదని సభలోనియెల్లరు నిలువఁబడి తమవిషాదమును వ్యక్తపఱిచిరి.

సంస్కృతాంధ్రద్రావిడాంగ్ల భాషాపాండిత్యవిశేషముచేతను బహుగ్రంథ రచనముచేతను బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు మహామహోపాధ్యాయబిరుదమున కర్హు లని బ్ర. శ్రీ వావిలికొలనుసుబ్బరావుపంతులుగా రుపపాదింపఁగా నాతీర్మానమును సభ్యులేకగ్రీవముగ నంగీకరించి యీతీర్మానమును దొరతనము వారికిఁ దెలుపుటకుఁ బ్రకృతసభాధ్యక్షు లగుసుబ్బరావుపంతులుగా రధికారులైయున్నారని నిర్ణయించిరి.

పిదప, ఆంధ్రభాగవతకర్తృత్వమునుగూర్చి మ. శ్రీ. కొత్తపల్లిసూర్యరావుగారును, పాల్కురికిసోమనాథకవినిగూర్చి, ఆ. రంగస్వామి సరస్వతి బి.ఏ., గారును వ్యాసములు చదివిరి. అంతట సభాధ్యక్షు లగు వేంకటరాయశాస్త్రిగారు రాఁగా వారిసమక్షమున సాహిత్యవిషయకవ్యాసమును మ. శ్రీ. వంగోలు వేంకటరంగయ్యపంతులు బి.ఏ., బిఎల్‌గారు చదివిరి. పిదప సభాధిపతు లారెండుదినములలోఁ జదివినవ్యాసములను స్థాలీపులాకన్యాయమున విమర్శించిరి.

మ. శ్రీ. జయంతిరామయ్యపంతులుగారు శ్రీసూర్యరాయాంధ్రనిఘంటు నిర్మాణవిషయమయి జరగుచున్నపనులు వివరించిచెప్పిరి. పరిషన్నవమవార్షికసభ బెజవాడలోఁగావింపవలయునని మ॥రా॥ పెద్దిభట్టవీరయ్యగారు కోరినందున వారి యాహ్వానమంగీకరింపఁబడినది.

ఆహ్వానసంఘమువారు వార్ధకమున నోపికతక్కువగా నున్నను భాషాభిమానముచే నధ్యక్షత వహించి సభ జరపినారని యధ్యక్షులకును, దూరమున కంగీకరించి శ్రమలకోర్చి విచ్చేసినప్రతినిధులకును భాషాభిమానప్రశంసాపూర్వక వందనము లర్పించిరి.

తుదిని.

శ్రీ. శతావధాని పురాణము సూర్యనారాయణతీర్థులుగారు.
గరిమెళ్లసత్యగోదావరి శర్మగారు.
అష్టావధాని మైనంపాటి హనుమంతరావుగారు.
కట్ట వేంకటసుబయ్య (కమ్మబాలుఁడు అప్పికట్ల.)
కొండముది వాసుదేవమూర్తి (బ్రాహ్మణబాలుఁడు, అప్పికట్ల).
మొదలగువారు పద్యములంజదువుటతో సభ ముగిసెను.

ఈసభ మేనెలలో ఒరంగల్లులో జరగవలసియుండెను. మధురసభ జరిగిన యనంతరము ఒరంగల్లువారీసభను దమపురమునకాహ్వానించిరి. కాని విషజ్వరములచే నాదేశమనారోగ్యముగా నుండుటచేతఁ బ్రభుత్వమువారీయేఁడిక్కడ సభజరపుట కనుమతి నొసంగకపోవుటచేతను భాషాభిమానులై సభనాహ్వానించినవారిలోఁ బ్రధానులగుకొందఱికుఁ గాలము దురతిక్రమణీయమగుటచేతను దలంచినట్లు కొనసాగదయ్యె. ఈ వృత్తాంత మవ్యవధిగాఁ దెలుపఁబడినను నెల్లూరుపురవాసులు తమభాషాభిమానముచే నతిస్వల్పకాలములోనే సభను సంఘటించుటెంతయు స్తవనీయము. నెల్లూరుపురముపైని బరిషత్తుపైని గలదమ యభిమానముచే నెల్లూరిపౌరులతోపాటు సభాసంఘటనమునకై విశేషపరిశ్రమ మొనరించిన రా. సా. గుమ్ముడూరివేంకటరంగరావుపంతులు ఎం., ఏ. గారును వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారును భాషాభిమానులవిశేషప్రశంసాపాత్రములై యున్నారు.

శ్రీశ్రీశ్రీ.

## స్వాగతము.

సీ. మనుమసిద్ధిమహీవిభునిరాజ్యలక్ష్మికి శ్రవణకల్హారమ్ము సంతరించి
ఖడ్గతిక్కన వాఁడికత్తి వర్షించురక్తప్రవాహముల నేస్తమ్ము సల్పి
తిక్కనకవి తేటతెలుఁగుక్రొందేనియవాఁకల ముడిగొని పంకమూడ్చి
గజపతివంశభూభుజులదురాధిలక్ష్మిని జలక్రీడకై చేరఁదీసి

గీ. నట్టి పెన్నాతరంగిణి యాంధ్రజనహృదంతరక్షేత్రముల భావనాంకురములు
మొలకలెత్తఁగ స్వాగతముల నొసంగుఁగమ్మకమ్మని మరుదర్భకముల నంపి.

సీ. దయ సేయుఁడయ్య సంధ్యావందనము సల్ప మమ్ముఁగన్నమ్మ పెన్నమ్మదఱికిఁ
బైనమై వత్తురా? పాటూరుతిక్కనగంటంపుటాటఁ కండ్లఁగప్పికొనఁగ
పెరుమాళ్లదయచేత పెన్నఁదాటిరిగదా! సేవింపుఁడాస్వామి చెంతగలిగి
హరిహరనాథునియాలయమ్మా? యంతపుణ్యమా! యిందంచుఁబోల్పలేము

గీ. దూరదేశమ్ము నాక యాంధ్రులకు దర్శనీయమసిసింహపురికి వేంచేసినట్టి
తీర్థసంవాసులార! మీదివ్యపాద, పాంసులఁబవిత్ర మయ్యె మాపట్టనమ్ము.

సీ. శారదరాత్రి యుజ్జ్వలత తమ్మలపుసౌరభమున మప్పినబ్రహ్మ యొకఁడు
కవితఁ జెప్పి యుభయకవిమిత్రు నొప్పింప దక్షుఁడౌ నభినవదండి యొకఁడు

గంగాప్రవాహమ్ముగాఁ గృతిజెప్పినసాహిత్యపోషణచక్రవర్తి
'వాణినారాణి'యన్ ప్రౌఢుండు సరసకర్ణరసాయనుండు వీరన్న యొకఁడు
గీ. నాంధ్రభాషను బాలించినట్టిసుకవు, లితరు లెందఱో! మా వారలేయటంచుఁ
గొసరి మీ ప్రోలఁ గొండాడుకొనుట కాక, వేఱువిధముల మిమ్మునొప్పింపలేము.

ఉ. ఎందుకు వత్తురీయెడకు నీ తెలుఁగుంజవరాలియుత్సవం
బుం దిలకించుగోర్కెఁ దమబోఁట్లిటువచ్చుట కల్గెఁగాని వే
వందనముల్ పొనర్తుఁ గవిపండితబాంధవులార! స్వాగత
మ్మంది ముదావహమ్మును జయప్రద మౌనటు జూడుఁడీసభన్.

పింగళి లక్ష్మీకాంతము,
కాటూరి వేంకటేశ్వరయ్య.

సీ. శ్రీపిఠాపురవరశ్రీనాయకాత్మీయమానసాంభోజాతమధురసంబ!
సకలాంధ్రభూపాలసమధికాదరలసత్కిసలయామోదకోకిలవరంబ!
వాఙ్మయసంశయవ్యాపారనీరద దూరీకరణచణమారుతంబ!
యమలకవిత్వతత్త్వాధికజ్ఞానప్రకాశప్రదాన భాస్కరముఖంబ!
నవనవానంతపరిశోధనాబలంబ! యాంధ్రజనవర్ణనీయకీర్త్యాకరంబ!
సారకవిపండితాహ్లాదకారణంబ! స్వాగతంబాంధ్రసాహిత్యపరిషదంబ!

సీ. స్వాగతం బిదె గొనుం డాగమాంతజ్ఞానపారీణు లగుబుధప్రవరులార!
స్వాగతం బిదిగొ రక్షోగణోపాధ్యాయజయసాధనము లగుచతురులార!
స్వాగతం బిదిగొ విస్ఫారపాండిత్యధిక్కృతపాణినీశసత్కీర్తులార!
స్వాగతం బియదే యోగశాస్త్రాదికవ్యాపారనిరతు లౌప్రాజ్ఞులార!
స్వాగతం బిదెగొనుఁడయ్యసరశాస్త్ర,సర్వసంపద్విలాసవిస్తారులార!
స్వాగతం బాంధ్రదేశభూషణములార! ధన్యమతులార! పరిషత్సదస్యులార.

సీ. అమలపినాకినీవిమలజలంబులం గమనీయసంపత్తిఁ గన్నతల్లి
భారతామ్నాయప్రబంధనిర్మాత తిక్కనకవిశ్రేష్ఠునిఁ గన్నతల్లి
హరిహరరంగనాయకధర్మరాజశంకరపాలనంబులఁ గన్నతల్లి
బహుజనశ్లాఘ్యమై పరఁగునముద్రితగ్రంథచింతామణిం గన్నతల్లి
మనుమసిద్ధిమహీనాథమండలాగ్ర,ధార శ్రీరామరక్షగాఁ దనరుతల్లి
పూజ్యతరమైనమాసింహపురమతల్లి,స్వాగతంబిచ్చుఁగొనుమాంధ్రపరిషదంబ.

సీ. తనపాలిశాశ్వతధనములమూటయై యలరుతిక్కనసోమయాజినోట
నతవిసత్కృతి పూర్ణమై వెల్గఁగాఁ జేసి మెన్నికఁ గన్న యెఱ్ఱన్ననోటఁ
గృతి చిన్నదైన సత్కృతిచాల పెద్దగాఁ గన్నపుష్పగిరి తిమ్మన్ననోట
రామాయణగ్రంథరచనాధురీణయై యలరారినట్టి మొల్లాంబనోటఁ
బూజ్యగుణవల్లి మాసింహపురమతల్లి, పలుకుచున్నది స్వాగతప్రవచనముల
నింపుపెంపారఁగ ననుగ్రహింపుఁడయ్య, ధన్యమతులార ! పరిషత్సదస్యులార.

చ. సరసులుఁ బండితోత్తములు శాశ్వతకీర్తు లనల్పకల్పనా
సరసకవిత్వతత్త్వసువిశాలురు వాఙ్మయసత్పరిశ్రమన్
నిరతు లమేయవైభవు లనింద్యచరిత్రులతోడ నొప్పునీ
వరసభ కీయువార మిదె స్వాగతచిహ్న మనుగ్రహింపుఁడీ.

మైనంపాటి హనుమంతరావు.

శా. శ్రీరామామణి నీలయున్ మఱియు ధాత్రీదేవియున్ నిచ్చలున్
గారా మొప్పఁగ వల్లభాంఘ్రిభజనోత్కర్షంబునన్ గ్రంథక
ర్త్రారప్రస్ఫురితాంగులై కొలువ నేపుం జూపుమానేత వి
స్తారప్రేమను బ్రోచు నాంధ్రజననిన్ సంతోష మేపారఁగన్.

సీ. స్తుతియింపఁబడినావు మితిమీఱి గలదేశభాషల లెస్సనుపల్కుచేత
నందినావమ్మ తియ్యందనమ్మున నిటాల్యనుభాష మించెద వనియశమ్ముఁ
బాడించెద వఱవపాటకులనుగూడఁ దేజంబుమెఱయు గీతికలచేత
దీపించితివి భారతీదేవపుత్రికలను మూఁడువంతులు జనని బోలి
యట్టియసమానప్రజ్ఞచే నలరునట్టి, యాంధ్రభాషామతల్లి మహాభిమాన
దివ్యదీక్షను పూజంచి తేజరిల్లు, నాంధ్రజనులార, బుధులార ! యార్యులార.

సీ. ఏనాఁడు తెలుఁగు ప్రధానభాషయయి ప్రస్తుతపాఠశాలల శోభఁ గాంచు
నేనాఁడు తెలుఁగువారైన స్వచ్ఛముగ గంటయయిన తెల్గుమాటాడనేర్తు
రేనాఁడు తెల్గునఁ గానసేర్చెద మన్య, భాషామహాగ్రంథభావములను
నేనాఁడు తెలుగు కాలానుసారంబుగనూత్నమార్గముఁ దొక్కయత్నమునలు
పప్పుడే యాంధ్రభాషాలతాంగిప్రతిభ, నొప్పి చక్కఁగ వర్ధిల్లుచుండు నంత
దనుకఁ గృషి సల్పవలయు సోదర్యులార, యాంధ్రజనులార బుధులార, యా
ర్యులార.

ప్రతాప రామకోటయ్య.

ఉ. శ్రీయనఁ గౌస్తుభంబునను జెల్వగు రత్నయుగంబు వక్షముం
బాయమిఁ దద్ద్యుతుల్ దిశలఁ బర్వఁగ శ్రీవనమాలికారుచిం
జాయఁగ దృష్టిదోషము నెపం బిడి కప్పెడు శ్రీసహాయుఁ డా
తోయజనేత్రుఁ డెప్డు పరితోషము నీసభ కిచ్చుఁగావుతన్.

మ. ధనధాన్యంబుల విద్యలం గవిత వేదాంతప్రచారంబునం
దున శిష్టాచరణంబునం గరము సంస్తుత్యంబు నా నొప్పు నీ
యనఘక్షేత్రము నేఁడు నీసభకుఁ బట్టై యొప్పుటం జేసి తా
ననురూపప్రియుఁ గన్నపద్మిని యనా నాహ్లాదముం బొందెడున్.

తే. కవులకునుమార్గదుండుదిక్కనయుభక్తి,ననుపమానగుణుండుపోతనయుసూక్తి
చతురుఁ డనఁ బేరుగన్నట్టి శంభుదాసుఁ, డెంద జేసియు మఱికవులిం దెమనిరి.

తే. శూరతకు బొబ్బి లెట్లట్ల ధీరకవుల,పట్టు నెల్లూరు నాఁ జనె నట్టి కాక
యర్జునునకచ్యుతునిఁ బ్రాఁపునట్ల యొరులఁ,గవితకునుదోడుకోరువార్కలుగరిచట.

ధర్మమునం దొలంగకయె తర్కమునేఁతగుణంబు హృద్గతిన్
మర్మమొకండు వెట్టుకొని మార్కొని చర్చకురాక తప్పు దు
ష్కర్మము రిత్తవాద మటుకావున నెల్లరు సద్గుణంబులన్
ధర్మయుతంబుగాఁ బొగడి తారుఁ బొగడ్తను గాంచుటొప్పగున్.

(ప్రణేత పేరు తెలియలేదు.)

## —✻ బమ్మెరపోతరాజు. ✻—

సీ. ఒకచోటఁ బండిత ప్రకరప్రకీర్తిత ప్రథితవాక్ప్రౌఢ ప్రబంధశైలి
యొకచోట సుకవిరాణ్ణికురుంబ సన్నుత కమనీయపద భవ్యకావ్యశయ్య
యొకచోటఁ బౌరాణికకదంబవందితరసవదపారపురాణఫణితి
యొకచోట సకలపాఠకజనామోదకప్రకటధారాళనాటకపథంబు

గీ. నచ్చుపడరిచ్చపడి బుధులిచ్చ మెచ్చఁ,బరమభాగవతోత్తముల్ ప్రస్తుతింప
భాగవతమురచించిన భవ్యచరితుఁబోతనామాత్యు నెదఁదలపోయఁదగదె ?

సీ. భయదబహుధ్వానబహుళసంగ్రామరంగములు ప్రదర్శించుగాఢశక్తి
రంగదుత్తుంగతరంగగంగాదితరంగిణుల్ నడిపించు ప్రకటరీతి
జిల్లనుల్లమ్ము పల్లవింపఁగమంచిశృంగారమల్లనఁ జిల్కునేర్పు
పామరులకుఁగూడఁ బారవశ్యమెలర్ప భక్తిప్రబోధించు ప్రౌఢిమంబు

గీ. నీకెతగుఁగాక వేఱొక్కనికిజగానఁ,దగునె? బమ్మెరవంశ సుధాపయోధి
చంద్ర! సుస్థిరసద్యశోరుంద్ర! సహజ,పాండితీసాంద్ర! పోతన వరకవీంద్ర!

సీ. ఆంధ్రిమహాకవులతిభక్తి మెయిఁగవిపట్టపురాజంచుఁబ్రస్తుతింప
వేదాంత విద్యాప్రవీణుఁడితండని వేదాంతవేత్తలు వినుతిసలుప
వ్యాకృతినసమానపండితుండంచుఁదచ్ఛాస్త్రివేత్తలు శిరసావహింపఁ
దార్కికపండితుఁడు తథ్యము తథ్యమని తర్కశాస్త్రజ్ఞులెంతయు సన్నుతింప
గీ. సకల శాస్త్రప్రవీణ విశాలహృదయు, భాగవత భాగవతమాంధ్రఫణితిగణుతి
కెక్కఁ రచియించినట్టి కవీంద్రుఁబోత, రాజుదలఁతుఁదృణీకృత రాజరాజు.

సీ. చెలికాఁడు తనకింత చేదోడువాదోడుగా మెలంగెడువాఁడు గాఢమూర్తి
తానింత తినఁగ నితరులకింతయిడఁగఁజాలు జీవనము కర్షకసువృత్తి
యిహపరంబులసౌఖ్య మొనయఁగఁగడుపారఁగన్నసంతానంబు కావ్యకన్య
యశాంతికర్తవ్య మత్యంతసుఖద మోక్షప్రధానంబు భాగవతసేవ
గీ. గాఁగఁగాఁపుర మొనరించి ఘనతఁగనిన, ఘనుఁడు పోతనసుకవి విఖ్యాతసహజ
పాండితీధనుఁడతఁడువంద్యుండుగాఁడె,యెంచిచూడఁగనాంధ్రప్రపంచమునకు.

ఉ. బమ్మెర పోతరాజ! కవి పట్టపురాజ! నినుఁగాసించి 'యం
బ్రహ్మ'లు వెఱ్ఱివ్రాఁతలను వ్రాసిరి కొందఱు దానినీకులో
పమ్ముఘటిల్లెనే? మఱియు వారియకీర్తికి హేతువయ్యెఁగా
కెమ్మెయినిన్నువంటి కవి యింక జనించునె? భారతావనిన్.

దీపాల పిచ్చయ్యశాస్త్రి.

భరతవాగ్రత్నములు.

ఉ. శ్రీనగహర్మ్యమందు నివసించి సుఖించుచుఁ గాళహస్తిహా
దాను జెలంగుచు న్విబుధతత్పర మా చును దాక్షవాటికో
ద్యానవిహారి యాచును దదంతరసీమఁ ద్రిలింగనామముం
బూని వెలుంగువాఙ్మయవిభూషణ మాంధ్రి మెసంగుఁ గావుతన్.

సీ. పదియునొకండు భాష్వన్మండలమ్ములకధికారమునుదాల్చునట్టిదేవి
సర్వప్రపంచవిస్తారంబు కడుపారఁ గనినసంస్కృతవాణి కనుఁగుఁజెలియ
దేశభాషలయందుఁ దెలుఁగులెస్సని శేషశాయిచేఁ బలికించుజాణమిన్న
మూర్తిత్రయమ్ము సోముండు భాస్కరుఁ డాదితనయులఁ గన్నరత్నంపుబొజ్జ
గీ. సరసకావ్యప్రబంధభాస్వరవిభూష,ముద్దులను మూటఁగట్టెడుసుద్దులగని
గానకవితాసుధాధామకల్పకుసుమ,శ్రీల వెలయుత మాంధ్రభాషాలలామ.

సీ. ఆది జయంతిరామయ్యసత్ప్రభునిభక్త్యాలవాలమ్మున నైననొలక
పీఠికాధీశాదిపృథ్వీశసాహాయ్యక, దోహదోజ్జీవమై తొడవుతీవ
విబుధులు సత్కవుల్వెలయించు విద్యాకృషి, తానమ్మునల్లునంతానసూన
చాటుచాటుననుండు సద్గ్రంథరాజసంకలిత యై వెలయుసత్ఫలవిలోల

గీ. సరససాహిత్యమకరందసరిదనంత, మహితపాఠకమధుపసంభరితచరిత
యాంధ్రపరిషత్సభాకల్పకాఖ్యవల్లి, ధరణి వెలయుత మాచంద్రతారకముగ.

సీ. శ్రీరమారమణికి శృంగారభవనమ్ము శౌరియురమ్మా నెల్లూరుపురము
భారతీసతికి భాస్వన్నాట్యరంగ మబ్జోద్భవు మోము నెల్లూరుపురము
సర్వశక్తికి నిజస్వాధీనభాగమ్ము మారారిమూర్తి నెల్లూరుపురము
విబుధాళికిని నిత్యవిభవాలయమ్ము బృందారకపురము నెల్లూరుపురము

గీ. «జౌర నెల్లూరి నెఱజాణ» యనెడుబిరుద, మొందఁగనె నాంధ్రవాణి సాహిత్యపరిష
దంబు నిప్పుడు పూజించు నాపురమ్ము, కీర్తి నింజెంది వెలయు నెల్లూరుపురము.

క. సరసులు విద్వన్మణు లీ, పురమున గలనాగరికులు భూరియశస్కుల్
సిరులను దులఁదూఁగుచు మా, పరిషత్సత్కృపను నుంద్రు భాగ్యోదయులై.

గీతమాలిక.

శ్రీమహితధామ సింహపురీలలామ, గారవమ్మున రమ్మని కౌఁగిలింపఁ
బౌరులందఱు భక్తితోఁ బ్రణుతి సేయ, రంగరాణ్మణి కార్యభారము వహింపఁ
గవివరుల్స్వాగతం బిచ్చి ఘనతఁ గూర్ప, బాలు రతిభక్తిఁ బద్యపుష్పముల గురియ
విబుధు లిర్వంకలను నిండి వెలయుచుండ, విబుధరాయలు సధ్యక్షపీఠినుండ
బిట్టు సభవారు చేతులు తట్టుచుండ, భావములరంగ నీసభాభావమొంది
వరలునిను గంటిమంబ శ్రీపరిషదంబ, యాంధ్రసాహిత్యనికురుంబ యాప్తదంబ
యగ్రపీఠాధినాథునియమృతవాక్కు, లాంధ్రపరివర్తనవిధాన మాంధ్రవాణి
సంస్కరణరీతి తిక్కనసాధుచరిత, పోతనార్యునిశతకమ్ము మురిసుకృతి
మొదలుగాఁ గల్గునవి యెంతొ ముదమునింప, వీను లలరంగ వింటిమి, విబుధవరులఁ
గన్నులారంగఁ గంటి మింకను మఱేమి, భాగ్య మున్నది పండితప్రవరులార!
యొకట శాస్త్రార్థములు విననొప్పమీఱు, నొకట చారిత్రవిషయము లొప్పుఁజెందు
నొకటఁ గవికాలనిర్ణయమూహఁ జేయు, నొకట శాసనచర్చ లింపొందుచుండు
నొకట వ్యాకరణాంశమ్ము లొప్పుమీఱు, నొకట సత్కవికీర్తన లూర్జితములు
నొకట యతిధర్మములు చెప్ప నొప్పుచుండ, నొకటఁ బ్రాసలగతులెల్లఁ బ్రకటితములు
నొకట నాడుసుధాధార లొలుకుచుండ, నొకట నవధానరీతులింపొందుచుండ
నొకటఁ దీర్ఘాశువులు ప్రవాహోదకమ్ము, లొకట మధురప్రసాదవాఙ్మకుటమణులు
జల్లుజల్లునఁ బూవులు చల్లినట్లు, కమ్మకమ్మని తెమ్మెరల్ గ్రమ్మినట్లు

కోకోయనుచును గోయిలల్గూయునట్లు, గుల్కుగుల్కుచుఁ జిల్కలు పల్కునట్టు
లెల్లరకు హాయి నింపుచుఁ బిల్లకవులు, పద్దెములు చెప్పిరయ్యప్పిరి ముద్దులొలుక
నిట్టియానందమునమున్గి "యెచట మనికి, యెవ్వరము మేము? మా పని యేమి?" యనెడు
పలుకె మఱచితి మిదెంత భాగ్యమయ్య! యాంధ్రబాలకులార! దీర్ఘాయులార!
యిట్టియుత్సవమును వీడి యెట్లు పోవ, మనసుపుట్టును నేఁటేట మనము గలిసి
యీమహోత్సవమునకును నేగుదెంచి సంతసము నొందువార మిఁకింతనుండి
యాయురారోగ్యములనిచ్చి యాంధ్రమాత, మనలఁ బ్రోచుచునుండుత మహిమ
బాలకులు నిండువేడుకఁ బడినశ్రమముఁ జెప్పశక్యము కాదు విశేషగతుల [మీఱ
నవసరార్హమ్ముగా సభ నాదరించి, ధన్యులైరన్నివిధముల దయదలిర్ప
నాంధ్రభారతియును వీరి నాదరించి ప్రేమఁ జూపుచు నుండునే వేళలందు.

గరిమెళ్ల సత్యగోదావరిశర్మ.

చ. తెలుఁగున సంస్కృతంబునను దివ్యతరంబుగ ద్రావిడాంగ్లభా
షలఁ గలసారమంతయును జక్కనిశోధన చేసి చూచి ని
ర్మల మగుదత్సుధారసము మాన్యగతిన్ దలపోసి చూచి ని
చ్చలుఁ దదనూనవైభవిశాలత నొప్పెడిశాస్త్రి నెంచెదన్.

మ. ఘను లౌసంస్కృతకావ్యకర్తలకు నగ్రస్థాన మిప్పించె మా
తెనుఁగుంబాస యొకండె నేరిచినయాధీమంతులున్ మెచ్చ నా
జనసామాన్యసుబోధమౌవిధమునన్ సత్కావ్యముల్ నైషధం
బును వ్యాఖ్యానయుతంబు సేసి నిలిపెం బో సార్వభౌమప్రభన్.

ఉ. ధీయుతులెల్ల రౌననఁగఁ దెల్గున నాటకముం బ్రతాపరు
ద్రీయ మనల్పకల్పనలఁ దీర్చెను; వాదము లెన్నొ చేసె శా
స్త్రీయముగా సమస్తజనచిత్తవశీకరణైకవాణితో
వేయును నేల యీడెవరు వేదము వెంకటరాయశాస్త్రికిన్.

ఉ. వీరికవిత్వపాటవము వీరియనల్పసుధీవిలాసముల్
వీరివిమర్శనాప్రతిభ వీరివివాదపథప్రచారముల్
వీరిసుకల్పనాధికత వీరియపారవచోనిగుంభనం
బౌర! వీరికే తగుఁ దదన్యులయం దిది గానరాదొకో.

చ. అభినవభట్టబాణుఁ డన నంచితకీర్తిని గాంచె నొక్కరుం
డభినవదండి నాఁ బరగి యచ్యుతకీర్తిని గాంచె వేఱొకం
డభినవగాధిసూనుఁ డనునంకముఁ దాల్చె మఱొకరుఁ డీవు నేఁ
డభినవమల్లినాథబిరుదాంకముఁ దాల్చఁగదయ్య ధీనిధీ.

మైనంపాటి. హనుమంతరావు.

# అధ్యక్షోపన్యాసము

ఆంధ్రసాహిత్య పరిషత్తువారి యష్టమవార్షిక సమావేశ సమయమున సభాధ్యక్షులగు బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రిల వారొసంగిన యుపన్యాసము.

ఈకాలమం దెల్లెడలను భాషాభివృద్ధి యగుచున్నదని ఘోషాభివృద్ధి వినఁబడుచున్నది. ఆయభివృద్ధి వాపో బలుపో యనిన — వాపు ప్రత్యక్షమే, మఱినాడిని బరికింపఁగా-నాంధ్రసాహిత్యపరిషదుద్దేశ్యములలో సూచితమై విజ్ఞానసర్వస్వాది మహోద్యమములలోను, నాంధ్రులచరిత్రము లోనగు గ్రంథములలోను బరిషత్పత్త్రికాంధ్రపత్త్రికాహితకారిణ్యాది పత్రికలలోను బ్రస్ఫుటమై శ్రీసూర్యరాయప్రభునిర్మిత్సిత బృహన్నిఘంటు ప్రస్తావనలందస్ఫుటమై బలుపునాడియు నాడుచునే యున్నది.

మఱి వాపు ప్రత్యక్షమేయైనను, జికిత్ససేయుటకై నిదానాదికము నరయవలయును. అందుల నిదానమాధురిక వాఙ్మయమే. దినము తప్పక గంట తప్పక శైశవప్రభృతి ఆకౌమారము భాషాదేవతకుఁ బుస్తకనిర్మాతలసంఖ్యేయులు యథాప్రజ్ఞము ప్రయోగించిన విషములచే ధాతువులు సెడి నంజుగలిగి వాపెక్కి-మన చేతితో నెట నదిమినను దాని రేఖలుగూడ స్ఫుటముగాఁ గానిపించుచు లొత్తలుపడుచున్నవి.

బాలుర పాత్తములు.

ఆవిషయముల నించుక (ఇంచుకయే) ఉద్ఘాటించెద.—

"ననవిల్తు శాస్త్రంపు మినుకులావర్తించు పనివెన్నతోఁ బెట్టినదిమాకు॥"

అని పెద్దనగారు చేసిన యుపదేశమును దృఢముగా నవలంబించి ప్రథమ శిశుపుస్తకములోనే రాజకీయవిద్యాంగము వారి క్రిందిప్రయోగములను జేయించి యున్నారు.

జలగ-దవడ-జండా-కాలవ-మనమడు అని మాటలు నేర్పినారు. జెలగ-దవుడ-జెండా-కాలువ మనుమఁడు-అని వీనివలెనే యుచ్చరించుటకు సులువగు సాధురూపము లుండఁగా నీయసాధురూపములనే నేర్పుట యవిమృశ్యకారిత గాదా?

"జొన్నకంకెకు నూగు ఉండునా."—"కంకె" యేమి? "కంకి" యని రూపము. ఈ పుస్తకములోనే - కంకులను కోయును. అని యికారాంత శబ్దముగాను ప్రయోగమున్నది. "పెంకుడు ఇల్లు" - ఇందు "డు" ఏమి? పెంకుటిల్లు అనరాదా?

"శనగలు" - "సెనగలు" సాధురూపము. పామరులు "శెనిగలు" అందురు. పామరతరులు "శెనిగెలు" అని ఎత్వాంతము చేయుదురు. శెనిగెలన్నందులకు నా సుమాస్తాను బ్రాహ్మణు నొకనిని నేను తఱిమివైచితిని.

"ఊసరవిల్లి" యఁట.—వెల్లిగాని విల్లిగాదు.

ఒక్క "గెలుచు" ధాతువునకు వచ్చినపాట్లు కనుఁడు:—ఎవరు గెల్చెదరో" (గెలుచు ప్రకృతి); "నేను గెల్వలేనా" (గెలచు ప్రకృతి); "పందెము గలచెను" (గలచు ప్రకృతి) "గెలుపు కలుగును" (గెలుదు ప్రకృతి) - అన్నిటను గెలుచే ప్రకృతిగా నుండరాదా?

"నీవు చాలా బాగా పాడుతావశే!" "పకోడీలు కరకరలాడుచు బాగానే యున్నవి." "నీకు దానిరుచి బాగా తెలుసును." మఱియొక బాలశిక్షలో "బంధుత్వము తెలియచేసే మాటలు బాగా బోధపడ్డ తర్వాత" అని మాటిమాటికి "బగా" ప్రయోగము. ఎఫ్. ఏ. పరీక్షకు పఠనీయమైన యొకనాటకంపుఁ దోఁబుట్టువు నాటకములో అనర్థమోక్తిగా ఈ "బాగా" ప్రయోగము అయిదాఱు మాఱులు కావింపఁబడినది. అందే యిట్లుండఁగా అట్టివానిం జదివి పండితులయిన వారి పొత్తములలో నిట్లుండుట యాశ్చర్యమా! అయినను "బాగాయున్నది" అని అంకున్న కళాత్వమునుదిద్ది ఇందు "బాగానే" అని ముద్రితమంచుట మేలుగదా.

[ఇది అతిసులభమైన శబ్దము. "బాగుగా" లేక "బాగుగ" అని సాధు ప్రకృతి. దానికి "బాగా" అని గ్రామ్యము. ఇట్లే పెదపెద్దవారి గ్రంథములలో "ఆనక" శబ్దము చొచ్చియున్నది. "ఆలానా?" "ఆమట" అను వానిని ఇంకను నేను ఆధునికవాఙ్మయమునం గనలేదు. కూర్చుండు ధాతువునకై కొండ ఱుపడినపాట్లు పరిహాసనీయములేగాక అనుశోచనీయములుకూడ నై యున్నవి:—కూర్చుని, కూర్చొని, కూర్చున్న కూర్చొన్న, కూర్చున్నాఁడు, కూర్చొన్నాఁడు. ఇత్యాది బహురూపములను ఒకఁడేకవియే ప్రయోగించియున్నాఁడు.]

"I have a house" అనువాక్యమునకు తెనుఁగు నేర్పినశిశుబోధకుఁడు కొట్టతొలుత కలుగుధాతువును సకర్మకముఁ గావించినాఁడు "I = నేను, a house = ఒకయింటిని, have=కలిగియున్నాను" అతని యుపదేశము. ఆసంప్రదాయమున సకర్మకత్వము నాటకాంతము వ్యాపించినది. అధునికవాఙ్మయమునుండి ఎన్నిప్రయోగముల నేని యుద్ధరింపవచ్చును. బడిపుస్తకములలోను సమృద్ధిగానే కలవు. మూఁడవతరగతి పాఠపుస్తకమున [Third Class Reader-Marsden's] 24-వ పుట. - "కిటికీలను గొన్నిటిని మాత్రమే కలవై యుండును." శబ్దస్వరూపనాశమునకు "మాట్లాడు" (22 పు., చాలును. "మాట" శబ్దమునకు బ. వ. "మాటలు" గాని "మాట్లు" గావు.

21 పు. "ఆఘ్రాణించు = ముచ్చూచుట" యఁట మూచ్చూచుట యసలురూపము. ఏయూరి యేగొందివాఁడుకయోగాని "మూచూచుట" సార్వత్రికము, సాధువు.

"మానా - 'జానెడుఇంట్లో మూరెడుకట్టె'" మానాశబ్దము గ్రామ్యమనియు వరవడియర్థ మనియు శబ్దార్థచంద్రిక. ఈ శబ్దము బ్రౌనులోను శబ్దరత్నాకరములోను లేదు. అది యటుండ "జేనెఁడు" అనియు "ఇంటిలో" అనియు పఠింపఁగూడదా. ఏమి యీ గ్రామ్యాభిమానము! ఇగియునుం గాక ఈ వరవడి యేమి? దీనికర్థమేమి? దీనికి పెద్దవారు హర్షించినను పిల్లకాయలు హసింపరా?

## బాలశిక్షలలోని వ్యాకరణసూత్రములు.

వ్యాకరణము బాలురకు ప్రత్యేకముగా నేర్పరాదని విద్యాంగమువారి చిత్తము. దానంజేసి ఈపొత్తములకర్తలు వ్యాకరణముఁలోఁ గూడంగాలిడిసూత్రించినారు :—మూఁడవ పాఠపుస్తకములో 26 పు—

"కొడుకు, తండ్రి ఇవి...మగవారిని తెలుపుపదములు. ఇవి పుల్లింగములందురు.....నీరు, ఊపిరి, దీపము, గాలి-ఇవి నపుంసకలింగములు." అనియున్నది. ఇది లింగస్వరూపము తెలియని వ్రాఁత, కొడుకు, తండ్రి, నీరు, ఊపిరి, గాలి-వీనికి లింగము లేదు. దీపము పుల్లింగము.

నాల్గవవాచక పుస్తకము-పు. 87.—
"చెల్లెలు అనుపదము స్త్రీలింగము."

"కోడలు అనునది యటులే స్త్రీలింగము."

వాస్తవముగా చెల్లెలికిని కోడలికిని లింగము లేదు.

పురాణకథలలో సయితముం బ్రవేశించి వీరు విచిత్రములు వ్రాసియున్నారు. త్రిశంకువు దశరథరామాదులకు తర్వాత అయోధ్యలో రాజ్యమేలినాఁడఁట! చూ. మూఁడవవాచకపుస్తకము—పు. 27.

## శాస్త్రవిద్యార్థుల తెనుఁగుపాత్తములు.

[College Telugu]

కాలేజివిద్యార్థులకు పఠనీయములైన తెనుఁగుకబ్బములు పెక్కులు దోష భూయిష్ఠములై భాషాదేవతకు వ్యాధిని శల్యములలోనికి దించుచున్నవి.

ఆదోషములం గొన్నింటిని ఆంధ్రకాళిదాసుల గ్రంథములనుండి యుదాహరించెద :—

ఈ దుష్ట ప్రబంధనిర్మాతలు ప్రాయికముగా ఒకపాటి పశాణవాణిని కఱచియుందురు. వీరును వీరిప్రాపకులును విద్వద్వతంసులను తిరస్కారముగా పెడంటులు (Pedants) అందురు. మఱి వీరి విపప్రయోగములు—

"మాళవికా?" [మాళవికయా? అనవలయు.] అట్లే "వసుళావళికా?" "భర్తాయేమి? [భర్తయేమి? అనవలయు] "ఈమె రాజపుత్రికా?" [...రాజపుత్రికయా అనునది.] "ప్రియంవదా?" [ప్రియంవదయా అనునది.] "శకుంతలా?" [శకుంతలయా—అనిప్రశ్న.]

"ప్రశాంతమాయాశ్రమపదము" [...మానాశ్రమ.]

"ముగ్ధతా యీతపస్వి" [...తానీతపస్వి]

"కాంతిరాశియాయింతి" [...యానింతి]

"ఔయామెవ్రేళ్లు" [...ఔనామె..]

"ఈదేశపుప్రతి;" "వంగదేశపుప్రతి;" వంగదేశపుపండితుఁడు;" "ఈదేశపుపాఠము;" "పానకపుకుండ;" "పావపుచాపు;" "మంచిగంధపుకఱ్ఱ." ["గుఱ్ఱపుఁ బిల్ల"ను పెడంటికొందురు." గుఱ్ఱపిల్ల" మధురమఁట" "గుఱ్ఱప్పిల్ల" మధురతర మనియు "గుర్పిల్ల" మధురతమ మనియు త్వరలోనే గ్రహింపరా?] "లోపఱుచు" "ఇదిగోయేనుఁగు" [ఇదిగో నేనుఁగు సరి.]

"కనుపడు" [అని పలుమాఱు ప్రయుక్తము-కనఁబడు అనవలయు.] "కన్బఱుపంబడెను" [కనఁబఱుపంబడెను అనవలయు.] "అడుగో" ["వాఁడుగో" సరి.]

“కనిపెట్టు” [కనిపట్టు అనుటకు.]

[నన్నుకంటె, నాయందుకంటె, రాముడువలె-ఇట్టి రూపములును తెలనూ వుచున్నవి.]

“ కోరినావు ” అడిగినాము” “ విన్నాను” ఇత్యాది భూతార్థకనావునాము నాన్వంతములు పెక్కులు.

“ఉంచుదురు” [ఉంపుదురు”-ఒండె-“ఉంతురు” అనవలయు.]

“వీచుదునో” [వీతునో అనవలయును]

“పోతివి” “పోతిని” [పోయితివి, పోయితిని-అనవలయు.]

కుమష్ఠికి ముంమునగాగమములేమి, ముత్తుపరంబగునపుడు ఇంచుక్ప్రకారము నకు పత్వముఁరామి, థకారమును ధకారముగా మార్చుట, ప్రాయికములు.

“కడుపు” [కడపు అనుటకు.] “కానుపించు” [కానిపించు అనవలయు.] “అనుఁగును” [అనుఁగను అనుటకు.]

“సౌష్టవము” [సౌష్ఠవమనునది]; “జ్యోతిష్కులు” [జ్యౌతిషికులు సరి]; “చతుశ్శాలనుండి ” [చతుశ్శాలమునుండి అనవలయు]; “ కుక్షింభరపరాయణుఁడు” [కుక్షింభరణ....సాధువు]; “అవిశ్వాసనీయము” [అవిశ్వసనీయమనుటకు; “అవశ్యకము” [ఆవశ్యకము సాధువు]; “ఘూర్ణిలి” [ఘూర్ణిలి అనునది]; “ఎండమావివలెఁ” [ఎండమావులవలెఁ అనవలయును]; బయలకుఁ [బయలికిఁ అనియేని బయటికిఁ అనియేనిసాధువు]; “ అప్సర ” [అప్సరస అనుటకు]; “ హృదయ ” [సంబోధన, హృదయమా అనవలయు]; కుసుమకోమలి [కుసుమకోమల అనవలయు]; “ అపరాధులమైతిమి ” [స్త్రీలుపలుకుట-అపరాధినులము అని స్త్రీలింగ ముండవలయును]; “ దుర్వాసమహర్షి ” [దుర్వాసోమహర్షి-సాధువు]; “నీబ్రహ్మవర్చస్సు ” [...వర్చసమనవలయు]; “శకుంతల నాకు దేహ సదృశ” [సదృశియనవలయు]; “శిలాపట్ట మధిశయనించి” [..అధిశయించి యనుటసరి]; “తల్లియైనసింహము” [....సింహి'అనవలయు]; “హిమవంతప్రాంతము ” [హిమవత్ప్రాంతమన్నసరి [“ కాశ్యపులు ....నియమించెను” [...నియమించిరి. అనవలయు]; ప్రాణేశ్వరుఁడు నన్నురప్పించుకొందురు” [కర్తయు క్రియయు ఒకటే వచనముననుండవలయు.] “ మఱచిపోయితిని సుమా” [....జుమా అనవలయు]; “రక్షకునింగలవారై” [“కలుగుధాతువు ఇట్లు సకర్మకమగుట

Have ధాతువు నజ్ఞానకృతదోషము]; "ప్రయోగించిన యుపాయసిద్ధి" [ప్రయోగింపఁబడినట్టిది యుపాయము గాని సిద్ధిగాదు]; "పేంకణపు లతాపరివృతము" [పుకారమును తొలఁగించునది]. పెడంట్లు (Pedants) సాధురూపములనే ప్రయోగింతురు. "వారిద్దఱుపాలించుకొనిమ్ము" [వారినిద్దఱను పాలించుకొనిమ్ము— అనుట సరి.

ఈప్రబంధములను గుఱితో చదివినవారు పూర్వోక్త బాలశిక్షులకన్న మేలు తెలుఁగు వ్రాయుదురా ?

ఈప్రయోగములచేత సంజువచ్చినది. అనంతరమును దేవతకు అపథ్యమే సంభవించుచుండినది.

"కోకిల యాకలి కూడగున ధరిర'
అచ్చరాంగనల మెచ్చనికేళిర"
"అది పిలచిన పలకవు"
తద్ధితాది కల్పనయందు విశృంఖలత్వము :—

"ప్రతిపూర్ణిమాసాయంతనమునం బ్రకటింపఁబడును" [సాయంతనము కాలభవవాచముగాని కాలవాచకముగాదు]; లౌకీకులు ? వైదీకులు ; [మీరు వైదీకలా నీయాకలా అని ఒకబాలుఁడు మఱియొకబాలుని ఒకపాఠశాలలో ప్రశ్నచేయుచుండెను. నేను ఏ యాకనుఁ గానని రెండవాఁడు ఉత్తరముచెప్పెను. [లౌకీకమని యొకకవి ప్రయోగించి సాధువే యని వాదింఁగా మంగళేశ్వర శాస్త్రిలవారు అందులకు "లౌకీకం లౌకికం లౌక్యమితి చణ్డాలభాషితమ్" అని ప్రమాణము వ్రాసికొమ్మనిరి. కొన్నిచోట్ల "పూర్వీకులు" పంక్తిపంక్తిలోను అడ్డపడుచున్నారు. "షష్ఠమహాకారదేవరా" [షష్ఠగాని షష్ఠమగాదు]

అర్థజ్ఞానములేక శబ్దమును ప్రయోగించుట :—"పద్మపత్రిములను" [పద్మినీపత్రిములను అనుటకు - పద్మినీపత్రిములనఁగా తామరాకులు - పద్మపత్రిములనఁగా తామరరేకులు.] "అతివిస్తారము" [అతివిస్తర మనుటకు.]" నాయకిత్వము" [వింతశబ్దము !]

సమాసవిధులు తెలియమి :—" అంధతమస్సు " [అంధతమసము అనునది; "అవాఙ్మనో గోచరుఁడు" [అవాఙ్మనస అనవలయు] "ఈవృక్షము శూన్యఫలముగానున్నది" [ఫలశూన్య మనవలయు - పండ్లేలేవని యభిప్రాయము గాని లెంకలేని పండ్లుకలవని యభిప్రాయము గాదు.]

తత్సమములనుండి సంస్కృత ప్రకృతులను కల్పించుకొనుట:—"అభిమన్యా" [అభిమన్యుఁడా అనుటకు - ఈప్రయోగము గురుఁడా, శంభుఁడా అనుటకు మాఱు గురా, శంభా అన్న నెట్లో అట్లున్నది. అభిమన్యుశబ్దముగాని అభిమన్య శబ్దము గాదు.

తెలుఁగున ప్రతిలోమముగా ధాతుప్రకృతి కల్పన.—"ఒల్లఁడు" అని వల చునకు వ్యతిరేకమున రూపము. అట్లుండ, "ఒల్లుదును" అని యొక యాధునిక గ్రంథమునం బ్రయుక్తము. ఆధునికులు "పైన" శబ్దము నొకదానిని కల్పించినారు.

గ్రంథకర్తకీర్తి, యతని గొప్పతనము పైనను, గొప్పవారి యాశ్రయబలము పైనను, వార్తాపత్రికాధిపతుల స్నేహాతిరేకము పైనను, పరీక్షాధికారులయెడ గ్రంథకర్తలు చూపు నైచ్యానుసంధానము పైనను, స్తుతిపాఠకులగు శిష్యవర్గము పైనను, నాధారపడినది."

"కృషీవల" శబ్దమునుండి కృషీశబ్దమును సాధించి "కృషీసాధకుఁ" డని యొకరు ప్రయోగించినారు.

నోటికి వచ్చినదిగదా యనియు ప్రయోగములు.—

"భాసురుండగు సీతూపతీసుతుండు."

శబ్దస్వరూపము నెఱుంగమి. "స్మశానము." ఇది పెడంటుల గ్రంథములలో నుండదు.

లెక్కలేని యిట్టి ప్రకారములచే నాధునికులు సాహసమున భాషాదేవిని ప్రాణసంశయదశకుం దెచ్చినారు.

ముగింపుకై యింగ్లీషు విషములను సయితము పోసినారు :—

"పెద్దనాదులవలన రచింపఁబడలేదు—[ఇది "బివై బై వలన" యొక్క ప్రభావము. పెద్దనాదులచే అనిన తెలుఁగగును.]

"పిలుచు" ధాతువునకు హరాణార్థము పేర్కొనుట. "దీని నాంగ్లేయులు 'Conjectural philosophy' అని పిలిచెదరు." మనచే నిపు డార్యులని పిలువంబడు నార్యులు టమిళ్లనిపిలువఁబడువా రీ దేశమున నుండినవారు కారు." "కణ్వులు గళింగాంధ్ర కర్ణాటకదేశములని పిలువంబడు ప్రదేశమును జేరిరి." ఆంధ్రభాష యని పిలువసాగిరని తోఁచుచున్నది."

'బమ్మెరయనుగ్రామ మోరుగంటికి మూఁడామడలోనున్నది. దీని నచ్చటి జనులు బొమ్మెరయని పిలుతురు.' ఆధుని కాంధ్రవాఙ్మయములో ఈ విధముగా పిలుచుటకు అర్థము మాఱినది. లింగములు నశించవని మున్నే సూచితము గదా, అట్లే మహాత్త్వాదికము నయితము పరాణమర్యాదానుసారముగా మాఱిన చో నిట్టి వ్యాకరణయము నుప్పతిల్లును :—

"నా నగగుఱ్ఱము ఆస్ట్రేలియావాఁడు, కాని గోడిగ అరబ్బీది. ఆమెకన్న వాఁడు ఉలవలు ఎక్కువగా తినును. కాని ఆ మెయే వానికన్న వేగవంతురాలు."

భాషాదేవికి ఆధునికవాఙ్మయమువలనం గలిగిన యీ వాపును ఇంకను జీవ ధాతు వుండఁగానే పండితభిషక్కు లు కలిసి యాలోచించి తగినమందులచే తొలఁగించి ఆరోగ్య మొసఁగుదురుగాక యని మదీప్సితము.

ఆంధ్రమునకు సంస్కృతజ్ఞాన మనావశ్యకమని యొక మతము తలసూపుచున్నది. ఈ మతమువారు సంస్కృతము చదువనివారు. ఈమతమే నెలకొనినచో సంస్కృతమం దతినదీష్ణులైన తిక్కనాదుల కవనమాధుర్యమునకు ఇఁకజలాంజలియే.

సంస్కృతము లేనిచో పరతత్త్వము 'భద్రాయితి మూర్తియై హరిహరంబగు రూపము౦" దాల్చునా ? ఇఁకమీఁద నిట్టి నామధాతువులు పొడసూపునా?-

"హిందూరాజ్యరమాధురంధర భుజాహిగ్రామణీకంచుక త్కుందస్వచ్ఛయశోగుళుచ్ఛ." మనుచరిత్ర.

"యమునద్ధంగము కృష్ణభూమదిల మబ్జాతస్మనువ్యం౦బు।నీలవాహిధన్నిఖిలాచలావళి తమాలద్భ్యాజమిందీవర।త్కుముద శ్రేణి పికధ్వహంగముదమాస్తోమద్గ్రిహారరప్రభా।సముదాయంబగుచుండె లోకమలఘుశ్యామాభ్రముల్పర్విన౯.'—
భా. రా. కి. 382.

" వీరభద్రజనజీవగ్రాహరాహూయమాణదృఢాంచద్భుజ."— ఆము.

"ఆవధికుధరకటాంచలభూపిస్మరమర తేజశ్ఛ్ఛపక భసలదసత్కీర్తి మలిన పరిపంథినృపా."—మను.

[కంచుకత్-యమునదిత్యాదులును-రాహూయమాణ-భసలత్-ఇవియు నామధాతువులు.]

"నీనయనాబ్జంబులకిచ్చు భవ్యశకునానంద క్రకకల్యాణముల్
శయనోత్థాయమభోజరాజతనయా సంఫుల్లనేత్రాబ్జముల్." శృం. నైష. VIII.

[శయనోత్థాయము - ణముల౦తము.]

"కామ కమలాస్త్రకమలా,కాముకసుత కామనీయకనిధీయనుచుఁ
గామినులువిన్నవించిరి,కోమలకోకూయమానకోకిలఫణితిన్." వసు. III 171.

[కోకూయమాన-యఙంతప్రయోగము.]

శా. "ధారాస్ఫారకృపాణబాణపటలీధారాహతిం దచ్చతు
ర్థీరీశోణితశోణితద్రవ సవీతప్రీతులై తన్నుఁ జె
న్నారం బన్నగ యక్ష రాక్షసులమర్త్యవ్రాతదేతస్స్ఫురత్
స్ఫారస్వైరవిహారఘోరనటనారంభాటస్ఫుటాటోపులై." ఉ. హ. VI-53.

[చతుర్థీరీ - ద్విగుసమాసము.]

ఇట్టి మధురార్థప్రయోగములు అంతరించును.

శా. "అద్ధావాగ్విబుధ మ్మహావచనకవ్యాహార మహావచ
స్సిద్ధ మ్మాకృతతాంగతఃకలిరితి శ్రీసూక్తిపిద్యాధర
మ్మిద్ధాద్ధత్య మగాల్లయహింకుధియా మిత్యున్నదత్కన్నర
మ్మద్ధీరాగ్రణిగెల్పునుత్సవమునం దయ్యెన్నభమ్మంతయున్." ఆము. IV-6.

సీ. "స్యందనస్థితబిడౌజఃకుత్తృజాడ్యకృ ఝ్ఝంఝామరుద్ధురుఝ్ఝాత్కృతములు
క్రవ్యాశిరాడ్గాత్రకనదసృగ్గాహనస్ఫుటశల్యహవ్యభుక్ఫూత్కృతములు
యోధవర్మితహృత్పుటోత్కృంతనిజపాతసాలాశ్మకృతముహుస్ఫాత్కృతములు
పతితోగ్రరక్షఃకబంధభారభృశార్తిభుగ్నభోగఫణీంద్ర ఫూత్కృతములు

తే. క్షాంతరధ్వనిరంతరచ్ఛాయ(?)దములుదివ్యతావక కార్ముకోత్థ్విరితములు
కలుషములడంచుఁగాత లంకాపురాంగణాంబరచరత్కలంబకదంబకములు."

ఆము. IV-27.

ఇట్టి లోకోత్తరకవనములు అస్తమించును. ఆంధ్రభాష రసము దివిచిన చెఱకై తొంటికోఁదుభావఁగా నిలుచును. కావున సంస్కృతమందును సంపూర్ణపాండిత్యము నలవఱచుమార్గమునే విద్వద్వరేణ్యులు అవలంబింపవలయును. సుబోధసమగ్రవ్యాకరణము వలసియున్నది.

ఉన్న వ్యాకరణములు దుర్బోధములును అసమగ్రములును. ఇప్పటి వ్యాకరణములందు సంస్కృతకృత్తద్ధిత సమాసముల స్వరూపము ఇంచుకేనియు బోధి

తము గాదు. ఇది సంస్కృత మెఱుఁగనివారికి అత్యావశ్యకము, మహోపకారకంబును. ఇదియుఁగాక శాస్త్రమార్గమున వివరింపవలసిన విషయములు పెక్కులు గలవు. ఎట్లన-దిక్ప్రదర్శనము—

సంస్కృతమున - అష్టగజాః, నవబ్రాహ్మణాః, ఏకాదశశిష్యాః, వింశతిభటాః - అని సమాసము లుండవు. తెనుఁగున-అష్టగజములు, నవబ్రాహ్మణులు, ఏకాదశశిష్యులు, వింశతిభటులు - అని సమాసములు ఉంపును. అది యెట్లు? శ్రీరాములవారు, కవలవాండ్రు, ఈసమాసము లెట్లు? అయిదాఱుగురము - సమాస మెట్లు?

12 కోట్ల - 86 లక్షల - 5 వేల - నూటయిరువదిరెండు రూపాయల - పండ్రెండణాల - 9 పైసలు.—ఇదియేమిసమాసము? వివరించునది.

మాదాఁక, మీదాఁక - సాధువులా? సమాసఘటన మెట్లు?

"తన పోయివచ్చిన వృత్తాంతం బంతయు నెఱింగించి" శృం. నై. (II.—301.) వచ్చిన యనుదానం గల భూతార్థక విశేషణత్వము పోవుధాతువునందును ఘటితమై యున్నది.

ఊరూరినీళ్లను ద్రాగి ఇంటింటి యన్నమును దిని రోగము తెచ్చుకొన్నాఁడు.—ఇందలి సమాసముల ఘటనను వివరించునది.

నేనేను, వీఁడేను, వాఁడు మంచివాఁడేను, వాఁడేనా? వీఁడేనా?—ఇందలి యేనునకు సమాధాన మెట్లు?

"ఔపవాహ్యంబు నారోహణంబు సేసి;" "వదనారవిందానవము ప్రసాదము సేసి;" "ఇందునిభాస్య లప్పుడు సమీక్షణసేసిరి రాజహంసముఁన్"—ఇత్యాది ప్రయోగములందు - ఆరోహణంబు, ప్రసాదము, సమీక్షణ - ఇత్యాదులకు అన్వయ మెట్లు? నామూలముగా [నేను మూలముగా అని యర్థము - సమాసమెట్లు?]

బుద్ధిమంతురాలు (- బుద్ధిమంతము) అగు రామకళత్రము.—ఏ విశేషణ పదము సరి?

'చేయరయ్యెదరు మీరు.' శృం. నైష. $VI_{I}$ (72.) 'పెట్టలేఁడయ్యెడుఁన్'—బా. వ్యా. అగుధాతువులో లిట్టుతో మాత్రమే వ్యతిరేకరూపమునఁ జెప్పఁబడినది, సమాధాన మెట్లు?

"వారికి తెలియకుండ;" "మీకు నెఱుంగంబడని" శృం. నైష. III ౨7;—కుమష్టి యెట్లు?

"కన్నులు కనఁబడవు;" "చెవులు వినఁబడవు,"- ఈ వాక్యములు సాధువులా? ఇందు ప్రథమ యెట్లు?

వాఁడేఁడీ? అదియేదీ? వేరీ? "ఈరీతి దేహమొసఁగితి। వేరీ నీసాటి వీరవితరణగరిమన్".డి.డీ. రీ-ఇందలి యీకారమేమి?

"భూపతులయు విప్రముఖ్యుల సభన్" సభాపర్వ.—"భూ, ధవునియు విప్రముఖ్యుని సదస్సున" అని ఏకవచనంబునఁ జెప్పవచ్చునా?

"కానన్" [=కావునన్ -ఈపదము పూర్వము ద్రుతాంతముగానుండెను. ఇపుడు కొన్నిముద్రాక్షరశాలలయందు కళ్ళైనది. సిద్ధాంతము వచింపుఁడు.]

ఇంపుగాగమమునుంగలదా? సాధువా? ఆహోబలపండితుఁడు దీనిని చెప్పినాఁడుగాని ఎట్లువచ్చినది?

అనుస్వారమునకు మాఱు ఉమాకాంతపండితోపదిష్ట మార్గమున పరసవర్ణానునాసిక మిడుట గుణమా కాదా? సిద్ధాంతించుట న్యాయము. తత్సమములందు పరసవర్ణానునాసికముబింకువుగా మాఱును.—

ఉ. "సింగబాఁకటితో..."నిగుడించెన్ × నిగిడించెన్ - నిగుడుధాతువు

ఎఱుఁగించెన్ × ఎఱుంగించెన్ × ఎఱింగించె,ఎఱిఁగించెన్-ఎఱుఁగుధాతువు.

ప్రాసమైత్రి కలదు; అది ఎట్లు - గోత్ర × క్షత్త్రియ "ఎట్రా శేషుఁడు. ....గట్ట్రాచిమాలి..." జైమినిభారతము.

నల్లఁబాఱు × నల్లపాఱు? బంగరుకొండ(?) × బంగరుఁగొండ(?) నడగొండ [గత్వమెట్లు?] "ఊరుంగాయలు" [ద్రుతకార్యమెట్లు?] మేలుకట్టు [గాదేశము రాలేదేమి?]

అబ్బంగి, ఇబ్బంగి-అద్ధీరాగ్రణి, ఇద్ధైర్యము-ఈ సరళాదేశములు సాధువులా? గుండె గుభేలుమను చున్నది "తళతళమనఁగ" [మాగమమెట్లు?] ఔపవిభక్తికత్వము వైకల్పికమా? ఊరికి×ఊరునకు; నూఱునకు×నూటికి-అన్ని రూపములును సాధువులా? పాముపిసము × పాఁపవిసము; పాముకాటు × పాఁపకాటు-యు సాధువులా?

చెట్టుకడ, చెట్టుకొన,—ఇట నుగాగమము రావలదా ? భోగముపిల్ల - ఇట మువర్ణకంబునకు పుంపులగునా? "జన్నంపుఁబరికరంపుసొంపు"-ఇట పుంపు లెట్లు?

"రాయికి" రాళ్లు బ. వ. మేని - అట్లే "వేయికి" వేళ్లు కావలదా !

మీనలువురకుమారులు - సమానసమటన యెట్లు ? నేఁటి దనుక, ఇంటిదనుక - రూపసిద్ధియెట్లు ? రెండేసిలక్షలు - ఏమి సమాసము ? ఎట్లు ?

నాలుగుఁగుండలు, రెండుఁజక్రములు అని నుగాగమము వచ్చునా ?

రాజసింహమా ? × రాజసింహుఁడా ? నారాయణుఁడు జగత్కారణుఁడా × జగత్కారణమా? శంభుఁడు త్రైలోక్యప్రాసాదమూలస్తంభుఁడా× .... స్తంభమా?

"వచోగాంభీర్యలీలాస్పదా" అస్పదశబ్దము మిత్రాదులలో పఠించి కొనవలయును. మాభాగ్యంబు కతన - భాగ్యంబుఁ గతన అనవచ్చునా ? చెట్టుకై వడి, - చెట్టుఁగైవడి అనఁదగునా ? మాయింటినిండ × మాయిల్లు నిండ అయిదుబారల రెండుమూరలు-సమాసమెట్లు? అనన్య సామాన్యరూపయైన కన్యారత్నము - లింగభేదము సరియా ? హరిశ్చంద్రుఁడుగారు (?)

నీదు నాదు తనదులవలె మీదు మాదు తమదులు కలవా ?

ఇట్లు సూత్రములు చాలనందునను ఉన్నవానికి వివృతులు చాలనందునను గణములు విరివిగా నివ్వనందునను వితర్కవిషయములు విశేషముగాఁ గలవు. సంస్కృత శబ్దస్వరూపములందు నయితము పెద్దనాదుల ప్రయోగములు నయితము సందేహముల కెడమిచ్చుచున్నవి - ఎట్లన.

ఉ. "పాటనసేయుమిం గురులు పైఁబడి శీర్ణపటీరపంకిలా
లాటికమై దరస్మితవిలాసపుఁ జంద్రిక డాంకి వాడుటన్
దేటఁదొలంగి విన్ననగు నీమొగమోయన మాసి చంద్రుఁడో
పాటలగంధి ప్రాలెసదెభానురుచిం దన కందుమీఱఁగన్."

మను. III—53.

అని పెద్దనగారు "లాలాటిక" శబ్దమును పాపటబొట్టునకు వాచకముగా ప్రయోగించినారు. నిఘంట్వాదులవలన "లలాటికా" శబ్దమునకు పాపటబొట్టర్థముగాని, లాలాటిక శబ్దమునకుఁగాదు. లలాటికశబ్దమునకు 1. ప్రభువుయొక్క అభిప్రాయమును తెలిసికొనువాఁడును 2. కార్యమునందు నేర్పుచాలనివాఁడును

అర్థములు. చూ. శ. ర. ‹‹పత్త్రిపాశ్యాలలాటికా ।››....లాలాటికః ప్రభోః ఫాల (భావ-పా) దర్శీకార్యాక్షమశ్చయః›› అమ. ‹‹లలాటస్యాలంకారః। ‘కర్ణలలాటాత్కనలంకారే’ 4-3-65.” రామాశ్రమి. ‹‹సంజ్ఞాయాం లలాటకుక్కుట్యౌ పశ్యతి 4-4-46 ఇతిఠక్-” రామాశ్రమి.

నిఘంటు వ్యాకరణములవలన “గృహయాళు” అని రూపము లభించుచుండఁగా పెద్దనగారు “గ్రహయాళు” అని ప్రయోగించినారు :—

మ. చకితైణాహుతిదావ మానవళితపుచ్ఛస్వల్పగచ్ఛత్కరం
గక మద్రిగ్రహయాళు భల్లుకము వక్షోభాగనిక్షిప్తడిం
భకవల్గత్పృతగీకదంబము హ్రదాంభఃప్రోత్థితక్రోడనా
యక మాభీలముఖద్విపిస్థపుటితం బయ్యెన్నభం భర్తృతిక్.” మను. IV-38.

“గృహయాళుర్గ్రహీతరి” “స్పృహిపతిదయి నిద్రాతన్ద్రాశ్రద్ధాభ్య ఆళుచ్”. 3-2-158 వృత్తి-‘ఆద్యాత్త్రయశ్చురాదావదన్తాః। స్పృహయాళుః। గృహయాళుః। పతయాళుః అని సి. కౌ. అందుపై బాలమనోరమ-‹‹...ఏవంగృహయాళుః.”

ఇట్లు మహావిద్వాంసులైన పెద్దనాదులే శబ్దస్వరూపమున సందేహములకు ఎడమిచ్చుచుండఁగా, ఈ కాలపు విద్యార్థులకు విపులశబ్దానుశాసనమత్యంతావశ్యకమని చెప్పవలయునా ?

సరియే ఆవశ్యకమే కాని, ఇట్టి యుద్యమములు మహాధనసాధ్యములు; ఇందులకు ధన మెక్కడ ?-అందురు గావలయు. పూర్వము ఇట్టి వాఙ్మయోద్యమములకు రాజులును రెడ్లును ధనములిచ్చినారు. ఇప్పటి మహోద్యమములకు ఇప్పటి రాజులును ఇప్పటి రెడ్లును ఇచ్చుటనే యుండగా నలుదెసలం గనక ధనము లేదని యపశకునము పలికెదరేల !

ఒక్క శబ్దసంస్కరణమే పరిషదాదికార్యమని, మదీయాభిప్రాయముగా పూర్వోక్తవిస్తరమువలన ఎవ్వరును తలంపవలదు. పండితకృత్యములు ఇంక నెన్నియేని కలవు. అయినను సంయమమునకు ప్రాణాయామ మెట్టిదో సకలవాఙ్మయమునకును వాక్సంస్కరణము అట్టిది గాన, ముందుగా వాగ్దేవతను సేవించితిని. వాక్సంస్కారము లేనిచో వక్తను పశుత్వ మని పెద్దలు చెప్పియున్నారు గదా.

“గౌర్గౌః కామదుఘా సమ్యక్ప్రయుక్తా స్మర్యతే బుధైః
దుష్ప్రయుక్తా పున ర్గోత్వం ప్రయోక్తుస్సైవ శంసతి.” కావ్యాదర్శము.

మనభాషకుం బండితకర్తవ్యములు అనంతములు కలవంటిని వానిలో కొం చెపాటిని ఇట్లం బేర్కొనియెద :—

ఈభాషలో <u>అలంకారశాస్త్రగ్రంథములు</u> కతిపయములే కలవు. కావ్యాలంకారచూడామణి, కావ్యాలంకారసంగ్రహము. అటుపై ఆకాశమందును పేరులు లేవు. అవియేనియు అగ్రహారములకై వ్రాసినవేగాని ఆంధ్ర విద్యార్థులకై వ్రాసినవికావు. కావున విద్యార్థి జన సుగమంబుగా ఆశాస్త్రమును సమగ్రముగా ఆంధ్రమున నందన వనముగా నాటుకొల్పుట ఆంధ్ర కవనపాలకుల యవశ్య కర్తవ్యము.

ఇందులోనే ఏక దేశముగానొండె ప్రత్యేకముగానొండి <u>శ్రవ్యకావ్య స్వరూప విస్తరము</u> వలసియున్నది. రూపకములు ప్రకృతకాలముననే ఉత్పన్నములై ఇప్పటికే ఎల్లెడలను పదమిడ వలనుపడనియట్లుగా చెత్త పెరిగి కవితానగరసం స్కారణాధ్యక్షులకు మితిమీఱినపనిం గలిగించుచున్నవి. ఇవి పెక్కులు ఏ లక్షణముం బూరయక హరాణరూపక లక్ష్యములం గని కవి యూహించికొన్నమార్గమున వ్రాయంబడినట్టివి. ఇవిగాక సంస్కృతనాటకముల కాంధ్రీకృతము లగుటచేతను ఆంధ్రకవి యిచ్ఛచేతను భరతోక్త లక్షణానుసారులైన రూపకములును కొన్ని కలవు. ఈరెండు లక్షణములలో ఏది శ్రేష్ఠము? హరాణమే సులువు. మంచి నీళ్లజాలు, భరతోక్త లక్షణము హఠయోగము, గురు శుశ్రూష లేక యలవడదు. ఈపీడయేలయని దీనిని పెకంటులకు "ఒగ్గినయిచి" అమూల్యయశోలిప్సశిఖామణులు హరాణమార్గము నవలంబించుచున్నారు. ఈవిషయమున ఇందు ఏ మార్గము శ్రేష్ఠమో పండితులు నిర్ధారింపవలసియున్నది. రెండింటి స్వరూపములను విస్తరించు గ్రంథములు రచింపవలయును. ఈ సులభరూపకంపుటలలో ఔచిత్యము అసలంటుచున్నది. రాజును మంత్రియు, రాజు మంత్రిని ఓరీయనక మానరు. జేసుకూతురు నిండుగుబ్బెత జేయమాత్య సత్తముని ఓరీయనకమానదు. క్షత్రియచక్రవర్తి ఘనండైన తురకబీబీని ఉంచుకొనకమానడు. ఆ యత్యుత్కటను కృతమునకు ఫలముగా.

"త్రిభిర్మాసై స్త్రిభిర్వర్షై స్త్రిభిఃపక్షై స్త్రిభిర్దినైః
అత్యుత్కటైః పుణ్యపాపై రిహైవ ఫలమశ్నుతే."

అను మహదాశీఃప్రభావమున బీబికాగర్భశుక్తి ముక్తామణీభూత నిజౌరసపుత్రునిచేత రణరంగంబునం బ్రాణముం గోల్పోక మానడు. అంతటితో చంద్ర

వంశపరిపాలనము అస్తమింపక మానదాయెను. ఆసేతువింధ్యము ఆంధ్రాదిలోకము అంధతామిస్రలోకము కాక మానదాయెను. ఇట్టి యనౌచిత్యపుఁజెట్టలను తొట్టతొలుతనే దిట్టపండితులు నెట్టివైవవలయును.

నన్నయోపజ్ఞమయిన మన యీ యాంధ్రభారతిని "Italian of the East;" "దేశభాషలందుఁ దెలుఁగులెస్స ;" ఇత్యాద్యాభాణకపణితనుగా దేదీప్యమానదివ్యమంగళసుధామూర్తిం గావించినవారు నియోగిబ్రాహ్మణులు. కృతజ్ఞతలేనివారికి పురోవృద్ధియుండదు గావున భాషకు బలుపుఁగోరి వారిని ఇట భావించితిని. ఆ యమాత్యుల సిఫారసుచేత కిరీటియె దేశభాష లన్నిటిలోను మనభాషకే కిరీట మిడినాఁడు ; అనఁగా కిరీటధారియైన కృష్ణరాయఁడు తెనుఁగునకే "లెస్స" పలుకు పలికినాఁడు. ఆ కిరీటముందాల్చి యాతని యాస్థానియందు ఈ మన యమ్మ ఏమహిమయందుండెనో ఆమహిమకు వెండియు మనము మన యమ్మను తేవలదా !

ఈ భాషలో చరిత్రగ్రంథదారిద్ర్యము అనంతముగా నున్నది. దానిని ఎప్పుడును తీర్చుచునే యుండవలయును. ఇందులకు సూత్రపట్టుటగాను పునాదులుగాను మూలస్తంభములుగాను ప్రాచీనలేఖాజాలము కొంత లభించి యున్నది. దానిని ఎంత దొరకినను తనవిసనక సమకూర్చుచునే యుండవలయును.

వేయేల ? ఏ భాషలో ఏవిద్య ఏకళయున్నను దానినెల్ల సవిస్తరముగా మన భాషలో వివరించికొని మనది గావించికొనవలయును. ఈ విషయమున విజ్ఞాన చంద్రికామండలివారు కొంతయారంభము గావించినారు. కాలవ్యత్యాసముచేత నిలిపినారు.

భాషావ్యాప్తికై సాహిత్యప్రాప్తికై యుద్గ్రంథములను టీకలతో ప్రకటించుట భారతీదేవికి అత్యుత్తమసేవ. అందుం జేరిన సటీక మహాభారతప్రకటనంబును శ్రీసుందరరామ సూర్యనారాయణ విద్వద్వరేణ్య క్రియమాణంబు నిలుపుదలలో నున్నది. త్వరలోనే వెండియుం బ్రవర్తిల్లుఁగాత, ప్రవర్ధిల్లుం గావుత.

సకలవిద్యలు సకలకళలు సకలభాషలు నని సకలశబ్దపూర్వకముగా చెప్పియున్నందున-

సాంఖ్య, యోగ, వేదాంత, వ్యక్తావ్యక్తగణిత, జ్యోతిష, సిద్ధాంత, ధనుర్వేదాయుర్వేద, పురాత నాధునాతనములులోనుగా సకలంబును మనదిష్టంబగ

పున దీనిని చెప్పితిని దానిని చెప్పనైతిని అను నిత్యాది గ్రంథాక్షేపములు చేయు నవసరము లేదని తెలుపుచున్నాను.

ఆ కాలమునుండి అచ్చుండిన కృష్ణరాయని గ్రంథములు నష్టమై యుండవు గదా. ఇప్పుడు అచ్చుతోడ్పాటుచేత ఎల్లయెడలను శారదాభాండారములను స్థాపింపవచ్చును. స్థాపింపక క్షణమయినను తామసింపఁగూడదు. మన దేశమున ఆంధ్ర, దేవనాగరములందును ఇంగ్లీషునందును గ్రంథములను కూర్పవలయును.

ఇన్ని సేవలు సేయవలసియుండఁగా ఈపరిషత్తువారు ఏమిసేయుచున్నారో మనముకని యానందించి కృతజ్ఞతం దెలుపుట న్యాయ్యము.

పరిషత్తువారు శారదాభండార స్థాపన చేసియే యున్నారు. తదర్థమై రాజకీయా ముద్రిత గ్రంథ భండాగారాధికారులవలె నిరంతరము ముద్రితాముద్రితాంధ్ర సంస్కృత గ్రంథములను సంపాదించుచు ఉచితక్రమమున బృహన్మంజూషలయందు దిదృక్షు పిపఠిషూపయోగార్థము పెట్టియున్నారు.

గ్రంథవ్యాప్త్యర్థము ఉపోద్ఘాతసహితముగా గ్రంథములను యథామతి యథాసంపత్తి ప్రకటించుచున్నారు.

పత్రిక నొకదానిని మాసికమును ప్రకటించుచున్నారు అందు విద్యార్థులకును విద్వాంసులకును ఉపాదేయములగు పెక్కువిషయములను నెలకొల్పుచున్నారు. శాసనములు వ్యాకరణశాస్త్రము, జ్యోతిషము, ఇత్యాదులందలి గూఢవిషయములను సవాదములంగాను సవిస్తరములంగాను సుబోధములంగాను అరఁటిపం డొలిచి త్రుంచి కేల నిడినట్లు ఇందు నేర్పుచున్నారు. వార్షికోత్సవోపన్యాసములును ఇందు బ్రకటింతురు. అందువలన ఎండదినములలో తదుత్సవమునకు రాఁజాలనివారు అనంతరము ఇంచుమించుగా వచ్చిన ఫలముం జెందుదురు. పైగా లోకుల గ్రంథములపై ఇందు విమర్శలు సయితము పొడసూపుచున్నవి. సర్వమును సమంజసమైయున్నను దీని సంపాదకుఁడు ఎవరో తెలియరాక "కశ్చిద్వ్యక్షః" అన్నట్లై అసత్ప్రబంధత్వము నాపాదించుచున్నది.

విమర్శల విషయమున—రసమును (అనఁగా చేరును) రుచిచూచి ఈరసమెవరిది (అనఁగా ఈ చారును ఎవరు కాఁచినారు) అని యడుగవలయును. అట్లడిగిన నదేరసము. అప్పటికిఁ గదా "చారు చారుతరం భాతి." మనకును ఆసమయమేవచ్చుచున్నది. అట్లే విమర్శకులును ఖ్యాతనాములయిన విమర్శలు రుచిమత్తరములగును. ఈ పరిషత్తుయొక్క కార్యస్థానము పెక్కురు విద్యార్థులు సంచరించు ప్రసిద్ధస్థలముననుండిన దీని ప్రయోజనము వర్ధిల్లును.

ఇంతటి పరిషత్తునకు ఎంతటిదో మహోద్యమము అనితరసాధ్య ముండవలయును. అట్టిదిగా నిఘంటునిర్మాణారంభ ముండినది.

# అన్యభాషాగ్రంథానువాదము.

"క. ఒకబాసలోని రస మిం, కొక బాసకు నిండదివియ నుంకించు కవుల్
తికమకలువడరె పెంకా, యకు లోనయి చేతు లాడనట్టి కపులె యై.

గీ. త్రాగ నేరని పిల్లి బోరగిలఁ ద్రోసి, నేలపాలైన పాలఁ గొన్నింటి నాకు
నట్లు కొందఱు మూలంబు నందలి రస, మెల్లఁ గొనలేక యల్పసంతృప్తిఁ గంద్రు.

క. పాలగుదురు నగుఁబాట్లకు, మూలార్థముఁ గానలేక ముడిపెట్టు కవుల్
నేలఁ బడ నన్న మంతయు, బోలియుఁ దల చిక్కు శ్వానములఁ బోలియహా."

క. అనుచున్ వచియించెను మన, జనమంచి సువేంకటాఖ్య సత్కవి వినుఁడీ
తనయమృతకలశిలోనను, జనవునఁ జర్చింతు దాని సన్మతితోడన్.

ఆ. వె. స్పర్ధవలన విద్య వర్ధిల్లు ననియెడు, సూక్తిఁ దలఁచి వ్రాయుచుంటిఁ గాని
లేదు వేఱువృత్తి నాదు మనంబునఁ, గాన నలుగకయ్య కవివరుండ.

క. ఒకబాసలోని రస మిం, కొక బాసకు నిండఁదివియ నుంకింపక యా
యొకబాసనె యుంచిన నా, యొకబాసనె గ్రోలు పట్టులో జనులెల్లన్.

క. ఏబాసలోని రస మది, యాంబాసనెయుంచి గ్రోలుఁడందఱనినచో
నేబావిలోని నీరము, లాబావిజనంబె గ్రోలుఁ డనినట్లు గదా.

గీ. చేఁద నూతనైపఁ జేఁదెఁడు రస మబ్బు, నూతిరసము నంత నూయి యెత్తి
త్రాగవలయు నన్నఁ దరమగునే బ్రహ్మ, కైన వాని గన్నవానికైన.

ఆ. చేతనైనరీతిఁ జేఁదలతోఁ జేఁది, గ్రోలవలయుఁ గాని కుంభసంభ
వముని వలెఁ బుడిసిటఁ బట్టి సంద్రము గ్రోల, నగునె సర్వజనుల కవని నెందు.

ఆ. బావి యెత్తి త్రాగు ప్రౌఢులుండినఁ గాని, బావియడుగు తేమ వాయకుండఁ
గ్రోల నలవియగునె కుంభసంభవుఁ బోలు, వానికే మహానుభావ చెపుమ.

ఆ. అంత వెలికిఁ దీయ నలవిగాకుంటను, గొంతఁ దీయుకవిని గొంకుజంకుఁ
దక్క గ్రోంతి పిల్లి కుక్క యటంచును, వికటముగను వ్రాయువేడ్క చనునె.

ఉ. చెట్టున నున్న తేనియను జేతను దీయఁగ నంత వచ్చునే
యట్టని తీయకున్న మనకబ్బునె తేనియ వచ్చుదానిఁ జే
పట్టి భుజింపఁగావలదె పాపమె దానను బండితాగ్రణీ
యిట్టిసుతర్క మెచ్చుట గ్రహించితివయ్య కవీంద్రచంద్రమా.

క. ఒకబాసలోని రస మిం, కొక బాసకుఁ దీసి పోసి రెండఱొ సుకవుల్
సుకముగ నదెగద మనకిపు, డొక బ్రదుకుం దెరువుగాఁగ నొప్పఁ దెలుఁగునన్.

ఉ. నన్నయఁ దిక్కయజ్వ మఱి నైషధకర్తను భాస్కరార్యుఁ బో
తన్నను దొట్టి పూర్వకవిధన్యులు వేంకటరత్నసూరి వీ

రన్నయుఁ దద్గురుండు వసురాట్కవి తిర్పతి వేంకటేశులున్
మున్నగు నేఁటివారలును బూనరె బాసను మార్చి వ్రాయఁగన్.

ఉ. వారలధర్మమా యనుచు వ్రాసిరి గావునఁ దెల్గుబాసకున్
చేరెని గన్నగ్రంథములు పెక్కులు లెక్కకుఁ గానవచ్చెడున్
వేఱొక బాసలో రసము వెక్కసమంచును మానివైచినన్
నీరసమై కృశించుఁగద నేఁటికిఁ దెల్గు కవీంద్రచంద్రమా.

సీ. వంగప్రకృతినుండి వ్రాయుచున్నారు, వచ్చుచున్నవి హిందిభాషనుండి
ఇంగ్లీషునందుండి యెన్నొ వచ్చుచునుండె, నలమరాటీనుండి యరుగుదెంచు
నివి యున్నియునుగూడి యెంతొ పన్నియువాసిఁ, దెచ్చుచున్నవి మన తెల్గునకును
ఈగ్రంథకర్తల హీనంపుఁ బేళ్లతోఁ, బిల్చుటపాడియే వెలుపుఁ దక్క
యంతగాక యున్నఁ గొంతకొంతైనను, రసముఁ దెచ్చి తెల్గు రంజిలంగఁ
జేసినట్టివారిఁ జేయెత్తి మ్రొక్కక, నిందసేయఁ దగునె నిర్మలాత్మ.

సీ. పండినధాన్యముల్ పండుచోటనె యున్న, నెండుచోటులగతి యెట్టులయ్యె
ఎచట నూరిననీర మచటనే యుండిన, నీరులేనియచట నిలుచు టెట్లు
వాణిజ్యమున లక్ష్మి వర్ధిల్లు నందురు, వసుధలో నట్టులే వాఙ్మయమును
భావసంపత్పరివర్తనమ్మున నది, వృద్ధిఁ జెందును గాని వికృతిపడదు
అట్టిమార్పు లేక యచ్చటి దచ్చట, నింకఁ జేయుమనుట యెట్టిపాడి
చేయుకవులమనసు చివుకురుమనునట్లు, నిందసేఁత తగునె నెనరుమాలి.

గీ. ముదముతో గ్రహించి మూఁడులోకోక్తులు, వానిమూఁడు పద్యవరములందుఁ
బొదివి మూఁడుకాలములకవులను దిట్టఁ, జనునె క్రోఁతి పిల్లి శునక మనుచు.

ఉ. వేఱొకభాష నున్నరసవిత్తము చిత్తము హత్తసత్కవుల్
కోరిక మీఱ దానిఁ దమకూరిమిబాసకు నోపినంతదో
తేరఁ బ్రయత్నమున్ జలిపి తెచ్చిరి యెంతయొ కొంతవారలన్
దూఱుట మేర యౌనె పరితుష్టిగ నంతయుఁ దేరటం చిటుల్.

ఉ. అంతకు మించు ప్రజ్ఞ గలయయ్యలు తద్రస మించుకేనిఁ గో
రంతయు వీడకుండఁ గమరమ్యముగాఁ గొనివచ్చు టొప్పును
స్వాంతముతోడ నందులకు సత్కవులెల్లఁ గృతజ్ఞులౌదు రీ
వింగత నిందసేయఁ బనియేమి సమర్థత లేనివారలన్.

ఆ. ఉట్టిమీఁదఁ జట్టి నున్నపాల్గ్రహియించి, దానిఁ ద్రాగ వేఱుదారి లేక
బోరగించి కొన్ని క్షీరముల్ గొనుపిల్లి, యార్చుపిల్లికంటెఁ బేర్చుఁగాదె.

ఆ. రసము లుండుచోట్ల గ్రహియించి వానిని, స్వకులమునకు జూప శక్తికొలఁదిఁ
బాటుపడఁగ నెనరు భక్తియుఁ గల్గిన, శునియుఁ గపియు మేలుశూన్యకన్న.

నండూరి సూరిరాజు.

# బమ్మెరపోతరాజు—నారాయణశతకము.

## పీఠిక.

శ్రీమదాంధ్రభాగవతగ్రంథకర్త యగు బమ్మెర పోతనామాత్యుఁ డోరుగంటి మిట్ట యం దుండె నని చిరకాలప్రతీతియు లిఖితసాక్ష్యము లోనగు నిదర్శనములు పెక్కు లున్నను వానినెల్ల నిరాకరించి (యితరమండలముఖ్యకవుల నెల్లఁ గృష్ణలోనో గోదావరిలోనో కలుపవలయునను) కొందఱట్టులైన నాయనను నోరుగంటియందు స్థాపింప ౧౦-౧౫ సంవత్సరములుగఁ బ్రబలప్రయత్నములు చేయుచుండుట యాంధ్రలోక మెల్ల నెఱింగినవిషయమే. తత్సంబంధములైన వాదప్రతివాదములు గ్రంథరూపమున వెలువడియున్నవి. పోతరాజవిజయము ముద్రణమందున్నది. సత్యజిజ్ఞాసువు లగుపండితులకు, సత్యాసత్యములు విమర్శింపసామర్థ్యము గలభాషాభిమానులకుఁ దద్గ్రంథము నీసభవారు యూరకయ పంపుదురు.

ఈవాద మిట్లు జరుగుచుండ సాధుమార్గమున నోరుగంటివారివాదము జయింపఁజాల దని తోఁచుటచేఁ గాఁబోలు నెవ్వరో వక్రమార్గమునఁ బోవనుద్యమించుట నెఱింగి యేకశిలానగరద్వయావివాదసంగ్రహమను నం దిప్పటికి 7-8 నెలల నాఁడే బ్ర॥ శ్రీ॥ రాజశ్రీ వావిలికొలను సుబ్బరావుగారు "ఓరుగంటి కాధారముగ లిఖితాధారములు తాళపత్రములు సృష్టింపఁబడుచున్నవని వింటిని. అవి యెంతవఱకు విశ్వసనీయములో భావిప్రాజ్ఞు లాలోచింతురుగాక." అని వ్రాసిరి. అది యోరుగంటివాదులకుఁ గొండఱకుఁ గన్నెఱ్ఱచేసెను. వారు వ్రాసినది సత్యమో యసత్యమో యీనారాయణశతకవిమర్శనము తెలుపఁగలదు.

నారాయణపద్యశతక మొకటి యాంధ్రలోకమున నుండుట యనేకాంధ్రు లెఱుఁగుదురు. ఇందలి ౧౦వ పద్యము.

మ. ధరసింహాసనమై నభంబుగొడుగై తద్దేవతల్ భృత్యులై
పరమామ్నాయములెల్ల వందిగణమై బ్రహ్మాండ మాగారమై
సిరి భార్యామణియై విరించి కొడుకై శ్రీగంగ సత్పుత్రియై
వరుస న్నీఘనరాజసంబు నిజమై పర్గిల్లు నారాయణా.

అనునది యనేకస్త్రీపురుషులకు ముఖస్థమై యున్నది. కావున నీశతకము నూతనకల్పితము గాదు. దీనిని వ్రాసినకవి యెవరో మాకింకను నిజము తెలియరాలేదు.

ఇట్లుండఁ బిఠాపురమునందు "నాంధ్రపరిశోధకమహామండలి" కార్యనిర్వాహకులై యోరుగంటిపక్షపాతులైన మ-రా-శ్రీ. వంగూరు సుబ్బరావుపంతులవారు మ-రా-శ్రీ. వడ్డాదిసుబ్బారాయునిగారిచేఁ బరిశోధింపించి యీనారాయణశతకమును బ్రకటించిరి.—ముద్రితప్రతియం దీశతకము ౧౦౦ పద్యములు ముగియఁగనే కడపట-

"శ్రీపరమేశ్వరకరుణాకలిత కవితావిచిత్ర, కేసనమంత్రిపుత్ర, సహజపాండిత్య, పోతనామాత్యప్రణీతంబైన, నారాయణశతకంబున సర్వంబునుసంపూర్ణము" అను గద్యము ముద్రింపఁబడినది.—ఈగద్యము నాధారము చేసికొని మ-రా-శ్రీ. వంగూరిసుబ్బరావుగారు "ఈశతకము సార్వజనికపుస్తభాండాగారమునఁజిరకాలమునుండి యున్నట్లు నేనెఱుఁగుదును. ఇది శ్రీమద్భాగవతమును దెనిఁగించిన బమ్మెరపోతనామాత్యకృత మని గద్యవలనఁ దెలియుచున్నది. గ్రంథశైలియందును, కొన్నివ్యాకరణదోషములందును భాగవతమునకు సంపూర్ణముగుపోలికతో నున్నది.....ఈ గ్రంథమును బోతన్న చిన్నతనమునందు మంచిధార గలకవితాశక్తి గలిగి శ్రుతపాండిత్యముచే రచియించి క్రమముగా మహాపండితుఁడై భాగవతము రచియించినట్లు నమ్మవచ్చును. కావున నాతని 'సహజపాండిత్య బిరుదమున కిది తార్కాణము కావచ్చునని నాయభిప్రాయము. పద్యములనడక, భావములు, నతిరమ్యములయ్యు భాషాదోషము లెల్లవిధములైనవి నిందుఁ గన్పట్టుచున్నవి" అని పీఠికయందు లిఖించిరి.

ముద్రితపుస్తకములను రెండుప్రతులను సంపాదించి వావిలికొలనుసుబ్బరావుగారు మాసమాజమునకుఁ బంపిరి. ఈపుస్తకమును బఠించి, యిదిబమ్మెరపోతనకృతము గాదనియు నెవ్వరో యాయనపేరటి గద్యమును బ్రాఁతశతకమునకుఁ జేర్చిరనియు మాసమాజమువారికిఁ దోఁచుటచే నీశతకమును విమర్శించి పండితమహాజనాభిప్రాయ మెఱుఁగఁగోరి విక్రమసింహపురమున జరగఁగల సాహిత్యపరిషద్వార్షికసభయందుఁ బఠింపవలసినట్టు మాబమ్మెరపోతనామాత్యసమాజమువారు 1919వ సంవత్సరము మేనెల 5తేది యందు జరిగినసభయందుఁ దీర్మానించిరి. ఈ 5వ తేది

యందుఁ బెజవాడలోనుండుః బ్ర॥శ్రీ॥ పెద్దిభొట్ల వీరయ్యపంతులు బి.ఏ., బి.ఎల్ గారు వ్రాసిన "వార్రంగల్ ఒంటిమిట్టవివాదము" అనుగ్రంథమునందలి వాదమును ఖండింప మానసమాజమువారు సభచేసిరి. ఆసభకుఁ దాము రాఁజాలమని తెలుపుచు బ్ర. శ్రీ. వీరయ్యపంతులవారు "నూతనముగా బ్రచురింపఁబడిన నారాయణశతకమునందలి ధర్మపురలక్ష్మీనాథ యనుమాటవల్ల బోతన వార్రంగల్ ప్రాంతమున నుండినటుల దెలియగలదు" అని వ్రాసిరి.

దీనివలన నీశతక మోరుగంటివాదమును బలపఱుప నోరుగంటివాదులచేఁ బ్రకటింపఁబడియె ననుట స్పష్ట మయ్యెఁగదా. దీని నామోదించిన బ్ర. శ్రీ. వీరయ్యపంతులవారేగాక రా. శ్రీ. వంగూరి సుబ్బరావుగారును నోరుగంటివాదులే యని యాంధ్రలోకమునకు విదితము. వీరుగాక కర్తలు, కారయితలు, ప్రేరకులు, నామోదకు లెవ్వరెవ్వరు తెఱనుఱుఁగుల నున్నారో మేమెఱుఁగము. నిజము నిలుకడపైఁ దెలియును. బ్ర॥ శ్రీ॥ రా॥ శ్రీ॥ వావిలికొలను సుబ్బరావుగారికి వారిమిత్రులొకరు "I have come to *understand to-day* that a letter was received by Mr. P. Veerayya about the discovery of Potanna's manuscript of దశమస్కంధము in ఓరంగల్. Did you hear?" 12-2-1919.

అని లేఖ లిఖించిరి. 500 సంవత్సరములనాఁటి తాళపత్రగ్రంథము రామబాణక్రిమిదష్టమై నశింపక యథాస్థితి నుండఁగలదేమో మీరే యాలోచింపుఁడు. అది బమ్మెర పోతన స్వహస్తలిఖితమని యాయక్షరములగుర్తింపఁ జాలినమహానుభావులెవ్వరో. ఈలేఖవలన నోరుగంటివాదు లింకను నెట్టెట్టివాని కెక్కుపెట్టియున్నారో యూహింపుఁడు. దీనివలనఁ గూటగ్రంథములు రత్నగర్భచరిత్రాదులు మఱికొన్ని పోతనపేరనో యాయనకొడుకుపేరనో మనుమనిపేరనో మునిమనుమనిపేరనో వెలువడఁగలవని యెంచఁ గారణము కలుగుచున్నది. అట్టివి వెలువడినవు డాంధ్రలోకమే వానిని దగురీతి విమర్శించునుగాక.

ఈశతకపరిశోధనమం దొకచిత్రము గానవచ్చుచున్నది. దానిని మీకుఁ దెలిపి యింతటితో నీపీఠిక విరమించి గ్రంథవిమర్శనమునకుం గడంగెదము.

శోధన మనఁగ శుద్ధముగఁ జేయుట; యనఁగా దోషములను నవరించి నిర్దుష్టముగఁ జేయుట. పరిశోధన మనఁగా మిక్కిలి నిర్దుష్టముగాఁ జేయుటగదా. ఇఁక నీగ్రంథము పరిశోధింపఁబడినవిధముఁ గనుఁడు.

౨౭. "కుఱుగుంపైనను వంకపోయినఁ గడుం గుజ్జైనఁ బేడత్త్రినన్" అనుపాఠమును "కుఱుగుంపైనఁ వంకబోయినఁ గడుంగుజ్జయినఁ బేడత్త్రినన్" అని ఛందోభంగ మగునట్లు ప్రథమమిాఁదిపకారము బకారమగునట్లును బరిశోధింపఁబడినది.

౨౮. "కడకుం బోయక వేయినోళ్లు గలయాకాద్రోదగాధీశుఁడున్। కడము ట్టన్ వినుతింపలేక నిగుడం గ్రాలంగ నోచ్చునుబిం। మ్మడరన్ సన్నుతిసేయ నాదు వశమే యజ్ఞాని లోభాత్ముఁడన్। జడుడన్నజ్ఞుఁడ నేకజిహ్వుఁడ జనస్తబ్ధుండ నారాయణా. వేయినోళ్లు గలయాదిశేషుఁడే నిన్ను స్తుతింపలేకయుండ నొంటి నాలుక గల నేను నిన్ను నుతింపఁగలనా యని కవ్యాశయము. ఏకజిహ్వుఁడ ననునది నైకజిహ్వుఁడ నని పరిశోధింపఁబడినది. రాజమహేంద్రతాళపత్త్రప్రతి యందు నేకజిహ్వుఁడ ననియే యున్నది.

౨౯. "మదవద్ధేనుకముష్టికాద్యసురులన్" అని వ్రాఁతప్రతిపాఠము. మదవద్ధేనుకదానవాద్యసురులన్ అనిపరిశోధితపాఠము.

౩౦. "సగుణబ్రహ్మమయాఖ్యతం" అనునది "సగుణబ్రహ్మమయాఖ్యతన్" అని పరిశోధితము. యాఖ్యత యిందు నేల రావలసివచ్చెనో.

౩౧. వ్రేపల్లెం దాడుచు, ననునది యంతకంటె సాధువని కాఁబోలు వ్రేపల్లెందాడుచు నని పరిశోధితము.

౩౨. "రహస్యంబుగాఁ జెలకున్"అనునది చెవ్లకున్ అని పరిశోధితము.

౩౩. "వృద్ధాప్యకాలంబునన్" అనునది వృద్ధాప్యవేళంబులన్, అని శోధింపఁబడినది.

౩౪. నరసింహాచ్యుత వాసుదేవ వికసన్నాళీకపత్త్రాక్ష యనుపాఠము వికసన్నాళీకపత్త్రేక్షణ యనిశోధింపఁబడినది.

ఇట్టివి మఱికొన్ని గలవు. ఇట్టిదానిని దజ్ఞులు శోధిత మందురో బాధితమందురో. ఆర్యులారా! వం. సూ. సుబ్బరావుగారును విద్యావంతులే, మహాపండితులే. ఇట్టివారు బ్ర॥ శ్రీ॥ వడ్డాది సుబ్బరాయనిగారి సాహాయ్యముతో గ్రంథము పరిశోధించి ప్రకటించితి మని చెప్పుచు నవపాఠముల గ్రహించుచు సాధుపాఠముల విసర్జించుచు లేని దోషములు కల్పించుచు ముద్రించుటకుఁ గారణము సహజపాండిత్యశక్తి యనఁదగునా, మఱి యేమిటికో చెప్పిన యర్థము సమర్థించుటకో ప్రాజ్ఞులాలోచింతురుగాక.

"ప్రాయికముగా యథామాత్రకముగా ముద్రింపఁబడినది" యని పీఠిక యందు మేము వ్రాయలేదా యందురేని ప్రాయికశబ్దమున కేమి యర్థము? యథాశక్తిసహాగమన మనియా? యథామాత్రక మగునేని పరిశోధిత మన నేల? సాధుపాఠమును బాధించుట పరిశోధితమా?—అదట్లుండనిండు. యథామాత్రకమనిరికదా. 'అథవా పుస్తకత్రయ'మ్మను నియతికలదుగదా. సాహిత్యపరిషత్తునందుఁబ్రతులుగలవని తామే వ్రాసిరికదా. వానిని గన్నెత్తియైనఁ జూచిరా? ఒక నాఁటిలో ముద్రించుటచే మాకు విరామము లేదయ్యెనందురేని యాగ్రంథము లు 'రెండుప్రతులు' చిరకాలముగ రాజమహేంద్రవరపుస్తకభాండాగారమున నుండుట యెఱింగియు నొకనాఁటిలో ముద్రింపవలసినంత యాత్యయికకార్య మేమి గలిగెను? వీరు ప్రకటించిన విజ్ఞచిత్తీయరాజనీతియందును శీఘ్రముగఁ బ్రకటింపఁబడినదని వ్రాసియున్నారు. ఇఁక నెన్నిట నట్లు వ్రాసిరో మేమెఱుఁగము. కావునఁ దర యనునది నెపమని గ్రహింపవలసియున్నది. ముద్రణ మొకదినమందయ్యెననిరి, అంగీకరింతము. వీరు 3-4-19సం॥న వ్రాసిన వ్రాఁతప్రతికిని, దాము చేసిన సవరణకు విరోధముగ ముద్రాక్షరశాలవారు పైనష్టపాఠముల ముద్రించిరని వంగూరు సుబ్బరావుగారు చెప్ప సాహసింతురా?

ఇంతటితోఁ బీఠిక నిలిపి నారాయణశతకము బమ్మెరపోతనామాత్యకృత మగునో కాదో విమర్శింతుము.

నారాయణశతక విమర్శము.

ధర్మపురిలక్ష్మీనారాయణున కంకితముగ రచియింపఁబడి నారాయణశతక మను పేర లోకమునఁ దెలియవచ్చుశతకమున మత్తేభశార్దూలవృత్తములు నూఱు గలవు. ప్రతిపద్యముకడపట "నారాయణా" యనుపదము మకుటముగఁ గూర్పఁబడినది. ఈగ్రంథకర్త యెవఁడో మాకుఁ దెలియరాలేదు. కాని పీఠికయందను వదించిన "ధరసింహాసనమై" యనుపద్య మాంధ్రలోకమున నింతకుమున్నే వ్యాప్తమై యుండుట సత్యము. ఆకారణముచే నీశతకము నూతనసృష్టము గాదు. దీనికడపట—

"ఇది శ్రీపరమేశ్వర కరుణాకలితకవితావిచిత్ర, కేసనమంత్రిపుత్ర, సహజ పాండిత్య, పోతనామాత్యప్రణీతం బైన నారాయణశతకంబున సర్వమును సంపూర్ణము" అనిముద్రింపఁబడినది. ఇట్టిగద్యమే భాగవతమునఁ బోతనవిరచితస్కంధాంతముల నుండుట యెల్లరెఱుంగుదురు. ఈగద్యము నాధారముగఁ గొనియు మఱి

కొన్నికారణములచేతను నీశతకము బమ్మెర పోతనామాత్యకృత మని గ్రంథమును ప్రకటించిన మ-రా-శ్రీ. వంగూరి సుబ్బరావుగారు వ్రాసిరి బ్ర॥ శ్రీ॥ పెద్దిభొట్ల వీరయ్యపంతులు గారును నోరుగంటివారును తమవాదము జయించెనని చంకలు కొట్టుకొనుచున్నారు.

ఈశతకము బమ్మెర పోతరాజకృత మనుటకు వంగూరు సుబ్బరావుగారు చెప్పెడు కారణములు.

(1) ఆంధ్రభాగవతమునఁ గానవచ్చుగద్యమే యీశతకమునకడపటను గానవచ్చుట.

(2) గ్రంథశైలియందును, కొన్నివ్యాకరణదోషములందును భాగవతమునకు సంపూర్ణమగుపోలికతో నుండుట.

(3) "ఈగ్రంథమును పోతన్న చిన్నతనమునందు మంచిధారగలకవితాశక్తి గలిగి శ్రుతపాండిత్యముచే రచియించి క్రమముగా మహాపండితుండై భాగవతము రచియించినట్లు నమ్మవచ్చును. కావున నాతని సహజపాండిత్యవిషదమున కిది తార్కాణము కావచ్చునని మాయభిప్రాయము. పద్యములనడక భావములు నతి రమ్యములయ్యు భాషాదోషము లెల్లవిధములైనవి యిందుఁ గన్పట్టుచుం"డుట.

ఈకారణములు క్షోదక్షమములేమో పరిశీలింతము :—సభాస్తారులారా ! తొలుత గద్యమునుగుఱించి మాకుఁ దెలిసినవిషయము విన్నవించెదము. i. శతకములం దెందైనఁ దద్గ్రంథకర్తలు తమనామధేయములను గద్యరూపమున వ్రాసికొనియున్నారా ? ఆయాచారమునకు భిన్నముగ నిందు గద్యము కానవచ్చుట సంశయాస్పదముకదా.

ii. సాహిత్యపరిషత్పుస్తకభాండాగారమున నైదుప్రతులున్నవి: అందు నాల్గిట గద్యముగాని కవిపేరుగాని లేదు. ఒక్కదానియందుమాత్రము గద్యము కలదు. ఇది కాగితములప్రతి. దీనిసంఖ్య 1113. పద్యములు పాతమసితో వ్రాయఁబడినవి. గద్యము నూతనముగ, కలకత్తా (స్వాన్)సిరాతో వ్రాయఁబడినది. లిపియు భిన్నముగనే కానవచ్చుచున్నది. ఈగ్రంథ మోరుగంటివాదము పుట్టినతరువాత సాహిత్యపరిషత్కార్యాలయమునఁ జేరినది. సృష్టికర్త లెవ్వరో యెప్పుడుసృష్టించిరో మేము చెప్పఁజాలముగాని గద్యము కూటసృష్టి (forgery) యనుట నిస్సందేహము. ఇది గోదావరిజిల్లాప్రతి.

దీనినిగుఱించి మఱికొంతవివరించెదను సావధానులరై చిత్తగింపుఁడు.— ఏవ్రాఁతప్రతి నాధారముచేసికొని మ-రా-శ్రీ. వంగూరి సుబ్బారావుగారు ముద్రించిరో యావ్రాఁతప్రతి కడపట—

క. భారద్వాజసగోత్రుఁడు, సూరిస్తుతబాచిరాజసూనుఁడు రామాం
బారమణీమణితనయుఁడు, సారసవంశార్ధిచంద్రుఁడుధరలోన్.

క. ప్రతి చూచివ్రాసినాఁడను, సతతము శివభక్తిసారసంగ్రహలీలా
దృతలోకోత్తరసీతా, పతినాముఁడ నందివాడపరమాన్వయుఁడన్.

అని యున్నది. ఈపద్యములవలన రాజమహేంద్రవరప్రతి నందివాడ సీతాపతియను నాయన వేఱొకమాతృకనుజూచి వ్రాసి సార్వజనిక పుస్తకభాండాగారమునకు నాయనో వేఱొకరో యిచ్చినట్లు రూఢిపడియెఁగదా. ఇఁక సాహిత్యపరిషత్తునందుఁ గానవచ్చు శతకమును బరిషత్తునకుఁగా దే॥ భరద్వాజసను వారు సేకరించిరి. వా రాపుస్తకముమీఁద "మహారాజశ్రీ బ్రహ్మశ్రీ, నందివాడ శీతాపతిగారు పరిషత్తునకు నొసంగిన నారాయణశతకం ఇది పోతరాజప్రణీతం" అనివ్రాసి దే ॥భ॥ అని తమపేరుసూచించిరి. దీనివలన నిది రాజమహేంద్రవరప్రతికి మాతృక యగుట స్పష్టము. మాతృకగద్య కూటసృష్టియగుచోఁబుత్రిక గద్యమెట్టిదో మీరే భావింపుఁడు.

సాహిత్యపరిషత్తువారిపక్షమున యస్. రంగనాథరావు అనువారు వ్రాఁతపుస్తకములను సేకరింపఁ జిత్తూరు కడపమండలముల సంచరించిరి. వారు పంపిన పుస్తకములలో నొకప్రతి తాటియాకులపై వ్రాయఁబడిన దున్నది. దీనిసంఖ్య 2167. ఈపుస్తకముకడపట ముష్టూరి బాలరాజుకొమారుఁడు పెద్దవెంగయ్య వ్రాసికొన్నది. యనియు నిది జయనామసంవత్సరమున వ్రాసికొనఁబడిన దనియు నున్నది. ఈ జయ మొన్నటిజయకుఁ బూర్వపుజయ. ఇట్టివ్రాఁతగ్రంథమందు గద్యము లేకుండుట యటుండ ౧౧వ పద్య మిట్లు కానవచ్చుచున్నది.

మ. రమణీయంబుగ నాదిమంబు నవతారంబుల్ భవద్దివ్యరూ
పము నామామృతముం దలంప దశకప్రాప్తయ్యె కృష్ణావతా
రము సుజ్ఞానము మోక్షముల్ ద్వివిధసంప్రాప్తిం శతాంధ్రాఖ్యకా
వ్యము నర్పించితి మీపదాబ్జములకున్ వైకుంఠ నారాయణా.

ఈపద్యార్థ మిట్లుగ్రహింపవలసియున్నది. ఆదిమదశకము, అవతారదశకము, దివ్యరూపదశకము—నామదశకము. ఇంతవఱకుఁదరగతికి ౧౦ పద్యములవంతున

వ్రాయఁబడినవి. ఆవల కృష్ణావతారవింశతి, జ్ఞానవింశతి, మోక్షవింశతియని రకము నకు ౨౦ వంతున వ్రాయఁబడినవి అన్నికలిసి ౧౦౦ అయ్యె. మూలగ్రంథమం దీ యంతర్విభాగము లాయాస్థలముల సూచింపఁబడినవి. దీనివలన నీశతకము నా ద్యంతగ్రంథసంఖ్య ౧౦౧యని యేర్పడియె. కొన్నిప్రతులలో ౧౦౮-కొన్నిటిలో ౧౧౦ యున్నవిగాని కవియే పద్యసంఖ్య భాగములతో నియమించియుండఁదగినవి ప్రక్షిప్తము లనఁదగును. ఈ ౧౦౧ పద్యమందు నర్పించితినని మాత్రము వ్రాసె నుగాని కవి తననామము పేర్కొన్నవాఁడు గాఁడు. తనయోగ్యత యెఱిఁగి యే పేరు దాఁచికొనెనని భావించుట తప్పుగా నుండదు—పేరు చెప్పియేయుం డిన నర్పించితి ననుపదముతోడనే యదియు నుండవలయునుగాని భిన్నముగ గ ద్యమునం దుండఁ గారణములేదు—. కావున నీగద్యము కూటసృష్టి యనఁదగి యున్నది.

## గ్రంథశైలి, పోలిక.

బమ్మెర పోతనామాత్యుశైలివిధ మెవ్వ రెఱుఁగని విషయముగాదు ఆయన యత్యంతానుప్రాసప్రియుఁడనుట జగత్ప్రసిద్ధము. అనుప్రాసాభిరుచి యాయన నాచనసోమునిహరివంశము రంగనాథ రామాయణము, భాస్కరరామాయణము పఠించినకాలమునందే జనించి యుండవలయునుగాని యున్నట్టుండి పిట్టపిడుగువలె భాగవతరచన వేళకు నాకసమునుండి దిగి రాలేదు. భోగినీదండకము బమ్మెర పోతన రచితము కాకున్నను శైలిగదా యనేకుల సంశయాంబుధి ముంచుచున్నది. కావున నీశతకము పోతనవిరచితమే యైయుండినయెడ ననుప్రాసదుర్భిక్షమునకుఁ గారణము లేదు. ఈనూఱుపద్యములం దొకచోటనైన ననుప్రాసప్రీతిని గవి కనఁబఱిచిన వాఁడుగాఁడు. వక్ష్యమాణపద్యంబులే కవిశైలిరీతిఁ దెలుపుచున్నను నొకపద్యము మచ్చునకై యుదాహరించెదము.

మ. ఇరవొందన్ సచరాచరప్రతతుల న్నెన్నంగశక్యంబె కా
  కరయన్ పద్మభవాండభాండచయము న్నారంగ మీకుక్షిలో
  నరుదార న్నుదయింపఁ జెంప నడప న్నన్నారికేళోద్భవాం
  తరవాఃపూరముచంద మొంద దెపుడున్ దైత్యారి నారాయణా. ౨౧.

## వ్యాకరణదోషసామ్యము.

నారాయణశతకంబున ద్రుతంబున కచ్చుపరమైనపుడు ద్విత్వము విచ్చలవిడి

గాఁబ్రయోగింపఁబడినది. "ఎడల న్నేతప్పులున్." ఇట్టివి సాధారణముగ నరాసరి పద్యమున కొకటివంతున గాన నగు.—ఇట్టిసంధిని వం॥ సుబ్బరావుగారు దోషములలోఁ బరిగణించిరో లేదో మేమెఱుంగముకాని యిట్టిసంధివిషయమై బహుజనపల్లి సీతారామాచార్యులవారు ప్రౌఢవ్యాకరణంబున నిట్లు వ్రాసిసిరి. "కొన్ని యెడలఁ బ్రామాణికప్రయోగంబులం ద్రుతంబున కచ్చుపరం బగుచో ద్విత్వంబు చూపట్టెడి.

ఉ. మ. ఘనచక్రాయుధనిష్ఠురక్షతగళద్రక్తాస్యసర్వాంగుని
 న్ననుభూతాప్రతిమప్రగల్భహరివాదాంతర్ద్ధితోద్విక్రమున్ ఉ. హ. ౬౯.
 సర్వమున్నతని దివ్యకళామయమంచు. భాగ. ౭స్కం.

తరుణీశాతకటాక్ష వీక్షలకొనల్దాఁగొన్న చోట్లుంబలె, *న్నురుశోభావిభవాకరంబులగుచున్ రోమాంకురస్థానముల్. కళా. ఆ. 7. (నన్నయభట్టారకుఁడు "అన్నిష్ట నఖినూఁదియున్నదాని. అని ప్రయోగించి "లుక్సంశ్లేషా నాచిద్రుతస్య" యని సంశ్లేషమును నిషేధించుట ప్రయోగవైరళ్యసూచనార్థంబని యెఱుంగునది.)"

దీనివలన నిదిదుష్టము కాదనియుఁ దఱచు ప్రయోగింపరాదనియు నేర్పడెను.

ఇఁక నారాయణశతకములోఁ గానవచ్చుకొన్నిదోషములను జేర్కొనెదము. అట్టివి భాగవతమున బమ్మెర పోతనామాత్య రచితభాగంబులఁ గల వేమో ప్రాజ్ఞులారయుఁడు.

 ౫. గాడిదసౌరభ్యపరీక్షచూడఁ గుశలే.
 ౮. జగత్త్రియములన్ నిష్పాపులం జేయఁగా.
 ౧౧. మగమీనాకృతి నార్ధిఁ జొచ్చి.
 ౧౨. అత్యంతసామర్థ్యులై. ౧౩. డాగున్న గర్వాంధునిన్.
 ౧౪. హేమకసిపోద్దండాసురాధీశ్వరున్.
 ౧౫. విహరించింద్ర విరించిశంకరమహావిఖ్యాతదివ్యాకృతిన్.
 ౧౬. త్రైలోక్యనిర్దుష్టమై. ఇరువైయొక్కటిమారు.
 ౨౪. నిర్భేద్యుండవై త్రైగుణోపేతంబై.
 ౩౧. తగిలుండు. ౩౨. శత్రోరగవ్రాతముల్.

* ఈయుదాహరణము సరికాదు. "బోట్లుంబలె! న్గురుశోభా...చున్రోమాం." అనవున్న యతిభంగము—ప. అ.

౪౪. ప్రేవల్లెండాడుచు.

౪౯. పీలీపింఛము.

౫౯. చెన్నరుఁ - వాలరుఁ.

౬౧. తెల్సి.

౬౬. దాసోహంభావము - దాసోహంభావమనియుండవలయు.

౬౭. భేమజునకుఁ.

౭౦. నిరసించేదికి.

౭౨. సంసారమాతుఃపయోధరదుగ్ధంబులు.

౭౬. కల్గుంచు.

౮౦. కారుణ్యులై పుణ్యులై.

౮౩. జలయంత్రాన్వితబంధయాతనగతిఁ. వృద్ధాప్యవేళంబులఁ.

౮౪. మమహంకార వికారసంపద.

౮౮. వరదాసావళి దాసదాసినయి.

౯౧. గజయూథేంద్రుండు ఆపన్నుఁడై. ద్రౌపదియెడ. నీశరణ్యమనెనో.

౯౯. జగత్త్రాతాహితల్పాంబుజోదర.

౧౦౦. భాగీరథీపడఁతి.

ఇఁక ఛందోభంగములంగనుఁడు.

౯౫. అనయంబుఁ మదిఁదన్నెఱుంగక తుది న్నీమాయచే మగ్నుఁడై॥ ఇది వ్రాఁతప్రతి యందలిపాఠము. తుది న్నామాయచే నని శోధిత పాఠము.

ఈదోషములయం దీశతకము భాగవతమునకు సంపూర్ణ మగుపోలికతో నున్నదని మ.రా. వంగూరి సుబ్బరావుగారు వ్రాసిరి. ఇది సత్యమా, మీరే పరిష్కరింప సమర్థులు.

## శతకము బాలకకృతమా ?

ఈశతకమును బోతన బాల్యమున రచించెనని వోరుగంటివారుల యభిప్రాయముగదా. ఇట్లు వ్రాయుటకు గ్రంథమం దాధార మొక్కటియైనఁ గానరాదు. తప్పులు కుప్పలుగా నున్నవి కావున బాల్యరచిత మఁట. అట్లైనచోఁ దప్పులు కుప్పలుగానున్నవన్నియుఁ బోతనరచితములా? బాల్యరచితములా?

ఈపద్యములు చిత్తగింపుఁడు - ఇవి బాలకవికృతములా !

మ. చన్నుల్ మీఁదికి చౌకళింప నటనముం జన్నాడ కందర్పసం
పన్నాఖ్యంబు నటింపఁ జూడ్కి కబరీభారంబు లూటాడఁగా
విన్నాణంబుల నొప్పు గోపికలు.—రఙ.

మ. కనవొప్పన్ పసిమేసి ప్రొద్దుగలుగం గాంతారముంబాసి యు
ప్పసియు న్నీవును వచ్చుచో నెదురుగాఁ బైకొన్న గోపాంగనా
రసవద్వృత్తపయోధరద్వయహరిద్రాలేపనామోదముల్

పసిఁగొంచున్ బసిగొంచు వచ్చుటలు నేభావింతు నారాయణా. ఇట్టిప్రయో
గములు మఱియుఁ గొన్ని కలవు.—మఱియొక తెగ పద్యములు చూడుఁడు.

23-40-69-70-97. పద్యములు వేదాంతసంబంధములయి యున్నవి. బాల
కవికి వేదాంతతత్వమెట్లలవడెనో ?- మీఁద వివరించిన యవలక్షణప్రయోగము
లన్నియు సహజపాండిత్యబిరుదమునకుఁ దార్కాణముఁట.

సభాస్తారులారా ! సహజపాండిత్య మననేమియర్థము ? పాండిత్యము సహ
జ మని యర్థమా ? లేక సహజముగ నోరవెడలు వెఱ్ఱివెక్కుడుకూఁత లన్నియుఁ
బాండిత్యమునకుఁ జిహ్నమనియా ? ఎంతెంత వెఱ్ఱికూఁత లెక్కువగఁ గూసిన
నంతంత సహజపాండిత్యబిరుదమునకు యోగ్యుఁడగునా యేమి ? నారాయణ
శతకము వ్రాసినవాఁడు తనకు లక్షణజ్ఞానము చాలదనియు నిట్టిగ్రంథమునఁ దన
పేరు చెప్పుకొనుట శాశ్వతాపకీర్తిపాలగుటకే యని వెఱచి నామధేయము
దాఁచెను-ఆమాత్రజ్ఞానమును లేక యిటువంటి యవలక్షణకృతియందుఁ బరమేశ్వ
రకరుణాకలితకవితావిచిత్ర సహజపాండిత్య యని పోతనామాత్యుఁడు వ్రాయు
నా ? ఆగద్యము భాగవతమునకుఁ దగునుగాని దీనికిఁ దగునా ? ఇందేకవితావిచి
త్రము గానవచ్చుచున్నది ? ఏమిపాండిత్యము ప్రకటింపఁబడినది ? గద్యము శ
తకమునకు నదుకుపెట్టినట్లున్నదిగాని రెండు నొకరువ్రాసినట్లున్నదా ?

ఈపద్యమును దిలకింపుఁడు.

మ. చదువుల్ పెక్కులు సంగ్రహించి పిదపం జాలంగసుజ్ఞానినై
మదిలోఁ బాయక నిన్ను నిల్పఁదగు నామర్మంబు వీక్షింపఁడే
మొదలం గాడిద చారుగంధవితతుల్ మోవంగ శక్యంబెకా
కది సౌరభ్యపరీక్ష జూడ కుశలే యవ్యక్త నారాయణా.

ఇది భావ మతిరమ్యమైనపద్యము !!! ఓనుగంటిప్రాంతములందుఁ బరిమళ
పదార్థములు గాడిదలు మోయునుగాఁబోలు. దత్తమండలములం దట్టియాచార

ములేదు. కావున నీశతక మోరుగంటిప్రాంతమునం బుట్టిన దనుటకుం బ్రబలా
ధార మోరుగంటివాదులకు లభించినది. మా బమ్మెర పోతన్న రసజ్ఞుండు కావున నిట్టి
పిచ్చివ్రాంతల వ్రాయండు.

౯౨వ పద్యమున ధర్మపురిలక్ష్మీనాథ నారాయణా యనియున్నది. ధర్మపురి
గోలకొండదేశమున నున్నదంట. ఆకారణముచే నీశతకము గోలకొండదేశమునం
బుట్టెనంట. ఇది బమ్మెర పోతన వ్రాసెనుగావున బమ్మెర పోతన గోలకొండదేశము
వాండే కాని దత్తమండలములవాండు కాండంట. కూటసృష్టికిం బరమోద్దేశ మిది.
ధర్మపురములు రెండును ధర్మపురి యొకటియు దత్తమండలములందుండుట యోరు
గంటివాదు లెఱుంగమి నిట్టిసాహసవాదమున కుపక్రమించిరి. ధర్మపురనృసింహ
స్వామిపేర నొకశతకము గలదు. ఇదియు గోలకొండ దేశమందే పుట్టె నని యొకరు
వ్రాసిరి. ఆధర్మపురియందు లక్ష్మీనారాయణాలయము నృసింహాలయము రెం
డును గలవా? రెండును లేవా? యేల వ్రాయరైరో? ఈశతకము దత్తమండలము
లంబుట్టినట్టు మేము స్థాపింప యత్నింపము. అది యెందైనం బుట్టనిండు. పోతనకృ
తము కాదనుటే మాయభిప్రాయము. అయిన ౯౨వ పద్యంబున.

మ. భవనాశిన్ గయ తుంగభద్రయమునల్ భాగీరథిం గృష్ణవే
త్రవతి న్నర్మద పెన్న బాహుద పయోరాశి న్వియద్గంగ యం
దవగాహంబుననైన పుణ్యము లొగి న్నారంగ నేం డిచ్చుటల్
భవదంఘ్రిస్మరణంబునం గలుగు నోపద్మాక్ష నారాయణా.

అని పుణ్యనదులను చేర్కొనుచుం బెన్నను జెప్పియుటిని చేర్కొని గోదా
వరినిగాని శేషాద్రిరమణకవులగంగబుగ్గనుగాని యేల పేర్కొనలేదో తమదేశనది
నేల స్మరింపనైన స్మరింపలేదో యోరుగంటివాదులు చెప్పరైరి.

ఈక్రింద వివరింపంబడువిషయము లాలోచించి యిది బమ్మెరపోతనకృతమే మో
పరిష్కరింపం బ్రార్థించుచున్నారము.

గీ. చేతులారంగ శివునిం బూజింపండేని, నోరు నొవ్వంగ హరికీర్తి నుడువండేని
యని చెప్పుటచేతను.

సీ. తనువున నంటిన ధరణీపరాగంబు, పూసిననెఱిభూతిపూంత గాంగ
ముందర వెలుంగొందుముక్తాలలామంబు, తొగలసంగడికానితునుక గాంగ
ఫాలభాగంబుపైం బరంగుకావిరిబొట్టు, కాముని గెల్చినకన్ను గాంగ
గంఠమాలికలోని ఘననీలరత్నంబు, గమనీయ మగుమెడకప్పు గాంగ

ఆ. హారవల్లు లురగహారవల్లులు గాఁగ, బాలలీలఁ బ్రౌఢబాలకుండు
శివునిపగిది నొప్పె శివునికిఁ దనకును, వేఱులేమి దెల్ప వెలయునట్లు.

అనుటచేతను బోతన శివకేశవభేదము పాటింపనియద్వైతి యగుట స్పష్టము. ఇట్టియద్వైతి బాల్యమున విశిష్టాద్వైతిగా నుండె నని వాదించుజడుఁడుండఁడుగదా. తండ్రి శైవమతస్థుఁడు గావున నుండినఁ గొంతశైవపక్షపాతమే బాల్యమున నుండవచ్చును. ఇఁక నారాయణశతకములోని పద్యములం గనుఁడు.

౨౫. వరనాభీధవళాంబుజోదరమునన్ వాణీశుఁ గల్పించి యు
ష్పురుషశ్రేష్ఠుని ఫాలమందు శివునిం బుట్టించి యామేటికిన్
బరమోత్తంసముగా పియత్తలనదిం బాదంబులం గన్నమీ
సరి యెవ్వారలు మీరుదక్కఁగ రమాసాధ్వీశ నారాయణా.

ఇందుఁ బురుషశ్రేష్ఠుఁ డనఁగా జీవకోటియందు శ్రేష్ఠుఁడని భావము. పురుషోత్తమశబ్దమునకుఁ బురుషులకంటె నుత్తముఁ డని వ్యుత్పత్తి.—ఇది బాలుఁడు నద్వైతి చెప్పినపద్యమా ?

౨౬. ప్రభ మీనాభి జనించినలసత్పద్మోరు సద్మంబునం
బ్రభవం బైనవిరించి ఫాలజనితప్రస్వేదసంభూతుఁడై
యభిధానంబును గోరి కాంచెను భవుం డార్యేశు లూహింపఁగా
నభవాఖ్యుండవు నిన్నెఱుంగవశమే యబ్జాక్షనారాయణా.

ప్రథమపాదమున గణభంగము.—బ్రహ్మలలాటమందలి చెమటలోఁ బుట్టుటచే శివునకు భవుఁడనునామము కలిగెననియు నారాయణుఁ డభవుఁడనియుఁ జెప్పఁబడెను. ఇట్లు బాలుఁడు నద్వైతి చెప్పునా? ఈయైతిహ్య మెందలిదో పెద్దవారే యెఱుంగరు.

౨౮. నవిశేషోరుసువర్ణబిందు విలసచ్ఛక్రాంకలింగాకృతిన్
భవుచే హృద్భవుచే పయోజభవుచే పద్మారిచే భానుచే
దివిజేంద్రాదిదిశాధినాయకులచే దివ్యన్మునీంద్రాళిచే
నవదివ్యార్చన లందుచుందువు రమానారీశ నారాయణా.

ఇందు శివుఁడు లోనగువారు సాలగ్రామార్చనము చేయునట్లు చెప్పఁబడినది

౩౦. వరుసం గర్మపిపీలికాకృత తనూవల్మీకనాళంబులోఁ
బరఁగంగా వసియించి యుండెడుమహాపాపోరగశ్రేణికిన్

బరమోచ్చాటనమై రహస్యమహిమన్ బాటింపుచున్నండుమీ
తిరుమంత్రం బగుమంత్రరాజము మరున్ దివ్యాత్మ నారాయణా.

తిరుమంత్రశబ్ద మద్వైతినోర వచ్చునా ? రహస్యశబ్దము రహస్యత్రయము ను సూచించుచున్నది.

౬౬. తనకున్ సాత్త్వికసంపదాస్పద మహాదాసోహభావంబునన్
ననయంబున్ మది నన్యదైవభజనం బారంగ దూరింపుచున్
జనితాహ్లాదముతోడ నీచరణముల్ సద్భక్తి పూజించి నిన్
గనుగొన్నంతనె కల్మషంబులడగుం గర్మఘ్న నారాయణా.

అద్వైతి సోహమనునుగాని దాసోహమనఁడు. శివకేశవుల నిరువురఁ బూజించునుగాని శివపూజ మానఁడు. కావున నీపద్యమునందలి దాసోహంభావము నన్యదైవభజనదూరత్వము నద్వైతివాక్కు లగునా ? ఇట్లన్యదైవభజనమునే పోతన దూరీకృతము గావించెనని చెప్పుచు నుత్తరకాలమునఁ బడుపులంజను గృతినాయికఁ జేసి యర్థార్థియై భజించెనని యోరుగంటివాదులు వాదించు టెట్టివాదమో.

౮౮. ధర గ్రామాధిపునింటిదాసుఁ డొరుకెంతో ద్రోహముం జేసినన్
వరగం జెల్లుట సూచితీభువనసంపాద్యుండ వైనట్టిమీ
వరదాసావలిదాసదాసినయి దుర్వారాఘముల్ జేసితిన్
కరుణం జేకొని కావుమయ్య త్రిజగత్కల్యాణ నారాయణా.

మొదటి రెండుపాదములవలన నీకవి యోరుగంటివాసి గాఁడనియు సామాన్యగ్రామనివాసియనియు నేర్పడుచున్నది.

దాసావలిదాసదాసినని తాను బురుషుఁడో స్త్రీయో యాజ్ఞానముకూడ లేక పోతన చెప్పెనను నోరుగంటివారివాదమును మీరంగీకరింతురా ? "భృత్యస్య భృత్యపరిచారక భృత్యభృత్యభృత్యస్యభృత్య ఇతి మాం స్మర లోకనాథ" యను ముకుందమాలనుండి యిది గ్రహింపఁబడినది. ఇట్టిభావ మద్వైతికిఁ గలుగునా ?

౯౨. నీలగ్రీవుఁడు చేతిపుర్రె విడిచెన్ నీయింతి భిక్షంబునన్
నీలగ్రీవుఁడు యీశ్వరాఖ్యఁ దనరెన్ నీనామజప్యంబునన్
నీలగ్రీవుఁడు మించి ద్రుంచెఁ బురముల్ నీప్రాపు సేవించినన్
నీలగ్రీవముఖాబ్జభాస్కరకృపానిత్యాత్మ నారాయణా ॥

౯౬. నీవే శంకరమూలమంత్రమయుఁడౌ నీవేజగత్కర్తవున్.

ఇవి యద్వైతి చెప్పునా. ఈగ్రంథకర్త వైష్ణవ విశిష్టాద్వైతి యనుటకు మఱియుఁ గొన్నియాధారములు గలవు. ఇంకొక పద్యము నుదాహరించెదము.

మ. స్నానంబుల్ నదులందు జేయుట గజస్నానంబు చందంబగున్
మౌనంబొప్పఁ బఠించు వేద చటపీఠధ్యంబులో నేడ్పుగున్
నానాహోమములెల్ల బూడిదలలోన న్వేల్చునెయ్యైచనున్
నీనామోక్తియు నీపదాబ్జరతియున్ లేకున్న నారాయణా॥

ఇది ప్రతిదినము నుదయమున విశిష్టాద్వైతులు పఠించు కులశేఖరాళ్వార్ కృత ముకుందమాలలోని

ఆమ్నాయాభ్యసనాన్యరణ్యరుదితం వేదవ్రతాన్యన్వహం
మేదశ్ఛేదఫలాని పూర్తవిధయ స్సర్వే హుతం భస్మని
తీర్థానా మవగాహనానిచ గజస్నానం వినా యత్పద
ద్వంద్వాంభోరుహసంస్మృతిం విజయతే దేవస్సనారాయణః ॥

అను శ్లోకమునకుఁ దెనుఁగు. ఇది బాలుఁడు నద్వైతి యగువాఁడు చెప్పినాఁ డనినమాట విశ్వసనీయమా?

ఇట్టులే పోతనకుఁ గించితాపూర్వుఁ డగు లీలాశుకులు చెప్పిన కృష్ణకర్ణామృతములోని-

రాధా పునాతు జగ దచ్యుతదత్తచిత్తా మంథాన మాకలయతీ దధిరిక్తపాత్రే
తస్యాస్స్తన స్తబకచంచలలోలదృష్టిః దేవోఽపి దోహనధియా వృషభం నిరుంధన్

అను శ్లోకమును.

ర౨. పెరుఁగుల్ ద్రచ్చుచు నొక్క గోపిక మిముం బ్రేమంబునం జూచి రా
గరసావేశత రిత్తపన్ను నిడియెం గవ్వంబు నీవు న్మనో
హరలీలం గనుగొంచు ధేనువని యయ్యాబోతునుం బట్టి తీ
వరవృత్తాంత మిలేను పుణ్యకథగా వర్ణింతు నారాయణా.

తాళపత్రగ్రంథములం దన్ని మూలమున ననుసరించి "ధేనువని యుర్యాబోతుకుం బెట్టితి"వని యున్నది. పరిశోధనముం దున్న తెలివియుం బోయినది.

౨౨. మదిలోనం జమభక్తిపీఠముపయిన్ మానాథ మీపాదముల్
గదియం జేర్చినవానికే నోడయుఁడున్ గానంచు నత్యున్నతిన్
పదిలుండై సమవర్తి భృత్యుచెవిలో భారంబుగాఁ బల్కు మీ
పదపద్మార్చకు లెంతపుణ్యులో కృపాపారీణ నారాయణా.

ఈభావము భాగవతషష్ఠస్కంధమున నజామిళోపాఖ్యానంబునం జెప్పఁబడినది. అజామిళోపాఖ్యానము భాగవతమునం దప్ప మఱి యొందుచోట లేదని వినికి. సంస్కృతగ్రంథ మీకవికి దుర్బోధము. కావున నీపద్యము దాశరథిశతకానంతరమో యాంధ్రభాగవతషష్ఠస్కంధానంతరమో పుట్టియుండవలయును.

"ఎఱుంగునే పసులగాపరి భావజమర్మకర్మముల్" అను పారిజాతాపహరణవాక్యము మీకందఱకు ముఖస్థమేకదా. నారాయణశతకకవి దాని ననుసరించి

"పసులంగాపరి యేమెఱుంగు మధురప్రాయోల్లసద్వృత్తవాగ్విసరారావము" అనికొంచెము మార్చి చెప్పెను.

దీనివలన నిది పారిజాతాపహరణమునకును వెనుకఁ బుట్టిన దని తలఁప వచ్చునుగదా.

పూర్వోదాహృతపద్యములవలన నారాయణశతకకవి వైష్ణవవిశిష్టాద్వైతి యగుట నిస్సందేహము. వీరభద్రవిజయము శైవవిశిష్టాద్వైతి వ్రాయుటయు నిశ్శంకము. ఈరెండును బోతన బాల్యమున రచించె నని యోరుగంటివాదులు వాదించుచున్నారు. ముందు శైవుఁడై యావల వైష్ణవుఁ డయ్యెనా ముందు వైష్ణవుఁడై యావల శైవుఁ డయ్యెనా తరువాత నద్వైతి యెప్పు డయ్యెను? భోగినీవర్ణనారతుఁ డెప్పుడయ్యెను?

వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునందన
బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయో౽వ్యవసాయినామ్.

అనుట స్మరణీయము.

నారాయణశతకమున ముద్రితగద్యము కూటసృష్టి యని సప్రమాణముగ నిరూపించితిమి. గ్రంథస్థసాక్ష్యమువలన నిది బమ్మెర పోతరాజకృతము గాదని నిర్ధారించితిమి. ఇది మాయభిప్రాయము. విజ్ఞులు, కవులు, పండితులు నగుమీయట్టివారు మాయభిప్రాయ మొప్పో తప్పో యెఱిఁగింపవేఁడెదము.

"సభకువచ్చి ధర్మసందేహ మడిగిన, నెఱిఁగి చెప్పకుండు రేని సభ్యు
లనృతదోషఫలమునం దర్ధ మొందుదురు.
ధర్మ మెఱిఁగియుండి దా నొండుగా లాభ, లోభపక్షపాతలోలబుద్ధి
సభల నెవ్వఁడేని సభ్యుఁడై పలుకును, బ్రాజ్ఞుఁడైన నెందుఁ బాపచయము."

అనుసూక్తులు మీస్మరణమునకుఁ దెచ్చుచున్నారము.

ఈకూటసృష్టి యెవ్వఁ డెప్పుడు చేసె నని నిర్ధారింప మిమ్ము మేము కోరలేదు. ఇందలిగద్య కూటసృష్టి యగునా కాదా?

ఈశతకము బమ్మెర పోతనామాత్యరచిత మనవచ్చునా? ఇవియే మీరు పరిష్కరింపవలసినవిషయములు.

మాకడపమండలపోతనామాత్యసమాజమువారి తరఫున మీకందఱకు వందనముల నర్పించి విరమించుచున్నాఁడ.

జనమంచి వేంకటసుబ్రహ్మణ్యశర్మ (పాఠకుఁడు.)

# సర్వేశ్వరశతకము

పీఠిక.

ఈశతకవుంబ్రతులు మూఁడు మాకు లభించినవి. అందు మొదటిది గుంటూరుమండలములోని గురజాలనివాసి యగు మ॥ దుర్గరాజు శేషగిరిరావుగారు 1915 సంవత్సరము డిసెంబరునెలలోఁ బంపినది. శేషగిరిరావుగా రీశతకమునకు సమగ్ర మయినమాతృక తమ కెక్కడను దొరకలే దనియు, గురజాలతాలూకాలోని జూలకంటిగ్రామములో నొకలింగబలిజెయింటఁ గొన్నిపద్యములను నాతాలూకాలోనే కొదమగుండ్లగ్రామమున, చింతపల్లివారియింటఁ గొన్నిపద్యములను బ్రోగుచేసి వ్రాసితి నని వ్రాసినారు. రెండవప్రతి విశాఖపట్టనమండలవాస్తవ్యులగు మ॥ కొవ్వలి జగన్నాథముగారు కాశినుండి పంపినది. ఈప్రతికి మాతృక విజయనగరమునకు సమీపమున నున్న జామిగ్రామమున నొకపట్టుసాలెవానియింట దొరకినదని జగన్నాథముగారు వ్రాసినారు. మూఁడవప్రతి యోరుఁగల్లు (వారంగల్) నందుఁ జిరకాలమునకుఁ బూర్వము ముద్రింపఁబడినది.

ఈశతకమును యథావాక్కుల అన్నమయ్య యనుకవి ౧౧౭౪వ శకాబ్దమునకు సరి యయిన శుభకృత్సంవత్సరమున రచించినట్లు ౧౨౭-౧౨౮వ పద్యములం బట్టి కనుపట్టుచున్నది, కవిపేరు పూర్ణముగాఁ గల ౧౨౮వ పద్య మొక్కజామి ప్రతియందు మాత్రమే యున్నను, గురజాలలోఁ గూడ "నీశతకము యథావాక్కుల అన్నమయ్యకృతమే" యని ప్రతీతి గలదని దుర్గరాజు శేషగిరిరావుగారు వ్రాసినదానినిబట్టి తెలియుచున్నది. కృతికాలముం దెలుపు ౧౨౭వ పద్యము మూఁడుప్రతులందు నుండుటవలన నది ప్రక్షిప్త మనుట కవకాశము లేదు. ఈశుభకృద్వర్షము క్రైస్తవమానమున ౧౨౪౨వ సంవత్సరమునకు సరిపోవుచున్నది. దీనిసబట్టి యథావాక్కుల అన్నమయ్యగారు రించుమించుగాఁ బాల్కురికి సోమనాథునకుఁ దిక్కనసోమయాజికిని సమకాలికుఁ డైనట్లు తోఁచుచున్నది.

ఈకవి వీరశైవుఁడు; కవినిగుఱించియు, శతకరచనమును గుఱించియు, పల్నాడు (గురజాల) తాలూకాలోని చెర్లగుడిపాడుగ్రామమునకుఁ గరణ మయిన సోమరాజు వేంకటశివుఁ డను నాయన వ్రాసియుంచినవృత్తాంతము శేషగిరి

రావుగారివలన మాకు లభించినది. దానిలోనిముఖ్యాంశముల నీక్రిందఁ బొందుపఱచుచున్నవారము.

“ యథావాక్కుల అన్నమారాధ్యుఁ డాత్రేయసగోత్రోద్భవుఁడు. యజుశ్శాఖాధ్యాయి, గోదావరీతీరవాసి, రాజమహేంద్రవరమునకు సమీపమున నున్న పట్టిసమను గ్రామమందు వెలసిన వీరభద్రేశ్వరస్వామి యీయనకు నిలువేలుపు. ఈమహనీయుఁ డొకప్పుడు శ్రీశైలయాత్రకు వెడలి శ్రీమల్లికార్జునస్వామిని సేవించి తిరిగివచ్చుచుఁ బల్నాడుతాలూకాలో జెట్టిపాలెముదాపునఁ గృష్ణాతీరమందు విశ్వామిత్రాశ్రమ మనఁబడు సత్రశాల యనుపుణ్యస్థలమున శ్రీమల్లికేశ్వరస్వామిని సేవించుచుఁ గొంతకాలముండి యచ్చటనే యీసర్వేశ్వరశతకమును రచించెను. ఒక్కొక్కపద్య మొక్కొక్కతాటియాకుపై వ్రాసి యాయాకును గృష్ణలో వైచి యది ప్రవాహమున కెదురీఁదివచ్చెనా దానిని దీసి సూత్రమున నెక్కించెద. అట్లుగాక క్రిందికిఁ గొట్టుకొనిపోయెనా యప్పుడే నాశిరము ఖండించికొనియెద నని శపథముచేసి మెడకు గండకత్తెర వైచుకొని యాకులమీఁదఁ బద్యములు వ్రాసి నీళ్లలో విడిచిపెట్టఁగా నవి తిరిగి వచ్చుచుండినవి. కొంతసేపటికి ‘తరులం బువ్వులు పిందెలై నొందవి’ అను (౧౭౨) పద్య మొకటిగా నాక కొట్టికొనిపోవుటఁ జూచి కంఠమును గత్తెరించికొనుట కుద్యమించుచుండఁగా నొకపసులకాఁపరి ‘నా కొకతాటియాకు దొరకినది చూడుఁ’ డని యిచ్చి యదృశ్యుఁ డయ్యెను. కవి యాయాకును జూడఁగా దానిపై దానువ్రాసినపద్యమునకు మాఱుగా వేఱొక (౧౭౭) పద్య ముండుటఁ జూచి యిది సర్వేశ్వరకృత మని గ్రహించి యాపద్యమును సూత్రమున కెక్కించి తాఁ జేసికొన్ననియమముప్రకారముననే శతకమును బూర్తిచేసి కొంతకాలమునకుఁ బిదప నాసత్రశాలయందే సిద్ధిఁబొందెను.

ఆ యన్నమారాధ్యునికొడుకు వీరంరాజు, వీరంరాజుకుమారుఁడు నాగరాజు, నాగరాజుతనయుఁడు చిట్టెమరాజు. ఈయన పల్నాడుసీమకు వచ్చి యచ్చట చెర్లగుడిపాడు, మిరియాల, పల్లిగుంత, పశ్వేముల, వద్దిరేల, సీతానగరము నను నాఱుగ్రామములకుఁ గరిణీకము సంపాదించెను. అప్పటినుండియు నీవంశము వారు పల్నాటిసీమనివాసు లయిరి. చిట్టెమరాజు కొడుకు గోపరాజు, గోపరాజు కొడుకు సోమరాజు. ఈసోమరాజు సుప్రసిద్ధుఁడై యుండుటచే నాతనినాఁటనుండి యీవంశమునకు యథావాక్కులవా రనుపేరు మాఱి సోమరాజువా రనుపేరు గలిగినది. ఇప్పటికి నిదియే వాడుకలో నున్నది.

ఇది సోమరాజు వేంకటశివుఁడుగారు వ్రాసినదానికి సంగ్రహము. తాను బెద్దలవలన వినినదానిని వ్రాసినానని వేంకటశివుఁడుగారు వ్రాసినారు. ఈయన వ్రాసిన దానినిబట్టి "యన్నమయ్యగారి వంశావళి" యను గ్రంథ మొకటి యున్నట్లు కనఁబడుచున్నది. దానిలోని వని వేంకటశివుఁడుగారు వ్రాసినపద్యములఁ గొన్నిటి నుదాహరించుచున్నారము. వీనిలోఁ గొన్ని తప్పులతడికలుగా నున్నవి.

గీ. ధర యుధావాక్కులాన్వయా ల్తత్త్వవిదులు
వారిలో నొక్కసద్గుణుం డమితయశుఁడు
అన్నమారాధ్యుఁ డనియెడునార్యనుతుని
వంశవృద్ధిని వర్ణింతు నగుసతోడ.

ఉ. శ్రీమదనంతసద్గుణసుశీలుఁడు నాత్మవిహారహారుఁడున్
ఆమదనాంతకాంఘ్రియుగళామృతపానరతాంతరంగుఁడున్
సోమధరారివత్సరమసుందర తేజవిరాజమానుఁడున్
కామనివారకుం డఖిలకారణుఁ డన్నమరాధ్యుఁ డోయనన్.

క. ఆయన్నమరాధ్యుంమును, స్వాయంభుసమానసర్వశాస్త్రార్థవిదుం
డాయమరేశుపదాధిపు, పాయక వేదాంతవేదపారాయణుఁడున్.

ఉ. సత్యమునందు ధర్మజునిసాటికి నచ్చును ధర్మమందు నా
దిత్యునిసూనుసాటి యగుఁ దేజమునందుఁ బరాక్రమించువి
వ్వచ్చుని బోల్పవచ్చు శుభవైభవుసత్కవిసేవ్యసత్కథన్
నిత్యము భక్తినల్పుమది నన్నమరాధ్య జగత్ప్రసిద్ధిగన్.

క. ఆయన్నమార్యతనయుఁడు, కాయజునిసమానమూర్తి ఘనుఁ డననొప్పన్
హేయగుణరహితు నిశ్చల, శ్రీయుతుఁ డన వీరనార్య జగతిని వెలసెన్.

ఉ. శ్రీలుఁడు ధర్మమార్గపరిశీలుఁడు ఖండితమోహవల్లికా
జాలుఁడు సత్కృపాలుఁడు ప్రసంగవిశాలుఁడు ధర్మసత్క్రియా
లోలుఁడు చిట్టిమంత్రి చెరులోగుడిపాడును పిల్లిగుంత మి
రాశ్యలయు పశ్చివేముల మిరాసిగఁ జేకొనె మూఁడుసీమలన్.

గీ. సాగరాబ్ధియు పావకసోమసంఖ్య, శాలివాహనశకమున జరుగువేళ
గ్రామవట్టంబు చేకొనెఁ గరిణికంబు, చిట్టినామాత్యఘనునకు స్వార్జితంబు.

సీ. శ్రీమదుమాదేవిచిత్తాబ్జభృంగమౌ శితికంఠుభక్తిని సిద్ధకీర్తి
సతతంబు బగళాదిసన్మంత్రజపితుఁడై నిగమాగమాంతాదినిరతుఁ డగుచుఁ
జిత్తంబు గురుపాదసేవను హత్తించి నిర్మలానందుఁడై నేర్పు మీఱఁ
దనపేరు లోకమందునఁ బ్రశస్తంబుగా నాచంద్రతారార్క మగుచు వెలయ
నార్యజనులను బ్రోచుచు నధికప్రీతి, రాజయోగానుసంధానరసికుఁ డగుచుఁ
బుణ్యచరితుండు గోపనపుత్రుఁ డెలమి, సోమరాజన సుగుణాభిరాముఁ డగుచు.

గీ. సోమరాజు కీర్తికాముఁడై విలసిల్లె, దనదుసంతతికిని ధరణియందు
గోపనార్యసుతుఁడు గృహనామధేయుఁడై, పెంపుఁ బడసెఁ బ్రస్తుతింపజనులు.

మ. అజరుద్రాదులు మి మ్మెఱింగి నుతిసేయన్లేరు నే నెంతవాఁ
డ జగద్రక్షణదక్షు నిన్నుఁ గొనియాడ న్నీస్వభావంబు దా
సజనానుగ్రహనిశ్చితం బగుట నాజన్మంబు సాఫల్య మం
ద జడుం డంచు నిరాకరింపక ప్రసన్నంబౌట సర్వేశ్వరా.

ఈసర్వేశ్వరశతకము వీరశైవమతసంప్రదాయానుసారము. భక్తిరసప్రధానము, శైలి హృద్యము, ధార యనర్గళము, చదువువాని కేపాటివాచకత యున్నను జాలును; తమంతఁదామ దొరలిపోవును. పద్యరచనాశిల్పమున కిది ముఖ్యలక్షణము. కొన్నికొన్నికల్పనములు మనోహరములును బ్రౌఢములును గా నున్నవి. స్థాలీపులాకన్యాయముగా ౨౧, ౪౪, ౪౫, ౫౧, ౬౧౭, పద్యములు చూడ వచ్చును. పద్యములనడకనుబట్టియుఁ, గల్పనములఁబట్టియు నీశతకము కొన్నిచోటులందుఁ సంస్కృతములోని శివమహిమస్తోత్రమును గన్నడములోని సోమేశ్వరశతకమును, దెలుఁగులోని కాళహస్తీశ్వరశతకమును దలంపునకుఁ దెచ్చుచున్నది. బహువిధముల నీపుస్తకము సకలాంధ్రజనపఠనయోగ్యమని మాయభిప్రాయము

జ. రామయ్య.

# గ్రంథస్వీకారము.

(1) **ఈశ్వరతారావళి :—** ఇందీశ్వరాయనుమకుటముగల యిరువదియేడుపద్యములు గలవు. ఈచిన్నిపొత్తము పిఠాపురము ఆర్.సి. హెచ్ హైస్కూలు సహోపాధ్యాయులగు బ్ర॥ జనమంచి సీతారామస్వామిగారిచే రచింపఁబడినది. దీనికివలయు ధనము నయాచితంబుగ నొసంగి చిక్కాని పద్మమ్మయను భక్తురాలు ముద్రింపించినదఁట. ఇందలిపద్యములన్నియుఁ జక్కని భక్తినిబోధించుచు సరసములగు కల్పనములచేనలరారుచున్నవి. మచ్చునకొకటి :—

ఉ. చుక్కలనొప్పనంబరముఁజూడఁగ నెంతయు నేత్రపర్వమై
చక్కఁగఁజాటునీమహిమసర్వము, నద్భుతలీల, నందియం
దెక్కడిదింక "నాస్తికుఁడనే" ననుమూఢుఁడుఁగూడ రాత్రియం
దక్కజమంది నీకుహృదయమందుఁ దలంపకయున్నె యీశ్వరా.

ఈకవియే శ్రీశంకరకృత మనుప్రసిద్ధింగన్న ద్వాదశమంజరికాస్తోత్రమునుగూడ నాంధ్రీకరించి పైపొత్తముతోడనే ప్రకటించెను. ఆయాంధ్రీకరణము మిగులసరసముగానున్నయది. దీనికి సుబోధసుధయనునది కవికృతనామము. ఇయ్యదిపాదనియతిలేని తేటగీతికలలో రచింపఁబడినది. పద్యములనడకమాత్రము బాగుగలేదు. అర్థైకదృక్కతచేఁ బద్యగమనిక చెడినదికావలయు. రుచికి :—

ఎట్టిది సతియనఁగ ? సుతులెట్టివారు
వారికిని నీకు గల్గినవరుసయేమి ?
యిట్టి సంసారమతి చిత్రమీజగాన ;
నేరివాఁడవు ? నీవిటకేస్థలంబు
నుండి వచ్చితి ? వెంత్రభ్రాంతుండవన్న !
దీనియందలి తత్త్వంబుఁదెలిసికొనుచు
ముక్తినొందు మీశుభజించి మూఢచిత్త.

(2) **భారతమాతృవిలాపము :—** దీనినిగూడఁ బైకవియే రచించెను. దీనిలో భారతభూమి యిక్కాలపుజనులనడవడుల రోసి విలపించి పలవించి తుదకు హితబోధచేసిన రీతి యిరువదియేనిమిది గీతపద్యములతోడను నొకమంజరీద్విపదతోడను వర్ణింపఁబడినది. ఇందలి గీతములకుఁ బాదనియతి పైదానికివలెనే లేదుకాని నడకమాత్రము సరళముగానున్నయది. ఇందలిభావములు రమ్యములు. మాదిరికొకటి.

గీ. కాలమాహాత్మ్యమేమియోగాని దేశ, భక్తులమనిచెప్పుకొనుచుయుక్తులెవిరియు
వన్నిస్వమతస్వదేశస్వభాషలకును, ద్రోహులై రందఱొనుతులు దుర్దినములు
వచ్చెననుచువేఱువల్కవలయునె యీశ !

సీ. కాళిదాసాదిసంస్కృతకవులుచేసి, నట్టిగ్రంథములంజదివి పట్టిరాని
సంతసమునొందినాట్యముసల్పినారు, గారెంగోతి, సంటివారలుకాని యట్టి
సంస్కృతపువెలయిస్త్రపైసరాయనులేదె, కలదె ధర్మమునకనయిక్కాలమునను.

ఇట్టిపద్యములలో వాక్యమేకపద్యముగ లెక్కించి పంచపది, షట్పది, సప్తపదులం గూర్చుట కంటె నొక్కమాలికగా వ్రాసిన వాక్యమాలిక గీతమాలికకూడ నగును. గ్రంథములు కవిగారియొద్దనే దొరకును.

(3) **నాచనసోమనాథమహాకవి జీవితము :—** దీనిని రచించినవారు శతావధాని బ్రహ్మశ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు. శాస్త్రిగారు సోమనాథునిచరిత్రమును వ్రాయుచుముందుగా దానిలోనికొంతభాగము (16 పుటలుమాత్రము) ప్రకటించినారు. దీనిలో సోముని కాలనిర్ణయమును సిద్ధాంతీకరించిరి "ఉత్కృష్టకవికవిత్వము బాల్యమునందును నాఁటి తేటినది గానఁబడనగును. రాఁగలకవితాపరిపాకత నది సూచింపఁజాలియుండును" అను నిందలివాక్యమే యీపుస్తకాదిని గూర్చి మా యభిప్రాయముగా మరల వ్రాయుచున్నారము.

(4) **విలాపతరంగిణ్యాది :—** తిరుపతి, టి. ఇ. ఎల్. ఎమ్. హైస్కూలు ప్రధానోపాధ్యాయులగు శ్రీమాన్ కపిస్థలము కృష్ణమాచార్యులు బి.ఏ., గారు దీనిని సంస్కృతభాషలో రచించిరి. ఇందు 1 విరహివిలాపము 2 విరహిణీవిలాపము 3 సంధ్యావిలాపము 4 విధురవిలాపము 5 పుత్రశోకివిలాపమునన నిరువదేసి శ్లోకములుగల యైదుతరంగములు మిగుల సరసములై యలరుచున్నవి. ఇవిగాక, 1. కవికంఠభూష, 2. స్నేహలత, 3. అనునయాలాపము, 4. మనోగర్హణము, 5. రఘువీరసుప్రభాతనవమాలిక, 6. ప్రాస్తావికపద్యములు ననునవి గూడ నిందుఁగలవు. కవిత చాలవఱకు సరళపదసముపేతమై క్లిష్టార్థాదిదుష్టాంశవిదూరమైయున్నది. మచ్చున కొందు రెండు శ్లోకములు :—

శ్లో. ప్రతికృతింతవవీక్ష్యముహుస్సుతః కరముదస్య రుదన్నుపధావతి
తమిహసంభృతబాష్పమహంప్రియే న పరిరోద్ధుమలం నచవీక్షితుమ్. విధురవిలాపము.

శ్లో. మందానిలేనశిశిరేణహి వీజ్యమానా బాలారుణస్యకిరణైః పరిచుంబ్యమానా
నానాపతత్రినిచయైరపిగీయమానా డోలావిహారమయతే హృదయేకవీనామ్

శ్లో. కాత్వం మృగాక్షి వచసామధిదేవతాహ మ్మాతశ్చిరాయ రుదతీ వసు కుత్రయాని
భోజాదిమాశ్రయలయాద్దివముత్పతామి, మామైనమంబ కథమత్ర హిమాదృశానామ్.
కవికంఠభూష.

(5) **మలయవతి :—** ఇది తెలుఁగువచనకావ్యము. సంస్కృతమున నాగానందమను పేరుగల నాటకము దీనికి మూలము. బళ్లారి మున్సిపల్ హైస్కూలు తెలుఁగుపండితులగు బ్రహ్మశ్రీ చింతలపల్లి నరసింహశాస్త్రిగారీ గ్రంథమునురచించినవారు. ఇందలి భాష తేటతెనుఁగు. శైలిమృదులము. బాలురకుసైతము పొత్తమంతయు ననాయాసముగ నన్వయించును. కథ నీతి రక్తి భక్తి శక్తి యుక్తులనెల్లఁ గరతలామలకమువలె స్వాధీనపఱుచుననుట నాగానందముం జదివినవారికిఁ దెలియని విషయము కాదు? శ్రీశాస్త్రిగారీగ్రంథమునకు సంస్కృతనామముందీసి వైచి స్వకృతమలయవతీనామ

మేలయుంచిరో. నాగానందమనుటకంటె నీపేరునం దౌచిత్యము కొంతవడియున్నదని మాతలంపు. గరుత్మంతునిసంబోధించుటలో శాస్త్రిగారు "ఖగేశ్వరథా" యని తఱచుగా బ్రయోగించుచున్నారు. ఆంధ్రలాక్షణిక సంప్రదాయానుసారము నీశబ్దమునకు సంబోధనము "ఖగేశ్వరథమా" యని కావలయును. 46 పుటలో "నీవువచ్చి పైఁబడుదు వనుభయంబున నెన్నియో నాగాంగనాగర్భంబులు స్రావంబునొందుచున్నవి." ఈవాక్య మసంబద్ధమని మాతలంపు, పైఁబడుశబ్దనిట నస్థానశంకావహము. నాగాంగనాగర్భంబులని సమస్తముగానుండుటచే భయము నాగాంగనలకా గర్భములకా యను శంక కలుగును. వ్యస్తములుగానున్నఁ గొంచెపాటిక్లేశమున నన్వయమగును. ఎంచటో నావని తలనాథల యిరి. దీనికిఁ బూర్వము నీవలన ననియుండుటమేలు, లేకున్న నీవుపైఁబడుదు వన్నభయమే దీనికిని హేతువుకావలసియుండెను. అయ్యది హేతువనుటయనుచితము నాగరాజాపలుకువాక్యమున "మా పట్టణంబు జనశూన్యంబై" యనుటకంటె నాగశూన్యంబైయని యనుట నంచిది, జనశబ్దమునకుఁ బ్రాకరణిక సర్పార్థముచేసికొనవలసినంత క్లేశమేల. హింసార్థకమగు బారి నొక్కసారి బండిబారుగాఁ జేయుట యయుక్తము. 49 పుటలో, అష్టాంగన కన్నీరు మున్నీరై కాఱ, వానమున దైన్యంబు వ్రేలాడ" ఇట వ్రేలాడుట కర్థమనర్థము. తోఁచుననియనేకులు వ్రాయుదురు. ఆయర్థమే యిక్కడను. అయిన శబ్దముమాత్రము క్రొత్తది. వ్యవహారమందు మాత్రమిట్టి ప్రయోగము లనటనట వింటుము. గౌరి కమండలూదకము నభిషేకింప జీమూతవాహనుఁడు నిద్రనుండిమేల్కొనినవాని మాడ్కి లేవఁగా జీమూతవాహనుఁడే యత్యాశ్చర్యమందుట పొరపాటు. జీమూతవాహనుని లేచుటకు జీమూతకేతుఁడాశ్చర్యపడుట సాజము. ఒకచో నాగపతులు, బ్రతికిరి, యనియు, నొకచో నత్యుల్లాసంబునఁ బొదలుచున్నవి యనియు మహత్త్వమహత్త్వసమ్మేళనము.(79పుట). పార్వతి జీమూతవాహనుఁడొనర్చిన సాహసంబున కదిచాలదని విద్యాధరచక్రవర్తి పదంబొసంగి" (80పుట) ఇట నది యనఁగా ?

అటనట నిట్టి నెఱసులున్నను మొత్తముపై నీ పొత్తము బాలురకిత్యంతోపకారకము. వెల రు. 0-6-0లు.

(6) లక్ష్మీశృంగారకుసుమమంజరి :—నెల్లూరివాసులు బ్ర॥ శ్రీ॥ దుర్వాసుబ్రహ్మణ్య శర్మగారు సంస్కృతమున శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యనాథునిచే రచింపఁబడిన శతశ్లోకి నాంధ్రీకరించి ప్రకటించినది. మూలసంస్కృత శ్లోకము లొక ప్రక్కను దానికెదురుగ నాంధ్రపద్యములును వేఱువేఱుగ నచ్చువేయంబడినది. ఇందుఁ దొలుత నాంధ్రీకర్తవిజ్ఞాపనము, పిదప 1. విజ్ఞాపనాకుసుమము, 2. ధ్యానకుసుమము, 3. ఆవిర్భావకుసుమము, 4. వర్ణనాకుసుమము, 5. పూజాకుసుమమును బిదప నుపసంహారమును గలవు. సంస్కృతాంధ్రకవితలు రెండు ననర్గళములుగ మధుర మధురఝురులవలెఁ బ్రవహించుచున్నవి. శైలి తెలియుటకై.

శ్లో. ధ్యాయామి కాంచిదపి చిన్మయతత్త్వవల్లీమ్
వైరాగ్యపల్లవరసజ్ఞ సుధిపికాళీమ్
ఆనందపుష్పరసలాలస యోగిభృంగామ్
మోక్షాభిధానఫలనంది తసుజ్ఞకీరామ్.

శా. వైరాగ్యాహ్వయకల్పవైకరసికప్రాక్షోభమై కమ్ము ని
ష్పారానందవినూత్నపుష్పరసచంచద్యోగిభృంగంబునై
యారూఢాన్వితసత్ఫలప్రముదితోద్యద్ధీరకీరాళిలో
నారాజిల్లుచు నిత్యపల్లియొకఁ డీడ్యమ్మయ్యె మాకియ్యెడన్.

శ్లో. హరే ర్లీలాపర్ణం కుమతిజనదుర్దర్శ మనిశమ్
విమర్శస్థైర్దృశ్యం విమలదరహాస్యం కమలగే
నిజభ్రూసంజ్ఞాభి ర్నియమితసమస్తత్రిభువనమ్
శ్రుతీనామాస్థానం తనముఖ మఘం నః క్షపయతు.

చ. హరికివిలాసదర్పణ మనార్యులకుం గనరానిసీమ ధీ
వరులకు దృశ్యమెయ్యెడలఁ బ్రాణుడికోటికి నాటపట్టు వి
స్ఫురితవరస్మితాలయము భ్రూచలనైకకృతత్రిలోకసం
భరణము త్వన్ముఖాంబుజము మాదురితమ్ములడంచుఁ గావుతన్.

ఇట్లే యీచిన్నిపొత్తమెల్లెడల నుల్లసిల్లుచున్నయది. దీనివెల రు. ౦-౪-౦. వలయువారు గ్రంథకర్తగారికి వ్రాసికొనవలయు.

(7) **చాటుపద్యరత్నాకరము:—** దీని పేరివలననే గ్రంథవిషయము సుబోధము. ఇది గుంటూరుజిల్లా, వినుకొండతాలూకా, ఈపూరుపోస్టు, బొమ్మరాజుపల్లె బ్ర. శ్రీ. దీపాల పిచ్చయ్యశాస్త్రిగారిచే సంగ్రంథించి ప్రకటింపఁబడినది. రు. వెల ౧-౦-౦. వలయువారు శ్రీ శాస్త్రిగారికి వ్రాసి తెప్పించుకొనవలయును. ఇంతవఱకుఁ గూర్పఁబడిన చాటుపద్యగ్రంథములలో నిది మిగులఁ బెద్దది. సంపాదకీయవిజ్ఞప్తివలన శాస్త్రిగారు దీనిని సంపాదించుటలో మిగుల శ్రమించినట్లు తెలియును. ఈ గ్రంథమువలన నిదివఱకుఁ దెలియని యెందఱో దాతలు, కవులు, వారివారిచరిత్రములు మొదలగు వాని తోఁ దెలియుచున్నారు. చాటుపద్యసంపాదకులలో బ్ర॥ శ్రీ॥ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు మొదటివారు, నీశాస్త్రిగారు రెండవవారును. చాటుపద్యమణిమంజరిలో లేనిపద్యములు సుమారుగ నాఱువంద లున్నవని శాస్త్రిగారువ్రాసినారు. ఆయాపద్యముల కడ నాయాకవులు మున్నగువారికి సంబంధించిన గాథలను దెలిసినంతవఱకు శాస్త్రిగారు వివరించిరి. ఈ గ్రంథప్రకటమునకు సాయపడిన శ్రీ. మోపూరు, రేబాల కోదండరామరెడ్డిగారికిని, ఇందుపూరు సుబ్బరామిరెడ్డిగారికిని గల యాంధ్రభాషాభిమానము శ్లాఘాపాత్రము

దీని నైదుతరంగములుగ విభజించిరి. మొత్తమున గ్రంథము రెండువందల యిరువదిరెండు పుటలు. శాస్త్రిగారు 'బజారులలో నెల్లెడల దొరకుసమస్యలఁగూడ నిందుఁ జేర్చుట యనవసరము. అందలికొన్నింటిం దొలంగించిన బాగుగానుండును.

శ్రీరస్తు.

# ఆంధ్రసాహిత్యపరిషత్తు.

## (TELUGU ACADEMY.)

## శ్రీకాళయుక్తినామసంవత్సరకార్యనివేదనము.

ఆంధ్రసాహిత్యపరిషత్తునకు శైశవము గడచి నేఁటికిఁ గన్యాత్వము ప్రాపించినది. పరీధావిసంవత్సరమున జనించుటచేఁ గావలయు ననర్థమై యచిరకాలమున నాంధ్రదేశమునందే కాక యన్యదేశములందును నీపరిషన్నామము వ్యాపించినయది. ఈమె జనియించినముహూర్తబల మెట్టిదో కాని తల్లి యగు నాంధ్రభాషామతల్లికిం గల యిక్కట్టు లన్నియు శాంతిఁ బొందినవి. ఆమె వికసితవదన యైనది. దేశస్థుల కెల్లరకు నామెయం దధికానురాగము ప్రబలుచున్నది. ఏడుమూఁడుతరములకు ముం దెప్పుడో తమపూర్వు లాంధ్రదేశనివాసులై యుండి రనుమొదలగుకారణముల నాధారముగాఁ గొని యేహిమవన్నగోపాంతముననో యేసేతుసమీపముననో యున్న మహనీయు లెల్లరు నాంధ్రభాషయే మామాతృభాష యని వార్తలఁ బంపుచున్నారు. మనశ్శాంతి నొంది యెల్లవారిచే నాదరింపఁబడుచున్న యాంధ్రభాషాజనని వాత్సల్యంబునఁ జేయు దోహదవిశేషములచే నాంధ్రసాహిత్యపరిషత్తనేకసోదరీమణు లుదయమందుచుండ వారితో ననఁగి పెనఁగి వినోదించుచున్నది. బాల్యోపద్రవములం గడచి యిప్పటి కొకరూపుఁ దాల్చి చూపఱ కమితానంద మీనోపుచున్నది. ఆంధ్రభాషామతల్లి యీబిడ్డను జంక నిడికొని పలుదేశములందు నివసించుచున్నతన పుత్రులకుం జూప నేఁటేఁట నొక్కసారి వసంతాగమమునఁ బయనము సల్పుచున్నది. ఆప్రయాణము లన్నింటిలో నీయేఁడు వసంతర్తువునందు జరగినమధురాపురీయాత్ర యామెకు మితిమీఱినయానందముఁ గలిగించినది. ఆంధ్రసాహిత్యపరిషత్తచటఁ గాంచినయుపలాలన మింతిం తనఁగాదు. ఎన్నఁడో తన్ను విడచిపోయిన బిడ్డలఁ గాంచి తల్లియుఁ బుట్టినది మొదలు చూడని చెల్లెలిని జూచి యన్నలును బొందినయానంద మమందమయినది.

### →* సభ్యులు. *←

ఆంధ్రసాహిత్యపరిషత్ప్రతిష్ఠాపకు లిరువురు.

ఉద్ధారకు లొక్కరు.

పోషకు లెనమండ్రు.

సాధారణసభ్యులు ప్రాంతవారు 182గురు, క్రొత్తగాఁ జేరినవారు 15గురు, 29గురు తగ్గింపఁబడిరి. కావున సంవత్సరాంతమున నున్నసభ్యులు 168 గురు.

గౌరవసభ్యులు ప్రాంతవారు 38 గురు, వీరిలో ముగ్గురు కాలధర్మము నొందిరి. క్రొత్తగా ముప్వరు చేర్చికొనఁబడిరి. మొత్తము వీరి సంఖ్య 38.

### →* కార్యనిర్వాహక సభ. *←

ఈసభలోని సభ్యులకు మూఁడేసి యేండ్లవఱకు మార్పు లుండవు కావున యథాప్రకారముగానే (50) యున్నారు.

అనేకకారణములచేఁ బరిషత్కార్యనిర్వాహకసభ యీవత్సరమున మధురలో నొకసారియుఁ బరిషత్కార్యాలయమున నొక్కసారియుమాత్రమే జరగెను. కాళయుక్తిసంవత్సరమునకు దివాన్ బహదర్ వి. రామభద్రనాయఁడు గారు పరిషదధ్యక్షులుగా నుండిరి.

కోశాధ్యక్షు లిరువురిలో దివాన్ బహదర్ కంచి కృష్ణస్వామిరావు పంతులు సి. ఐ. ఇ., గారు వార్ధకము కారణముగాఁ దనుకార్యము నంగీకరింప నందున నిపుడు వారిస్థానమున వేఱొకరిని నియమింపవలసియున్నది.

బళ్లారిలోను, మధురలోను జరగిన పరిషద్వార్షికోత్సవ సభలందు సభాపతిగా నుండిన ఆనెగొంది రాజావారగు శ్రీమంతు శ్రీరంగదేవరాయలవారును, విద్వత్ప్రభువులును, పోలవరము జమీందారులు నగు కొచ్చెర్లకోట రామచంద్ర వేంకట కృష్ణారావుగారును విద్యావినోదియుఁ బండితపక్షపాతియుఁ బీఠికాపుర సంస్థానమంత్రియు నగు మొక్కపాటి సుబ్బారాయఁడుగారును గాలధర్మము నొందిరని తెలియఁ జేయవలసివచ్చుట కెంతయుఁ జింతించుచున్నారము.

### →* పత్రికాప్రకటనము. *←

మధురలో జరగినకార్యనిర్వాహకసభలోని తీర్మానము ననుసరించి పత్రిక రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడుచున్నది. ఈసంవత్సరముసంపుటములో శ్రీనాథమహాకవిప్రణీత మగుశివరాత్రిమాహాత్మ్యమును ముద్రించినారము. ప్రత్యంతరము దొరకకపోయినను నసంపూర్ణ మని తోఁచినను దొరకిన యీ నాలుగాశ్వాసము లైనను నతిశిథిలముగ నున్నపుస్తకమునందే యుపేక్షించితిమా ముందిదియు నుండ దనుభయముచే నొకప్రతిని లోకమున విడిచితిమి. వేఱు ప్రతి దొరకినను దొరకకపోయినను సిద్ధార్థిసంవత్సరమున దానిని బాగుగ సంస్కరించి వేఱుగఁ బుస్తకరూపమున ముద్రింపఁ దలఁచుచున్నారము. అచ్చు

పడఁగా మిగిలినదియు నచ్చుపడి ప్రచారములోనున్న యనేకచ్ఛందోవ్యాకరణములకాధారము నగు కావ్యాలంకారచూడామణిలోని యష్టమనవమోల్లాసముల భాగమును బత్రికలోఁ బ్రకటించితిమి. ఇందెనిమిదవయుల్లాసమున ఛందమును దొమ్మిదవయుల్లాసమున వ్యాకరణమును గలవు. దీనికి వేఱుగఁ బ్రతులు కూడఁ దీయించినారము. కొలఁదికాలములో నది పాఠకులకుఁ గరగతము కాఁగలదు. శాలివాహనశకము 12-వ శతాబ్దమునాఁటి సర్వేశ్వరశతకమును గూఁడఁ బ్రకటించితిమి. దీనికిని వేఱు ప్రతులు దీయించినారము. గతసంవత్సరమున మిగిలియున్న ప్రతాపచరిత్రము నీయేఁడు ముగించితిమి. ఈసంవత్సరమునఁ బత్రికలోఁ బ్రకటింపఁబడిన వ్యాసనామములను, తద్రచయితలనామములను, దెలుపు పట్టిక యీనివేదికకొకటవయనుబంధముగాఁ జివరఁ జేర్పఁబడినది.

పత్రికాగ్రాహకులు ప్రాఁతవారు 153 గురు, క్రొత్తగాఁ జేరినవారు 35 గురు, మొత్తము 188 గురు.

ఈ సంవత్సరమునఁ గొందఱు జిల్లా, తాలూకా బోర్డులవారును, మ్యూనిసిపాలిటీలవారును దమతమపోషణమున నున్నపాఠశాలల యుపయోగమునకై పరిషత్పత్రికను గ్రహించుచున్నా రనుమాట యొక ముఖ్యసంతోషవిషయము. పత్రికాగ్రాహకులకు వార్షికమూల్యము రు. 3 లు.

## పుస్తకభాండాగారము.

(1) అచ్చుపుస్తకములు :—

ఈయేఁటఁ గొనినవి 15. వీనివెల రు. 32-12-0 పుస్తకప్రకటనకర్తలు గ్రంథకర్తలు నుచితముగా నొసఁగినవియు నభిప్రాయప్రకటనమునకై పంపినవియును జేరి 130. వీని వెల రు. 97-11-6. సంవత్సరాంతమునఁ బరిషత్కార్యాలయమున నున్నయచ్చుపుస్తకముల మొత్తము లెక్క 871.

(2) వ్రాఁతప్రతులు :—

ఇందుఁ దాళపత్రపుఁ బ్రతులుఁ గాగితపుఁ బ్రతులును జేరియున్నవి. ఈ వత్సరమున గ్రంథసంపాదన మంతగా జరగలేదు. పరిషదుద్దేశము నుపయోగము నెఱిఁగినవారు తమంతఁ దామే యిచ్చిన స్వల్పగ్రంథములు మాత్రమే క్రొత్తగా వచ్చినవి. ఇందు, కురవి రామకవి రచియించిన వాసవదత్తాపరిణయ మొకటి యపూర్వపరిజ్ఞాతము. ఇది తెనుఁగు ప్రబంధము. రెండవది నంజరాజయశోభూషణమను సంస్కృతాలంకారశాస్త్రము. ఇది పేరునందేకాక సర్వవిధములందును, ప్రతాపరుద్రీయము ననుకరించునది. ఇప్పటికి భాండాగారమున నున్నవ్రాఁత పుస్తకములసంఖ్య 4227. వ్రాఁతప్రతుల నిచ్చినవారిపేరులు రెండవయనుబంధముగ నివేదికాంతమునఁ జూపఁబడినవి.

## —✻ నిఘంటు నిర్మాణము. ✻—

శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటునిర్మాణకార్యము పిఠాపురమునకు మార్పఁబడువిషయము పింగళసంవత్సరపరిషత్కార్యనివేదనమునందే యెల్లరకుఁ దెలుపఁబడినది. అక్కడ ఆ 1918 సం॥ మేయి మాసారంభమునుండి పని జరగుచున్నది. తొలుత నియమింపఁబడిన యయిదుగురు పండితులలో నిద్దఱు పనిలోఁ జేరలేదు. పిదప మఱి కొందఱు నియమింపఁబడిరి. ఇప్పుడు తొమ్మండ్రు పండితులు పని సేయుచున్నారు. ఒకరు తత్సమశబ్దాదుల కర్థాదులు వ్రాయుచున్నారు. ఈపని సగమునకుఁ బయిగా నైనది. ఆఱుగురు రాచ్చికపదముల కర్థప్రయోగాదుల వ్రాయుచున్నారు. ఒక్కొకరు పద మొక్కొక్కకాగితపుముక్క (కార్డు) మీఁద వ్రాయుచున్నారు. ఇంతవఱకు ౬౮ వేల కార్డులు వ్రాఁత యైనది. మిగిలిన యిద్దఱు పండితులలో నొకరు తద్భవశబ్దములకుఁ బ్రాకృతరూపములు వ్రాయుచున్నారు. ఇంకొకరు తెనుఁగుపదములకు సజాతీయద్రావిడపదములను వ్రాయుచున్నారు. సజాతీయకర్ణాటకపదముల వ్రాయించుటకుఁ దగినపండితునికై యత్నము జరగుచున్నది. ఇది యంతయు నిఘంటునిర్మాణమునకుఁ బూర్వాంగము. సిద్ధార్థిసంవత్సరాంతమున కీభాగము చాలవఱకుఁ బూర్తి కావచ్చు నను నమ్మకము గలదు. పదముల కర్థాదుల వ్రాయుటలోఁ బండితులు గమనింపవలసిన నియమములు ౩-వ యనుబంధముగ ముద్రింపఁబడినవి.

ఈసంవత్సరాంతమున కీవిషయమై పిఠాపురములో నైనవ్యయము :—

| | | | | |
|---|---|---|---|---|
| పండితుల జీతములు | రు. | 2422 | 14 | 2 |
| పుస్తకములు | ,, | 282 | 11 | 0 |
| కార్డులు | ,, | 443 | 6 | 0 |
| సామానులు మొదలైనవి | ,, | 144 | 0 | 0 |
| ఇంటియద్దె | ,, | 240 | 0 | 0 |
| చిల్లర వ్యయము | ,, | 83 | 13 | 8 |
| మొత్తము రు. ... | | 3616 | 12 | 10 |

## —✻ పరిషత్ప్రకటితగ్రంథములు. ✻—

(1) విప్రనారాయణ చరిత్రము :—

చెదలువాడ మల్లయకవిచే రచింపఁబడినది. ఉత్తమప్రబంధము. ఉచితశృంగారరసోపేతము, వెల ౦-౮-౦.

(2) జైమినిభారతము :—

రెండువందల యేండ్లకుఁ బూర్వము రచింపఁబడిన వచనకావ్యము. ఆ యాస్థలముల నాయారసములు చక్కఁగఁ బోషింపఁబడినవి. దీని కర్త సము

ఖము వేంకటకృష్ణప్పనాయఁకుఁడు. 1917-18 సం॥ములకు ఇంటరుమీడియేటు పరీక్షకుఁ బఠనీయము. వెల ౦-౧-౨-౦.

(3) కవిజనాశ్రయము :—

వేములవాడ భీమకవిచే రచింపఁబడినది. ఆంధ్రచ్ఛందోగ్రంథములలో నెల్లఁ బ్రాచీనము. పురాతనాంధ్రచ్ఛందస్స్వరూపమును దెలిసికొనుట కింత వఱ కిది తక్క వేఱొండు గ్రంథము గానరాదు, వెల రు. ౦-౧౦-౦.

(4) యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము. వెల ౦-౮-౦.

మ-శ్రీ జయంతి రామయ్యపంతులుగారు రచించిన పీఠికావిమర్శనము లతోఁగూడఁ బ్రకటింపఁబడినది. నన్నయభట్టారకునికాలమునకు నూఱేండ్లు ముందు పుట్టినది. కావున నాకాలమందలి యాంధ్రభాషాస్వరూపము నెఱుఁగఁ గోరువారి కిది చాల సహకారి యగును.

(5) చంపూరామాయణము :—

ఇయ్యది కార్వేటినగరసంస్థానాస్థానకవి యగుఋగ్వేదికవి వేంకటాచల పతి కవిచే రచింపఁబడినది. చక్కని పీఠికయుఁ గవితావిమర్శనమును గలవు. మిక్కిలి ప్రౌఢకావ్యము. వెల రు. ౧-౦-౦.

(6) జ్యోతిశ్శాస్త్రసారము :—

ఖగోళవిషయమంతయు నిందుఁ బాగుగఁ జర్చింపఁబడినది. శైలి మిగుల సులభము. వెల ౦-౮-౦.

(7) నీతిసీసపద్యశతకము :—

దీని పేరే విషయము నెఱిఁగించుచున్నది. తాళ్లపాక అన్నమయ్యంగారి కుమారుఁడు చినతిరుమలయ్య రచించినది. వెల ౦-౨-౦.

(8) జ్ఞానప్రసూనాంబికాశతకము :—

శిష్టు సర్వశాస్త్రిగారిచేఁ గూర్పఁబడినది. వెల ౦-౨-౦.

—✻ ఆదాయవ్యయములు ✻—

ఉద్ధారకులు, పోషకులు, యావజ్జీవసభ్యులు నీసంవత్సరమున నేమియు నీయలేదు. సాధారణసభ్యులలో నతిస్వల్పసంఖ్యాకులు మాత్రము రెండేసియేండ్ల కీయవలసినవారొక్కొక్కయేటికే యిచ్చియున్నారు. గతసంవత్సరమునకంటె నీయేఁడు చాలఁదక్కువ సొమ్మువచ్చినది. కాళయుక్తినంవత్సరమున సర్వాదాయము రు. 4072-8-11 సర్వవ్యయము రు. 3982-5-0.

ఆయవ్యయముల వివర మీక్రింది పట్టికలలోఁ గననగును.

## ఆంధ్రసాహిత్యపరిషత్తు—చెన్నపురి. కాళయుక్తినామసంవత్సరపు

### ఆయము.

| | | రు. | అ. | పై | రు. | అ. | పై |
|---|---|---|---|---|---|---|---|
| సంవత్సరాదిని నిలువ | ... | | | | 130 | 0 | 6 |
| బ్యాంకినుండి తెచ్చినవి | ... | | | | 2543 | 3 | 5 |
| బ్యాంకి వడ్డీలు | ... | | | | 475 | 2 | 0 |
| చందాలు :— | | | | | | | |
| సాధారణసభ్యులచందాలు | ... | 350 | 8 | 0 | | | |
| పత్రికచందాలు | ... | 260 | 15 | 0 | | | |
| | | | | | 611 | 7 | 0 |
| విరాళములు | ... | | | | 100 | 0 | 0 |
| చిల్లరబైండింగు | ... | | | | 8 | 12 | 0 |
| విడిసంచికల విక్రయము | ... | | | | 37 | 0 | 0 |
| పుస్తకములవిక్రయము :— | | | | | | | |
| విప్రనారాయణచరిత్రములు | ... | 6 | 12 | 0 | | | |
| జైమినిభారతములు | ... | 69 | 4 | 6 | | | |
| కవిజనాశ్రయములు | ... | 39 | 2 | 6 | | | |
| జ్యోతిశ్శాస్త్రసారములు | ... | 3 | 15 | 0 | | | |
| యుద్ధమల్లుని బెజవాడశిలాశాసనములు | ... | 5 | 14 | 0 | | | |
| నీతిసీసపద్యశతకములు | ... | 1 | 7 | 0 | | | |
| చంపూరామాయణములు | ... | 20 | 0 | 0 | | | |
| జ్ఞానప్రసూనాంబికా శతకములు | ... | 0 | 1 | 6 | | | |
| | | | | | 146 | 8 | 6 |
| వి. పి. పోస్టేజీ | ... | | | | 17 | 7 | 6 |
| | | | | | 4072 | 8 | 11 |

నెం. 5 మాంటురోడ్,
మద్రాసు, 11-4-19.

జి. నరసింహాము,
ఆడిటరు.

(ది 31 మార్చి ఆ 1919 సంవత్సరాంతమునకు) ఆయవ్యయముల లెక్క.

## వ్యయము.

| | | రు. | అ. | పై | రు. | అ. | పై |
|---|---|---|---|---|---|---|---|
| బ్యాంకికిఁ బంపినవి | ... | | | | 1415 | 10 | 0 |
| బ్యాంకి కమిషన్ | ... | | | | 0 | 13 | 0 |
| వి. పి. పోస్టేజి | ... | | | | 22 | 0 | 0 |
| బ్యాంకి చిల్లరవ్యయము | ... | | | | 0 | 1 | 6 |
| ప్రయాణవ్యయములు :— | | | | | | | |
| పండితులకు | ... | 136 | 2 | 0 | | | |
| ఉద్యోగులకు | ... | 12 | 13 | 6 | | | |
| పత్రికావిషయము :— | | | | | 148 | 15 | 6 |
| కాగితములు | ... | 84 | 0 | 0 | | | |
| ముద్రణవ్యయము | ... | 254 | 4 | 0 | | | |
| పోస్టేజీ | ... | 69 | 12 | 0 | | | |
| చిల్లరవ్యయములు | ... | 0 | 12 | 10 | | | |
| | | | | | 408 | 12 | 10 |
| ఇతరముద్రణము-బైండింగు | ... | | | | 65 | 4 | 0 |
| పుస్తకభాండాగారము :— | | | | | | | |
| ముద్రితప్రతులు, కొనినవి | ... | 32 | 2 | 0 | | | |
| ప్రతులువ్రాయించుటకు | ... | 0 | 0 | 0 | | | |
| ఇతరవ్యయములు | ... | 13 | 0 | 0 | | | |
| | | | | | 46 | 6 | 0 |
| పరిషదుద్యోగులజీతములు | ... | | | | 978 | 6 | 2 |
| ఇంటియద్దె | ... | | | | 352 | 8 | 0 |
| చిల్లరపోస్టేజి | ... | | | | 57 | 8 | 3 |
| రిజిష్టరు పోస్టేజీ | ... | | | | 3 | 12 | 0 |
| కార్యస్థానము చిల్లరవ్యయము | ... | | | | 53 | 6 | 3 |
| కలములు కాగితములు మొదలైనవి | ... | | | | 57 | 4 | 0 |
| ఆడిటరుఫీజు | ... | | | | 50 | 0 | 0 |
| వార్తాపత్రికలలోఁ బ్రకటనము | ... | | | | 6 | 2 | 0 |
| పుస్తకప్రకటనము (ముద్రణాదికము) | ... | | | | 120 | 9 | 0 |
| నిఘంటు చిల్లరవ్యయములు | ... | | | | 197 | 5 | 0 |
| కార్యస్థానమున సంవత్సరాంతమున నిలువ | ... | | | | 89 | 13 | 5 |
| | | | | | 4072 | 8 | 11 |

పురాణము నాగభూషణము,<br>
గుమ్మడూరి వేంకట రంగరావు,<br>
ఆచంట లక్ష్మీపతి, } కార్యదర్శులు.

## ఆంధ్రసాహిత్యపరిషత్తు—చెన్నపురి. శ్రీ కాళయుక్తినామసంవత్స

### అప్పు.

| | | రు. | అ | పై | రు. | అ. | పై |
|---|---|---|---|---|---|---|---|
| పరిషత్తుఫండు :— | | | | | | | |
| గతసంవత్సరాంతమున నిలువ | ... | 81,418 | 1 | 5 | | | |
| ఈసంవత్సరమున హెచ్చుకర్చు మినహా | .. | 254 | 15 | 4 | | | |
| | | —— | — | — | 81,163 | 2 | 1 |
| నిఘంటుఫండు :— | | | | | | | |
| గతసంవత్సరాంతమున నిలువ | ... | 15000 | | | | | |
| ఈసంవత్సరమున జమ | ... | —— | — | — | 15,000 | 0 | 0 |
| పత్రిక అమ్మబిల్లులబాకీ | ... | | | | 126 | 12 | 0 |
| మొత్తము | ... | | | | 96,289 | 14 | 1 |

పైని తెలుపబడిన జమాకర్చు నిలువలెక్కను ఆంధ్రసాహిత్యపరిషత్తువారి కాళయుక్తినామ సంవత్సరపు లెక్కలతో తనిఖీచేసి సరియైనట్లు తెల్పుచున్నాను

నెం. 5, మౌంటురోడ్డు, మద్రాసు.
11-4-19.

జి. నరసింహము,
ఆడిటరు.

రాంతము (డి. 31-3-1919)న జమాఖర్చు నిలువ లెక్క.

ఆస్తి.

| | | రు. | అ | పై | రు. | అ. | పై |
|---|---|---|---|---|---|---|---|
| పరిపత్తుఖండము :— | | | | | | | |
| 3½°/₀ గవర్న్మెంటుపత్రము ... | | 1,0000 | 0 | 0 | | | |
| మద్రాసుబ్యాంకిలో ఫిక్సెడ్ డిపాజిట్టు ... | | 3000 | 0 | 0 | | | |
| కరెంటు అక్కవుంటు ... | | 109 | 12 | 9 | | | |
| మేనేజరువశమున నిలువ ... | | 89 | 13 | 5 | | | |
| | | | | | 13,199 | 10 | 2 |
| వసూలుకావలసిన చందాలు ... | | | | | 12,917 | 9 | 0 |
| కుర్చీలు మొదలగు సామానులు (అసలు) ... | | 525 | 8 | 0 | | | |
| గతసంవత్సరము మినహా | 145-8-0 | | | | | | |
| ఈసంవత్సరము మినహా | 12-2-0 | 157 | 10 | 0 | | | |
| | | | | | 367 | 14 | 0 |
| ప్రచురింపబడిన పుస్తకములనిలువ ... | | 1608 | 2 | 0 | | | |
| ,, పత్రికల నిలువ ... | | 1031 | 8 | 0 | | | |
| కాగితముల నిలువ ... | | 147 | 9 | 0 | | | |
| | | | | | 2,787 | 3 | 0 |
| పుస్తకభాండాగారము. ముద్రితప్రతులు :— | | | | | | | |
| గతసంవత్సరాంతమున నిలువ ... | | 1250 | 15 | 0 | | | |
| ఈసంవత్సరమున నుచితముగ వచ్చినవి ... | | 97 | 11 | 6 | | | |
| ,, కొనినవి ... | | 32 | 12 | 0 | | | |
| ,, వ్రాయించినవి ... | | 0 | 10 | 0 | | | |
| | | 1382 | 0 | 6 | | | |
| గత సం॥రాంతమున మినహా | 400-15-0 | | | | | | |
| ఈసంవత్సరమున మినహా | 50-1-0 | 451 | 0 | 0 | | | |
| | | | | | 931 | 0 | 6 |
| పుస్తకభాండాగారము వ్రాతప్రతులు ... | | 51145 | 14 | 6 | | | |
| భారతోద్యోగపర్వము సంప్రతించుటకు ... | | 148 | 2 | 0 | | | |
| | | | | | 51,294 | 0 | 6 |
| నిఘంటువ్యయము :— | | | | | | | |
| గతసంవత్సరాంతమునకు ... | | 14595 | 3 | 11 | | | |
| ఈసంవత్సరమున వ్యయము ... | | 197 | 5 | 0 | | | |
| | | | | | 14,792 | 8 | 11 |
| మొత్తము ... | | | | | 96,289 | 14 | 1 |

పురాణము నాగభూషణము.
గుమ్ముడూరి వేంకటరంగరావు. } కార్యదర్శులు.
ఆచంట లక్ష్మీపతి.

## వ్యయము.

| | రు. | అ. | పై. | రు. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|
| జీతములు ... | 976 | 6 | 2 | | | |
| ప్రయాణవ్యయములు ... | 148 | 15 | 6 | | | |
| ఆడిటరుఫీజు ... | 50 | 0 | 0 | | | |
| కార్యస్థానము అద్దె ... | 352 | 8 | 0 | | | |
| కాగితములు మొదలగునవి ... | 57 | 4 | 0 | | | |
| చిల్లరపోస్టేజి ... | 57 | 8 | 3 | | | |
| రిజిష్టరుపోస్టేజి ... | 3 | 12 | 0 | | | |
| చిల్లరవ్యయములు ... | 53 | 6 | 3 | | | |
| వార్తాపత్రికలలో ప్రకటనము ... | 6 | 2 | 0 | | | |
| బ్యాంకి కమీషన్ ... | 0 | 13 | 0 | | | |
| వి. పి. పోస్టేజి ... | 22 | 0 | 0 | | | |
| బ్యాంకి చిల్లరవ్యయము ... | 0 | 1 | 6 | | | |
| బైండింగు ... | 65 | 4 | 0 | | | |
| పుస్తకభాండాగారమునకు చిల్లరవ్యయము ... | 13 | 0 | 0 | | | |
| | | | | 1807 | 0 | 8 |
| పుస్తకప్రకటనము :—ముద్రణాదికము ... | | | | 120 | 9 | 0 |
| పత్రికావిషయము :— | | | | | | |
| గతసంవత్సరము పత్రికలు ... | 909 | 9 | 0 | | | |
| కాగితములు ముద్రణము మొదలగునవి ... | 408 | 12 | 10 | | | |
| గతసంవత్సరము నిలువ కాగితములవ్యయము ... | 170 | 10 | 4 | | | |
| అచ్చుకర్చు బాకీ ... | 126 | 12 | 0 | | | |
| | | | | 1615 | 12 | 2 |
| మినహాయింపులు :— | | | | | | |
| కుర్చీలు సామానులు ... | 12 | 2 | 0 | | | |
| పుస్తకభాండాగారము ... | 50 | 1 | 0 | | | |
| గతసంవత్సరము పుస్తకముల నిలువ ... | 1262 | 2 | 0 | | | |
| సాధారణసభ్యులచందాలు ... | 192 | 0 | 0 | | | |
| | | | | 1516 | 5 | 0 |
| మొత్తము ... | | | | 5059 | 10 | 10 |

జి. నరసింహము, ఆడిటరు.

నెం. 5, హంటు రోడ్డు, చెన్నపురి, 11-4-19.

## సంవత్సరాయవ్యయముల లెక్క.

### ఆయము.

| | | రు. | అ. | పై. | రు. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|---|
| ఉద్ధారకుల చందాలు | ... | 0 | 0 | 0 | | | |
| పోషకుల చందాలు | ... | 0 | 0 | 0 | | | |
| సాధారణసభ్యులచందాలు | ... | 843 | 0 | 0 | | | |
| పత్రికచందాలు | ... | 436 | 8 | 0 | | | |
| | | | | | 1279 | 8 | 0 |
| విడిసంచికల విక్రయము | ... | 37 | 0 | 0 | | | |
| పుస్తకముల విక్రయము | ... | 146 | 8 | 6 | | | |
| పత్రికల నిలువ | ... | 1031 | 8 | 0 | | | |
| | | | | | 1215 | 0 | 6 |
| పుస్తకముల నిలువ:—స్టాకు బుక్కుదాఖలా. | | | | | | | |
| బైండువి | ... | 687 | 2 | 0 | | | |
| బైండు కానివి | ... | 921 | 0 | 0 | | | |
| | | | | | 1608 | 2 | 0 |
| బ్యాంకివడ్డీ | ... | 478 | 2 | 0 | | | |
| విరాళములు | ... | 100 | 0 | 0 | | | |
| చిల్లరబైండింగు | ... | 8 | 12 | 0 | | | |
| వి. పి పోస్టేజి | ... | 17 | 7 | 6 | | | |
| ఉచితముగావచ్చిన పుస్తకములు | ... | 97 | 11 | 6 | | | |
| | | | | | 702 | 1 | 0 |
| ఈసాలుకు ఆయముకంటెవ్యయము హెచ్చు | ... | | | | 254 | 15 | 4 |
| మొత్తము | ... | | | | 5059 | 10 | 10 |

పురాణము నాగభూషణము.
గుమ్ముడూరి వేంకటరంగరావు.
ఆచంట లక్ష్మీపతి.
} కార్యదర్శులు.

## ఉపసంహారము.

ఇపు డాంధ్రదేశమందు భాషాభిమానము మెండైనట్లు సూచనము లనేకములు గలవు. సభలు పెక్కులుగా నున్నవి. భాండాగారములు తఱచుగాఁ గలవు. నూతనగ్రంథరచనముఁ బ్రకటనముఁగూడ నంతకంత కభివృద్ధి నొందుచున్నవి. కాని మన ప్రాచీనగ్రంథములను దగినంతశ్రద్ధతో మనయువకులు చదువుచున్నారా యని సంశయము కలుగుచున్నది. ఇక్కాలమునుబట్టి నూతనవిషయములను బోధించునట్టి శాస్త్రగ్రంథములును. పాశ్చాత్యరీతిని మిగుల రమణీయము సుగ్రాహ్యము నగుశైలిని జరిత్రములు నవలలు నాటకములు మొదలగుగ్రంథములు రచింపఁబడుట యవసరమయి యున్నది. కాని గ్రంథకర్తలే యాశైలిని వారివారికిఁ దోఁచినట్లు నిర్ణయించికొనుట శ్లాఘ్యముగా నగపడదు. ఇట్టి గ్రంథములు రచించునపుడు సర్వోత్కృష్ట మయినమన ప్రాచీనగ్రంథశైలినే యుపయోగించుట సమంజసముగాఁ దోఁచెడిని. ఆంధ్రభాషాభిమానులును దానియందుఁ బాండిత్యము సంపాదింపఁగోరువారును మనపూర్వగ్రంథముల బాగుగాఁ జదువుట యావశ్యక మని గ్రహింతురుగాక. రచనాభిలాషకుఁ దగిన భాషాజ్ఞానము సంపాదింపఁ గోరువారికిఁ బురాతనగ్రంథపఠన మత్యవసరము.

కొందఱు విషయప్రధానము లగుగ్రంథములలో భాషానియమములఁ బాటింప వలనుపడదు; అట్లు పాటింప నక్కఱలే దని చెప్పుచున్నారు. వీరివాద మసార మగునది యని చెప్పుట సాహసముకాదు. ఆలోచింపుఁడు. ప్రబోధచంద్రోదయము, రాజయోగసారము (వేదాంతము). శరభరాజీయము, రసప్రదీపిక, (వైద్యము). జ్యోతిషరత్నాకరము, రెట్టమతము (జ్యోతిషము). పావులూరిగణితము, (గణితశాస్త్రము). కృష్ణరాయవిజయము, రామరాజీయము, సోమదేవరాజీయము, సిద్ధేశ్వరచరిత్ర, రంగరాయవిజయము, (చరిత్రములు) మొదలగు విషయప్రధానగ్రంథము లిదివఱకే పూర్వులు రచించినవి కలవని కొంచెము తెలుపుదు. ఇకను ఛందోవ్యాకరణాలంకారాదిశాస్త్రము లెల్ల సలక్షణపద్యప్రబంధములుగానే రచింపఁబడినవి. వీని యన్నిటియందును భాషాసౌష్ఠవ మెంతవఱకుఁ గలదో యందఱకును విదితమే. ఇంతియకాక యిప్పటికి నచ్చుపుస్తకము లన నెట్టివో యెఱుఁగని పల్లెటూళ్లను, వానియం దఖండజ్ఞానసంపన్నులగుపండితులు నుండుట నిస్సంశయము. వారి కట్టిపాండిత్య మెట్లు కలిగినదో విమర్శింపుఁడు. నిర్బంధమున భాషామర్యాద లన్నియుఁ దెలియఁదగిన గ్రంథములఁ జదివింపకున్న మనయువల కేమాత్రమైన లాభము గలుగదు. ఇది విద్యాశాఖాధికారులు, కళాశాలానిర్వాహకులు, పండితులు, గ్రంథకర్తలుగూడ ముఖ్యముగా గమనింపవలసిన విషయము.

# అనుబంధము.

## I.

### కాళయుక్తిసంవత్సరమున, ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికలోఁ బ్రకటింపఁబడిన వ్యాసములయుఁ దత్కర్తలయు నామములు.

1. భారతకవులు నన్నెచోడఁడు, త. తేవప్పెరుమాళ్లయ్యగారు.
2. శివరాత్రిమాహాత్మ్యము—శ్రీనాథమహాకవి.
3. ఆంధ్రసాహిత్యపరిషత్తు—మధురసభ.
4. ఆంధ్రసరస్వతీప్రేమము—నన్నయభట్టారకవిలాససభ్యులు.
5. విజ్ఞాపనము.
6. పింగళనామసంవత్సర కార్యనివేదనము.
7. ఆంధ్రపంచకావ్యములు—కొత్తపల్లి సూర్యరావుగారు.
8. చోళపాండ్యదేశాంధ్రప్రాబల్యము—హరి సేతురామయ్యగారు.
9. ద్రావిడాంధ్రభాషలయన్యోన్య సంబంధము, టి. యస్. మురుగేశపిళ్లెగారు.
10. ప్రతాపచరిత్రము—ఏకామ్రనాథుఁడు.
11. చంపూరామాయణ పీఠిక.
12. ఒంటిమిట్ట—పోతనామాత్యుఁడు, వావిలికొలను సుబ్బరావుగారు.
13. బమ్మెరపోతరాజు నివాసస్థానము—జయంతి రామయ్యపంతులుగారు, బి.ఏ., బి.ఎల్.
14. విజయనగరసామ్రాజ్యాంధ్రవాఙ్మయచరిత్రము—చేకుమళ్ల అచ్యుతరావుగారు, బి.ఏ.,ఎల్.టి.
15. ఇంద్రకీలపర్వతముమీఁదిరెండు చాలుక్యశాసనములు,జయంతిరామయ్యపంతులుగారు,బి.ఏ.బి.ఎల్.
16. అమృతకలశ—జనమంచి వేంకటరామయ్యగారు.
17. వర్ణోత్పత్తి—మహామహోపాధ్యాయ తాతాసుబ్బరాయశాస్త్రిగారు.
18. పాండవాజ్ఞాతవాసవత్సర వ్యాప్తినిర్ణయము—విస్సా అప్పారావుగారు, ఎమ్., ఏ.
19. కృష్ణరాయల కొన్ని దిగ్విజయయాత్రలు—కొ. వెం. లక్ష్మణరావుగారు, ఎమ్., ఏ.
20. బాలవ్యాకరణగుప్తార్థప్రకాశికా విమర్శనము, వఝులచిన సీతారామస్వామి శాస్త్రిగారు.
21. తోడరుమల్లు—ఆ. రంగస్వామి సరస్వతిగారు, బి.ఏ.
22. గ్రంథస్వీకారము.
23. ఉత్తరరామచరిత్ర(విమర్శనము).
24. కావ్యాలంకారచూడామణి—విన్నకోట పెద్దయకవి.
25. సర్వేశ్వరశతకము—యథావాక్కుల అన్నమయ్యగారు.
26. కృష్ణరాయల నిర్యాణకాలము—కొ. వెం. లక్ష్మణరావుగారు, ఎం. ఏ.
27. విక్రమార్కచరిత్ర విషయానుక్రమణిక—సి. ఆర్. కృష్ణమాచారిగారు.

## II.

## పరిషత్పుస్తకభాండాగారమునకు వ్రాఁతప్రతులనిచ్చినవారి నామధేయములు.

1. తంజనగరము తేవప్పెరుమాళ్లయ్యగారు, చెన్నపురి.
2. వావిలికొలను సుబ్బరావుపంతులుగారు, చెన్నపురి.
3. మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు, అనంతపురము.
4. నాగపూఁడి కుప్పుస్వామయ్యగారు, బి.ఏ., తిరుపతి.

## III.

## శ్రీసూర్యరాయాంధ్రనిఘంటునిమిత్తము శబ్దార్థములు వ్రాయుపండితులు గమనింపవలసిన విషయములు.

### తత్సమశబ్దములవిషయము.

౧. శబ్దములకు నర్థములు వ్రాయునపుడు, సుప్రసిద్ధములగునర్థములు మొదట వ్రాసి యప్రసిద్ధములగువానిని వెనుకఁ జూపవలయును.

౨. కేవల వైదికశబ్దములను వైదికార్థములను విడిచిపెట్టవలయును.

౩. ఆంధ్రమునందు స్వతంత్రముగాఁ బ్రయోగములేని లసత్, గీర్, భవత్ మొదలగు సంస్కృతశబ్దములకుఁ జెందుగున స్వతంత్రప్రయోగము లేదని సూచించు నొకగుర్తును బెట్టవలయును.

౪. తెనుఁగు గ్రంథములయందు వాడఁబడిన తత్సమక్రియలు ప్రత్యేకముగ నొకపండితుఁడు వ్రాయవలయును. వానికిఁ గల విశేషరూపములకును, నర్థములకును మాత్రము ప్రయోగము లీయవలయును. ఉ. శయించు, శీలించు (పరిశీలించు). తక్కినవాని కర్థములు వ్రాసినఁ జాలును. ఉపసర్గాదులతోఁ గూడిన ధాతువిశేషములను వ్రాయవలయును. శయనించు మొదలగు నామధాతువులు కూడ వ్రాయవలయును.

### ఆచ్ఛికశబ్దములవిషయము.

౧. ఒక్కొక్కపద్యమే చదివి యందున్న తత్సమేతరశబ్దము లొక్కొక్కటి యొక్కొక్క కాగితపుముక్క (కార్డు) మీఁద వ్రాసి దాని కాసందర్భమునఁ గలయర్థమును దానికిఁ బ్రమాణముగ నాపద్యములలో వలసినంతభాగమును వ్రాయవలయును.

౨. అనుమానము, ధారుణి, మొదలగు శబ్దములకువలె సంస్కృతశబ్దములకు నర్థభేదము గాని రూపభేదము గాని యున్నట్టిశబ్దములకుఁ గూడ దేశ్యపదములకువలెనె యర్థాదులు వ్రాయవలెను.

౩. ప్రయోగదర్శనమునకై పద్యములో నెంతభాగము వ్రాసినఁ జాలునో యంతయే వ్రాయునది. సాధారణముగ నొకపాదము చాలి యుండవచ్చును. చాలనిచో నధికము వ్రాయవలయును. పుస్తకాపేక్ష లేకుండ శబ్దముయొక్క స్వరూపమును నర్థమును విశదముగఁ దెలుపుట కెంత కావలయునో యంత వ్రాయవలెను.

౪. ఒక్కొక్కశబ్దమున కనేకార్థము లుండును. ఒక యర్థమునకును మఱియొక యర్థమునకును భేద మొకప్పుడు లేశమాత్రమే యుండును. అయిన నర్థము లన్నియు వేఱువేఱుగఁ జూపవలసినదే

౫. అర్థము వాక్యరూపముగ వ్రాయునప్పు డావాక్యము సంగ్రహముగను, స్పష్టముగను, నవ్యాప్త్యతివ్యాప్తిదోషములు లేకుండను రచియించునది.

౬. అగు, చేయు, కను, మొదలగుసామాన్య శబ్దములకు సందర్భానుసారముగ ననేకార్థము లుండును. అవి స్థూలదృష్టికి గోచరములు కావు. చక్కఁగఁ బరికించి యట్టిశబ్దముల కాయాస్థలములందుఁ గనఁబడునర్థభేదములు విశదముగ వ్రాయవలయును.

౭. ఒక కార్డుమీఁద నొకటికంటె నెక్కుడుశబ్దములు వ్రాయఁగూడదు. ఒకమాట కనేకార్థము లున్నప్పుడు వేఱువేఱు కార్డులమీఁద వ్రాయనగును.

౮. తలలు, కాలు, చేయి మొదలగు సామాన్యశబ్దములును వానిసామాన్యార్థములును వ్రాయనక్కఱలేదు. కాని, యట్టిశబ్దములకుఁగల విశేషార్థములును, వానిని దెలుపుపద్యములును లోకోక్తులును వ్రాయవలయును. లోకోక్తుల కుదాహరణములు :—తల :—తలపాలకు. అనితల (యుద్ధముఖము) నే నేమి, నాతల యేమి, ఆపనిచేయుట యేమి ?

౯. సాధారణముగా శబ్దము మార్చినచో ఛందోభంగము గాని ప్రక్రమభంగము గాని గలుగునన్నస్థలములయందలి ప్రయోగములే చూపవలయును. అపూర్వశబ్దములు గాని, యపూర్వరూపములు గాని, యపూర్వార్థములు గాని వచ్చినప్పు డీనియమము లేక, యేప్రయోగములయినఁ జూపవచ్చును.

౧౦. ప్రయోగవాక్యములు వ్రాసి వానియడుగున గ్రంథములపేళ్లు దెలుపు పొడియక్షరములును నాశ్వాసముయొక్కయుఁ బద్యముయొక్కయు సంఖ్యలను దెలుపునంకెలును వేయవలయును.

౧౧. శబ్దరత్నాకరములో నుపయోగింపఁబడిన సంకేతము లిందు వాడవలెను.

౧౨. ఏశబ్దమునకయిన వ్యుత్పత్తి స్ఫురించిన యెడల నది శబ్దముతరువాత వ్రాసి దాని నీవిధముగ (          ) గుర్తించునది. ఉ. చేఁద. వి. చేక (చేఁదునది = తోడునది.)

౧౩. ప్రయోగవైచిత్ర్యములును, శబ్దలక్షణవిశేషములు నున్నయెడల వానిని కార్డులమీఁద సూచింపవలయును.

౧౪. ఆదేశబ్దమున కదేయర్థమునందు సాధారణముగ రెండేసిప్రయోగములకంటె నధికముగ వ్రాయనక్కఱలేదు. కాని యుచితతరమగు ప్రయోగము దొరకినచో నది తప్పక వ్రాయవలెను.

౧౫. పదప్రయోగవిషయములఁ జక్కఁగాఁ దెలుపుభాషీయములు (నానుడులు phrases) స్ఫురించినయెడల నవి యాయాకార్డులమీఁద వ్రాయవలయును. ఉ. ముద్దు వి. చుంబనము ముద్దుసేయు, ముద్దులుమూటఁగట్టు.

౧౬. అర్థములు, సులభము లగుతత్సమపదములతోఁ గాని తెలుఁగుపదములతోఁ గాని వ్రాయవలయును. మాఱుమూలపదములు మానవలయును.

౧౭. అర్థము విస్పష్టమగుటకై రెండుమూఁడుపర్యాయపదములు వ్రాయవలెను. ఉ. ఒదవు అ. క్రి. పుట్టు, కలుగు. "పుట్టు" అని మాత్రము వ్రాసినచో జన్మించు ననునర్థమే తోఁపవచ్చును

౧౮. ప్రతిపదమునకు మొదట భాషాభాగము వ్రాసి తరువాత నర్థము వ్రాయవలెను. షో ప విభక్తిక మగునో షో ప. అని వ్రాయవలెను. బహువచనాదిరూపములలో విశేషము లున్నప్పుడు వానిని జూపవలయును. ఉ. కోలను. వి. షో ప. బ. వ. కోలఁకులు—

౧౯. నెచ్చెలి, తలఁబ్రాలు మొదలగుసమాసము లేక పదముగానే చూపి, మాటలు వేఱు పఱిచి వానిని గుండలీకరించునది. ఉ. నెచ్చెలి. వి. (నెఱ + చెలి) మిత్రుఁడు.

౨౦. వికృతిపదములకు శక్యమగునంతమట్టునకుఁ బ్రకృతులు చూపి వానిని గుండలీకరించునది. ఉ. అగ్గి. వి. (స. అగ్నిః).

౨౧. ప్రేరణార్థకధాతువులకుఁ దొలిరూపములఁ జూపవలయు. ఉ. పుచ్చు. స.క్రి. పోవుప్రే.

౨౨. కృదంతములకుఁ గ్రియలను వ్రాయునది. ఉ. కినుక. వి. కినియుధా-కృ.

౨౩. నిత్యబహువచనరూపములు నిరూపించునది. ఉ. ఇరులు. వి. చీఁకటి. ని. బ.

౨౪. ప్రచ్ఛన్నపదములకు నిజరూపముల నీయవలెను. ఉ. నావుడు. ప్ర. అను ధా. యొక్క యానంతర్యార్థకము, నాక. అనుధా. వ్యతి. క్త్వా. ఇట్టిచోటులం దక్కఁ గ్రియలకు ధాతురూపములుమాత్రమే వ్రాయునది. కాలపురుషాది భేదములచేఁ గలుగురూపములు వ్రాయనక్కఱలేదు.

౨౫. ఒక పదమునకు నర్థము వ్రాయుచున్నప్పుడు గ్రంథమున వచ్చినయర్థము గాక మఱియొక విశేషార్థము స్ఫురించినయెడల దానినిగూడఁ గ్రింద వ్రాయవలయును. ఉ. అనుధాతువున కర్థము వ్రాయుచున్నప్పుడు "దూషించు" అనునర్థము తోఁపఁగా నదియును "పలుకు" అను నర్థము క్రింద వ్రాయునది. ఉ. అను. స. క్రి. 1 పలుకు, 2 దూషించు, ఉ. "అని యనిపించుకొనుట నీసైజమా"

౨౬. అప్రసిద్ధార్థములు గలపదములు వ్రాయునప్పుడు వ్రాయుచున్న గ్రంథములనుండియే కాక గ్రంథాంతరములనుండి ప్రయోగములు స్ఫురించినయెడల నవియును వ్రాయవలయును.

౨౭. తద్ధితపదములకుఁ బ్రకృతిప్రత్యయములు విభజించి వానిని గుండలీకృతములు గావించునది. చిచ్చఱ. విశే. (చిచ్చు + అఱ) అగ్నిమయము.

౨౮. ఘల్లు, భోరు, ధగధగ మొదలగు ననుకరణశబ్దములయం దొత్తక్షరమున్నప్పుడు లోకమునం దట్టియుచ్చారణ మున్నయెడల నారూపములుగూడ వ్రాయవలయును.

౨౯. ఎసఁగు ఎసంగు మొదలగుశబ్దములకు రెండురూపములను గనఁబఱుచు ప్రయోగములు విడివిడిగా వ్రాయవలయును.

౩౦. ఒకానొకప్పుడు శబ్దమున కర్థనిర్ణయము సేయుట కష్టసాధ్యమని తోఁచినయెడల నర్థనిర్ణయమునకై కాలహరణము సేయక శబ్దమును బ్రయోగమును మాత్రమే వ్రాయవలయును.

సంపుటము ౬. | సిద్ధార్థిసంవత్సరము. ఆశ్వీయుజ, కార్తికములు. | సంచిక ౪.

# నారాయణశతకము.

నెల్లూరుపరిషత్సభలో శ్రీజనమంచి వేంకటసుబ్రహ్మణ్యశర్మగారు చదివినట్లు ప్రకటింపఁబడిన "బమ్మెరపోతరాజు—నారాయణశతకము" అనువ్యాసమును జదివితిని. మన మెంతదుస్థితిలో నున్నారమనిదుఃఖము వచ్చినది. అభిమానము దురభిమానముగ మాఱినప్పు డది యెంతటిపండితుల కైన నెంతయో యపకారము చేసి, వారిని సత్యము గ్రహింపకుండఁ జేసి, న్యాయమైనపనికూడ వారి కన్యాయకార్యమువలెఁ దోఁపింపఁజేసి, వారిని బాధ చేయునుగదా యని జాలి కలిగినది.

నారాయణశతకపీఠికయందును, నాంధ్రపత్రికలలో రెండుమాఱులును, హితకారిణిలో నొకమాఱును, సంవత్సరాది సంచికయందును, నే నాశతకము ప్రకటించినయభిప్రాయముల వ్రాసితిని. నాయభిప్రాయముల సంపూర్ణముగ విప్పి చెప్పితిని. పాఠకులసౌకర్యార్థము తిరిగి యిఁక ముందైన భిన్నాభిప్రాయము లుండకుండ సంగ్రహముగ విశేషముల వివరించెదను.

" నేను 1914 సం॥లో రాజమహేంద్రవరము వచ్చి వీరేశలింగపుస్తకాలయమును (ఇప్పుడు సర్వజనపుస్తకాలయ మని పేరు మార్చిరి) దర్శించితిని. అప్పుడందున్నలిఖితగ్రంథములఁ గొన్నిటిఁ బరీక్షించితిని. వివరములు కొన్ని వ్రాసి కొంటిని. కాని గ్రంథము లన్నియుఁ జూడలేదు. శతకములఁ జూడలేదు. మఱికొన్ని దినములకు మానవసేవలోఁ బ్రకటించుటకు గ్రంథములు ప్రాచీనములు చిన్నవేవైనఁ గావలయునని తత్పత్రికాధిపతులు చెప్పినప్పుడు నేను వారికిఁ జెన్నపురినుండి వ్రాసితెచ్చిన యైరావతచరిత్రము ప్రతి నొకమిత్రునివలనఁ బంపితిని. తరువాతఁ బుస్తకములపట్టిక చూచి వారిలిఖితగ్రంథములలోఁ బోతన్నదని యున్ననారాయణశతకమును ముద్రింపరాదా ? యని యడిగితిని. ఆగ్రంథములు వరుస సంఖ్య లేక కట్టముమీఁదఁగాని చూచుటకు వీలులేకయుండెను. అచ్చుగ్రంథములవలె లిఖితగ్రంథములు పెక్కుమాఱు చూచివేయుటకుఁ వీలుండునా ? పైఁగా నేను రాజమహేంద్రవరమున నున్నకొన్ని గంటలలో నాపని పూర్తి కాదు. అప్పుడప్పుడు వచ్చి యొకొక్కదిన ముండిపోవుచుండువాఁడను. గ్రం

థాలయము మధ్యాహ్నము 3 గంటలకుఁ దెఱచెదరు. కావున నాకొఱ (నా యొకరిని కొఱ) కుదయమున సేవకుని బంపినఁగాని లిఖితగ్రంథములు చూడ వీలులేదు. గ్రంథాలయము తెఱచియున్నప్పుడు లిఖితగ్రంథములఁ జూచుటకు వీలేర్పఱచి యుండలేదు. అందువలన నేను బోతన్నశతకమును బ్రకటింపరాదా యనియడిగిన ప్రశ్నమునకు మానవసేవపత్రికాధిపతులు “దది తప్పులకుప్పగా నున్నది. పోతన్నది కాదని సందేహము.” అని చెప్పిన ప్రత్యుత్తరముతో సంతృప్తిపడి యూరకుంటిని. ఇటీవల నొకసంవత్సరమునకుఁ బూర్వము శతక కవులచరిత్రము” నేను వ్రాయఁబూనుకొంటిని. అప్పుడు తెలుఁగులో నున్న “శతకములపేళ్ళన్నియు సేకరించుచుంటిని. ఇప్పటి కొకటి రెండుసంవత్సరములకుఁ బూర్వము ప్రకటింపఁబడిన సర్వజనపుస్తకాలయమువారిపుస్తకములపట్టికయందుఁ గూడ శతకములపేరులకై చూచితిని. అందు లిఖితగ్రంథములపట్టికలో నారాయణశతకము రెండుప్రతులు పోతన్నవిరచితము లని యున్నట్లు కనఁబడెను. 4,5 ఏండ్లక్రింద విన్నపోతన్నశతక మెట్టిదో చూడనైతినే యని యెంచితిని. ఈ నడుమ ననేక పర్యాయములు సర్వజన పుస్తకాలయమునందలి లిఖితగ్రంథములఁ బరీక్షింపఁ గోరియు నట్లు చేయలేకపోయితిని.

ఓరుఁగల్లువాదము విజృంభించినది. ఆంధ్రవాల్మీకుల వ్యాసములు వచ్చినవి. నాకుఁగూడఁ బోతనామాత్యచర్చలోఁ బ్రవేశింపక తప్పకవచ్చినది. మఱియొక పనిమీఁద రాజమహేంద్రవరము వెళ్లినప్పుడు పుస్తకములఁ బరిశీలించితిని. తాటియాకుల పుస్తకములు సరిగ లేనందునఁ దాళపత్రగ్రంథలిఖిత మగు నారాయణశతకము నేను నద్దంకిసత్యనారాయణశర్మగారును గలిసి రెండుసారులు వెదకినను గనఁబడలేదు. కాగితపుఁబ్రతి కనఁబడినది. దానిపై నొకయచ్చుచీటి కలదు. అది పెద్దాపురముగ్రంథాలయమునుండి వచ్చినట్లు వ్రాయఁబడియున్నది. కార్యదర్శి యనుగ్రహమునను, శ్రీఅద్దంకి సత్యనారాయణశర్మగారిసహాయమునను, కాగితపుఁబ్రతి నాతో నింటికిఁ దీసికొనివచ్చితిని. చదివితిని. తప్పులుకుప్పలు కవివి కొన్ని! లేఖకునివి మఱికొన్ని! కాని నా కందలిపద్యములు కొన్ని పోతన్నశైలిలో నున్నట్లు తోఁచినది. ఒకవేళ నవి పోతన్నవి కాకపోవచ్చును. నాకుఁ దోఁచినంతమాత్రమున నెల్ల రంగీకరింపవలసినబాధ్యత లేదే! నేను శతకము చదువుచుండఁగనే శ్రీ వడ్డాది సుబ్బరాయఁడుగారుకూడ వినుచుండిరి. “ఇది తప్పక పోతన్నది కావచ్చునండీ! పరిషత్తున కొకప్రతి యిచ్చితినని కీ॥ శే॥ దేవగుప్తాపు

భరద్వాజముగారుకూడఁ జెప్పినారు. పోతన్నదనియే వారును జెప్పినారు." అని సంతోషముతో వారు పల్కిరి. అంతటఁజర్చించితిమి. మాకిరువురకు నాశతకము పోతన్నదని తోఁచినది. "కానిండు! కాక పోనిండు! పోతన్నగద్యతో నిది యున్నది. శతకకవులచరిత్రములో వ్రాసెదను. ఉన్నది యున్నట్లు వ్రాసెదను. ప్రస్తుతచర్చకుఁ గూడ ననుకూలపడిన మఱియు సంతోషము." అని చెప్పితిని. ఓరంగల్లునకుఁగాని యొంటిమెట్టకుఁగాని సంబంధించినవాక్యము లుండునని కడవఱకుఁ బరిశీలించితిమి. ఈ సందేహము తీరి లోకము తృప్తిపడునని తలంచితిమి. కాని మాకు నదులపద్యము ధర్మపురియనుపేరున్నపద్యము తక్క జన్మస్థానచర్చ కనుకూల మగుపదములు కనఁబడలేదు. చదువుచుండఁగా "ధర్మపురిలక్ష్మీనాథ" యనువాక్యము చూచి శ్రీవడ్డాదిసుబ్బారాయఁడుగారు సంతోషముతో "ఈ ధర్మపురి యెక్కడిదో తెలిసికొనుఁడు. ఇది దేనికిఁ జేరువయో యచ్చటివాఁడు పోతన్న యనవచ్చునండి" యని పల్కిరి. నేనును సంతోషమును వెలిబుచ్చితిని.

పిమ్మట నిది పోతన్న దనుకొనుటకు మాకుఁ గారణము లైనపద్యముల నుదాహరించి పత్రిక కొకవ్యాసము వ్రాయవలయునని తలంచితిని. వ్యాసము పెద్దదగును. పైఁగా జనులు శతక మెట్లున్నదో యట్లే యథామూలముగఁ జూచిన మనకంటె బుద్ధిమంతు లుండి మఱికొన్నివిషయముల గ్రహింపవచ్చును. ఎల్లరును రాజమహేంద్రవరము వచ్చి మాతృక చూచుట కష్టము. నాకుఁ దోఁచిన యభిప్రాయములను మాత్రమే ప్రకటించి యాంధ్రప్రపంచమును సందిగ్ధావస్థయం దుంపనేల? శతకమే ముద్రించుట యుత్తమపక్ష మని శ్రీవడ్డాదిసుబ్బరాయఁడుగారితో నంటిని. వారు నంగీకరించిరి. వెంటనే యాకాగితపుఁబ్రతి కుట్టువిప్పి శ్రీసుబ్బారాయఁడుగారి యింటివెనుక నున్నవిద్యానిలయముద్రాలయములో నల్వురు పనివాండ్ర నొక్కకాలమునందే యచ్చుఁగూర్ప నేర్పఱచి యిచ్చితిని. కాని నే నీగ్రంథమును ముద్రించుటకుఁ దీసికొనుచున్నాఁడనని సర్వజనపుస్తకాలయకార్యదర్శితోఁ జెప్పలేదు. అచ్చున కిచ్చిన పిమ్మట వారికడకుఁ బోయి శ్రీనాళము కృష్ణారావుగారిసహాయమున నదిముద్రించుట కనుమతి నొందితిని. కార్యదర్శి యగు శ్రీభమిడిపాటి సత్యనారాయణమూర్తి బి.ఏ., ఎల్.టి.గారును సంతోషముతో ముద్రణమున కంగీకరించిరి. కాని నే నావ్రాఁతప్రతి గ్రంథాలయము తెఱచియుండుకాలములలో నిచ్చివేయుచుండవలయు నని యాజ్ఞాపించిరి. అందువలన రాజమహేంద్రవరమునందే యున్నతాటియాకు గ్రంథముతో నైనఁ

బోల్పడకుండఁ దొందరగా ముద్రింపవలసి వచ్చెను. అందువలనఁ బీఠికలో నిట్లు వ్రాసితిని.

"వివర ముగఁ బీఠికయు, గ్రంథవిమర్శనమును, పాఠభేదములును, రెండవ ముద్రణమునఁ జేర్పఁ బ్రయత్నించెదను."

పీఠికలో రాజమహేంద్రవరపుఁబ్రతుల ననుసరించితి నని వ్రాసినను నేను కాగితపుఁబ్రతిని బట్టియే దీనిని ముద్రించితి నని శతకముద్రణ మైన 4,5 దినముల లోనే పత్రికలకు వ్రాసియున్నాఁడను. తాటియాకులప్రతితో సంప్రతించి పాఠభేదముల నిచ్చుటకైనఁ గాలము లేకపోయినది. ప్రతి కనఁబడలేదు.

ఈగ్రంథము సర్వజనపుస్తకాలయమునకుఁ బెద్దాపురము గ్రంథాలయము నుండి వచ్చిన ట్లున్నయచ్చుచీటి నే నచ్చునకిచ్చినప్పుడు పుస్తకము కట్టు విప్పి నందున నదివఱకే శిథిల మైనయట్టు చినిగిపోయినది. అందువలన గ్రంథము మరలఁ గట్టించి గ్రంథాలయమున కిచ్చితిని. మఱునాఁడే సత్యాగ్రహవ్రతదినము. అందఱు నుపవాసములు. చంద్రపాలుగారియుపన్యాసములు. కావున నీభక్తిశతక మీనాఁడే ప్రకటింపవలయు నని రాత్రికూడఁ బనిచేయించి ప్రకటించితిని. ఆ నాఁడు రాజమహేంద్రవరములో "నేఁడుసుదినము. ఆమహాకవి (పోతన్న) 400 యేండ్లకుఁ బూర్వమే భక్త్యావేశమున వ్రాసిన "నారాయణశతకరాజము" సార్వజనిక పుస్తకాలయమునుండి తీసి నేఁడే మొదటిసారి ముద్రింపఁబడినది" అని వేలకొలఁది ప్రకటనలు పంచిపెట్టఁబడినవి ఇంతతో నారాయణశతక ముద్రణో దంతము ముగిసినది."

ఈ పైకథ సత్యమైనది కానిది తెలియవలయునని వ్యాసకర్తలు కోరునెడల (1) శ్రీ వడ్లాదిసుబ్బరాయఁడుగారు, (2) అద్దంకి సత్యనారాయణశర్మగారు, (3) నాళము కృష్ణారావుగారు (4) విద్యానిలయముద్రాశాలాధికారులు, (5) సర్వజనపుస్తకాలయకార్యదర్శి మొదలగు భాషాభిమానులను, సత్యవ్రతులను విచారించి యిందలి ప్రత్యక్షరము సత్యకథనముకాని వేఱుకాదని యెఱుంగుదురుగాక! ఈ యుదంతము నేను బీఠికలో వ్రాయకపోయినను నేటికైన వ్రాయవలసిన యవసరము కల్పించిన వ్యాసకర్తలకు వందనశతంబు లర్పించి మీఁదికథకుఁ బోవుదును. పైవిధముగాఁ బ్రకటించుటచే మొదటిముద్రణ మానాఁడొకపుస్తకవిక్రేత మొత్తముగా వెలకుఁ దీసికొనియెను. మిత్రుల కిచ్చుటకైన నాకడఁ బ్రతులు లేవు. అందువలనను, మఱికొన్ని యితరకారణములవలనను మఱునాఁడే రెండవ

ముద్రణ మొనరింపవలసివచ్చెను. అప్పుడుకూడఁ దప్పులవిషయములో నే నింత కంటెఁ జేయవలసినది లేకపోయెను. కొన్ని పాఠములు మూలమున సరిగానుండఁగా వానిని మేము మఱింతపాడుచేసినట్లు వ్యాసకర్తలు చూపిరి. దానికిఁ గారణము వారు నే నుపయోగించినమాతృక కాగితపుఁబ్రతి చూడకుండుటయే యని త లంచెదను. వ్యాసకర్త లీవిషయము లన్నియు నెఱిఁగియుండినచో నాపై వా రింతయప్రతిష్ఠాకర మైనవ్రాఁతలు వ్రాసియుండకపోవుదురని యనుకొందును.

గ్రంథమునందుఁ దప్పు లున్నవనియుఁ గొన్నిపాఠములు మార్చితిమనియు, నామార్పుటలోఁగూడఁ బోతన్న సహజపాండిత్య బిరుదమును నిలువఁబెట్టవలయు ననునుద్దేశముతో మార్చితిమనియు వ్యాసకర్తలు సెలవిచ్చియున్నారు. వారి మాటలే కొన్ని వినుఁడు.

"ఈ శతకపరిశోధనము నొకచిత్రము గానవచ్చుచున్నది. దానిని మీకుఁ దెలిపి యింతటితోఁ బీఠిక విరమించి గ్రంథవిమర్శనమునకుఁ గడంగెదము."

శోధన మనఁగ శుద్ధముగఁ జేయుట, యనఁగా దోషములను సవరించి నిర్దు ష్టముగఁ జేయుట. పరిశోధన మనఁగా మిక్కిలి నిర్దుష్టముగాఁ జేయుటగదా. ఇఁక నీగ్రంథము పరిశోధింపఁబడినవిధముఁ గనుఁడు."

చూచినారా? ఈవ్యాసకర్తలవ్యాఖ్యానధోరణి! శోధనమఁట! శుద్ధిచే యుటయఁట! పరిశోధనమఁట! మిక్కిలి నిర్దుష్టముచేయుటయఁట! ఎంత వింతవ్యా ఖ్యానములు వినుచున్నారము. ఇది కడపమండలవ్యాఖ్యానమా? తన్మండలస్థిత పోతనామాత్యసమాజసభ్యులలో నొక్కరై యుండు నాంధ్రవాల్మీకులవ్యాఖ్యాన మా? లేక వ్యాసపాఠకులవ్యాఖ్యానమా? సంస్కృతభాషనే సంస్కరించుచు న్నారు. నేను బోతన్నశతకమును జేతఁగాక తప్పులుగాఁ బ్రకటించిన లోకమునకు నష్టము లేదు. తప్పులు కుప్పలుగా గుజిలీప్రతు లెన్ని లేవు? కాని కడపమిత్రుల సంస్కృతభాషాసంస్కరణము కొంపఁ దీసివేయునుగదా! దీనికేమి? పరిశోధనమ నఁగా మామిత్రులకు విపరీతాభిప్రాయ మున్నట్లు పైవాక్యమువలనఁ దెలియు చున్నది. పరిశోధకుఁడు లేఖకదోషముల దిద్దువాఁడేకాని కవితప్పులు దిద్దువాఁడు కాఁడే! కవితప్పులు దిద్ది కవికి రానివ్యాకరణము తనకు వచ్చినవ్యాకరణసహా యమున లోటులేకుండఁ దగినకారణములు చూపకుండ దిద్దువాఁడు పరిశోధ కుఁడు కాఁడే! (పరిషత్పత్రిక 7 సం॥ 350 పుట చూడుఁడు!) అట్టిశోధకుఁడు దేశ ద్రోహి! అట్టి దేశద్రోహులవింతకల్పనలు, "లేఖకపాఠబాధముల" పాఠభేదము

లు కలిసి ముద్రింపఁబడుటవలననే కాదా మనభారత మిట్టిస్థితికి వచ్చినది. దేశ
మున శోకపాత మైనది. ఇట్టి పరిశోధనవ్యాధి యెంతత్వరగఁ గుదిరిన నంతపుష్టి
కాదా ? ఇప్పటికైనఁ బ్రాంతగ్రంథముల సహాయమున నున్నగ్రంథముల సంస్క-
రించుకొని కవిహృదయమును సమీపింపఁగలుగుదుము. నేను నారాయణశతకము
ను బ్రకటించునప్పు డది చరిత్రజ్ఞులకుఁగూడఁ బనికివచ్చునని తలంచితిని. పోతన
కర్తృత్వము లోకముసందేహించునని యెఱుఁగుదును. కావుననే యథామూలము
గఁ బ్రకటించితిని. ఇది తప్పో యొప్పో పాఠకులే నిర్ణయించెదరుగాక !

ఇంతవఱకు మనముద్రాపకులు, వారిపరిశోధకులు నేమిచేయుచున్నారు.
"నుయిదాఁటేవానికిన్" అనుప్రయోగ మున్నది. తప్పు కావునఁ దెనాలిరామ
కృష్ణమ్మ వ్రాసిన "దాఁటేవానికిన్" తీసివేసి "దాఁటెడివానికిన్" అనఁబోవుచు
న్నారు. గణము సరిపోదు. కావున "దాఁటన్‌వానికిన్" అనుకొందమనుచు
న్నారు. అర్థము చెడినది. అనర్థము వచ్చును. కావున "నుయిలోమావారికిన్"
అనుకొంద మని దిద్దివేయుచున్నారు. కవిహృదయము గంగలో గలిసిన వారి
కేమి ? పరిశోధకునికి వలసినది నిర్దుష్టవాక్యము. వ్యాకరణసమర్థనీయ మగువాక్య
ము ! ఆవ్యాకరణము కవికి రానిదైన సరియే ! ఇట్లే "రాకన్ మానవు హాని
వృద్ధుల"ని దిద్దివేయవలసినదే ! లేనియెడల నది పరిశోధనము (మాకడపమిత్రుల
యభిప్రాయానుసారము) కానేరదు. కావ్యములోఁ గవి తప్పులు వ్రాసినను
దరువాత మనము దిద్ది నిర్దుష్టముగఁ జేయుటయే పరిశోధనమని వారియభిప్రా
యము. వారిసూత్రముప్రకారము మేము దిద్దివేసియుండినయెడల వీరీవ్యాసము
నం దిన్నికవితప్పులు పట్టిక వ్రాసికొని చదివి "ఓ నెల్లూరుపరిషత్సభ్యులారా !
నిజమాడుఁడు ! ఈతప్పులు పోతన్నవా ? కావా ? మీమీఁద నొట్టు. చెప్పకపో
యిన మీరు నరకమునఁ బడుదురు. చెప్పండి ! బాబూ ! చెప్పండి. పోతన్న కడ
పవాఁడేయనండీ !" అని బ్రతిమాలుకొనఁ గలిగియుండెడివారా? నందనందన
శతకము వ్రాసిన శ్రీవడ్డాదిసుబ్బరాయఁడుగారే కవితప్పులుకూడ దిద్దవలెనను
నూహతో శతకమును దిద్దియుండిన, మార్చియుండిన నది పోతన్నభాగవతశైలిక
చ్చుగ్గుద్దినట్లు లేదనుట కెవనియబ్బతరము? కాని మా కట్లు దిద్ది యీశతక మె
ట్లయిన పోతన్నదే యనిపింత మనుపట్టుదల లేదే ! "తప్పయినను బూర్వకవి కవి
త్వమే కావలయును. ప్రస్తుతపరిశోధకపండితుల పైత్యము మా కక్కఱలేద"ను
వారముకావున నున్నది యున్నట్లు ప్రకటించితిమి. ఇంతకంటె నధికముగ దిద్దిన

నొంటిమిట్టవాదు ‘లీశతకము నచ్చువేసినవారు దిద్దివేసి ధర్మపురి మొదలగున విందుఁ జేర్చివేసినా’రని మమ్ము నిందింపకుండ యథామూలముగ ముద్రించితిమి. కాని చేతఁగాక కాదు. పీఠికైనంతవఱకు మూలము చెడకుండ దిద్దితిమి కావునను, లేఖకకవిదోషముల నిర్ణయించుకొనుటలోఁ బ్రమాదము లేకుండ నుండవలెనని మూలమున కతిస్వల్పమైనమార్పు లొనరించుటచేతనే “ప్రాయికముగా యథామాతృకముగ ముద్రించితిమ”ని పీఠికలో వ్రాసితిమి. మూలమునకు విరుద్ధముగఁ గొన్నియచ్చుతప్పులుకూడ రాత్రి పనిచేయుటచేతను, దెల్లవారకుండ శతకము సత్యాగ్రహదినమునాఁటి ప్రభాతగోదావరీస్నాన సమయమునకే యమ్మక మారంభము కావలసియుండుటచేతను, గొన్నియక్షరములు తారుమాఱగుట కూడఁ దటస్థించినది. మే ముదయమాఱుగంటలకే నిద్రమంచముమీఁద నున్నవారిని లేపి శతకము లిప్పించితిమి. శతకగ్రాహకులలో నొక రగుశ్రీవేమూరి విశ్వనాధశర్మ ఎం.ఏ., ఎల్.టిగారు దీనికి సాక్షులు! యథామూలముగ నొంటిమిట్టవాదులకొఱకే ప్రకటించినను, ప్రకటకాలమునాఁటి కీశతకప్రఁబ్రతులు పెక్కు లున్న ట్లెఱుఁగకపోవుటను, రెండవప్రతి దొరకినవారి కిదియొక లేఖ్యముగానైన నుపకరించునని మాయూహ! పోతన్నశతకముకదా యనుసంతోషముతో వ్యయప్రయాసలకు లోనై మే మీగ్రంథము ముద్రించుటయేమి? కడపమిత్రులకు మాపై నీయాగ్రహమేమి?

నేను గ్రంథపీఠికలోఁ ద్వరలో ముద్రించితి ననుట నాపాండిత్యలోపమును గప్పిపుచ్చుకొనుట కని వ్యాసకర్తలు నాపూర్వగ్రంథమునుండికూడ నెత్తిచూపిరి. గ్రంథముద్రణ మొక్కదినములో ముగించుటకుఁ గారణము గ్రంథముఖపత్రమున ముద్రించియున్నాఁడను. అది వారు చూడరో, లేక యుపవాదములు మోపుట వారి కార్యమో? పైఁగ నేను వా రనుకొనునట్టిపండితుఁడనుగాను. వ్యాకరణము వచ్చుటయే పాండితియైన నా కది రాదు. రాదు! ఇప్పుడు నేర్చుకొనుచున్నాఁగను. తప్పా? కావుననే స్పష్టముగ వడ్డాదిసుబ్బారాయఁడుగారివంటి పండితులసాయ మందితిని. ఇది తప్పా? వ్యాకరణము రానివా రెందఱు లేరు. అందులకు నన్ను ‘‘మహాపండితులే! విద్యాధికులే’’యని సభాముఖమున నధిక్షేపింపవలెనా? నాకు వ్యాకరణము రాకపోయిన వారియొంటిమిట్టవాద మెట్లు నెగ్గును? నారాయణశతకకర్తృత్వ మెట్లు నిర్ణయమగును?

వ్యాసకర్తలు క్రొత్తసౌజన్యముననో యథార్థవాదులు కాక తప్పకపోవుటనో

నారాయణశతకము కల్పితము కాదనియు, ప్రాచీన మైనదియే యనియు, దీనికిఁ బరిషత్తులోఁగూడ 4,5 ప్రతు లున్నవనియు, నవి యనువదేండ్లకంటెఁ బ్రాచీనము లయినలేఖ్యములనియు నందొకదానియందు నేను బ్రకటించిన గద్యకూడఁ గలదనియు నంగీకరించిరి. అందులకు వారికి వందనములు. వా రంగీకరింపకపోయినను నారాయణశతక ప్రాచీనతను స్థాపించుట కాధారము లేకపోలేదు. ఆశ్రమ వారియంగీకారముచేఁ బ్రస్తుతము తప్పినది. కాని గద్య "కూటసృష్టి" యనుచున్నారు. ఈక్రిందివాక్యముల వినుఁడు,

"శతకములం దెందైనఁ దద్గ్రంథకర్తలు తమనామధేయములను గద్యరూపమున వ్రాసికొనియున్నారా ? ఆయాచారమునకు భిన్నముగ నిందు గద్యము కానవచ్చుట సంశయాస్పదము కదా" ఆంధ్రశతకవాఙ్మయముతోఁ బరిచయ మున్న యెల్లవారికి స్థూలదృష్టి కీసందేహము గోచరమగును. కాని ప్రత్యక్షముగ లేఖ్యమున గద్యము కనఁబడుచున్నప్పు డేమిచేయవలసినది? వారు చెప్పినట్లు సిరాభేదములు లేకుండ గద్యము మాప్రతిలోఁ గన్పట్టినది. దానిమాతృకలోఁ "గలకత్తా స్వానుసిరా" యున్నట్లు మాకుఁ దెలియదుకద ! పైఁగా నాగద్యముక్రింద వ్యాసకర్త లుదాహరించిన ట్లీక్రిందిపద్యములుకూడఁ గాన్పించినవి.

క. భారద్వాజసగోత్రుఁడ, సూరిస్తుతబాచిరాజుసూనుఁడ రామాం
 బారమణీమణితనయుఁడ సారస...వంశాబ్ధిచంద్రుఁడ ధరలోన్.

క. ప్రతిచూచి వ్రాసినాఁడను, సతతము శివభక్తిసారసంగ్రహలీలా
 ద్భుతలోకోత్తరసీతా, పతినాముఁడ నందివాడపరమాన్వయుఁడన్.

అనఁగా నీప్రతి నందివాడసీతాపతిగారు, శివభక్తులు, బాచిరాజురామాంబల పుత్రులు నగుకవివర్యులు వ్రాసిరి. వారి యీలేఖకపద్యములకు మీఁద శతకగద్యమున్నది. గద్యముకూడఁ "బ్రతిచూచి వ్రాసినాఁడ" ననియేకదా సీతాపతిగారి యభిప్రాయము. ఈకవి వ్రాసినమాతృక ననుసరించియే వేము నర్సయ్యగారు ప్రతివ్రాసినట్లు జ్ఞాపక మున్నది. అనఁగా స్థూలదృష్టికి వేమునర్సయ్యగారికి నందివాడ సీతాపతిగారిప్రతి దొరకినదనియు, సీతాపతిగా రింకొకప్రతి చూచివ్రాసినదే వేము నర్సయ్యగారిప్రతికి మాతృక యైనదనియుఁ దెలియుచున్నది. వేము నర్సయ్యగారే తమగ్రంథాలయమునకుఁ బ్రతి యిచ్చినట్లును, వారినిఁ దామెఱుఁగుదుమనియు శ్రీ నాళము కృష్ణారావుగారు చెప్పినట్లు జ్ఞాపక మున్నది. వారు బహుశః పెద్దాపురముగ్రంథాలయమునకు సభ్యులై యుండవచ్చును. కాని నందివాడ

సీతాపతిగా రెప్పటివారో తెలియదు. పరిషత్తువారికిఁ బ్రతి సంపాదించి యిచ్చిన కీ॥ శే॥ దేవగుప్తాపుభరద్వాజముగారు వారుసంపాదించిన ప్రతికూడ నందివాడ సీతాపతిగారి దని చెప్పిరఁట. పైఁగా నందివాడ సీతాపతిగా రిచ్చిరని వ్రాసిరఁట. ఈ నందివాడ సీతాపతిగారు లేఖకులో—లేఖకునిమనుమలో" వీ రెచ్చటివారో—సజీవులో—తెలిసికొనకుండ నీప్రతి యీపరిషత్ప్రతికిఁ బుత్రిక యని వ్యాసకర్తలు సిద్ధాంత మొనరించిరి. అయినను నగుఁగాక! వారు సజీవులయినచో మూల మెచ్చటిదో, అది చూడ వీలున్నదో లేదో ప్రయత్నించినచో నింతకంటె మన కిందలిసత్యము చేరువ యగును. కాని మే మీనందివాడ సీతాపతిగారిపద్యములమూలమునసే మేము చూచినప్రతి చిరకాలమునుండి పోతన్నదని వాడుకలో నుండియుండెనని తలంచుటకుఁ గారణమైనది. నందివాడసీతాపతిగారు పూర్వకవులని మే మనుకొంటిమి. అందువలన నున్నది యున్నట్లు ప్రకటించితిమి. దోషమా ? అదిగాక గద్య ముండుటవలన శతకము పోతన్నది కాకపోవునా? మఱియు శతకములయందు గద్యముండదనుటయు స్థూలదృష్టిచేఁ గలిగినయభిప్రాయమే ! చూడుఁడు.

(1) "గద్యము. ఇది కాళహస్తీశ్వరమహాత్త్వము చెప్పినధూర్జటకవిచే కేవలభక్తిమార్గమున రచియింపఁబడిన శ్రీకాళహస్తీశ్వరశతకము." ఇదికూడ నేఁ గల్పించితి నందురు కాఁబోలు. కాదు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు ప్రకటించిరి. అది వారివాదము నెగ్గవలయు నని యిటీవల ముద్రించి రందురా? కలావతిలో 1901లో ముద్రించిరి. గద్యము కవి వ్రాసినట్లు లేదందురా ? పోనిం డింకొకటి చూతము.

రామరామశతకము. (1917 అమెరికనుడైమెండుముద్రాలయము, చెన్నపురి.

"గద్య :—శుక్లనామసంవత్సర * * * * తోట వంశపయః పారావారసుధాకర నరసింహపుత్ర సుజనవిధేయ వేంకటనరసింహప్రణీతం బైన శ్రీరామరామశతకంబునందు నీతి సంగ్రహంబు * * * శ్రీరామరామశతకము సంపూర్ణము."

నడుమ నేవియో పువ్వులు పెట్టినవారము, 1817లో నాముద్రాలయులము వారికి లంచమిచ్చి యీరుఁగంటివాడు లిట్లు సృష్టించి రందురా ? ఆంధ్రవాల్మీకులు చెన్నపురిలో విచారించెదరు గాక !

(౨) శ్రీ. దత్తాత్రేయశతకము. (1916) చంద్రికాముద్రాలయము, గుంటూరు.

"గద్య. ఇది శ్రీమత్పరమపవిత్రభారద్వాజసగోత్రపిశుపాటివంశ కలశాంబుధిపూర్ణసుధాకర చిదంబరసుధీపౌత్ర సీతారామపుత్ర కనకాంబాగర్భశుక్తిముక్తాఫల పరమేశ్వరవరప్రసాదలబ్ధవివిధావధాన *** శ్రీదత్తాత్రేయశతకము సర్వము సమాప్తము."

(4) శ్రీ సీతారామశతకము. (1910 దుర్గాముద్రాలయము. బెజవాడ.)

"గద్య. ఇది శ్రీ సీతారామపాదకమలసేవావిలసితదాసానుదాసుండును హేలాపట్టణనివాసుండును, ఆలామాణిక్యాహ్వయునిజ్యేష్ఠపుత్రుఁడునగునగరయాఖ్య విరచితం బైన శ్రీసీతారామశతకము సంపూర్ణము."

(5) శ్రీ దశరథకుమారశతకము (1910 వాణీముద్రాలయము బెజవాడ.)

"గద్యము. ఇది శ్రీరామచంద్ర చరణారవిందరసాస్వాదనతుందిలేందిందిరాయమాన **** శ్రీ చంద్రయదాసప్రణీతం బైనశ్రీదశరథరామశతకము సర్వంబు నేకాశ్వాసము?"

ఇవి యన్నియు నాధునికములని వ్యాసకర్తలు కొట్టివేయుదురు కాఁబోలు. ప్రాచీనశతకములఁ జూపెదను.

(6) వేంకటరమణశతకము (ఇది దుర్గాముద్రాక్షరశాలయందు ముద్రితము. సంవత్సరము లేదు. అందువలన మాకల్పితమో "కూటసృష్టి"యో యందురనుభయమునఁ బీఠికనుండి కొంత యెత్తిచూపుచున్నాఁడను. "మావంశమున రమణప్ప యనునొకఁడు పరమభక్తుండై యుభయభాషాభూషణుండై కవియై తనకాలమువారలలోఁ బేరుగాంచె. మాబంధువులనేకు లాడుకొనుట విని తద్రచితము లగుపొత్తంబు లేమేని లభించునేమో యని మాయింట నున్న తాళదళ సంపుటంబులం బరిశోధింపఁగాఁ జెదపురుగులచే మిక్కిలి శిథిలమై ప్రయత్నంబు నంగాని యక్కరంబుల నిర్ణయింపరాని పురాతనగ్రంథములు రెండు నాకుం దొరికినవి. *** బలిజేపల్లి లక్ష్మీకాంతముగారిచే సంస్కరింపించి *** కవి యిప్పటికి నూఱుసంవత్సరములక్రిందటివాఁ డని తెలియవచ్చుచున్నది****పత్రి వేంకటరమణరావు." అని పైశతకపీఠికలో నున్నది. ఆశతకముచివర నీక్రింది గద్య మున్నది.

"గద్యము. ఇది శ్రీ పత్రివంశపయఃపారావారరాకానిశాకర కౌండిన్యసగోత్రపవిత్ర తిమ్మప్పార్యపౌత్ర శ్రీనివాసవరపుత్ర బుధజనవిధేయ రమణప్ప నామధేయ ప్రణీతం బైన శ్రీవేంకటరమణశతకంబు సర్వంబు సంపూర్ణము."

ఇదికూడఁ గల్పిత మని కడపమిత్రు లందురుగాక !

(7) కుక్కుటేశ్వరశతకము (కూచిమంచితిమ్మకవిది.) (1912 వావిళ్లరామస్వామిశాస్త్రులు అండ్ సన్సు. చెన్నపురి.)

ఇప్పటి కోరుఁగల్లువాదము లేదని యనుకొందును. పైఁగా వీరు 1919లో నేను నారాయణశతకమును గద్యతోఁ బ్రకటించుతుననియు దాని కాధారముగనిది యుండవలయు ననియు వావిళ్లవారితోఁ గుట్రచేసి యిది ముద్రింపించియుండను గద ! ఇప్పటికి బహుశః జయంతిరామయ్యపంతులుగారు మొదలగు వారందఱు నోంటి మెట్టువాదులే కద ! కడపమిత్రులు వివరము లన్నియుఁ జొల్చిచూచు కొందురుగాక ! "గోదావరీమండలము వారిని నమ్మరాదు. బాగుగ వివరములఁ బరికింపుఁడని యాకాశవాణి చెప్పుచున్నది. వినుఁడు. తిమ్మకవిశతకాంతమున నున్నగద్యయిది.

"గద్యము. ఇది శ్రీమదుమారమణకరుణాకటాక్షనిరీక్షణాసంలబ్ధసరసకవితాసామ్రాజ్యధురంధర ఘనయశోబంధుర కౌండిన్యగోత్రపవిత్ర కూచిమంచిగంగనామాత్యపుత్ర బుధజనవిధేయతిమ్మయనామధేయప్రణీతం బైనకుక్కుటేశ్వరశతకము సంపూర్ణము."

ఈగద్య మిప్పుడు నేను గల్పించియుండినచో 1912లో వావిళ్లవారు ముద్రించియుండలేరు. ప్రాచ్యపుస్తకశాలలో ననేకసంవత్సరములక్రింద నీగ్రంథము నోరుఁగంటివాదులే పంపియుండరుకదా ! ఆంధ్రివాల్మీకులును, బోతనసమాజ సభ్యులును బరిశోధించెదరుగాక ! ఈగద్య లేడింటితోఁ గడపమిత్రులసిద్ధాంత మేమైనది ? పాఠకులకు విడిచెద. ఇట్లే విష్ణుసర్వోత్తమశతకము, పార్వతీశ్వర శతకము, శ్రీవేంకటేశ్వరశతకము, విశ్వకర్మశతకము, ఆత్మలింగశతకము, పరశివరామశతము, కట్టుపద్యములశతకము, శ్రీలక్ష్మీశతకము, రామానుజశతకము, మొదలగుశతకము లనేకములు గద్యోపేతములై కన్పట్టుచున్నవి. ఈశతకములు గద్యయుతములై, ముద్రితములై నాకడ నున్నవి. గ్రంథవిస్తరభీతిచే నుదాహరింపలేదు. విజ్ఞానతారావళి, శ్రీరామమానసపూజ యనుచాటుప్రబంధములును గద్యసహితములు కన్పట్టుచున్నవి. కావున గద్య మున్నంతమాత్రమున నది శతకసంప్రదాయవిరుద్ధమనియుఁ గల్పితమనియు ననుట సాహసము. చక్కఁగఁబరిశీలింపక యోరుఁగంటివాదు లీ"కూటసృష్టి" యొనర్చిరనుటలో మాకడప మిత్రులు మంచిపని చేయలేదని వారికి వినయపూర్వకముగ మనవిచేసికొనుచున్నాఁడను.

పరిషత్తులో 5 ప్రతులు నారాయణశతక మున్నట్లు నందొక్కదానియందే గద్య మున్నట్లు నందువలన నీగద్యము కల్పిత మనియు వ్యాసకర్తలు వ్రాయుచున్నారు. రాజమహేంద్రవరపుఁదాళపత్త్రప్రతి నేనిప్పటికిని జూడలేదు. అందుఁగూడ గద్య లేకున్నచో నేము ప్రతులలో రెండుకాగితపుఁబ్రతులమీఁదనే గద్యము కనఁబడుచుండుటచే నాకును నీశతకకర్తృత్వ మిప్పుడు సందేహముగనే కన్పట్టుచున్నదని తప్పక యంగీకరించుచున్నాఁడను. కాని యంతమాత్రముచేతనే యాశతకము పోతన్నది కాదని తొందరపడి సిద్ధాంతముచేయ వీలులేదు. ఇప్పుడు మనకు మూఁడుప్రశ్నలు తట్టుచున్నవి.

(1) పోతన్న శతకము వ్రాసి గద్యము వ్రాయఁగాఁ గొంద ఱాగద్యము వ్రాసికొని కొందఱు వ్రాసికొనకపోయిరా?

(2) భోగినీదండకమునందువలెనే ధూర్తకవి యెవ్వఁడయిన నీశతకమునకీగద్య కల్పించి చేర్చినాఁడా?

(3) గద్యపోతన్నవ్రాయకపోయినను శతకము పోతన్నదని వాడుక యుండఁగా మంచియుద్దేశముతోనే భాగవతగద్యమును బూర్వు లీశతకమునకుఁ దగిలించియున్నారా?

ఈప్రశ్నలు భిన్నప్రదేశములలో నింకను నీశతకప్రతులు దొరకినప్పుడు కాని దొరకిన 7 ప్రతులను నిష్పక్షపాత మగుబుద్ధితో మహాజనులు పరిశీలించి కాని నారాయణశతకకర్తృత్వమును నిర్ధారింపవలసియున్నది. గద్యము చెన్నపురిప్రతిలో భిన్నమైనసిరాతో నున్నది మేము చూడలేదు కావునను, మేము చూచినప్రతిలో మే మదికల్పితగద్య మనుకొనుటకు వీలు లేకుండ నొక్కసిరాతో నుండుటను, మే మది సందేహించుటకే యవకాశము లేకపోయినదని పాఠకులు గ్రహించెదరుగాక! ఇప్పటికిని రాజమహేంద్రవరపుఁబ్రతి నెవ్వరైనఁ బరీక్షింపవచ్చును. అంతేకాని దూరమున నుంటిమికదా మనల నెవ రేమి చేయఁగలరని చేతికి వచ్చిన ట్లెల్ల వ్రాయుట కాని, వ్రాసినది పరిషత్సభాముఖమునఁ జదువుట కాని న్యాయ్యమా.

గద్యము "కూటసృష్టి"యైన నగుఁగాక! వారెవ్వరో పాపాత్ములు శతకము చివర తామే శతకము వ్రాసి దానికిఁ దగిల్చినఁ దగిల్చియుందురుగాక! అది యట్లే పరిశీలనమువలనఁ బరిణమించినను నాకు సంతోషమే! నారాయణశతకము పోతన్నదైనను గాకపోయినను నాకు విచారము లేదు. నే నున్నపితా

పురమునుండి పోతన్న యెచ్చటికైనఁ బోవునని విచారము లేదు. అందువలన నేను మూర్ఖుఁడనై "నాపట్టినకుందేటికి మూఁడే కాళ్లు"ని వాదింపను. నారాయణశతకము ప్రకటించుటలో నాయుద్దేశమేమనఁగా నొకవేళనైన నది పోతన్నది కావచ్చును. పోతన్నశతకము ప్రకటించితి మనుతృప్తి నొందుదము. రెండుమూఁడు ప్రతులు భిన్నదేశములయందుఁ గాన్పించినట్లు వినుచున్నారము. వ్యతిరేకాధారములు లేనిది యిది కాదనుట యెట్లని చదివితిని. నా కది పోతన్నదని తోఁచినది. లోకము విమర్శించునని యున్నది యున్నట్లు ప్రకటించితిని. కావున నాశతకము పోతన్నది కాకున్న మఱియు సంతోషము. నేను బొరపాటుపడి పోతన్నశైలి కలదనుకొంటి ననుకొందును. మఱియొకఁ డెవ్వఁడో యాశైలిని వ్రాసె ననుకొందును.

నన్ను "ఓరుఁగంటిపక్షవాదులైన"యనువిశేషణమును జేర్చి గౌరవించుచు వ్యాసకర్త లిట్లువ్రాసిరి.

"బ్ర. శ్రీ. వీరయ్యపంతులవారు" నూతనముగాఁ బ్రచురింపఁబడిన నారాయణశతకమునందలి ధర్మపురలక్ష్మీనాథయను మాటవల్ల బోతన వార్రంగల్ ప్రాంతములనుండినటుల 'దెలియగలదు' అని వ్రాసిరి. దీనివలన నీశతకమోరుఁగంటివాదమును బలపఱుప నోరుఁగంటివాదులచేఁ బ్రకటింపఁబడియె ననుట స్పష్టమయ్యెఁగదా. దీని నామోదించిన బ్ర. శ్రీ. వీరయ్యపంతులవారే కాక రా. శ్రీ. వంగూరిసుబ్బారావుగారును నోరుఁగంటివాదులే యని యాంధ్రలోకమునకు విదితము."

అని పరుషవాక్యములు వ్రాసినారు. ఒంటిమెట్టవాదులు వారిపోతన్న యనుకొనినయాతఁడు కడపనుండి యోరుఁగల్లు ప్రయాణముఁగట్టె నని గంపెడు దుఃఖముచేఁ గడుపుమండి వ్రాసిన యీయపనిందావాక్యములఁ బ్రస్తుత ముపేక్షించి ప్రత్యుత్తర మిచ్చెదను. నే నోరుఁగంటివాది నఁట! అవును. సత్య మోరుఁగంటివైపునకు ములుసూపుచున్నందున—నేనే కాదు—నాలెక్క యేమి యున్నది—ప్రథమమున నొంటిమెట్టవాదులై యుండిన శ్రీ రా. బ. కం॥ వీరేశలింగముపంతులుగారు, శ్రీ జయంతి రామయ్యపంతులుగారు, శ్రీ చిలుకూరి వీరభద్రరావుపంతులుగారు, మొదలు కించిచ్చరిత్రజ్ఞానము కలయెల్లరు నోరుఁగల్లువాదులే! కానినే నీశతకమును బ్రకటించుట యోరుఁగంటివాదవిజయమునకుఁ గాదే! అట్లయిన నేను "తెఱమఱుఁగు"న నుండి యేపుస్తకవిక్రేతచేతనో ప్రకటింపించి యుండవలయునే! నే నీశతక మోరుఁగంటి వాదవిజయమునకుఁ బ్రకటింప

లేదు. సత్యవిజయమున కేమైన సాయము సేయునని ప్రకటించితిని. అది యొంటిమెట్టపక్షమైనను సంతోషమే! ఓరుఁగంటిపక్షమైనను సంతోషమే! జ్ఞానము గలయెవ్వరైన నొంటిమెట్టవాదులు నోరుఁగంటివాదులు నని విభేదము నొందరు. సత్యవాదులు నసత్యవాదులు—అభిమానవాదులు—నభిమానశూన్యవాదులు నని యగుదురు. అట్టియెడ శ్రీ వీరయ్యపంతులుగారు ధర్మపురి యని యున్నది గనుకఁబోతన్న 'యోరుఁగంటివాఁడనుట యేమి? "పృష్ఠ తాడనాద్దంతభంగ" యన్నట్లీశతక మోరుఁగంటివాదమును బలపఱుప నోరుఁగంటివాదులచేఁ బ్రకటింపఁబడియె ననుట స్పష్టమయ్యెఁగదా' యని వ్యాసకర్తలు చెప్పుట యేమి? కడపమండలముననుండి వీరు గోదావరీకృష్ణామండలములవారి తాక్యతంత్రము నెంతలో భేదించిరి!

చెన్నపురియందొకదానియందైన గద్య మున్నదికదా! అది నాప్రతికి మాతృక యని వ్యాసకర్తలే యంగీకరించుచున్నారుకదా! పత్రికను జూచి మాతృక నోరుఁగంటివాదులలో నొకఁడనైననేను జెన్నపురికిఁబోయి గద్యము దిద్దియుండనుగదా! ఉన్నది యున్నట్లు నేను బ్రకటించితినిగదా! ఇఁక నోరుఁగంటివాదులు చేసినద్రోహ మేమియున్నది? గద్యము సృష్టించి మాతృకలోనే చేర్చి యుందురంచురా? అట్లయిన నే నీశతకముపై సంవత్సరాదిసంచికలోఁ బ్రకటించిన మాటల వినుఁడు.

"** ప్రస్తుత మితఁడు రచియించినట్లు కనఁబడుచున్న నారాయణశతకము రాజమహేంద్రవరమునందలి సర్వజనపుస్తకాలయమునుండి తీసి ముద్రించితిని. అది పోతన్నకృతమే యని నాయభిప్రాయము. సత్యాసత్యములు విమర్శించి తెల్పుట కనువగునట్లు పాఠకుల కందలివివరములఁ దెల్పుచున్నాఁడను. ** ఈశతకము నేను పోతన్నదే యని పట్టుదలతోఁ జెప్పుట లేదు. చెప్పినను సత్యము కాకున్న విన రు. కావునఁ జదువరులే చర్చించి తీర్మానించుకొందురుగాక! *** ఇందలి ధర్మపురి యేది? అచ్చట లక్ష్మీనాథదేవాలయమున్నదా? ఇది వరంగల్లునకుఁ జేరునా? ఒంటిమిట్టకుఁ జేరునా? జమ్మలమడుగుతాలూకాలో నొకధర్మపురి కలదు. ఇది యొంటిమెట్టకుఁ జేరువ. పరిశోధకులును జరిత్రప్రియులును జర్చించి దీనికర్తృత్వమును నిర్ణయించి యుపయోగమున్నఁ బ్రస్తుత జన్మస్థాననిర్ణయ చర్చలోనికిఁ దీసికొందురుగాక!" 125 పుట 10వ సంవత్సరాది సంచిక.

నే నీవ్యాసము పరిషత్సభ నెల్లూరులోఁ గూడుటకుఁ బూర్వమే వ్రాసి

యాంధ్రపత్రికసంవత్సరాదిసంచికకుఁ బంపితిని. దీని కాంధ్రపత్రికాధిపతులే సాక్షు లు ! నేను బ్రకటించిన పైవాక్యములలోనేగాక దీనికిఁ బూర్వము ప్రకటించిన శి వ్యాసములలోను, శ్రీజయంతిరామయ్యపంతులుగారిపేర నెల్లూరిసభకు వ్రాసిన జాబునందును నే నీశతకప్రకటనమువలన నుభయవాదములకు మధ్య నిలువఁ బడి సత్యవిజయమునకే ప్రయత్నించితినిగాని, యోరుఁగంటివాదమే నెగ్గవలయు నని నేను బాట్లుపడలేదని పాఠకమహాజనులకుఁ దెలియకపోదు—పైవాక్యముల లో నేను ధర్మపురి యొంటిమెట్టకే చేరువయని వ్రాసితినిగాని వ్యాసకర్త లభిప్రా యపడినట్లు కడప మండలములో ధర్మపురి లేదని తలంచి నావాదమే నెగ్గవలయు నని నేను వ్రాయలేదని వ్యాసకర్తలు గ్రహించెదరుగాక ! సంవత్సరాదిసంచిక వ్యాస మిందులకు సాక్షి !

ఇంకొకవిచిత్రము చూడుఁడు.

“ఓరుఁగంటి కాధారముగ లిఖితాధారములు తాళపత్రములు సృష్టింపఁబడు చున్న వని వింటిని. అవి యెంతవఱకు విశ్వసనీయములో భావిప్రాజ్ఞు లాలో చింతురుగాక !” ఆంధ్రవాల్మీకుల యావాక్యములకు శ్రీ వీరేశలింగముపంతులు గారు తగిన ప్రత్యుత్తరము సంవత్సరాదిసంచికలో వ్రాసియున్నారు. దానికేమి ! చెన్నపురిలో నున్న యాంధ్రవాల్మీకులతోడ గోదావరిమండలమునందలి జడుఁ డగునేయోరుఁగల్లువాది తాను లిఖితాధారముల సృష్టించుచున్నాఁ డనని చెప్పి నాఁడు? సృష్టియొనర్పువాఁడు చెప్పి సృష్టియొనర్చుఁడుకదా ! అట్టియెడ నీరహస్య సృష్టిగ్రంథములవిషయము శ్రీవావిలికొలను సుబ్బారావుపంతులుగారి కెట్లు తె లిసినది ? స్వప్నములో వినిరా ? ఎంతదారుణ మైనయసత్యము! భావికాలములో నేవైన లిఖితాధారములు దొరకునని భయముచే నవి ప్రజలు నమ్మకుండ వేయు ముందరకాళ్లబందములా ? ఇన్నిపాట్లుపడి పోతన్నను గడపలో నుంచుకొనుట కీ వ్యర్థప్రయత్నము లేల? నమ్మ వీలులేని యీయాలాపము లేల? సృష్టికథలు సృ ష్టింప నేల పాపము శాంతించునుగాక !

ఇఁకఁ బ్రస్తువ్యాసకర్తలవాక్యరత్నముల వినుఁడు. “రా. బ్ర. వంగూరి సుబ్బారావుగారు నోరుఁగంటివాదులే యని లోకవిదితము. వీరు గాక కర్తలు, కారయితలు, ప్రేరకులు, నా మొదలు యెవ్వరెవ్వరు తెఱమఱుఁగుల నున్నారో మే మెఱుఁగము. నిజము నిలుకడపైఁ దెలియును.” అని సాహసముతో బలి కిరి. కడపమండలమునందలి వ్యాసకర్తలు గోదావరిమండలమునం దున్న నాసృష్టి

ని, దానికిఁ గర్తలను, వారిపైఁ గారయితలను, నందుపైఁ బ్రేరకులను, వారిపై నా మోదకులను, నిందఱను దెఱమఱుఁగునఁ జూచుచున్నారు. నిలుఁకడమీఁద నిజము బయలుపడు నని యాశించుచున్నారు. గోదావరిమండలములోఁ గడపవారికిఁ బ్రత్యక్షముగ నోరుఁగంటివాదు లిరువురు కనఁబడుచున్నారు. వారిరువురు నావంటి యపండితుని "కూటసృష్టి" సాక్ష్యము నంగీకరింపవలసినంత యసమర్థులు గారు. ఒంటిమెట్టవాదులకు వారిపేరులు "సింహస్వప్నము" వంటివి. వారే నా సృష్టికి బ్రేరేపకులు కావలయునుగదా! పోనిండు వాదముకొఱ కాయిరువురు నగు శ్రీ వీరేశలింగముపంతులుగారును శ్రీజయంతి రామయ్యపంతులుగారును నాచే నీ "కూటసృష్టి" చేయించి రని క్షణమాత్ర మంగీకరింపుఁడు. న న్నపండితునిగా స్థాపించుటయే గాక నే నొకరిచేతియందలి నీచ మైనకీలుబొమ్మ ననికూడ న న్నెన్నఁడు నెఱుఁగనికడపమిత్రులు గ్రహించిరిగదా! గోదావరిమండలములో జరుగుచున్న వాఙ్మయద్రోహులచర్యలు కడపమండలములో నున్నమామిత్రులకుఁ జూచినట్లు పొడఁగట్టుచున్నవి. ఇది వారియదృష్టము! వారికొంటఁడో మెట్టఁడో దివ్యదృష్టిఁ బ్రసాదించి దివ్యులఁ జేసియుండును.

ఇట్టివెఱ్ఱివ్రాఁతలకు సమాధాన మేమి యీయము? శ్రీవీరేశలింగముపంతులుగారిని శ్రీజయంతి రామయ్యపంతులుగారిని వారిదోషము లెవ్వియో సకారణముగఁ జూపలేక నింద్యగ్రామ్యంబుల వర్షింపఁజేయఁ గలమాకడపమిత్రులు నన్ను "సృష్టికర్త"నని నిందించి రనుట యొకవింత కాదు. కామెరలు గలవానికి లోకమెల్లఁ బసుపురంగేకదా! దురదృష్టవశమునఁ గడపమిత్రులకుఁ గోదండరామస్వామియే ప్రత్యక్షమై నాకుఁ బోతన భాగవతమును గృతియీయలే దని చెప్పినచో వెంటనే యాంధ్రవాల్మీకులు నాంధ్రవాల్మీకిరామాయణకృత్యాదిని షష్ఠ్యంతములను బుఱ్ఱునఁజించి పారవేయుదురని నేను బాలకులకు మనవిచేసికొనుచున్నాఁడను. ఇది సత్యముగఁ జేయుదురో లేదో యాంధ్రవాల్మీకులనే యడిగి తెలిసికొనుఁడు. నరుఁడైన సరే—నారాయణుఁడైన సరే—ఒంటిమెట్టలోఁ బోతన్న కాఁడననిండు—సకారణముగ నిరూపింపనిండు. మామిత్రు లట్టివానిపై వెంటనే "అసత్యవాది—పాపాత్ముఁడు—దొంగ—కూటసాక్షి"—మొదలగు పదములతో దండకమును రచియించెదరు. అట్టియెడ వారిపంటిక్రింద కైనఁ బనికిరానినావంటి యపండితునిఁ దిట్టుట వారి కొకలెక్కయా?

వారివలె నేనుగూడ నింద్యగ్రామ్యములకు దిగవలసియుండును. కాని "కో

మును (సం. 6 పుట. 406) పరిషత్పత్రిక. కూటసృష్టి—తెఱమఱుఁగులు—యథాశక్తిసహాగమనములు." ఇత్యాదిపదముల నాంధ్రవాల్మీకులును గడపమిత్రులును గుత్తకుఁ దీసికొని పరిషత్పత్రికాకార్త్స్న్యము నీవఱకే మలినపఱచియున్నారు. ఆ నిఘంటువును వారే పూర్తిచేసినారు. నాకీవ్రాఁతలపై నాగ్రహము రాలేదు. దుస్థితికి వెఱ్ఱివ్రాఁతలకు జాలి కలుగుచున్నది. కావున వారియుపనిందల నుపేక్షించి వారి కొక్కహితోపదేశము జేయుచున్నాఁడను—పోతన్న సాక్షిగాఁ గోదండరాముఁడు సాక్షిగా వారీమాటల నాలకింతురుగాక!

"మిత్రులారా! మీకుఁ బోతనయం దున్నయభిమానమునకు మావందనములు. కాని యభిమానమును సత్యము తెలినప్పుడుకూడ విడువకున్న దురభిమాన మగును. మీ రాంధ్రులు. మీపై మాలో నెవ్వరికి నాగ్రహము లేదు. గోదావరిజలములఁ ద్రావిన యేభాషాభిమానియు మీకడపమండలమునకు వ్యతిరేక మగులిఖితాధారముల నొకయక్షరమైన సృష్టియొనర్పఁ బ్రయత్నించుట లేదు. అట్టిపాపాత్ముఁడు, దేశభాషావాఙ్మయద్రోహి, గోదావరిమండలమునఁ బుట్టఁడు. ఒకవేళ మీ రీమాటల నమ్మలేరా? అట్లయినచో దిక్కుమాలిన ధర్మపురినో, మఱియొక యాధారమునో తీసికొని యోరుఁగల్లువాదమును నిలుపవలసినంత యగత్యము లేదు. అమోఘనిదర్శనములుగ బమ్మెర, వెలిగందల, యేర్చూరు లొక్కచోట నున్నవి. ఇది మీరు కాదనలేరు. ఉన్నసాక్ష్యము చాలదందురా? చాలకపోయినఁ బ్రస్తుతవాదము సందియముగనే యుండనిండు. అంతేకాని గోదావరిమండలమువా రోరుఁగల్లువాదమునే స్థిరపఱుప నెంచినచో మీరు సులభముగ వెక్కిరింపఁ గలయాధారము లుండునారాయణశతకమును బ్రకటించియుండరు. "కూటసృష్టి" గద్య నెక్కించియుండరు. రెండుచోటులనున్నధర్మపురిని బట్టుకొని ప్రాఁకులాడరు. వారు "కూటసృష్టి"కి వెనుదీయని నీచులే యైనచో మీ రింతకాలము వాదమును సాగించి యుండలేకపోవుదురు. ఓరుఁగల్లునందే పోతన్న జన్మించినట్లాతనితండ్రి వ్రాసినజాతకగ్రంథమునే సృష్టించియుందురు. ఏకశిలానగర మోరుఁగల్లని యచ్చటనే పోతన్న యుండెనని శిలాశాసనమునే చెక్కించియుదురు. కావున వెఱ్ఱివ్రాఁతలు వ్రాసి మీగౌరవమును మీరే చెడఁగొట్టుకొనక సరళప్రసంగము లొనరింతురుగాక. ఆంధ్రమాత కుడిచేయి యగుకడప మీకుఁ బ్రీతికరమా? ఆమె యెడమచేతికడ గాడిదలు సుగంధములు మోయునని మీ కసహ్యమా? తల్లికాలును బ్రేమించి చేతినిఁ బ్రేమింపని మందుఁ డెందయినఁ గలఁడా?

పోతన్న యాంధ్రమాతప్రియపుత్రుఁడు ! ఆతఁ డొకసారి తల్లియొడిలో నుండును. మఱి యొకసారి మూపుపై గంతులువేయును. ఇంకొకతరి నామెను గౌఁగిలించుకొనును శివకేశవభేదశూన్యుఁ డైనపోతన్నవిషయములో మన కీతగవులాటలేల? ఓరుఁగల్లేమి ? ఒంటిమెట్టయేమి ? మనదంతయు నాంధ్రదేశమే ! మనకుఁ బోతన యెచ్చటివాఁడైనను భాగవతము సర్వజనపఠనార్హమే. చరిత్రజ్ఞు లైనవారు వారి వారికిఁ దోఁచిన సిద్ధాంతములను, దొరకినయాధారములను బ్రకటించి పోతన్న నొకసారి తల్లిపాదములపైని,నింకొకసారి యమ్మశిరముపైని నుంచెదరు. సత్యాసత్య విమర్శనమునకు దొరకుందురు. అంతమాత్రమున నేయాంధ్రవాల్మీకులుచెక్కించిన కృతిబొమ్మయో, చెడిపోవునని, యొక్కరు పడినభ్రమకై, యొకకాలమునందుఁ బడిన భ్రమకై, యెల్లర నెల్లకాలములయందును దప్పుమార్గముల నుండుఁడనుట న్యాయమా ? కావున మీ రిట్టివాదములకు దిగకుఁడు.

ఇఁక వారు నన్ను "మహాపండితుఁడ నని, విద్యాధికుఁడనే" యని హేళన మొనర్చిరి. పండితుఁ డైనవాని కది హేళనము కాని నాకుఁ గాదని సంతోషించుచున్నాఁడను. "యథామాతృకముగ ముద్రించితిని" అన్ననాపీఠికావాక్యమునకు "యథాశక్తిసహగమనమా?" యని సభాముఖమునఁ బలికి—నుడివి—ఏమనను? ఉపన్యసించి—తిట్టినారు! గోదావరిమండలమున మే మసభ్యముగ నెంచు నీతిట్టునకు వారికి వందనసహస్రములు. ఇంతతిట్టు పరు లెవ్వరు నన్నుఁ దిట్టఁ గలరు ? వారు నాంధ్రసోదరులు గనుక దూరమైనను నన్నుఁ దిట్టఁగలిగినారు. తిట్టినవారిని దీవింపవలయునని పెద్దలు చెప్పుదురుగావున వా రితోధికాభివృద్ధి నొందుదురుగాక యని నేను దీవించుచున్నాఁడను. "నీవు దీవించుట యేమి ? య పండితుఁడ"వని మఱలఁ దగవులాడుదు రేమో ? అందువలన మానుచున్నాఁడను ! నారాయణశతకము పోతన్న దగునో కాదో నిర్ణయింపవలసినది మహాజనులు. కావునవా రీక్రిందిపద్యములఁ జూచెదరుగాక !

"ప్రాయికముగ యథామాతృకముగనే (చదువరులు నిష్పక్షపాత మగు సిద్ధాంత మొనర్పవీలుండునని) ముద్రించుచున్నాఁడను."

మ. భూతవ్రాతము నంబుజాసనుఁడ వై పుట్టింతు,విష్ణుండ వై
ప్రీతిం బ్రోతు,హరుండ వై చెఱుతు,నిర్భేద్యుండ వై త్రిగుణో
పేతం బై పరమాత్మ వై నిలుతు,నీపెం పెవ్వరుం గాన ర
జ్జ్వాతోద్భూతసుజాత పూజితపదాబ్జశ్రేష్ఠ ! నారాయణా !

మ. పరమం బై పరతత్త్వ మై సకలసంపత్సార మై భవ్య మై
సురసిద్ధోరగయక్షపక్షిముని రక్షోహ్యగ్రహాంతస్స్ఫుర
ద్వరసుజ్ఞానసుదీప మై శ్రుతికళావ్యాపార మై సిద్ధ మై
సరి లే కెప్పడు నీదునామ మమరుఁ సత్యంబు నారాయణా! ॥౩౪॥

మ. అధికారౌఘతమోదివాకరము నై యద్రీంద్రజాజిహ్వకుఁ
సుధ యై వేదవినూత్నరత్నములకుఁ సూత్రాభిధానంబు నై
బుధసందోహమనోహరాంకురము నై భూదేవతాకోటికిఁ
విధు లై మీబహునామరాజి వెలయుఁ వేదాత్మ! నారాయణా! ॥౩౫॥

ఇట్టిపద్యములు ౭౮, ౮౦, ౮౧, ౯౧, ౯౨, ౯౩ మొదలగుపద్యములఁ జూడుఁడు! శతకము దగ్గఱ లేనివారు అంధ్రపత్రిక 10వ సంవత్సరాదిసంచికలో మఱికొన్నిపద్యములు చూడఁగలరు.

కవి తాను భాగవతమును ముందు వ్రాసెద నన్నపద్యము లీశతకమునందును, నారాయణశతకానంతరము కొంతకాలముతరువాత వ్రాసినభాగవతములో (నాయభిప్రాయనుసారముగ) "నారాయణకథాప్రపంచరచనాకుతూహలుండ నై"యని వ్రాసినవచనమును బాఠకులు విమర్శబుద్ధితోఁ జూచెదరుగాక! శతకములు కవులు బాల్యమునందుఁ బద్య, వృత్త, రచన మలవాటుచేసికొనుటకును, ప్రథమకావ్యములు భగవత్పర మగుస్తుతిగా నుండిన శుభమనియుఁ, దలంచి కొందఱు కవులు పద్యసాధనమునకు శతకములు వ్రాసి రనియుఁ బెద్దలు చెప్పుమాటలుకూడఁ బాఠకులు జ్ఞప్తియం దుంచుకొని యవి యీ శతకమువట్ల సత్యము లగునదియుఁ గానిదియుఁ జూచెదరుగాక !

మ. కన వొప్పఁ పసిమేసి ప్రొద్దుగలుగం గాంతారముం బాసి య
ప్పసియు న్నీవును వచ్చుచో నెదురుగాఁ బై కొన్నగోపాంగనా
రసవద్వృత్తపయోధరద్వయహరిద్రాలేపనామోదముల్
పసఁ గొంచుఁ బసిఁగొంచు వచ్చుటలు నే భావింతు నారా. ॥ ౪౫ ॥

మ. చన్నుల్ మీఁదికి చొకళింప నడుముం జవ్వాడ కందర్పసం
పన్నాఖ్యంబు నటింపఁ జాఱి కబరీభారంబు లూటాడఁగా
విన్నాణంబుల నొప్పగోపికలు గోబృందంబుతో వచ్చుమీ
వన్నెల్ కన్నుల ముంచి గ్రోలుటలు నే వర్ణింతు నారా. ॥ ౪౬ ॥

మ. కేలఁ గోలయు గూటిచిక్కము నొగిం కీలించి నెట్టంబుగాఁ

బీలీపింఛముఁ జుట్టినెన్నడుమునం బింఛావళిన్ గట్టి క
న్గాలంకారకదంబగుచ్ఛమధుమత్తాలిస్వనం బొప్పు నీ
వాలన్ గాచినభావ మిట్టిదని నే వర్ణింతునారా. ‖ ౨౦ ‖

ఈపద్యము దేవకీనందనశతకమునందలి 16వ పద్యముతోఁ బోల్చునది.

మ. కాళిందీతటభూమి నాలకదుపుల్ కాలూది మేయన్ సము
త్తాలాలోలతమాలపాదపశిఖాంతస్థుండ వై వేణురం
ధ్రాళిన్ రాగరసంబు నిండ విలసద్రాగంబు సాధించి గో
పాలవ్రాతము గండుగోయిలలు గా వర్ణింతునారా. ‖ ౨౧ ‖

మ. నిను వర్ణింపనిజిహ్వ దాఁబడటికా? నీలాభ్రదేహాంగకా!
నినునాలింపనిచెవ్లు దాఁ బడటికా? నీరేజపత్త్రేక్షణా!
నినుఁ బూజింపనికేలు దాఁ బడటికా? నిర్వాహకత్యాగతలా!
నినుఁ జింతింపనియాత్మ దాఁ బడటికా? నిర్వాణనారాయణా! ‖ ౨౨ ‖

మ. నిను వర్ణింపనివాఁడు మూఁగ మదిలో నీసత్కథాలాపముల్
విని మోదింపనివాఁడు చెవ్డు మఱి నిన్ వేడ్కన్ మనోవీథినిన్
గని పూజింపనివాఁడు నాశకరుఁడౌ కర్మక్రియారంభుఁడై
తనలోఁ గాననివాఁడు నీచమతి వో తత్త్వజ్ఞ నారాయణా. ‖ 23 ‖

ఈశతక మలాక్షణిక మైనదనియు, బూతులబుంగ యనియు, నెవ్వఁడో పేరు చెప్పుకొనుట కిష్టము లేనికుకవి వ్రాసె ననియు వ్యాసకర్తలయభిప్రాయము. ఇందుఁ గొన్ని యప్రమాణప్రయోగము లున్నమాట సత్యము. కొన్ని లేఖకదోషము లుండియుండును. అవి దిద్దుటకు వీలులేనిపదములుగా మాఱి యుండును. ఐన నిప్పు డేడెనిమిదిప్రతులు సంప్రతించి మంచిప్రతి వ్రాసికొనవచ్చును. దానికేమి? మావ్యాసకర్తలు హతాశు లగున ట్లీశతకము ప్రాచీనలాక్షణికులు ప్రమాణగ్రంథముగ నంగీకరించిరని మనవిచేయవలసియున్నాఁడను. రంగరాట్ఛందమునందలి యతిప్రకరణము చూడుఁడు! అందీశతకమునందలి 13వ పద్యము "భీమాకారవరాహమై భువనముల్ భీతిల్లి కంపింప" అనుపద్యముదాహరణముగఁ దీసికొనియున్నాఁడు. మాకడపమిత్రులు దానినిఁగూడ నోరుఁగంటివాదులు లేఖ్యమునడుమనిరికించి మఱియొక కూటసృష్టికిఁ గర్తలై రేమో కడుజాగరుకతఁ బరిషత్తునందును, ప్రాచ్యలిఖితాగారమునను గల రంగరాట్ఛందములప్రతులఁ బరిశీలించెదరుగాక! కనుక నిది మాకడపమిత్రులు నిర్ణయించినట్లు బూతులబుంగ

కాదు. లేఖకులు తప్పులకుప్పగానొనర్చిరి. కొన్ని కవితప్పులున్నను నారాయణశతకము ప్రసిద్ధ కవికృతముకావుననేధర్మవెచ్చకస్తూరిరంగకవి యీశతకమును లాక్షణికముగ నెంచెను—కావున నిప్పుడు మనవారివాద మేమట్టమునకు దింపవలెనో పాఠకులేయెఱుఁగుదురుగాక! ఒంటిమెట్ట కోదండరామస్వామికి జయమగుఁగాక! ఇప్పటికే వ్యాసము చాల దీర్ఘమైనది. కావున వ్యాసకర్తల యితరసందేహములు (1) బాల్యమున రచియించెనా (2) పోతన్న విశిష్టాద్వైతభావముల వ్రాయునా? (3) పోతన్న కిట్టివ్యాకరణదోషము లున్నవా? యనుసందేహములు నేను దేల్పవలసిన యగత్యము లేదు. దానికిఁ బాఠకులే సమర్థులు.

కడపట నొకమాట! నారాయణశతకము పోతన్నది కాకపోయినను బోతన్నసమాజమువారికి లాభము లేదు. దానిప్రకటనమునకుఁ బూర్వమే యోరుఁగంటివాదము స్థిరపడినది. అప్పటికంటె నారాయణశతకప్రకటనవలన నోరుఁగంటివాదులకు లాభ మేమియుఁ గలుగలేదు. ధర్మపురియందురా? మీ కడపమండలమునను గలదు. కావున నారాయణశతకము "కూటసృష్టి"యనియు నోరుఁగంటివాదులు చేసి రనియు మీరు వ్రాసినది యసత్యమని మీకే తోఁచుట లేదా?

నదులపద్యములో గోదావరి లేదనియు నది పోతన్న వ్రాయలేదనుటకు గోదావరితీరమువాఁడు కాఁడనుటకు నొకగొప్పయాధార మని వ్యాసకర్తయభిప్రాయము. ఇదిగో! ఇక్లే మీవాదమును మీరే బలహీన మొనర్చుకొనుచున్నారు. ఆపద్య మిది.

"భవనాశిన్ గయ తుంగభద్ర యమునన్ భాగీరథిన్ గృష్ణ వే
త్రవతి న్నర్మద పెన్న బాహుద పయోరాశి న్వియద్గంగ యం
దవగాహంబున నైనపుణ్యము లొగి న్నారంగ నేఁ డిచ్చటన్
భవదంఘ్రిస్మరణంబునన్ గలుగు నోపద్మాక్ష నారాయణా." ॥ ౮౭ ॥

గోదావరిపేరు చెప్పలేదు. చిన్నచిన్ననదులనుగూడఁ జెప్పినాఁడు. గంగపేరు "భాగీరథి"యని "వియద్గంగ"యని రెండుమార్లు చెప్పినాఁడు. కావున "గంగకుఁ జని గ్రుంకులిడి"యనుటలో గంగకుఁ బర్యాయపదముగ గోదావరినే చెప్పె ననువాదము స్థిరమగుచున్నదికదా! ఏమిచేయుము? ప్రాచీన మగుశతకములలో నదులపద్యములఁ గొందఱు చెప్పిరి. కాని గోదావరిని మానలేదు. ఉదాహరణముగ రంగశాయిశతకమునుండి యొకపద్యము.

కోరి తదీయనామ మొనఁగూర్చి జపించెడువారి కెల్ల భా
గీరథి వేణి స్వర్ణముఖి కృష్ణ సముద్రము తుంగభద్ర కా
వేరి మలాపహారి ఘనవేత్రవతీనది పెన్న గౌతమీ
తీరములందు స్నానములఁ దీర్చినపుణ్యఫలంబు లిచ్చుభూ
భారుఁడు రంగశాయి మనపాలఁగలండు విచార మేటికే. ॥ ౬౫ ॥

అనిపద్యము బంచపాదిగ నొనరించెనేకాని గౌతమిని విడువలేదు. కావున నారాయణశతకకర్త "గంగ"యనుపదము గౌతమిపరముగా వాడెనని గంగపేరు రెండుసార్లు పేర్కొనుటవలన నంగీకరింపవలసివచ్చుచున్నది. వీరియసరసవాక్య సంఘటితోపన్యాసవిమర్శనము సహ్యముగాని కార్యమైనను మహాభక్తుఁడైనపోతన్న ప్రశంస కొంతకాలమైన నాచేతఁ జేయించినందులకును, సాహిత్యపరిషత్పత్రికకొకవ్యాసము నావంటియపండితుఁడు వ్రాయుట కవకాశముఁ గల్పించినందులకును మాకడపమిత్రులకు వందనము లొనరించుచున్నాఁడను. ఇప్పటి కింతతో విరమించుచున్నాఁడను. ఈన్యాసమునకుఁ బ్రతిపక్షులు ప్రత్యుత్తరము వ్రాసినయెడలఁ బనికి మాలిన వాదప్రవాహమునం దీక నేను మునిఁగి నాకాలమును వ్యయపఱచుకొన లేకపోయినచోఁ బాఠకులు నన్ను మన్నింపవలయునని ప్రార్థించుచున్నాఁడను. నారాయణశతకము పోతన్నకృత మనుకొనుటకు నాకారణములు తెలియఁగోరు వారు నాచే రచియింపఁబడు "పోతనామాత్యజీవితము" నందుఁ జూడఁగలరు. కడపమిత్రులారా! సెలవు! పాఠకోత్తములారా! దయయుంచుఁడు.

వంగూరి సుబ్బారావు.

# విక్రమార్క-చరిత్ర — విషయానుక్రమణిక.

ఖ.

ద.

ధ.



న.

ర.



ల.



వ.

### శ.

స.

హ.

(శ్రీరామచన్ద్రాయ పరబ్రహ్మణే నమః.)

# గ్రంథవిమర్శనము.

(ఆంధ్రశాకుంతలము - శ్రీరాజా మంత్రిప్రెగడ భుజంగరాయప్రణీతము.)

భాషలు కొన్ని, వాక్యములశబ్దవ్యవస్థితియందును, నర్థములవ్యవహారశైలియందును, బరస్పరము భిన్నములై విజాతీయములుగా నుండుట గలదు. కాఁబట్టి యొకభాషలోనివిషయమును విజాతీయ మగుమఱియొకభాషలోఁ జెప్పునప్పు, డేశబ్దమున కాశబ్దమునో తత్పర్యాయమునో పెట్టి మక్కికి మక్కిగా రచించినయెడల నది యంతగా రుచింపదు. తుదకుఁ గవిహృదయమును మూలాభిప్రాయమును, భాషాస్వభావమును బాటించి రచించినదే చక్కఁగా నుండును గాని 'గోకంబర్డు' భాషాంతరము పనికిరాదు. అందును రసభావాదిప్రధానములగు కావ్యనాటకాదులను భాషాంతరము సేయునపుడు, మొదటి వానియందలి పాకమును, గుణమును, రసమును గూడ రెండవదానియందుఁ బొందుపఱిచిన యెడల, నది మఱింత మెఱుఁగుగా నుండును. మఱియు నొకసమాసమం దర్థపుష్టికిఁ బ్రాణభూత మగుశబ్దమునుగాని, యొకవర్ణనమందు భావచమత్కృతికి జీవాతు వగుసరసవస్తువును గాని విడుచుటవలన దాని జీవకళ వాసినట్లుండును. కొన్నియెడల నొకయర్థమునే భంగ్యంతరమునఁ గూర్చునపుడు, మొదటిభంగిని గూర్చిన శబ్దములపొందునందలిసారస్యము రెండవదాని శబ్దగుంభనమందుఁ గానిపింపకపోవచ్చును. కాఁబట్టి భాషాంతరము సేయునపుడు మూలమందలి యర్థచమత్కారములును ధ్వనిసారస్యములును ముఖ్యముగా నాభాషాంతరమునఁ గూర్చుటయే ప్రతిభాకౌశలము. ఇవి స్థూలదృష్టికిఁ దోఁచుసామాన్యనియమములు; సహృదయభావ్యము లగుసూక్ష్మనియమములు మఱియుఁ బెక్కు లుండవచ్చును. సామాన్యగ్రంథములవిషయ మిట్లుండ, సకలనాటక శిరోఽలంకారభూత మగుశాకుంతలనాటకమును భాషాంతరము సేయుటనుగూర్చి చెప్పవలయునే !

శ్రీరాజా మంత్రిప్రెగడ భుజంగరావుబహద్దరుగారు తెనిఁగించిన శాకుంతల నాటకమును జూచితిమి. ఇది మొత్తమునకు యథామూలముగాను రసవంతము

గాను నున్నది. పద్యము లించుమించుగా మూలమువలెనే యర్థపుష్టి గలిగి యున్నవి. కాని, యాయాపట్టులందు మూలాభిప్రాయము ననుసరింపకయు భాషాస్వభావమున కనుగుణముగాకయుఁ గొన్నిరచనలు గానిపించుచున్నవి. కొన్ని యుదాహరణములు చూపెదము :—

మూలము—.

'నన్విమమేవ నాతిచిర (అచిర) ప్రవృత్త ముపభోగక్షమం గ్రీష్మర్తు మధికృత్య గీయతామ్. సంప్రతిహి :—

శ్లో॥ సుభగసలిలావగాహాః
పాటలసంసర్గ సురభివనవాతాః।
ప్రచ్ఛాయసులభనిద్రా
దివసాః పరిణామరమణీయాః ॥ (అంక. ౧.)

తెనుఁగు—

'నూతనావతారమై భోగోపయోగ మగునీగ్రీష్మర్తువుంగూర్చియె గాన మొనర్పుము. ఇప్పుడు గదా.'

శ్లో॥ జలవిహారంబు లతిమనోజ్ఞంబు లెందు
గహనపవనంబు పాటలగంధిలంబు
నిబిడ మగునీడ నిద్రఁ జెందించునట్టి
వాసరంబులు దివసాంతభాసురములు. (3 పుట.)

'నాతిచిర (అచిర, ప్రవృత్త'మ్మనుటకు 'నూతనావతార' మనుట యంతగా సరియైనతెనుఁగు గాదు. అందలిసారస్యము నిందు లేదు. 'నాతిచిర (అచిర) ప్రవృత్త'మ్మనఁగాఁ 'జిరకాలముగా వచ్చియున్నది గాదు; వచ్చి స్వల్పకాలమైనది'యని యర్థము గాని 'క్రొత్తగా నవతరించిన'దని కాదు. దాని సారస్యము గ్రీష్మస్య నారమ్భో నాపి పరిణతిః—కిన్తు పరిపోషదశైవ ప్రోక్తా. ఆరమ్భే వసన్తధర్మాణాం సఙ్కరః. పరిణతౌ వర్షర్తుధర్మాణా ముపక్రమావస్థా. తదా గ్రీష్మధర్మా స్సాఙ్కర్యేణ స్ఫుటం నజ్ఞాయన్త ఇతి పరిపోషదశైవ ప్రోక్తా' అనియు 'అచిరప్రవృత్త మిత్యనేన తదుత్పన్నపుష్పాదేః సౌరభ్యాద్యతిశయో వ్యజ్యతే' అనియు వ్యాఖ్యాత లుదాహరించిరి. ఋతుసంహారమునందు.

శ్లో॥ 'ప్రచణ్డసూర్యః స్పృహణీయచన్ద్రమాః
సదావగాహక్షమవారి సఞ్చయః

దినాన్తరమ్యోఽభ్యుపశాన్తమన్మథో
నిదాఘకాలోఽయ ముపాగతః ప్రియే.'

అని ప్రచండసూర్యత్వమును నభ్యుపశాంతమన్మథత్వమును నిదాఘలక్షణములుగాఁ బరిగణితములు. వీనిచే గ్రీష్మర్తు వుపభోగక్షమము గాదు. కావున నాలక్షణము లింకను గలుగలేదనియు సదావగాహక్షమవారిత్వాదులు మాత్రము గలిగి యున్నవనియుఁ గాఁబట్టియే యిది యుపభోగక్షమముగా నున్నదనియు శృంగారాంగిక మగు ప్రకృతనాటకమున కనుగుణముగాఁ జెప్పుటకై 'నాతిచిరప్రవృత్త'మ్మనుట తెలియునది. ఈసారస్యము 'నూతనావతరి' మనుటచే స్ఫురింపదు. 'ప్రచ్ఛాయ'ములనఁగా దట్టంపునీడపట్టులు గాని నీడలు గావు. నీడపట్టులకు నౌపచారికముగా నీడ లనవచ్చును. 'ప్రచ్ఛాయసులభనిద్రాః' అనుటకు 'ఆదినములందు నిద్ర సులభముగా వచ్చు'నని యర్థము కాని, 'ఆదినములు నిద్రను జెందించు' నని యర్థము కాదు. ఈ రెండర్థములకు భేద మాత్రగా లేదన్నను 'నిద్రను జెందించుదినము' లనుటకంటె 'నిద్ర సులభముగాఁ జెందుదినము'లనుట యాఋతువునుపభోగక్షమత్వమునకును రామణీయకమునకును మఱింత పోషకముగా నున్నది.

మూలము.

శ్లో॥ అనాఘ్రాతం పుష్పం కిసలయ మలూనం కరరుహై-
రనావిద్ధం రత్నం మధు నవ మనాస్వాదితరసమ్
అఖణ్డం పుణ్యానాం ఫలమివ చ తద్రూపమనఘం
న జానే భోక్తారం కమిహ సముపస్థాస్యతి విధిః॥ (అంక. ౨.)

తెనుఁగు.

మ. అనఖచ్ఛిన్నమృదుప్రవాళము ముఖానాఘ్రాతపుష్పంబు నూ
తన మై భుక్తరసంబు గానిమధు,వంతర్వేధ మొకింతఁ జెం
దనిరత్నంబు,నఖండపుణ్యఫలమై దైవాఱు నా లేమ పా
వనరూపంబు భుజింపఁగా నెఱుఁగ దైవంబెవ్వరిం గూర్చునో. (౨౨ పుట.)

మూలము చాల మధురముగా నున్నది. తెనుఁగున శబ్దగుంభన మంత మధురము గాదు; పెటుకుగా నున్నది. 'ముఖానాఘ్రాత' ముఖముచేత నాఘ్రాత మెట్లు? ముఖశబ్దము నాసికయం దుపచరించు ననుట గౌరవగ్రస్తమై యొ

ప్పిదము గానేరదు. దీనికంటె శ్రీవీరేశలింగము పంతులవారి తెనుఁగు మధురము గానున్నది.

ఉ. వాసనచూడనట్టి ప్రసవంబు,నఖంబులఁ ద్రుంపనట్టినూ
త్నానమపల్లవంబు,నరు లాననిగ్రోవ్విరిదేనె, సూచివి
న్యాసము లేనిరత్నము,మహాతతపుణ్యఫలంబుఁ బోలునా
భాసురగాత్రిసోయగ మెవండు భుజింప విరించి వ్రాసెనో.

మూలము.

శ్లో॥ క్షామక్షామకపోల మాననమురః కాఠిన్యముక్తస్తనం
మధ్యః క్లాన్తతరః ప్రకామవినతా వంసౌ ఛవిః పాణ్డురా
శోచ్యాచ ప్రియదర్శనాచ మదనక్లిష్టేయ మాలక్ష్యతే
పత్త్రాణామివ శోషణేన మరుతా స్పృష్టా లతా మాధవీ,
(అంక. 3.)

తెనుఁగు.

శా. చెక్కుల్ చొక్కు మొగంబుఁ జన్గవబిగి [illegible]జెడ్డ వక్షంబునుఁ
గ్రుక్కంబాఱినకౌను,వెల్లనగుమేనుం, గ్రుంగుమూఁపుల్ దగఁ
నిక్కం బీమె మరుండు నొంపఁజెడియుఁ నేత్రోత్స[illegible] బిచ్చేదుఁ
జొక్కాకుల్ వడఁ జేయుగాలి వోలయుఁ సొంపారు[illegible]నే. (పుట.3౭.)

'క్షామక్షామకపోల'మ్మనుటకు 'చెక్కుల్ చొక్కు మొగం' బనుట [illegible]యైన తెనుఁగు కాదు. 'చొక్కు' 'క్రుంగు'—ఇవి యిట భూతార్థంబున [illegible] ములు. ఇట్లె 'తద్ధర్మార్థకవిశేషణం బసహాయతం ద్రికాలవాచి యగు' ప్రౌఢవ్యాకరణవిధి నాశ్రయించి 'సంస్కారో ల్లిఖితో మహామణిరివ క్షీణోపి నాలక్ష్యతే' యనుచో 'ఉల్లిఖిత' యనుటకు 'సానఁబట్టిన' (పుట 68) యన వలసినదానికి మాఱుగా 'సానఁబట్టు' అని తెనిఁగించిరి కాఁబోలు. తద్ధర్మార్థక విశేషణంబునకు భూతకాలవాచిత్వంబు ప్రయోగంబులం దతివిరళంబు కావుననే బాలవ్యాకరణమందును లాట్టు వర్తమానభావ్యర్థాదులం జెప్పఁబడినది గాని భూతార్థంబునం జెప్పఁబడ లేదు. కపోలము 'క్షామక్షామము'; మధ్యము 'క్లాంతతరము'; అంసములు 'ప్రకామవినతము' లనెడి యీ విశేషణము లందు 'క్షామ' ,తర' 'ప్రకామ' శబ్దము లావిశేషణములను మన్మథక్లిష్టతకు విశేషలక్షణము లని తెలుపుటకే కాని పాదపూరణమునకుఁ గావు. ఆలక్షణములె నాయకుని మనోరథధాటికి ఘంటాపథములు. అవియె శృంగారరసప్రరోహము

నకు మూలబీజములు. ఆసొంపులు తెనుఁగునందు లేవు. మఱియు 'శోచ్యాచ ప్రియదర్శనాచ మదనక్లిష్టేయ మాలక్ష్యతే' యనుటకు 'మన్మథునిచే నలంగినదై శోకింపఁదగినదయ్యుఁ జూడ నింపుగా నున్న' దని యర్థము. 'తామరతామరక పోల' త్యాదులచే 'శోచ్య'; అవి మదనకృతము లనుటచే 'ప్రియదర్శన' యని యాశయము. దీనికి 'ఈమె మరుండు నొంపఁ జెడియున్ నేత్రోత్సవం బిచ్చెడు' నని తెనుఁగు. ఇందు 'శోచ్యా' అనుటను దెలిఁగింపలేదు. ఇది యొక సరసవస్తుత్యాగము. 'ప్రియదర్శనా' యనుటకు నేత్రోత్సవం బిచ్చెడు'ననఁబడినది. చూపునకు నింపుగా నున్నదనుట తగునుగాని చూపునకుఁబండువుగా నున్నదనుట యతిమాత్రము. ఇంతేకాక 'మరుండు నొంపఁజెడియు' ననుటచే నశ్లీలధ్వనియుఁ గలుగుచున్నది. ప్రకరణము నాశ్రయించి దీనిని బరిహరించుకొనుట సద్యస్సమాస్వాదవినోదమునకుఁ బానకములోని పుడకయుంబోలె భంగము గావించుచున్నది. తెనుఁగున మొదటిపాదము సంస్కృత సమాసమర్యాద ననుసరించుటచేఁ జాల బిగిగా నున్నది. పంతులవారిది కొంచెము సరళముగాను భాషాస్వభావానుసారముగాను నున్నది.

'మొగమునఁ జెక్కులెండెఁ గుచముల్ కఠినత్వముదూలె ఱొమ్మునన్
వగచెడి పోలె నెన్నడుము?

మూలము.

శ్లో॥ నియమయసి కుమార్గప్రస్థితా నాత్తదణ్డః
ప్రశమయసి వివాదం కల్పసే రక్షణాయ
అతనుషు విభవేషు జ్ఞాతయ స్సన్తు నామ
త్వయితు పరిసమాప్తం బన్ధుకృత్యం జనానామ్.' (అంక. ౫.)

తెనుఁగు.

చ. అపథమునన్ మెలంగు మనుజాళి మరల్తువు దండధారివై
కృపమెయిఁ గావనేర్తు వడఁగింతు వివాదము ధాత్రి వైభవం
బపరిమితంబుగాఁ దనరునప్పుడు బందుగు లుందు రైన నో
నృపవర! ముఖ్యబాంధవుఁడ వీవెకదా! జను లెల్లవారికిన్. (౫౩ పుట.)

'కుమార్గమునఁ బోవువారిని దండముఁగొని నియమించుట, వివాదము లడఁచుట, రక్షించుట'—యివి బంధుకృత్యములు, ఇవి యన్నియు నీవు ప్రజలకుఁ జేయుచున్నాఁడవని యాశయము' ఇవియే భంగ్యంతరమున 'నీయందు బంధుకృ

త్యము పరిసమాప్త' మనఁబడిఁనది. ఈ భంగియందు 'బంధుకృత్య'ములనుటచేఁ బూర్వోక్త కుమార్గప్రస్థితనియమనాదుల నట్టివి గాఁ బరామర్శించుటయుఁ 'బరిసమాప్త'మనుటచే వాని నెల్ల రాజు ప్రజలకుఁ జేయుననుటయు, సిద్ధించుచున్నది. 'ముఖ్యబాంధవుఁ' డనుట పూర్వోక్తబంధుకృత్యముల నట్లు చక్కఁగాఁ బరామర్శింపదు. రాజునందు వాని పరిసమాప్తియు నంత స్ఫుటముగాఁ దోఁపింపదు. ఆపద్బాంధవుఁ డిత్యాదులందు బాంధవశబ్దము బంధుకృత్యములను సామాన్యముగా లక్షించుచున్నది గాని పూర్వనిర్దిష్టము లగువానిని బరామర్శింపదు. మఱియు నబంధువయ్యు బంధుకృత్యములు చేయవచ్చును. బంధువయ్యు బంధుకృత్యములు చేయకపోవచ్చును. కాఁబట్టియే కవి బంధు వనక బంధుకృత్యములు చేయువాఁ డన్నాఁడు. ఈభంగియందలి పూర్వోక్త పరామర్శమును నర్థసారస్యమును ముఖ్యబాంధవుఁ డనుటయం దంతగాఁ గానిపింపవు.

మూలము.

'భ్రియ ఇవ విభాతే కున్దమ న్తస్తుషారం
న చ ఖలు పరిభోక్తుం నైవ శక్నోమి హాతుమ్.'

'ప్రొద్దున నంతర్హిమ మైనకుందసుమమందుం దేఁటియుఁబోలెఁ। గన్నన భోగంబునకైనఁ ద్యాగమునకైనం బూవలే నియ్యెడన్.'

ఇది కేవలము సంస్కృతమర్యాద ననుసరించిన తెనిఁగింపు; ఆంధ్రభాషాశైలి కనురూపము గాదు. కావున మూలముకంటెఁ గ్లిష్టముగా నున్నది. పంతుల వారిది కొంత మెఱుఁగుగా నున్నది,

'హిమపూర్ణకుందమున కేఁగి ప్రభాతమునందుఁ గాంచుతు
మ్మెదకరణిం దృజింపను దమిన్ గ్రహియింపను జాల నిత్తఱిన్.'

వచనముల తెనిఁగింపు కొంతవఱకు భాషాశైలి ననుసరింపకయు సంస్కృతపదభూయిష్ఠముగాను నున్నది. విస్తరభీతిని వాని నిట చూపలేదు. ఆంధ్రవాక్యరణ మర్యాద కనుగుణములు గాని ప్రయోగములును గొన్ని కనుపట్టుచున్నవి.

'వల్కలాంచలమును . . . . విమోచనమున్ నటించె' (23 పుట.) వ్యస్తప్రయోగమునఁ దెనుఁగున 'విమోచనము'నకు 'విమోచనము సేయుట'యని యర్థము రాదు. భారతమునఁ దెనుఁగుకృదంతములకు మాత్రమె యట్లర్థము చూపట్టుచున్నది. 'రమ్యం ద్వేష్టి' అనుటకు 'పగగొను'రమ్యము (67 పుట.) నని తెనుఁగు. 'పగగొను' సకర్మకము గాదు. 'నిసర్గవక్ర మగుపోల్కిఁడి' (5 పుట.)

'దయఁ దాల్తు?' (3 పుట.) 'పెనిపింపవె' (59 పుట.) ఇత్యాదులు ప్రయోగారూఢములు గావు. సబిందుకములు నిర్బిందుకములుగాను సలఘురేఫములు లఘురేఫములుగాను పరుషములు సరళములుగాను పెక్కుచోట్ల నున్నవి.

ఈ దోషము లట్లుండ, సర్వత్రోట్లఁ దెనుఁగింపు చాల నిపుణముగాను మనోజ్ఞముగాను నున్నది.

మూలము.

శ్లో॥ యాస్యత్యద్య శకున్తలేతి హృదయం సంస్పృష్టముత్కణ్ఠయా
కణ్ఠః స్తమ్భితబాష్పవృత్తికలుష శ్చిన్తాజడం దర్శనమ్
వైక్లబ్యం మమ తావదీదృశమహో స్నేహాదరణ్యౌకసః
పీడ్యన్తే గృహిణః కథంను తనయావిశ్లేషదుఃఖైర్నవైః (అంక.౪.)

తెనుఁగు.

చ. అరిగెడు నాశకుంతల యటంచు మనంబున బెంగ గూరె; దు
ష్కర మగు నశ్రుబోధమునఁ గంఠము గ్రుగ్గె; నలంత చూడ్కి సొం
పఱె; వనవాసి నేనె యకటా! యిటు లర్తిలిఁ గుంద నింక ను
ద్ధురతనయావియోగనవదుఃఖము గేస్తుల నెట్లు లేచునో. (౪౪ పుట.)

పంతులవారి తెనుఁగు.

ఉ. కొందలమందె డెందము శకుంతల తా నపు డేఁగునం చయో!
క్రందుగ బాష్పరోధమునఁ గంఠమునుం జెడె దృష్టిమాంద్యముం
బొందె నొకింత పెంచినతపోధనులే యిటు గుంద నెంతగాఁ
గుందుదురో తమంతఁ గనుకూఁతులఁ బాయుగృహస్థు లక్కటా.

పంతులవారితెనిఁగింపున 'అరణ్యౌకసః' 'నవైః' అనుపదములు రెండును నర్థసారస్యమునకు జీవాతువులైనవి త్యజింపఁబడినవి. ఇవి శ్రీభుజంగరావుగారి తెనుఁగున నింపుగాఁ బొందుపడియున్నవి.

మూలము.

శ్లో॥ మోహాన్మయా సుతను పూర్వముపేక్షితస్తే
యో బాష్పబిన్దురధరం పరిబాధమానః
తం తావదాకుటిలపక్ష్మ విలగ్నమద్య
బాష్పం ప్రమృజ్య విగతానుశయో భవేయమ్. (అంక. ౭.)

చ. మునుఁబలికాకువా తెఱకు నొవ్వఘటించెదు వల్రఁబిందువుల్
వెనుక నెఱుఁగఁజాలమి నుపేక్ష్యయెనర్చితి నోశుభాంగిరో !
ప్రణయము మేలర్పి నాకిటిలపక్ష్మములకా నెలకొన్న బాష్పముం
బనరఁగ నింకఁ బోఁదుడిచి నాయనుతాపము నేఁడు బాయుదున్. (౧౨౧ పుట.)

శ్లో॥ ఉదేతి పూర్వం కుసుమం తతః ఫలం
ఘనోదయః ప్రాక్తదనన్తరం పయః ।
నిమిత్తనైమిత్తికయోరయం క్రమ
స్తవప్రసాదస్య పురస్తు సంపదః ॥ (అంక. ౭.)

చ. మునుమును దావి పూవు నొడముం దరువాత ఫలంబు దోఁచుఁ ; దొ
ల్తను జలదోదయంబుఁ, బిఱుదన్ బహువారిధురంబుఁ గల్గు ; ని
ట్లనె కద ! కార్యకారణములం బరిపాటివలంపనయ్యరే
కనఁబడు మీయనుగ్రహముకన్నను మున్న సమస్తసంపదల్. (పుట. ౧౪.)

ఇట్లు పెక్కుపద్యములు మూలమువలెనే చాల మధురముగా నున్నవి.

త॥ తే॥

---

# యుద్ధమల్లుని బెజవాడశాసనము.

(అక్షరముందలి ౹౹౹ అనుధ్వని తెనుఁగున నుండుట.)

యుద్ధమల్లునిశాసనమును గుఱించి ౧౯౧౩లోఁ దెనుఁగు పత్రికలయందుఁ బ్రబలవాదములు జరిగినందున నీబెజవాడశాసనము తెలుఁగువారందఱును జక్కఁగ నెఱిఁగినదియే. దీనిని ఇటీవల శ్రీయుత జయంతి రామయ్యపంతులుగారు *పరిషత్పత్రికలో టిప్పణముతోడఁ బ్రకటించియున్నారు. ఇయ్యది ఆంధ్రభాషా వ్యుత్పత్తి (Philology శాస్త్రమునకు నెంతయో యుపయోగకరమైనది కావున దీనిని బ్రకటించినందునకు నాంధ్రు లందఱును పంతులవారియెడలఁ గృతజ్ఞులు.

ఆంధ్రవిజ్ఞాన సర్వస్వమునకు నాంధ్రభాషనుగుఱించి వ్యాసము వ్రాయు నిమిత్తమై నే నీశాసనము చదువుట తటస్థించినది. అప్పుడిందు నా కొకవింత యక్షరము కానవచ్చెను.

---

* ఇది పరిషత్పత్రిక 6 సంపుటము 2వ సంచికయందును బ్రత్యేకముగఁ బుస్తకరూపమునను బ్రకటింపఁబడినది. జిజ్ఞాసువు లాపుస్తకములందలి శాసన ప్రతిబింబముల జూడ నగును.

అఱవమున ఴ అను నొకవింత యైన యుచ్చారణ గలయక్షరము కలదు. దీనిని వేఱువేఱుదేశముల అఱవవారు వేఱువేఱువిధముల నుచ్చరించుచుందురు. కొన్నిస్థలములఁ గొంచెము హెచ్చుతక్కువగ 'ష'వలెను, కొన్నిచోట్ల 'డ'వలెను మఱికొన్ని తావుల 'ళ'వలెను ఉచ్చరింపఁబడును. ఈయుచ్చారణమును, అక్షరమును మలయాళమునందును గలవు: కాని కన్నడమునందును, తెనుఁగులోను ఇప్పుడు లేవు. కన్నడమునందలి వాఙ్మయమును జూడగా ౧౩వ శతాబ్దమువఱకును ఈ వర్ణమును, దీనికి 'ఱ'అను ప్రత్యేకాక్షరమును ఆభాషయందు నుండినట్లు స్పష్టపడుచున్నది. ఇది మన బండిఱలోని అడ్డుగీటు తీసివేసిన నక్షర మెట్లుండునో, లేక వ్రాయు నెడమనము వ్రాసెడి 'ఱ' జుట్టులేనియెడల నెట్లుండునో అట్లు ఉండును. కేశిరాజు అనువాఁడు ౧౩వ శతాబ్దమున శబ్దమణిదర్పణ మను లక్షణగ్రంథ మొకటి కర్ణాటకభాషకు వ్రాసియున్నాఁడు. అప్పకవి శకటరేఫము కల శబ్దములకు జాబితా వ్రాసిన ట్లితఁడును 'ఱ' కారము గల శబ్దముల పట్టిక యొకటి యిచ్చినాఁడు. శబ్దమణిదర్పణమందలి ౧వ అధ్యాయములోని ౨౩వ సూత్రము చూడనగును. ఇందువలన, నాకాలమువఱకే యీయక్షరముయొక్క స్వతంత్రోచ్చారణము నశించి, ఏది 'ఱ' అయినది, ఏది 'ళ'అయినది తెలియక కొందఱట్లు, కొందఱిట్లు వ్రాయుచుండి రనియు, లక్షణవేత్తలింకను ఈ యక్షరమును విడువఁజాలక పెనఁగులాడుచుండి రనియుఁ దెలియుచున్నది. తరువాత నీయక్షరమును బండిఱాయుఁ గన్నడమునుండి జాఱిపోయినవి. కాని యీధ్వనియు, నక్షరంబును తెనుఁగున నెన్నఁడైన నుండెనని యెవరు ననుకొనలేదు. ఈ శాసనము వలన నాసంగతి క్రొత్తగ మనకుఁ దెలియుచున్నది. కావున నీశాసనముయోగ్యత హెచ్చైనదని యెంచవలెను.

ఈ వర్ణమునుగుఱించి మొదటఁ గొంచెము తెల్పెదను. అఱవమున ఴ ఈ యక్షరముచేఁ జూపఁబడు నుచ్చారణ గలశబ్దములు, కన్నడమున నిప్పుడు 'ళ'కారముతోను, తెనుఁగున డ'కారముతోను ఉచ్చరింపఁబడుచున్నవి. ఇందుకుఁ గొన్ని యుదాహరణములు :—

| అఱవము. | కన్నడము. | తెలుఁగు. |
|---|---|---|
| కోఴి | కోళి | కోడి |
| సుఴి | సుళి | సుడి |
| పాఴు | పాళు | పాడు |
| కూఴు | కూళు | కూడు |

కేశిరాజు తనవ్యాకరణమందు ఱకారముతోఁ జూపిన శబ్దము లిప్పటి కన్నడమున ళకారముతో వ్రాయఁబడును, తెనుఁగున డకారముతో వ్రాయఁబడును:—

| ప్రాఁతకన్నడము. | ఇప్పటికన్నడము. | తెలుఁగు. |
|---|---|---|
| తెగఱు | తెగళు | తెగడు |
| పొగఱు | పొగళు | పొగడు |
| మగఱు | మగళు | మగడు |

ఈ ప్రకారముగ నీద్రావిడ వర్ణము మూఁడుభాషలలో మూఁడువిధములుగ మాఱిపోయినది.

ఇఁక శాసమునకు వత్తము. తెనుఁగు భాషయందు నీవర్ణము యుద్ధమల్లుని శాసనకాలమువఱకు నుండెననుట స్పష్టము. ఈ యక్షరము ౬వ శతాబ్దము మొదలు ౧౩వ శతాబ్దమువఱకును కన్నడమున ఈరూపముతోనే వ్రాయఁబడుచుండెను. ఈరూపమే యీ శాసనమునందు మూఁడుచోట్లఁ గానవచ్చుచున్నది. ౧౪వ పంక్తిలో 'ఱస్ని'అనియు, ౨౧ పంక్తిలో '[అ]ఱిపిన'అనియు, ౩౫వ పంక్తిలో 'యఱిపుట' అనియుఁ గలదు. ఈ మూఁడుచోట్లను శ్రీయుత జయంతి రామయ్యపంతులుగారు ఈ అక్షరమును 'డ'కారముగనే చదివినారు. అందుచే వారిపుస్తకమున నివి 'డస్ని,' 'అడిపిన'; 'యడిపుట' అన్నరూపముతోనె కనఁబడును. కాని యీ శాసనము వ్రాసినవానిమతమున నిది 'డ'కారము కాదనుట స్పష్టము. ఏలయన నిశ్చయముగ 'డ'కార మని చెప్పుటకు వీలుగల యక్షర మింకొకటి యిందు నెన్నియో సారులు వచ్చియున్నది ఇది విడిగా ౧౧ సారులును, ఇంకొక యక్షరముతోఁ గలిసి క్రిందిభాగమున ౧౭ సారులును ఈశాసనమునందు వచ్చినది.

స్వతంత్రముగ వచ్చినస్థలములు ౧౧:—పం ౭. బెజవాడ; పం. ౮. గుడి; పం. ౧౧ విడిసి; పం. ౧౫. విడిసి; పం. ౨౩. బెజవాడ; పం. ౨౮ గుడి; పం. ౩౦ యేలెడు; పం. ౪౧. బిడ్డ; పం. ౪౨ మూఁడు; పం. ౪౫. వొడంబడి.

సంయుక్తాక్షరములో వచ్చినస్థలములు:—పం. ౩ మల్లుణ్డు; ౪ యుణ్డు. ౫. నుణ్డు; ౬ తుణ్డు; ౭ ణ్డిథిన్; ౮ భక్తుణ్డొ; ౯ ధాముణ్డొ; ౧౨. ణ్డువారు; ౧౪ ణ్డుని; ౨౨ చణ్డి; ౨౪. సుతుణ్డొణ్డు; ౨౭ మల్లణ్డొ; ౩౧ రొణ్డు; ౪౩ణ్డొ; ౪౪ తేజుణ్డు.

ఇట్లు నిజమైన'డ'కార మీశాసనమునందు ౨౮ తడవల వచ్చినది. కావున

దాని స్వరూపమునుగూర్చి సంశయము లేదు. దాని రూపమును చూచినను ఇప్పుడు మనము వ్రాయుచున్న 'డ' కారమునకు నది పూర్వరూప మనుట స్పష్టము. కావునఁ బైని ఉదాహరించియున్నాఁడు తావ్రులలోని అక్షరము 'డ' కార మనుట కు వీలులేదు. ద్వితీయా కారము నకును, ఈ శాసనమునందలి బెజవాడాది పదముల లోని 'డ' కారముయొక్క రూపాకారమునకును సంబంధము లేదు. ఇది తద్భిన్న మైనయక్షరము.

ఒక్క శాసనమునందే ఒకయుచ్చారణమునకై రెండుభిన్నాక్షరము లుప యోగింపఁబడిన వని చెప్పుటయు యుక్తియుక్తము గాదు. కావున నీయక్షరము చే భిన్నమైన వర్ణోచ్చారణము సూచింపఁబడుచుండె నని ఊహింపవలెను.

అఱవమందలి ழ అను అక్షర మేయుచ్చారణమును సూచించునో అదే యుచ్చారణను ఈ యక్షరము సూచించుననుటకుఁ గర్ణాటవాఙ్మయమే సాక్ష్యము. ఈ యక్షర మీరూపముతోనే పురాతనకన్నడమునందుఁ గానవచ్చుచున్నది. ఇది మనబండిఱావలెనె యుండి నడుమ అడ్డగీటు లేక యుండును. ఈ యక్షర మునుగుఱించి వ్రాయవలసివచ్చినప్పుడు ఇప్పటి కన్నడపువారును, ఈ రూప మునె వాడుదురు. అచ్చుపడిన శబ్దమణిదర్పణము, కిట్టెల్ రచిత కోశముఁ జూడ నగును.

యుద్ధమల్లుని ఈశాసనము ౯వ శతాబ్దమునాఁటి దని రామయ్యపంతుల వారు వ్రాసియున్నారు. ఈ కాలమునాఁటివి, అనగా ౯వ శతాబ్ద ప్రాంతపు విఱుగు కన్నడశాసనములలోఁగూడ నీరూపము చూడనగును.*

ఇఁక, మనశాసనమందు నీయక్షరయుక్తముగ వచ్చిన శబ్దముల ఉత్పత్తిని గుఱించియు, అర్థమునుగుఱించియు విచారింతము.

ఇందు 'ఱ' కారముతోఁ గలసివచ్చిన శబ్దములు మూఁడు. ౧౮వ పంక్తిలో 'ఱస్సి' (డస్సి); ౨౧వ పంక్తిలో '[అ]ఱిసిన' (అడిసిన); ౩౫వ పంక్తిలో 'యఱిపుట' (అడిపుట).

---

* Fleet's Cannada Inscriptions; Kittels' Grammar p. 15. ft; Epi. Ind. Vol. V. p. 151. ఇది ౧౦వ శతాబ్దమునాఁటిది; Alupa Canarese inscriptions at Udiyavara (7th to 11th Centuries); Epi. Ind. IX p. 15. శ్రవణ బెల్గొలలోను న్న ద్వితీయ మారసింహుని శాసనమునందు నీయక్షర మీరూపముననే, నోళంబ చోళశబ్దములలోఁ బెక్కుసారులు వచ్చును [Ep. Ind. V. p. 176.] ఇది క్రి. శ. 975 నాఁటి సంస్కృత కన్నడ శాసనము.

ఇందలి మొదటిశబ్దమునకు మూలము అఱవమునందుఁ గాని, కన్నడమునం దుఁగాని కానరాలేదు. కాని ౨వ, 3వ శబ్దములు ఒకధాతువునుండి పుట్టినవియే. అఱవమునందు அழி (అఴి) అనుధాతువు కలదు. దానిని సకర్మకముగను, అకర్మకముగను ఉపయోగించెదరు. దానికి నాశము చేయుట, పాడుచేయుట, ధ్వంసముచేయుట' కూల్చుట ఇత్యాద్యర్థములు కలవు.* పురాతన కర్ణాటకమందును ఈ ధాతువు ఴిధ్వనితోనే యుండెను. కేశిరాజువ్యాకరణమందలి ధాతుపాఠమున ఈ ధాతువు 'వినాశే' అనునర్థమున ఈయఁబడినది. కిటల్‌కోశమందును ఈయర్థమందే 'అళిసు'అను ధాతువును, 'అళువు'అను విశేష్యమును 'ఴ'కారముతోడనె యిచ్చియున్నాఁడు. కావున ఈధాతువు పురాతనకాలమందు అన్ని ద్రావిడభాషలలోను ழ అను ధ్వనితో నుండె ననియు, అది క్రమముగఁ గన్నడమున ళగను, తెనుఁగున డగను మాఱె ననియు నిశ్చయింపవచ్చును. యుద్ధమల్లునిశాసనము వ్రాసినప్పుడు దానికి డకారోచ్చారణములేదు. వచ్చియున్నయెడల 'బెజవాడ' శబ్దములోని 'డ'వంటియక్షరమే దీనిలోను వ్రాయఁబడియుండును. అట్లు ழ కారోచ్చారణముండుటవలన ఆంధ్రకర్ణాటాక్షములలో దీనికి బదులుగ నేర్పడిన 'ఴ'అక్షరము వాడఁబడినది. 'లింగంబఴి'(డి)సిన పాపంబు' అనఁగా లింగమును పీకిపాఱవేసినఁ గల్గు పాపము' లింగమును ధ్వంసముచేసినఁ గల్గుపాపమును; 'డప్పి యఴిపుట'అనగా దప్పి లేకుండజేయుట.

ఇట్లిందలి రెండుశబ్దములమూలమును అర్థమునుజూచి ఈ శాసనమందలి యీ శబ్దములలోని అక్షరము అఱవమందలి ழ కును, కన్నడమందలి 'ఴ'కును సరియైనదని నిర్ణయింపవలసియున్నది.

ఇఁక నీయక్షర మీయొకశాసనమునందే యున్నదా, యింకను ఇతరశాసనములందును గలదా యని చూడవలయును. ఇందునుగుఱించి శోధింపఁగా ౧౧వ శతాబ్దమునకుఁ బూర్వపు తెనుఁగుదేశపు శాసనములలో నీయక్షరము కానవచ్చుచున్నది. అవి యెవ్వియన :—

౧. విజయాదిత్యుని ఏడూరు శాసనము. [Epi. Ind. Vol. V. p. 118]
ఇది 799-843 కాలపు శాసనము. ఇది సంస్కృతమునం దున్నను ౨౫వ పంక్తిలో ఒక మనుష్యునిపేరు 'బోఴకిమనామా' అని యున్నది. అందువలన నాకాలమునఁ దెనుఁగుదేశమున ఈధ్వనియు అక్షరమును గలవనుట స్పష్టము.

* அழி: to blight, blast, ruin, injure, damage, annihilate; destroy, demolish, exterminate, efface [Winslows'. Tamil English Dictionary.

౨. సత్యాదిత్యుని మలపాడు శిలాశాసనము. [Epi. Ind. XI. p. 345] ఇది తెలుఁగు శాసనము. దీనికాలము స్పష్టముగఁ దెలియకున్నను, ౧౦వ శతాబ్దమునకుఁ బూర్వపుదియని తద్‌జ్ఞులయభిప్రాయము. ఇందు 'చోఴ' (చోళ) [౧వ పంక్తి] ఏఴు (ఏడు) [౮వ పంక్తి] అను శబ్దములు కలవు. 'చోళ' శబ్దము సాధారణముగ నిప్పుడు 'ళ'కారముతో వ్రాయఁబడినను బురాతన కాలపు టఱవమున ఴ కారము గలదిగనే యుండెనని అప్పయారు మొదలగు వారి వ్రాఁతలవలనఁ దెలిసికొనవచ్చును. లక్షణయుక్తముగ వ్రాయు వారిప్పటికిని ఈ యక్షరమునే ఉపయోగించెదరు. తెలుఁగు శాసనములలోఁగూడఁ గొన్ని చోట్ల ఴ అను అక్షరముతోఁ గూడ వ్రాయఁబడియున్నది. [చూడు మలపాడులోని పుణ్యకుమారు తామ్రశాసనము Epi. Ind. Vol. XI. p. 337] అక్లై 'ఏఴు' (ఏడు) అను దానికి అఱవమున సరియైనశబ్దము కలదు. ఈ ఴ ఉచ్చారణము ఈశాసనము నాఁటికిఁ దెలుఁగుదేశమునఁ గలదనుట స్పష్టము.

3. బెజవాడలోని యింద్రకీలపర్వతము మీఁదిశాసనము. [No. 883 of 1917 Epi. Collection] దీనిని రామయ్యపంతులుగారు పరిషత్పత్రికయొక్క 7వ సంపుటము, 4వ సంచికలోఁ బ్రకటించియున్నారు. ఇందలి నాల్గవపంక్తిలో ఈ యక్షర మున్నది. దీనిని మఱల రామయ్యపంతులుగారు 'డ'కారముగనె చదివియున్నారు. 'పదిఏడగు' అని వ్రాసిరి. ఇందలి 'డ'కారమునకు బదులు శాసనములో 'ఴ'కార మున్నది. కన్నడమున పూర్వము 'ఏఴు'కు 'ఏఴ్' అనుపద ముండెను. ఇప్పటికిని అఱవమున ఈ పదమున్నది. ஏழு = ఏడు. ఈ శాసనకాలము 909 ప్రాంత మని రామయ్యగారే చెప్పియున్నారు.

౪. విజయాదిత్య - ద్వితీయ అమ్మ రాజుయొక్క కలవచెర్లశాసనము [Epi. Ind. Vol. VIII] ఇందలి 35వ పంక్తిలో ఈఅక్షర మున్నది. శాసనము సంస్కృతమయమైనను మనుష్యుని పేరులో నీ యక్షరము కలదు. ఈ చాళుక్య రాజు 845 మొదలు 970 వఱకు రాజ్యము చేసినట్లు కానవచ్చుచున్నది.

౫. రెండవ చాళుక్యభీముని తామ్రశాసనము. [Epi. Ind. Vol V. p. 134] ఈ రాజు 934-945 కాలమున రాజ్యముచేసెను. శాసనము సంస్కృతభాషయందున్నను 17వ పంక్తిలో 'వేఴాంబ'యన్న పేరు వచ్చినది.

౬. నెల్లూరు మండలమందలి నలజపాడుశాసనము. దీనికాలము స్పష్టముగఁ దెలియదు. కాని అక్షరములు మాత్రము యుద్ధమల్లునిశాసనమువలెనే యు

న్నవి. ఇందు 18వ పంక్తిలో 'ఇచ్చిన' 20-21 పంక్తులలో 'శ్రీపర్వతంబుఇచ్చిన,' 23వ పంక్తిలో 'ఆళుకొడకు' అనియున్నది. ఇది తెలుఁగుశాసనము: యుద్ధమల్లుని శాసనములోనున్న 'ఇస్సి' శబ్దమిచ్చుట 'ఇచ్చి'గనుండుట యొక విశేషము.

౭. విజయాదిత్యునిది యైన కోలవెన్ను శాసనము. [South Indian Inscriptions Vol. I. p. 45. Epi. Ind. VII. p. 182 Ft 1.] ఇందును మనుష్యనామమందు ఈఅక్షరము కలదు.

౮. ప్రథమవిష్ణువర్ధనుని తిమ్మాపురము శాసనము. [Epi. Ind. IX p. 31] ఈపూర్వ చాళుక్యరాజు, 615 మొదలు 633 వఱకు రాజ్యము చేసినట్లు కానవచ్చుచున్నది. ఈ శాసనము సంస్కృతమునం దున్నను, 11వ పంక్తియందు 'పఱకివిషయ' అని యొకనాఁడు పేరు కలదు.

౯. పశ్చిమచాళుక్యరాజయిన ౧వ విక్రమాదిత్యుని నెల్లూరు తాలూకాలోని తలంచి తామ్రశాసనము. [Epi. Ind. IX. p. 98] దీని కాలము 660 అని ఊహింపఁబడుచున్నది. ఇదియు సంస్కృతముననె యున్నది. ఇందు గ్రామనామమున ఈఅక్షరము కలదు. ౨౨వ పంక్తి 'కొఱచుమకొన్రు' అనుగ్రామము పేర్కొనఁబడియె.

ఈచివర రెండుశాసనములలోను ఈ యక్షరముయొక్క రూపము మిగిలిన శాసనము లందలి యక్షరములకంటెఁ బురాతనముగ నున్నది. రెండు సున్నలను ఒకదాని ప్రక్క మఱియొకదాని నుంచి జోడించిన నెట్లుండునో యది యీ యక్షరముయొక్క మొదటిరూపము. ఇందు, అడ్డగీటు గీసిన నది బండిఱ అగును. ఇవియె క్రమముగ 'ఱ'గను ఱగను మాఱినవి.

ఆంధ్రకర్ణాటలిపి అశోకలిపినుండి పుట్టినదని పండితుల యభిప్రాయము. కాని ఉత్తరదేశభాషలలో 'ఱ', ఱఈ రెండుహల్లులు లేనందున, ఆంధ్రకర్ణాటకులీయక్షరములను నూతనముగఁ గల్పించుకొనవలసివచ్చినది. ఆకల్పించుకొనుటలోను ఈ రెండిటికిఁ గొంచెము భేధముతో నొక్కరూపమే కల్పించుటయుఁ జూడ నీరెండును కొంతసంబంధము గల శుద్ధ ద్రావిడవర్ణము లనుట స్పష్టమగుచున్నది.

ఈశాసనమందలి యింకొకశబ్దము.

యుద్ధమల్లుని శాసనమున ౩౯, ౪౦ పంక్తులను రామయ్యపంతులుగారు 'నద్ముతాత మల్లపరాజు వేరడుదానుం గట్టించె' అని చదివియున్నారు. 'వేరడు'

అనుశబ్దము సందేహాముగ నున్నదనియు వ్రాసినారు. ఈ 'వేరడు' అను దానిని 'వేరఱు' అని చదువవలయునని నా తాత్పర్యము. రామయ్యగారు 'డు' అని చదివిన అక్షరము 'డు' కాదు, 'ఱు' కాదు. అడ్డగీటు స్పష్టముగఁ గానవచ్చుచున్నది. కాన నది 'ఱు' అనుట స్పష్టము. కావున నీశబ్దము 'వేరఱు.' అన నేమి? మూల శబ్దము పేరఱు. ఇందలి పకారము వకారముగ మాఱినదని నా తాత్పర్యము. ౨౬-వ పంక్తిలో 'ప్రత్యక్షు' శబ్దము 'వ్రత్యక్షుము' అని వ్రాయఁబడినది. అట్లె యిదియు నని యెఱుంగునది. ఇఁక 'పేరఱు' అన నేమి యని విచారింతును. ఇందు పెర్ + అఱు అను రెండుశబ్దములు కలవు. పెర్ అనగా పెద్ద, అఱు అనగా ధర్మము. పేర్ శబ్దమునకు పెద్ద అనుఅర్థము అఱవము, కన్నడము, తెలుఁగు అను మూఁడు భాషలయందును కలదు. అఱు అనుశబ్దము తెనుఁగునఁ గాన రాదు. మిగిలిన రెండుభాషలలోను కలదు. కన్నడమున 'అఱు' అనురూపము ననే కలదు. అఱవమున 'అఱ' అనురూపమున నున్నది. ఈమాటలకు నాయా భాషలలో ధర్మము, దానము అని అర్థము. కావున 'పేరఱు' అనగా గొప్ప ధర్మము అని యర్థము చేయవలెను.

కే. వి. లక్ష్మణరావు,

శ్రీ.

# తిక్కనసోమయాజిజీవితము.

ఆర్యమహాశయులారా!

విద్వజ్జనభూషితం బై వెలయుచున్న యిమ్మహాసభయం దుపన్యసింపఁ గలిగిననాభాగ్యంబున కుబ్బి యిట్టిధన్యతకుఁ గారణభూతు లైనపరిషత్కార్యాలయాధికారుల కెంతయు నాకృతజ్ఞతను జూపి గుణగ్రహణపారీణు లగుసభాస్తారులకు వందన మొనరించి తిక్కనసోమయాజిం గూర్చి నా నేర్చినకొలందిఁ బండితులమ్రోల విన్నవింప నేఁటిదినంబునఁ బ్రయత్నించినాఁడ. విషయ మతి విస్తరము. నాకు జ్ఞాన మత్యల్పము. వ్యాపారాంతరములయందు నాసక్తమనస్కుఁడ నగుటం జేసి సాంతముగాఁ బరిశోధించుట కవకాశమును లేదు.

క్వ సూర్యప్రభవో వంశః క్వ చాల్ప విషయా మతిః।
తితీర్షు ర్దుస్తరం మోహా దుడుపేనాస్మి సాగరం॥

అను నార్యోక్తిరీతిని నల్పజ్ఞుఁడనే నిమ్మహావిషయముంగూర్చి యుపన్యసించుటకుఁ బండితులసన్నిధి నెంతయు సాహసించినాఁడ. రసజ్ఞుల రగుసభ్యు లించుక నాసాహసంబును సైరించి, తప్పులను క్షమించి, స్ఖాలిత్యములను సవరించి, యొప్పుల నుపలాలించి నన్ను ధన్నింతు రని యెంతయుఁ గరంబులు మొగిడ్చి వేఁడి కార్యక్రమం బరసెద.

## నెల్లూరి పూర్వచరితము.

ప్రస్తుతము మనము శాసనములవలనఁ దెలియఁదగినంతవఱకుఁ బ్రప్రథమమున నెల్లూ రేలిన రాజు ముక్కంటిరా జని యేర్పడుచున్నది. అతఁడు చోళరాజులకు సామంతుఁడై యుండి పదునొకండవశతాబ్దమున రాజ్యము చేయుచుండె నట్లూహింపఁ దగియున్నది. ఇతఁడు పల్లవవంశపురాజు. ఇతనికే, త్రినేత్రుఁడను నపరనామాధేయ ముండునట్లు శాసనములచేఁ దెల్లం బగుచున్నది. ఈపురమునకు నెల్లూ రనుపేరు వచ్చుటకు నొకచిన్న కథ గలదు. ఈ ముక్కంటి ప్రభువుయొక్క పశువులలో నొకటి ప్రతిదినము నెల్లిచెట్టు క్రింద నుండుపుట్టలోఁ బాలు గురియుచుండుటయును దానిని గనిపట్టి యారాజు అచ్చట నేమి యున్నదని పరీక్షింపఁగా నొకలింగ మగపడినట్లును, అచ్చోట నొక దేవస్థానము నిర్మించినట్లును ఆనెల్లిచెట్టుక్రింద నెలకొనియుండుటచేత నీపురమునకు నెల్లియూరు లేక నెల్లూరను నామము బరఁగిన దనియు నొక కథ గలదు. ఇప్పటికిని బ్రస్తుతము మూలస్థానేశ్వరస్వామి దేవాలయములో నీకథనే హెచ్చరిక పాటలలోఁ బ్రతిదినము పాడుదురు. కథ యొక్క నిజము మన మిప్పుడు నిరూపింపఁ బ్రబలసాధనము లేమియు లేకయున్నను, నిజముగా నుండనోపు నని యె యిచ్చట దానిని బ్రస్తావించితి. (See Boswels manual.)

మరియు నెల్లూరుపురమునకు విక్రమసింహపురం బనునపరనామం బొకటి ప్రసిద్ధిగ నున్నది. దీని కీపేరెట్లు వచ్చినది యెప్పుడు వచ్చినదియు నిర్ధారణ చేయుటకుఁ దగినంత సామగ్రి నా కిప్పటివఱకుఁ జిక్కి యుండలేదు. చోళరాజుల కాలములోఁ బండ్రెండు పదుమూఁడవశతాబ్దముల శాశనములఁబట్టి చూడఁగా నెల్లూరు దేశమునకు 'సింగపట్టునాడు' 'సింగత్తునాఁడు' అని యగపడుచున్నవి. నెల్లూరునకు నతిసమీపమున నున్న నృసింహస్వామిని బట్టియో లేక పూర్వము

దండకారణ్యములోభాగమునుండి యీమండలంబున సింహములు మెండుగా నుండిన వనుకారణముచేతనో సింహపుర మనునామ మీయూరికి నమరియుండెను. ఇప్పటికిని నెల్లూరిలో గజములు నిద్రింప వెఱచు నని ప్రతీతి గలదు. కాన నీరెండవకారణముచేతనె యిది సింగనా డని పేర్కొనంబడె. విక్రమ అనునది పౌరుషనామ మని నాయూహ. పై నుదాహరించిన శాసనములలో నెల్లూరు జయంకొండ చోళమండలములో, చేదికులమాణిక్య వలనా డనుఖండములో పి ్రైన లేక మిఢైనాడు అను ఫిర్కాలో చేరియున్న దని స్పష్ట మగుచున్నది. ఇందుకు నిదర్శనముగా నొకశాసనములోని విషయమునుమాత్ర మిచ్చెద.

శ్రీతల్పగిరిరంగనాయకస్వామియాలయకుడ్యములోనిశాసనములో నిట్లున్నది.

"చేదికులమాంగికుర్వాల నాట్టు నెల్లూరాన విక్కరమచింగపురత్తు తిరుపార్కడల్ బత్రుమెల్నివిణ్ణగరాన పళ్లికొండ పెరుమాళుక్కు" &c. &c.

Nellore Inscriptions Vol. II p. 883 No. (63) Nellore.

మఱియు నిట్టిశాసనములు పెక్కులు గలవు. ఇంతియకాక శ్రీనాథుఁడు తాను రచించిన శృంగారనైషధములోఁ గృతినాయకుని వర్ణించి యతనిముత్తాత చిట్టిపెద్దప్రభుఁ డనియు నతఁడు విక్రమపురసింహాసనాధిష్ఠాత యనియుఁ జెప్పియున్నాఁడు. "చిట్టిపెద్దప్రభుఁ డొప్పె విక్రమపురీ సింహాసనాధ్యాసి యై." ఆ. I—20.

గ్రంథాంతమున "నెల్లూరితూర్కరాజపౌత్ర మామిడి పెద్దనామాత్య పుత్ర...సింగనామాత్య" అని ముగించినాఁడు. ఇక్కారణంబుచే నెల్లూరి తుర్కరాజు విక్రమపురసింహాసనాధ్యాసి యైనచిట్టిపెద్దప్రభుఁడేయని తెల్లంబుగాక మానదు.

పై ప్రమాణావళులచే నెల్లూరు విక్రమ సింహపురం బని స్పష్టముగా నేర్పడఁగలదు.

## మనుమసిద్ధిరాజు.

విక్రమసింహపురం బనునపరనామంబు గలిగి నెల్లూ రనుపేర నిప్పటికిని నెగడుపట్టణరాజ్యంబునకు ముక్కంటి యనుపల్లవవంశజుండు రాజుగా నుండెనని పూర్వముననే చెప్పియుంటి. మహాకవి యగుతిక్కన కాలమునకు మనుమసిద్ధి యనుపే రొందినరాజు రాజ్యము చేయుచుండెను. రాగిశాసనములను రాతిశాసనములను బట్టిచూడఁగా నీ నెల్లూరుమండలమును బాలించినరాజులు సిద్ధిరాజు ల

ను పేరఁ బరఁగినవా రనేకులు గలరు. తిక్కనయేలిక యగుమనుమసిద్ధి యెవరు? యె ప్పటికాలమువాఁ డనువిషయము మొదట నిర్ణయింపవలసియున్నది. తిక్కన రచించిననిర్వచనోత్తరరామాయణములో వర్ణించినవంశావళిని బట్టిచూడఁగా మనుమసిద్ధి సూర్యవంశపు రాజనియు, చోళవంశ మనియు, కరికాళచోళునివంశంబ నియు వర్ణితమై యున్నది. ఈకరికాళచోళునికాలము క్రీ. శ. 950. అని Burnell మొదలగు పరిశోధకులు నిర్ణయించియున్నారు. అతనివెనుక బిజ్జన పు ట్టెను. ఆ బిజ్జనవెనుక మనుమసిద్ధిరాజు, అతనికిఁ జోళతిక్కరాజు, అతని వెనుకఁ దిక్కనప్రభు వగుమనుమరాజు జనియించె నని వ్రాయఁబడియున్నది. ఈమ నుమసిద్ధి చోళవంశము రాజని చెప్పుకొన్నను నితఁ డొకమాండలికరాజై చిన్న ప్రభువుగా నుండినవాఁడుగాని చోళరాజ్య మేలుచు నురయూరుపురంబు పరి పాలించుచుండెడు చోళరాజులలోఁ జేరినవాఁడు కాఁడు. మఱియుఁ దిరుకాళ దేవుఁ డనిపేరు గలరాజులు గూడఁ బెక్కండ్రు గలరు. వారిలో మనుమసిద్ధి రాజుయొక్కతండ్రి యైన తిక్కనృపతి యెవ రని నిర్ణయింపవలసియున్నది.

రాపూరుతాలూకా చికవోలుగ్రామములో సర్వే నెం. 510 రు. భూమికి ఉత్తరభాగములో దొరకిన రాతిశాసనములో నివ్విధముగఁ జెప్పఁబడియున్నది. "కుళోత్తుంగచోళదేవుని ప్రభుత్వములో ౩౬వ సంవత్సరములో వీరప్పనాయ కునితమ్ముఁ డైనట్టియు పిళ్లియార్ మనుమసిద్ధరాజుకుమారుఁ డైన చోళతిరుకాళ త్తిదేవుని భృత్యుఁ డైనట్టియు తుక్కినాయకుఁడు పిళ్లియార్ తిరుకాళత్తి దే వునిపక్షమున తిక్కులం అనుగ్రామమును కేశవస్వామికి దానము చేసెను" అని వ్రాయఁబడియున్నది.

Nellore Dt. Inscriptions Vol. III p. 1216 Reepur No. 8 (A. D. 1213-14.)

దీనినిబట్టి తర్కింపఁగా మనుమసిద్ధిరాజుయొక్క తండ్రియైన తిక్కనృపాలుఁ డు దీనం బేరొనఁబడిన తిరుకాళత్తిదేవుఁ డనిస్ఫురింపఁగలదు. అప్పటికిఁ దిక్క నృపాలుఁడు గతించి యాతనిపుత్త్రుఁ డగుమనుమసిద్ధిరాజు రాజ్యమునకు వచ్చి యుండనోపు.

మఱియు నిర్వచనోత్తరరామాయణమునందుఁ దిక్కనప్రభువు కర్ణాటసోమే శుని దోర్గర్వము రూపుమాపె నని చెప్పఁబడియున్నది. ఈకర్ణాటకసోమేశుఁ డనువాఁడు పశ్చిమచాళుక్యాన్వయసంజాతుఁ డైన నాలవసోమేశ్వరుఁడు.

1182-1189 A.Dవఱకు రాజ్యము చేయుచుండి చోళరాజులచే నోడింపఁబడి రాజ్య మంతరించినట్టు శాసనములవలనఁ దెలియఁదగు.

Sewells antiquites p. 150 Vol II.

మ. కమలాప్తప్రతిమానమూర్తి యగునాకర్ణాటసోమేశుదు
ద్దమదోర్గర్వము రూపుమాపి నిజదర్పంబు ల్ప్రతిష్ఠించి లీ
లమెయిన్ జోళుని భూమిపై నిలిపి చోళస్థాపనాచార్యనా
మము దక్కంగొని తిక్కభూవిభుఁడు సామర్థ్యంబు చెల్లింపఁడే.

నిర్వ-ఆ. 1-34.

కావునఁ దిక్కనధరణీశుఁడు 12వ శతాబ్దాంతమువఱకు రాజ్యమేలుచుండె నని తెలుచున్నది. ఇతనికుమారుండు మన్మభూరమణుండు. ఇతఁడె తిక్కనసోమయాజి గారి నేలినవాఁడు. నిర్వచనోత్తరరామాయణకృతిపతి. ఈనరపాలుఁడు నెల్లూరున రాజ్యము చేయుచుండె ననుటకు ననేకోదాహరణంబులు గలవు. సిద్ధేశ్వరచరిత్ర మనుద్విపదకావ్యమునందు నీవిధంబునఁ జెప్పఁబడినది.

"సూర్యవంశంబున సొబగొందునట్టి, యార్యపూజితవీర్యుఁ డామన్మసిద్ధి
రాజుదా నెల్లూరు రమణతో నేల, నక్కనబయ్యన లధికబలిష్ఠు,
లక్కట సిద్ధిరాయనిఁ బాఱఁదోలి."

* * * * * *

"నెల్లూరిప్రజలకు నేర్పువాటిల్లఁ, జెల్లించె మన్మనసిద్ధిరాజునకు.
నెల్లూరిపట్టంబు నేర్పుతోఁగట్టి."

సోమదేవరాజీయ మనుగ్రంథమునందు నీ విధముగ వ్రాయఁబడియున్నది.

గీ. ఇనకులోద్భవుఁ డైనట్టిమనుమసిద్ధి, రాజు నెల్లూరు పాలించుచోఁ జెలంగి
యతనిదాయాదులతనినక్కఱగఁబట్టి, యునిచిరాజ్యంబుదము రేలుచున్నవారు.

కేతన రచించినదశకుమారచరిత్ర మనుగ్రంథమందు "అట్టి విక్రమసింహపురంబున కధీశ్వరుండును, రాయవేశ్యాభుజంగుండును నైనమనుమసిద్ధిమహీప్రభువంశావళివర్ణనం బెట్టిదని"యని వ్రాసియున్నాఁడు. విక్రమ సింహపురంబన నెల్లూ రని యిదివఱకే నిశ్చితంబైనది.

పై యాధారములంబట్టి మన్మరాజు నెల్లూరుప్రభుం డని స్పష్ట మగును. ఇతని కాలనిర్ణయ మిఁకఁ జేయవలసియున్నది. ఇతని తండ్రి 12వ శతాబ్దాంతము వఱకు రాజ్యము చేయుచుండినట్టు లిదివఱకే నిర్ధారితంబు. ఈమన్మసిద్ధి 13వ శ

తాబ్దారంభము మొదలు తచ్ఛతాబ్ది మధ్యకాలమువఱకు జీవించియున్నట్టు లాధారంబు లున్నవి.

కృష్ణాజిల్లా కొండనాయనివరం గ్రామములో మన్మరాజుపేర నొకశాసనము గానవగును. అది 1257 A. D., Sewell antiquties Vol. I p. 51. ఇంతియ కాక నిర్వచనోత్తరరామాయణమునందు.

ఉ. రంగదుదారకీర్తి యగురక్కసగంగని బెంజలంబుమై
భంగ మొనర్చి మన్మజనపాలుఁడు బల్విడి నాదికొన్నరా
జ్యాంగము లెల్ల నిచ్చి తనయాశ్రితవత్సలవృత్తి యేర్పడన్
గంగయసాహిణిం బదముగైకొనఁ బంచెఁబరాక్రమోన్నతిన్.

అని రక్కసగంగని జయించి యతనిని దనయాశ్రితునిగాఁ జేసికొనిన ట్లగపడుచున్నది. ఈరక్కసగంగఁడు కాకతి గణపతిదేవునికిఁ బ్రతిపాలకుఁడుగా నుండినగంగఁడే యగునని నే భావించెద. ఈ గంగనామము గలవారు కళింగ దేశ నృపతులును హొసలరాజభల్లాళవంశ రాజులును గలరు. హొసలదేశపు భల్లాళ రాజు లక్కాలమున బలవంతులై ప్రబలియుండిరి గాని చోళులచేత నప్పటికి జయింపఁబడలేదు. మఱియుఁ గళింగగంగు లతిదూరమున నుండువారు. వారితో మన్మసిద్ధిరాజునకు యుద్ధము పొసంగుటకుఁ బ్రమేయ ముండదు. కాన నీరక్కసగంగఁడు పై నుడివిన ఓరుఁగంటికాకతి గణపతిక్రింద నొకచిన్నపరిపాలకుఁడుగా నుండినగంగఁ డనియే నిశ్చయింపవలసియున్నది.

కృష్ణాజిల్లాలో దుర్గి యనుగ్రామములోఁ గాకతిగణపతిదేవునిపేర A.D.1257 సంవత్సరమున నొకశాసన మున్నది. దానిలో నారాష్ట్రమునకుఁ బరిపాలకుఁడు (Governor) గంగయ్య యని పేర్కొనఁబడినది. ఇతనినె మన్మసిద్ధి వోడించి తన యాశ్రితునిగఁ జేసికొనియుండనోవు. Sewell Vol. I. p. 105.

అంతియకాక నిర్వచనోత్తరరామాయణములోని యీక్రిందిపద్యమువలనఁ గూడ మన్మసిద్ధికాలము నిర్ణయింపఁదగియున్నది.

శా॥ శృంగారంబు నలంగ దేమియును బ్రస్వేదాంకురశ్రేణి లే
దంగంబుల్ మెఱుఁగేద వించుకయు మాహారాష్ట్రసామంతు సా
రంగుంబోలి తురంగముం గొనినసంగ్రామంబునం దృప్తన
ప్తాంగస్ఫారయశుండు మన్మవిభుపం పైచన్న సైన్యంబునన్ ॥

పై పద్యంబున నిర్వచింపఁబడిన మహారాష్ట్రసారంగుఁ డెవఁడన, ఓరుఁగంటి కాకతి గణపతిదేవునికి సామంతరాజుగా నుండి యద్దంకిని బరిపాలించుచుండిన మాధవదేవునియొక్క పుత్త్రుఁడు. మణికేశవరంగామములో మాండూకేశ్వర స్వామిదేవాలయములోని శిలాశాసనంబున—

"స్వస్తి సమస్తప్రశస్తి సహితంబున శ్రీమన్మహామండలేశ్వర అతిపివమ మహాహయారూఢప్రౌఢ రేఖారేవంత...శ్రీ మాధవమహారాజులు Satha 1130 సంవత్సరంబున మాండూకేశ్వరస్వామివారికి గుండ్లకమ్మ పడమటి కోటికెలప్రాడి పొలమున ఖ 40 చేనును" &c. &c.) అనిచెక్కఁబడియున్నది (1208-09 A.D.) Nellore Insp. Vol. III p. 1034 O. 76. దీనిచే మాధవదేవుని హయసామగ్రి యత్యధిక మనికూడఁ దేలుచున్నది.

మన్మసిద్ధికూడ సారంగములనే గ్రహించెనని పై పద్యంబున వర్ణింపఁబడినది. మాధదేవునియొక్క కుమారుఁడు సారంగుఁ డని ఒంగోలుతాలూకాలో బ్రాహ్మణులకు క్రీ॥ శ 1254-55 A.D. సంవత్సరమునఁదా నొకగ్రామము దానముగా నిచ్చిన తామ్రశాసనమువలనఁ దెలియనగును.

Nellore Inscription Vol. III p. 1457 C. P. No. 17.

నాచే సమాహరింపఁబడిన పై శాసనములంబట్టి మన్మసిద్ధిరాజు 13వ శతాబ్ద మధ్యమువఱకు రాజ్యమేలుచుండె నని నిస్సంశయంబుగ నేర్పడఁగలదు. ఈ మన్మసిద్ధి నెల్లూర A D. 1710-1260 వఱకు రాజ్యపరిపాలనము చేయుచుండెను.*

తిక్కన ప్రశంస.

తిక్కన యెవఁడు ఎక్కడివాఁ డని యింకమీఁద విచారింపవలసినయంశము. తిక్కన గౌతమగోత్రుఁడు, మంత్రిభాస్కరుని మనుమఁడు, కొమ్మనామాత్యుని

* తిక్కనభారతరచనకుఁ బూర్వమే యీమన్మసిద్ధి సిద్ధిబొందియుండును. కాటమరాజు చరిత్ర మనుగ్రంథములో నీమన్మసిద్ధి పశువులపుల్లరివిషయమై పోట్లాడి తుదిని యుద్ధములో మృతినొందిన ట్లున్నది. కందుకూరుతాలూకా గుడిపాళెములోని బ్రహ్మేశ్వరస్వామివారి దేవాలయ స్తంభముమీఁద క్రీ. శ. 1258-59 సంవత్సరములో నెల్లూరుప్రభు వగునల్లసిద్ధిరాజు కాటమరాజుతోఁ బోరినట్లును, మఱియొక్క అలవలపాలు ప్రభువగు నల్లురాజుతో పశువులబీళ్ల పుల్లరివిషయమై యుద్ధ మొనర్చెననియుఁ దెలియుచున్నది. మన్మసిద్ధినల్లసిద్ధి యనుటకు నాధారము లేవియుఁ గానరావు. ఈమన్మసిద్ధి నల్లసిద్ధిరాజునకు లోఁబడినసామంతరాజేమో యని సంశయము గలుగుచున్నది. ఇది యింకను జర్చనీయాంశము.

పుత్త్రుఁడు. ఇతనితల్లి అన్నమ. అమాత్యవంశమువాఁడు గాన నియోగిబ్రాహ్మణుఁడు. కేతనచే రచింపఁబడి తిక్కనసోమయాజికిఁ గృతియీఁబడిన దశకుమారచరిత్ర మీకవిశిఖామణియొక్క చరితమును వెల్లడిచేయుచున్నది. నేను జెప్పఁబోవు విషయములు పెక్కులు దాని నుపజీవించియే యుండును. ఇతని తాత యగుమంత్రిభాస్కరుఁడు గుంటూరికి దండనాథుఁడుగా నుండెను. ఇతని తండ్రి యగు కొమ్మనామాత్యుఁడుకూడ గుంటూరి దండనాథుఁడుగా నుండెను. దండనాథుఁ డను శబ్దప్రయోగముచేతనే వారు సేనానాయకులుగా నుండి రని యూహింప నక్కఱలేదు. విభుఁడు, దండనాథుఁడు, మంత్రి, చమూప - ఇత్యాది బిరుదములు గొప్పయధికారమును సూచించుచున్నవి. తిక్కననుగూర్చి కేతన వర్ణించుటలోఁ 'దిక్కన దండాధీశా (ఆ. 12-1) 'తిక్కచమూపా' (ఆ. 8-1) 'మంత్రితిక్కం డెలమిన్' (ఆ. 3-1) అని యభివర్ణించియున్నాఁడు. లౌకికాధికారములలో నున్నతపదవి బొందినపు డీపర్యాయపదములు వాడఁబడునట్లు తోఁచెడిని. ఇత్యాదివాక్యములచే నితఁడు మనుమసిద్ధిరాజునకు నాస్థానకవియు, నమాత్యశేఖరుండు నై యుండెను. మఱియు నితండును నితనితండ్రులును మంత్రిపదంబున నుండినవారుగాని హఠాత్తుగా నుదరపోషణార్థమె యెచ్చటనుండియో వచ్చి యుద్యోగము సంపాదించుకొని యాయుద్యోగ మూడినవెనుక స్వస్థానము జేరువారువలె వచ్చినవారు కారు. దీనికిని బ్రబలనిదర్శనంబు దశకుమారచరితమే.

"విక్రమసింహపురంబున కధీశ్వరుండును (1-12)....కీర్తిపాత్రం బైన మనుమసిద్ధిమహీవల్లభునకుఁ గరుణాపాత్రం బైనకొట్టరవుతిక్కనామాత్యుండు నిజకులక్రమాగతం బగుమంత్రిపదంబున వర్తిల్లుచు." 1-20 పై వాక్యముచేఁ దండ్రితాతలతరముగఁ దిక్కనవంశ్యులు నెల్లూరురాజ్యమునకు మంత్రులుగా నుండిరని యేర్పడుచున్నది. మనుమసిద్ధియు వారిపూర్వులును రాజ్యము చేయుచుండినమండలము ఇప్పటి కృష్ణాజిల్లాలోఁ గొంతవఱకు వ్యాపించియుండినటులు పూర్వోక్తవచనంబులంబట్టి యేర్పడంగలదు. కానఁ దిక్కనతండ్రియుఁ దాతయు గుంటూర నధికారము చేయుట యొప్పగు.

తిక్కన యెచ్చటివాఁడు - అతని నివాసస్థల మెయ్యది.

తిక్కనతండ్రి యగుకొమ్మనను వర్ణించు తఱి, కేతన "గౌతమాన్వయాంబోనిధిశీతకరుఁడు కులనిధానంబు కొట్టరుకొమ్మశౌరి." (1-81) తిక్కన నభివర్ణిం

చుచో “ఇట్లు కీర్తిపాత్రంబై మనుమసిద్ధిమహీవల్లభునకుఁగరుణాపాత్రం బైనకొట్ట రువు తిక్కనామాత్యుండు” అని చెప్పియున్నాఁడు. పై వాక్యములంబట్టిచూడఁ దిక్కన పూర్వికులు కొట్టరువుగ్రామనివాసు లని యేర్పడుచున్నది, గాని తాత తండ్రులకాలముననే యాగ్రామము వదలి నెల్లూరు జేరిరని స్పష్టము కాఁగలదు. లేని చో నెల్లూరుప్రభుత్వము నేయురాజులకుఁ గులమంత్రులుగ నెట్టు లుండనోపు దురు. తిక్కనామాత్యుని పెదతండ్రి యగుసిద్ధన మనుమసిద్ధితండ్రి యగుతిక్క నృపాలున కాప్తమంత్రి యై యుండెనని కేతనకవి వర్ణించియున్నాఁడు (I-62). ఈ మంత్రి పద మిట్లు పై తామహధనం బై యుంటచేఁ దిక్కన త్రిపూరుషముగా నె ల్లూరునందే యుండె నని చెప్ప సమంజసం బగు. మఱియుఁ దిక్కన నెల్లూరివాఁడే యనుటకుఁ బ్రబలోదాహరణ మొకటి గలదు. కేతన తన గ్రంథారంభములో “అని యిష్టదేవతా ప్రార్థనంబును సుకవిచరణాభివందనంబునుం జేసి నారచి యింపం బూనినకృతి కధీశ్వరుం డైనకొట్టరువుతిక్కనామాత్యునకు నిజస్థానం బైన విక్రమసింహపురంబు నభివర్ణించెద, నని చెప్పి యున్నందునఁ దిక్కనయొక్క స్వస్థానము నెల్లూ రనియే ధ్రువ మగుచున్నది. తిక్కన యన్యగ్రామవాసి య య్యె నేని నిజస్థానం బని నెల్లూరు చెప్పుటయు, నాపట్టణము నభివర్ణించుటయుఁ గలిగియుండదు. ఎచ్చటను కొట్టరువునుగాని, గుంటూరును గాని వర్ణించియుండ లేదు. ఇంతకంటె వేఱొండుసాక్ష్య మేమికావలయు. విజ్ఞులు దీని నరయు దురుగాక.

మఱియొక విషయముగూడఁ బైనిఁ జెప్పిన యంశమునకుఁ బ్రబల సాక్ష్య ముగనున్నది. విక్రమార్కచరిత్రమును రచించిన జక్కన యనుమహాకవి తన కావ్యమున హరిహరేశుని బ్రార్థించియున్నాఁడు. ఈ కవియొక్క తాత యగు పెద్దయామాత్యుఁ డనుమహాకవి నెల్లూరి తిరుకాళమనుజవిభునిసమ్ముఖమున నుండెననియు వర్ణితమై యున్నది. ఆ గౌరవముచేతనే హరిహరుని బ్రార్థించియుండ నోపు నితఁడు కేవలము తిక్కనయందు గౌరవముచేత హరిహరనాథు నుతించె నని చెప్ప వలనుపడదు. జక్కనగూడ నెల్లూరుమండలములోఁ జేరిన బెల్లముకొండ వాస్తవ్యుఁడని యేర్పడుచున్నది. ఇట్లు నెల్లూరికి సంబంధించినమఱియొకకవిగూడ హరిహరనాథుని నుతించియుండుటచే, తిక్కనయు హరిహరోపాసకుం డగుటయుఁ జూడఁదిక్కనస్థానము నెల్లూరని స్థిరమగుచున్నది. (I-20 Vikramarka Charitra.) ఈవిషయమై మఱియొక ప్రబలాధారముగూడఁగలదు. నెల్లూరికి ననతిదూరమున

నుండు పాటూరనుగ్రామమునఁ దిక్కనవంశ్యు లని పేరొందఁబడువా రిప్పటికి ననేకకుటుంబములవా రున్నారు. జనశ్రుతినిబట్టియు వారివంశగాథల బట్టియుఁ దిక్కనవంశమువా రని భావింపఁబడుచున్నారు. వారివంశములోఁ దిక్కన వ్రాసినఘంటము ఒకటి పూజాపాత్రమై మెఱయుచున్నది. తిక్కన వంశ్యులు పాటూర వెలయుచున్నా రనుటకు నొకచాటుధారగూడఁ గలదు.

1. సీ॥ భారతపర్వము ల్పదియేను వరుసగాఁ దెనిగించె గుంటూరి తిక్కయజ్వ
యమ్మహాత్ముని పుత్త్రిఁ డాకొమ్మనఘనుండు కల్పించెఁ బాటూరికరణికంబు
నాకొమ్మనకుఁగల్గె హరిహరామాత్యుండు నెమ్మితో నతనికి కొమ్మఘనుఁడు
రహిమీఱ నతనికి రామన తిప్పనయా రామనకు సోమయాహ్వయుండు
ఆఘనునకు వీరనామాత్యుఁ డతనికి, సోమలింగము మంత్రి యామహాత్ము
నకును సోమరాజ నాముఁడు జిటివీర, ఘనుఁ డనంగ సుతులు గలిగి రందు.

2. సీ॥ సోమనకును గల్గె సుతుండు పాపనమంత్రి యతనికి వీరన యాఘనునకుఁ
గూరిమి తనయులు గోపాలభాద్రార్యనరసింహామంత్రు లనంగ ముగురు
వారిలో నరసింహవరునకు శరభార్య భాస్కరామాత్యుఁడు నారసింహ
ఘనుఁడనఁ బుత్త్రిలు గలిగిరి మువ్వురు వారిలో శరభార్యవర్యునకును
వీరఘనుఁడు గలిగె వేంకనామంత్రికి శరభమంత్రివరుఁడు జననమొంది
ప్రబలియున్నవాఁడు పాటూరిలో దీన, కులము వర్ధిలంగఁ గొమరు మీఱి.

మఱియు నితఁడు ప్రయోగించినకొన్నిపదములనుబట్టి నెల్లూరువాఁడనికూడ నేర్పడఁగలదు

తలుగులు, దామెన, క్రొత్తముట్టు, కడుపుకూడు, ఇత్యాదులు ప్రమాణంబులు.

మదుక్తంబు లైనపైప్రమాణంబులచేఁ దిక్కననిజస్థానము నెల్లూరని ధ్రువపడఁగలదు. ఈవిషయ మింక నిర్వివాదమని నాయభిప్రాయము.

## తిక్కనకాల నిర్ణయము.

తిక్కనవర్ధిల్లినకాల మెద్ది యని యిఁక విచారింపనగు. ఇతఁడు మనుమసిద్ధి యాస్థానకవియు మంత్రియు నై యుండెననుట జగద్విఖ్యాతమై యుంట యెల్లరకు విదితంబ. తిక్కనకృత మైన నిర్వచనోత్తరరామాయణము మనుమసిద్ధికి నంకితముగా నీయఁబడుటచే నతనిసమకాలికుఁడనియుఁ దేటపడఁగలదు. మఱియు సిద్ధేశ్వరచరితమునను సోమదేవరాజీయమునను తిక్కసోమయాజి ఓరుఁగంటికాకతి

గణపతిదేవుని సందర్శించి యతనిసహాయముచే మనుమసిద్ధిని రాజ్యస్థితుం జేసెనని చెప్పుటచేఁగాకతిగణపతిదేవునితో సమకాలికుఁడని యేర్పడుచున్నది. పూర్వోక్త ప్రమాణంబులచే మనుమసిద్ధియు, కాకతిగణపతిదేవుఁడును 13వ శతాబ్దారంభము మొదలు తచ్ఛతాబ్దమధ్యభాగంబువఱకుఁ బైరాజు లిరువురు జీవించియుండి రని సిద్ధాంతీకరింపఁబడియె. కానఁ దిక్కనయు 13వ శతాబ్దమధ్యభాగంబున జీవించి యుండె నని తెలియనగును.

## తిక్కనశైశవవిద్యాభ్యాసము.

తిక్కనసోమయాజి యేయూర జన్మించెనో నిర్ధారణచేయుటకుఁ దగిన యాధారంబు లేమియుఁ గానరావు. ఈతనితండ్రి గుంటూర దండనాథుఁడుగా నుండుటచే నితఁడచ్చటఁ బుట్టినను బుట్టియుండనగు. లేక త్రిపౌరుషేయము స్వస్థానం బగునెల్లూరనే జన్మించియుండవచ్చును. ఈతనిపేరును బట్టిచూడఁగా నచ్చటికి సమీపములో నుండు దక్షిణకైలాసము నాఁ బరఁగు శ్రీకాళహస్తీశ్వరుని నామమును బెట్టిరని యూహింపఁ దగియున్నది. తిరుకాళతి తిక్కనగా మాఱుటలో ననమంజసం బేమియు లేదు. కావుననే యితఁడు ప్రారంభమునుండి 'మహేశ్వరాంఘ్రి కమలధ్యానైకశీలుఁ'డై యుండెను. ఇతఁ డితరదేశమందుఁ బుట్టెనని ప్రబలాధారములగయుదనుకఁ గేతనదశకుమారచరితంబునందు నిజస్థానంబుగా నభివర్ణింపఁబడిన విక్రమసింహపురమే యితని జన్మస్థాన మని యూహింపందగు.

ఇతఁడు బాల్యమునుండి విశేషప్రతిభాశాలి యై దినదినప్రవర్ధమాన తేజోమూర్తి యై వేదాదిసమస్తవిద్యాభ్యాసవిభాసి యై వఱలుచుండె నని వర్ణించినాఁడు. పరంపరాగతముగఁ బండితులై మహాకవులై వేదాధ్యయనసంపన్ను లైన తండ్రులయొద్ద నితఁడు విద్య నభ్యసించియుండనోవును. తిక్కన తనవిద్యాగురువును బేర్కొనియుండమిచేఁ దనవంశములో నెవరియొద్దఁ జదివెనో నిర్ధారణచేయుటకు వలనుపడకయున్నది.

## తిక్కనజీవిక.

తిక్కనజీవిక యేమని విచారింప నిఁకఁ దగియున్నది. ఇతఁడు తండ్రితాతలతరముగా నెల్లూరురాజు లగుమనుమసిద్ధిరాజ్యంబునను దత్పూర్వికులకు మంత్రులుగా నుండిరి. ఇతనిపెదతండ్రి యగుసిద్ధన మనుమరాజుతండ్రియొద్ద మంత్రిగా నుండె. ఇతనితండ్రియుఁ దాతయు గుంటూరుపాలకులుగా నుండిరి. ఆది

నుండి యమాత్యవరులై యితనివంశమువా రుండిరి. ఇతఁడును దనపూర్వుల కంటె హెచ్చుగ మంత్రిపదము నధిష్ఠించియుండె. మఱియు నితఁడు సామాన్య మంత్రివరుఁడే కాక రాజవైభవములతోఁ గ్రాలుచుండె. ఇతఁడు మనుమసిద్ధి వలన రాజచిహ్నము లైనబిరుదముల నొందె.

గీ. "అందలంబు గొడుగు లడపంబు మేల్కట్టు, చామరములు జమిలిశంఖములును
గంబగల్లు భూమి కానిక గాఁగఁ బెం,పెసఁగు రాచపదవు లెల్లఁ బడసె."

(Dasakumara Charitam I-21.)

అంతియ కాక యితఁడు రాజులవలెఁ బెక్కూళ్ల నగ్రహారంబులుగా నిచ్చుచు దానకర్ణుం డనఁబరఁగె. సుకవిబృందములపాలిటి కల్పతరువో యనఁ బేరుదాల్చె.

* * *

అర్థిమైఁ బెక్కూళ్ల నగ్రహారంబులఁగా నిచ్చు ననుట పొగడ్తపాలము.

* * * (I-92.)

మఱియు నితఁడు మంత్రిగా నుండునపుడు మనుమసిద్ధి రాజ్యచ్యుతుఁడు కాఁగా గణపతిదేవుని సందర్శించి పునరభిషిక్తుం గావించుటచే నీతని మనుమసిద్ధిరాజ్యభార ధౌరేయత మిగుల వన్నెకెక్కె. అప్పుడు గణపతిదేవుఁ డీయనకుఁ బెక్కుగ్రామ ముల నిచ్చినట్టుగా నున్నది. ఇతఁడు సకల సంపత్కళాపరిపూర్ణుఁడై లౌకికాధి కారధూర్వహుఁడై మనుమసిద్ధికి దక్షిణహస్తంబై యుండె.

తిక్కనయొక్క పండితగోష్ఠి.

తిక్కన యమాత్యవరుఁ డయ్యును మంత్రిపదస్థుఁ డయ్యును విద్యావిష యమున నతిపరిశ్రమ చేయుచుఁ గవులను బండితులను సత్కరించుచుఁ గృతుల రచించుచుఁ గృతులఁ గొనుచు నాంధ్రప్రపంచమున జగత్పూజ్యుం బగుపండిత కవితాసామ్రాజ్యంబు ననుభవించుచుండెను. ఉభయభాషాప్రౌఢిఁ బాటించు శిల్పమునందుఁ బారంగతుండు.

మ. అమలోదాత్తమనీష నే నుభయకావ్యప్రౌఢిఁ బాటించుశి
ల్పమునం బారగుఁడం గళావిదుఁడఁ దిక్కాంకుండ సన్మాన్యుఁడన్.

(నిర్వ-రా. ఆ. 1-13.)

పైవిధముగా స్వయముగాఁ దనప్రౌఢిమను బ్రకటించినాఁడు. మఱియు నీ విషయమునే కేతన దశకుమారచరితమునందు-

క. అభినుతుఁడు మనుమభూవిభు, సభఁ దెనుఁగున సంస్కృతమునఁ జతురుండై తా
నుభయకవిమిత్రనామము, త్రిభువనముల నెగడమంత్రితిక్కఁడు దాల్చెన్.

అని తెలిపియున్నాఁడు.

ఇతనియొద్ద ననేకకవులు శిష్యులుగను నాశ్రితులుగను నుండిరనుటకు సందియము లేదు. అందుకుఁ బ్రథమోదాహరణము దశకుమారచరిత్రకృతికర్త యైయభినవదండి నాఁ బరఁగుకేతనయే. మఱియు మార్కండేయపురాణమును దెనిఁగించినమారన యీతనిశిష్యుఁడు. ఇతఁడు, ఆశ్వాసాంతగద్యమునందు "శ్రీమదుభయకవిమిత్రతిక్కనసోమయాజి ప్రసాదలబ్ధసరస్వతీపాత్ర....మారయనామధేయ"యని చెప్పెను. అంతియకాక భోజరాజీయమును రచించిన యనంతామాత్యకవిముత్తాత యగుబయ్యనమంత్రి తిక్కనమంత్రిచే "భవ్యభారతి"యని ప్రశంసింపఁబడియె.

చ. క్షితిఁ గ్రతుకర్తనా వినుతి చేకొని పంచమవేద మైనభా
రతముఁ దెనుంగుబాస నభిరామముగా రచియించినట్టి యు
న్నతచరితుండు తిక్కకవినాయకుఁ డాదట మెచ్చి 'భవ్యభా
రతి'యనఁ బేరు గన్నకవిరత్నము బయ్యనమంత్రి యల్పుఁడే.

అని పేర్కొనఁబడియె.

ఆకాలమునందుఁ గవులు తిక్కనసోమయాజివలన మెప్పువడయుటయే తమజన్మకుఁ జరితార్థంబని యెంచువారు. కానివో గేతన-

గీ. కవిత చెప్పి యుభయకవిమిత్రు మెప్పింప, నరిది బ్రహ్మ కైన నతఁడు మెచ్చఁ
బరఁగుదశకుమారచరితంబుఁ జెప్పిన, ప్రోఢ నన్ను వేఱ పొగడనేల.

యని యేల వక్కాణించును.

తిక్కన యసదృశం బగుపాండిత్యము గలవాఁడయ్యును బెఱపలుకు ప్రోడలయెడ సౌజన్యము గలవాఁడు. "బోద్ధారో మత్సరగ్రస్తాః" అను మహాకవివాక్యమును నెంతయుఁ గ్రిందుపఱిచినవాఁడు. ఇది యతనిరచించిన నిర్వచనోత్తరరామాయణము గద్యలోని యుభయకవిమిత్రబిరుదంబువలననే కాక, బుధారాధనవిరాజి యనుటంబట్టి స్పష్ట మగుచున్నది. ఇతఁ డెంత కవిబ్రహ్మ యని నెగడొందినను బండితులయెడ నొనర్చినపైచ్యానుసంధాన మెంతయు నితని నమ్రతను నెలకొల్పుచున్నది.

లేనిచో నితఁడు తననిర్వచనోత్తరరామాయణంబున,

తే. ఎట్టికవి కైనఁ దనకృతి యింపుఁ బెంపఁ, జాలుఁ గావునఁ గావ్యంబు సరసు లైన
కవులచెవులకు నెక్కొనఁగాని నమ్మఁ, డెందుఁ బరిణతి గలుగుకవీశ్వరుండు.

(ఆ. 1-9.)

అని యేల వచించు. ఇట్లే మహాకవికాళిదాసుగూడఁ దనసౌజన్యమును దెలియఁజేసె. ఇట్టిమనోధర్మ మాధునికమహాకవులకుఁగూడఁ బొసంగినచో మనదేశమునకును వాఙ్మయమునకు విశేషశోభనము వాటిల్లుననుటకు సందియము లేదు. ఇది కొంతశాఖాచంక్రమణము క్షంతవ్యము.

తిక్కన రచించినగ్రంథములు.

మహాకవి యై కవిత్రయములో మేటి యై విలసిల్లి కవిబ్రహ్మ నా నుతికెక్కినతిక్కన రచించినగ్రంథము లేవని యిఁక విచారింతము.

ఇతఁడు రచించినవానిలో ముఖ్య మైనవియును బ్రసిద్ధము లైనవియు రెండు. అందులో మొదటిది నిర్వచనోత్తరరామాయణము.

దీనిని రచించుటకుఁ గారణము తిక్కనయే స్వయముగఁ దెలిపియున్నాఁడు.

క. ఏ నిన్ను మామ యనియెడు, దీనికిఁ దగ నిమ్ము భారతీకన్యక నా
కీ నర్హుఁడ వగుదనినను, భూనాయకుపలుకు చిత్తమున కింపగుడున్.

అని తన్ను యాచించినట్టు లేర్పడుచున్నది. మనుమసిద్ధియాస్థానకవిగా నుండి, మంత్రిగా నుండి మామ యని పిలిపించుకొనఁదగినసాన్నిధ్యము గలిగినకారణముచే నీకావ్యమును మనుమభూవిభునకు నంకిత మొనర్చెను. దీనిలో మనుమసిద్ధి కర్ణాట సోమేశులయుద్ధమును రకెసగంగనియుద్ధము, మహారాష్ట్రసామంతుఁడగుసారంగునియుద్ధములు వర్ణితంబు లగుటచే 1251 ప్రాంతమునందు వ్రాయఁబడియుండును. ఇది వ్రాయునప్పుడు తిక్కన సోమపీథి కాఁడని యాశ్వాసాంతగద్యముచేఁ దెలియనగు. ఉత్తరరామాయణకథను వ్రాయుటకతం బేమనియరయుచోఁ దిక్కనయే దానికి జవాబు తెలియఁబఱచియున్నాఁడు.

క. ఎత్తఱినైనను ధీరో, దాత్త నృపోత్తముఁడు రామధరణీపతి స
ద్వృత్తము సంభావ్య మగుట, నుత్తరరామాయణోక్తి యుక్తుఁడనైతిన్.

(ఆ. 1-11).

కొంద ఱితనితాత యగుమంత్రిభాస్కరుఁడు రామాయణమును రచించియుండుటచేఁ నితఁ డుత్తరచరితమును రచింపఁబూనుకొనె నని యభిప్రాయము నిచ్చియున్నారు. అదియు నిజము గానోపు. పైపద్యానంతరము తాత యైన

మంత్రిభాస్కరుని బొగడియుండుటచే దానికి ననుబంధించి వ్రాయఁబడిన దని యూహ కవకాశము గలదు, అయినను నవ్విషయము విస్పష్టముగఁ దిక్కన చెప్పియుండలేదు. కాన నూహ్యంబు. ఈగ్రంథమునందుఁ గవి కొన్ని శపథంబులు చేసి వానిని బరిపాలించియే గ్రంథముల వ్రాసెను.

ఇతఁడు, రచించినగొప్పగ్రంథము ఆంధ్రమహాభారతము. ప్రపంచమునఁ బంచమవేదము నాఁబరఁగి, జనసంప్రార్థ్యంబై లోకమెల్లెడ వ్యాపించి యశేషజనసంసేవ్యంబై నానార్థశాఖలు గలిగి కల్పతరువుంబోలి యాశ్రితజనంబులకుఁ గామితార్థంబుల నిచ్చుచు నపవర్గ రమాధాయకం బై యలరారు మహాభారతగ్రంథంబును నాంధ్రీకరించినమహాకవులలో నగ్రగణ్యుం డై నయిమ్మహామహుఁ డెవరికి స్తోత్రపాత్రంబు కాఁడు. ఎవరో యొకరిద్దఱు, ఇదానీంతనులు మత్సరపూర్ణమతు లై నెఱసులఁ గొన్నిటి నారోపించి దోషంబు సిద్ధించు తమయపాండిత్యంబు వెల్లడిచేసిరి గాని,దానివలనఁ దిక్కనయశస్సు క్షీణింపదయ్యె. వారును బండితమ్మన్యులు గాక యాత్మశేముషీశాణోపలంబుల నానెఱసుల నొరసిచూచినచో మగుడనందవియన్నియు గుణంబులుగాఁ బరిణమించు నని నొక్కి వక్కాణించువాఁడ. విశేషవిదు లగునీసభ్యులు దీనివిశేషం బెఱుఁగుదురుగాత. ఈ మహాభారతము మొదటిమూఁడుపర్వముల నన్నయభట్టు రచించెను. తిక్కన విరాటపర్వము మొదలుఁ పదియేనుపర్వములు తెలిఁగించెను. ఆరణ్యపర్వశేష మితనివెనుక నెఱ్ఱాప్రెగ్గడ పూరించెను.

ఉ. ఆదరణీయసారవివిధార్థగతి స్ఫురణంబు గల్గి య
 ష్టాదశపర్వనిర్వహణ సంభృతమై పెనుపొంది యుండ నం
 దాదిదొడంగి మూఁడుకృతు లాంధ్రకవిత్వవిశారదుండు వి
 ద్యాదయితుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్.

అని చెప్పుటచే నప్పటికి మూఁడుపర్వములు తెనిఁగింపఁబడుటచేతను దిక్కన విరాటపర్వము మొదలుకొని తెలిఁగించెను. అప్పకవికూడ నన్నయభట్టు మూఁడుకృతులు రచించె నని చెప్పియున్నాఁడు.

క. ఆమూఁడుపర్వములలో,నామాన్యుఁడు నుడువు తెనుఁగు లరసికొని కృతుల్
 దామ రచించిరి తిక్కను,భీమణి మొదలైనతొంటితెనుఁగుకవీంద్రుల్.

(అప్పకవీయము ఆ. 1-48.)

పైసందర్భములనుబట్టి యోజించిచూడఁగా దిక్కనయారణ్యపర్వశేషము ను బిచ్చిపట్టు ననుభీతిచేతను, గ్రంథము విఘ్నమునొందు ననుభీతిచేతను దెలిఁగింపలే దను పాడుకలోనికథ విశ్వాసపాత్రము గాదు. తిక్కనకాలమునకు శేషముండినచోఁ బ్రారంభమునఁగాని యంతమునఁగాని పూరించియే యుండును.

తిక్కన తనభారతమును హరిహరనాథున కంకితమొనర్చెను. కొందఱుచారిత్రికులు భారతకృతిపతియైన హరిహరనాథుఁడు నెల్లూర నుండ లేదనియు నర్చారూపము కాదనియు ధ్యానాత్మకస్వరూపం బనియు వక్కాణించియున్నారు. అట్టి యభిప్రాయ మెంతయు నాక్షేపణీయము. హరిహరనాథుఁ డర్చావిగ్రహ మనియు నట్టివిగ్రహములు గలదేవాలయములు పెక్కుచోట్ల నుండె ననియు శిలాశాసనములవలనఁ దెలియనగును. ఈ హరిహరనాథునివిగ్రహములకు, ఒకవైపు హరిచిహ్నములును మఱియొకవైపు హరచిహ్నము లుండును. వీనికి హర్యర్ధమూర్తి యనియు, శంకరనారాయణమూర్తి యనియు నామంబులు గలవు. విష్ణుధర్మోత్తర మనునాగమశాస్త్రమునందు హరిహరమూర్తుల లక్షణంబులు వివరముగా వర్ణింపఁబడియున్నవి. తల్లక్షణంబుల ననుసరించి యిప్పటికిని శిలావిగ్రహము లున్నవి.

'బాదామి'లోను పునహాలోను హరిహరమూర్తి విగ్రహము లుండినవి. వానికి ఫొటోగ్రాపులు ఎత్తి వస్తుప్రదర్శనశాలలో స్థాపింపఁబడియున్నవి. ఈ రెండు విగ్రహములలోను హరిహరాదులచిన్నె లగపడుచున్నవి.

ఈశిలావిగ్రహములఁ బట్టిచూచినచో హరిహరుఁడు కేవల మద్వైతుల కుపాస్యుం డగు ధ్యానాత్మకదైవము కాఁడనియు నర్చావతారరూపుఁ డనియు నేర్పడుచున్నది.

(Gopinatha Row's Hindu Iconography Vol. I. p. 333,334,35 of part II.)

మఱియు నాసేతుహిమాచలపర్యంతము సేవింపఁబడు శేషాద్రినిలయుండైన శ్రీవేంకటాచలపతి ప్రస్తుతము వైష్ణవచిహ్నములతోఁ బరిశోభితుఁడై మనకు బయటి కగపడుచున్నను మూలవిగ్రహము హరిహరవిగ్రహమని యేర్పడఁగలదు. ఇప్పటిస్వామివారిదేహమునందు శివచిహ్నము లైనజటయు నాగాభరణమును విష్ణుచిహ్నము లైన శంఖచక్రములును స్థగితము లై యున్నవి.

G. P. Row, Vol. I part p. 270 & 271.

పైవిషయమునే పన్నిద్దఱాళ్వారులలో నొకరైనభూతయోగి (పేయాళ్వారు) యీక్రిందివిధమున శ్రీవేంకటేశ్వరుని హరిహరనాథునిగా వర్ణించియున్నారు.

తామ్రశడయుం నీళ్ముడియుం బణోమ్మ్రవుం, శక్కరముం శూమ్రరవుం పొన్నాణుంతొన్నుమాల్, శూమ్రంతిరండరవి పాయుంతిరుమలమేల్ ఎన్దైక్కు । ఇరండురువుం ఒన్నాయ్ యిశైన్దు ॥

తిరుపతికొండమీఁది వేంకటాచలపతి నిజముగా హరిహరుఁడని పైప్రమాణములచే నిష్పన్నం బైనది.

కాన హరిహరనాథుఁ డర్చావతారరూపుఁ డైనచో నేల వారిదేవాలయము నెల్లూర నుండియుండరాదు. ఇప్పు డట్టిదేవాలయము లుండె నని గుఱుతు లేమియుఁ గానరావుగాని యట్టిదేవాయతన ముండెనని భారతములోని యొక వాక్యమును బట్టి యేర్పడఁగలదని నాయాశయము.

తిక్కన మహాకవిత్వదీక్షాపద్ధి నొంది భారతము రచింపఁబూనెద నని చెప్పి వెనుకటివాక్యంబున నీక్రిందివిధమునఁ జెప్పియున్నాఁడు.

"అని పూని యాదృశంబు లగుపుణ్యప్రబంధంబులు దేవసన్నిధిం బ్రశంసించుటయు నొక్కయారాధనవిశేషం బగుటం జేసి." భార. వి. ఆ. 1-31.)

ఇచ్చటి దేవసన్నిధిం బ్రశంసించుట యనుచో దేవునియొక్క సన్నిధాన మని యగుచున్నది. సన్నిధిపదము సాధారణముగ దేవాయతనమును సూచించును. ఇట్టికావ్యములు దేవాలములయందు రచించుచో నెక్కువఫలప్రద మని కూడ మనవమ్మకము. ఈయొకవాక్యమే యర్చారూపము గలిగిన దేవాలయములో నీ గ్రంథము వ్రాయఁబడె నని నిక్కర్షసేయఁగలదు. దీనికిఁ దోడుగ నీదేశమునఁ గర్ణపరంపరాయత్తము వచ్చుజనశ్రుతి సహకారి యగుచున్నది.

పైప్రమాణములచే హరిహరనాథుఁ డర్చాస్వరూపి యనియు, హరిహరనాథదేవాలయ ముండనోపుననియు నేర్పడినది. అయినచో నది యెచ్చట నుండె ననువిషయ మింకఁ జర్చింపఁ దగియున్నది.

నెల్లూరు నాశ్రయించి పాఱుచున్న పినాకినీనది యిప్పటివలె నొకపాయ కాక రెండుశాఖ లై పాఱుచుండెను. ఇప్పు డానది తల్పగిరిరంగనాథస్వామి వారి యాలయము నానుకొని యుత్తరవాహినిగాఁ బ్రవహించుచున్నది. రెండవపాయ బొత్తిగా నదృశ్యమైనది. అయినను వృద్ధపినాకిని యనఁబరఁగి యచ్చటఁ గొన్ని చోట్ల నేఱుపాఱినస్థలము గోచర మగుచున్నది. రెవిన్యూలెక్కలలోఁగూడ నిందుకూరుపేట యనుగ్రామములో వృద్ధపినాకిని యని నది నిర్వచింపఁబడి యున్నది.

ప్రస్తుతము ష్టోన్‌హావుసుపేటమీఁదుగాఁ బూర్వము నది ప్రవహించియుండవలెను. ఒకటిరెండు ప్రాచీనప్రమాణములు గలవు.

జక్కన యనుకవిరచించిన విక్రమార్కచరితములో "సిరుల నొప్పారు విక్రమసింహపుర" మనినిర్దేశించి యప్పురంబున "నెగడెడు పినాకినీతటినీవధూటి, పట్టణాంతరసీమఁజూపట్టుటయును" అని వర్ణించియున్నాఁడు. ఇందుచేఁ బట్టణమధ్యమున నది ప్రవహించుచుండె నని విదితము. (విక్రమార్కచరిత ఆ. 7-139.)

మఱియుఁ దల్పగిరిక్షేత్ర మనఁబరఁగు శ్రీరంగనాథస్వామిదేవాలయ మున్నచోట క్షీరసముద్రమనియు (తిరుప్పార్‌కడలని) రంగనాయకులపేటకు చిత్రమేళ్ల విణ్ణగరం బనియు రంగనాథునికి పళ్లికొండపెరుమాళ్లనియు వర్ణింపఁబడియున్నది. పినాకినీనది రెండుశాఖలుగాఁ బ్రవహించుటచేతనే యీమధ్యప్రదేశము క్షీరసముద్రముతోఁ బోల్చుట సరియగును. ఇది క్షీరసముద్ర మగుడు శయనమూర్తి యావిర్భవించుటకు నవకాశము గల్గు. రంగనాథునికి శాయప్పెరుమాళ్లనికూడ నామధేయము కలదు. పెన్నగడచిన పెరుమాళ్లసేవ యను సూక్తియు దీనికి సహకారియగుచున్నది. See Nellore District Inscriptions Vol. II p. 829,833.

రెండుశాఖలుగాఁ బాఱుచున్నందున నేశాఖయొడ్డున నీహరిహరనాథ దేవాలయ ముండినదో యాధారము తెలియరాదు. దక్షిణశాఖ పాఱుచుండినచోట నిప్పుడు పరిశోధించుటలో నాయొడ్డున దేవాలయము లుండినట్లు మండపముల రాళ్లు, దేవాయములరాళ్లు మొదలగునవి గన్పట్టుచున్నవి. ఆప్రదేశము ప్రస్తుతము రోమన్ క్యాతలిక్ చర్చివారిస్వాధీనములో నున్నది.

పరంపరగా వచ్చుగాథలను జూచినచో శ్రీరంగనాయకస్వామివారియాలయమునకు నుత్తరభాగంబునం దుండునట్లు నమ్మవలసియున్నది. ఈవిషయమై యనుభవము గలపెద్దలు హరిహరనాథునియాలయ ముత్తరవాహినిగా నున్నపినాకినీతటమం దుండెననియే నమ్మవలసియున్నారు. ఈ యాలయము తుదిముట్ట శిథిలమైనందుల కెంతయు శోచనీయము.

హరిహరనాథునకు నీతిక్కనయేగాక మఱికొందఱుకవులుకూడఁ గృతుల సమర్పించిరి. వారిలో నుత్తరహరివంశము రచించిననాచనసోముఁడు మిక్కిలి గొప్పవాఁడు. పంచతంత్రమును బద్యకావ్యముగా రచించిన బైచరాజు వేంకటరాజును హరిహరనాథున కంకిత మొనర్చెను. ఇతఁడు తా రచించినకావ్యంబున,

క. ఏచనవు గలకు హరిహర,సాచివ్యము నొంద నన్యజనులకు మది నా
లోచింపఁ దిక్కయజ్వకు,నాచనసోమునకు మఱియు నాకుం దక్కన్.

అని చెప్పియున్నాఁడు. దీనం జూడ? మఱియు జక్కనకూడఁ దన విక్రమార్కచరితంబున హరిహరనాథుని నుతించియున్నాఁడు. ఇట్లెందఱుకవులు వర్ణించిన హరిహరనాథుఁడు కేవలము జ్ఞానాత్మకస్వరూపియే కాని యర్చారూపి కాఁడనుట సమంజసము గానోపదు. పై కవులుకూడ నెల్లూరుమండలమువా రని యూహింపఁదగియున్నది.

తిక్కన భారతరచనంగూర్చి పెక్కు గాథ లున్నవి. వానిలోఁ గొన్ని తిక్కన నన్నయలు సమకాలికు లని నిరూపించుటచే విశ్వాసపాత్రములు గావు. మఱికొన్ని కుమ్మరగురునాథునింగూర్చి. వాడు సమకాలీనుఁడుగామి నవిశ్వసనీయంబులు. కాన వానినన్నిటి నిటఁ బరిహరించితి.

ఇతఁ డీరెండుగ్రంథము లేకాక కవివాగ్బంధన మనియుఁ, గృష్ణశతకమనియు గ్రంథములనుగూడ రచించినట్టు కొన్ని యాధారము లున్నవి. అవి యన్నియు నంతగా వ్యాపకములు గావు.

తిక్కనకవిత్వము.

తిక్కన మహావిద్వాంసుఁడు. సంస్కృతమునందును దెనుఁగునందు నసమానపాండిత్యము గలవాఁడు. ఇతనికవనముం బోలి కవనము వ్రాయుట కెవరికిని దరము గాదు. ఈతనిప్రజ్ఞ యపార మగుటంజేసి మహాకవు లితనిని బరిపరివిధములఁ బొగడియున్నారు.

కేతన :—

క. అగుననఁ గొమ్మయతిక్కఁడు, జగతి నపూర్వార్థశబ్దచారుకవిత్వమై
నెగడిన బాణోచ్ఛిష్టం, జగత్త్రయ మ్మనినపలుకు సఫలం బయ్యెన్.
(దశ. ఆ. 1-89.)

క. అభినుతుఁడు మనుమభూవిభు,సభఁ దెనుఁగున సంస్కృతమునఁ జతురుండై తా
నుభయకవిమిత్రనామము, త్రిభువనమున నెగడ మంత్రితిక్కఁడు దాల్చెన్.
(దశ. ఆ. 1-95.)

ఎఱ్ఱాప్రెగ్గడ :—

మ. తనకావించిన సృష్టి తక్కొరులచేతం గాదునా నేముఖం
బునఁ దాఁ బల్కినపల్కు లాగమములై పొల్పొందు నా వాణిన

త్తను నీతం డొకరుండ నాఁ జనుమహత్త్వప్తిం గవిబ్రహ్మ నా
వినుతింతుం గవితిక్కయజ్వ నఖిలోర్వీదేవతాభ్యర్చితున్.

నాచనసోముఁడు :—

ఈతనియం దుండు గౌరవముచే గ్రంథమును గూడ హరిహరాంకితముచేసెను.

శ్రీనాథుఁడు :—

ఉ. పంచమవేద మై పరఁగు భారతసంహిత నాంధ్రభాష గా
వించెఁ బదేనుపర్వములు విశ్వజగద్ధితబుద్ధి నెవ్వఁ డ
క్కాంచనగర్భతుల్యుని నఖండితభక్తి నమస్కరింతు ని
ర్వంచితకీర్తివైభవవిరాజికిఁ దిక్కనసోమయాజికిన్.

ఇట్లనవద్యహృద్యం బగుకవిత్వనైపుణి గలవాఁ డితం డొకఁడే. ఇతని కవిత ద్రాక్షాపాకము. అలఁతియలఁతి పలుకులతో హాల సంధించిన ట్లుండును. ఒప్పగుజాతీయములు మెండు. రసపోషణము నౌచిత్యవిచారమును నల్లికబిగియు నితం డిచ్చినవారికిఁ గద్దు. అర్థకాఠిన్యము లేకపోయినను నన్వయకాఠిన్యము గలదు. ఇతఁడు సాధ్యమైనంతవఱకుఁ దెనుఁగు పదములనే ప్రయోగించును. ఆ యంశమునె తాను నిర్వచనోత్తరరామాయణమునందు 'జాత్యము గామి నొప్ప యిన సంస్కృత మెయ్యెడఁ జొన్ప" నని శపథము చేసియున్నాఁడు. ఇతని శబ్దజాల మత్యధికము. దేశీయములను జాతీయములందే యితనికిఁ బ్రీతి మెండు. ఇతని పలుకులు సరమున ముత్యములు కూర్చిన ట్లుండును. ఈమహాకవి భారతము రచించుటలో 'నాంధ్రావలి మోదముం బొరయం' జెప్పెద నని ప్రతినవట్టెను. అట్టి ప్రతిన నతఁడు సంపూర్ణముగఁ జెల్లించె నని నాయభిప్రాయము. ఈకవి యధరీకృతమయూరుండును భారవికల్పుఁడు నగుటచే మయూరునిసౌకుమార్యమును భారవియొక్క యర్థగౌరవంబును నితనికవనమందుఁ గలదు. ఇతనిని గవిత చెప్పి మెప్పించుటకు బ్రహ్మకైన నలవి గాదు. ఇట్టి మహానుభావునందు నెఱసులు గణించుట యెంత యవివేకము. ఇతని కవిత్వంబునకు మెచ్చి హరిహరుఁడే కావ్యమును బ్రార్థించెను.

## తిక్కన తెనుఁగు.

కొంద ఱాధునికులు తిక్కన నెల్లూరి తెలుఁగువాఁడు, భారతమును బాడు చేసె నని చెప్పుట తటస్థించినది. నెల్లూరి తెనుఁగు, గుంటూరి తెనుఁగు, రాజమహేంద్రవరము తెనుఁగు నని యిన్నివిధము లైనవి గ్రాంథికభాషయం దున్నవా యని

యోజింపఁ దగియున్నది. ఒకవేళ నున్న వనుకొన్నను నెల్లూరితెనుఁగునకుఁ
గొఱంత యేమేని యున్నదా యని యడుగవలయు. నే నెఱిఁగినంతవఱకు నె
ల్లూరితెలుఁగునందు లోప మేమియు లేదు. ఉచ్చారణయందు సహితము నేవిధ
మైనవిజాతీయ మైననాదము లగపడవు. కవిత్రయములో నిద్దఱిచేఁ బోషింపఁబడి
నాచనసోమనాథునిచేఁ బరిగణింపఁబడి జక్కనకేతనాదులచే నభ్యసింపఁబడిన
తెలుఁగే నెల్లూరుతెలుఁగు. తుదకు నెల్లూర నుండుసామాన్యజనులుగూడ నెఱ
జాణ లనిపించుకొనుచో వారితెనుంగున కేలాటిలోప ముండునో యెఱుఁగరా
కున్నది. తిక్కనచే నిరస్తులైన "పలుకులుపొందు లేక రసభంగము చేయుచు
యొంటఁ హృదయం బలరింపలేని కుకవులే" కానోపుదు రని యే నూహించెద.
ఆంధ్రప్రపంచమునకు సృష్టికర్తయై వఱలునట్టి యఖ్యాసనకల్పుఁడైనట్టి తిక్కన
ప్రయోగములు "లౌకికానాం హి సాధూనా మర్థం వాగనువర్తతే। ఋషీణాం
పున రాద్యానాం వాచ మర్థోఽనుధావతి" యనుమహాకవివాక్యము రీతిని వి
శృంఖలవృత్తిని జరించుచుండ వానిని నధిక్షేపించుటకన్న నాచరించినచో జన్మ
సాఫల్యము కాఁగలదు. ఇట్టిమహనీయులయందుఁ దప్పులు గణించుట యఘసం
పాదనహేతుకమే గాని వేఱొండు గాదు. వారిప్రయోగంబులు మన కెంతయు
నాదరణీయంబులు; ఆచరణీయంబులు. అప్పకవివంటిలాక్షణికకవి సోమయా
జులు వాడుటచే విశేషవళి యని చెప్పిసత్కరించినాఁడు. ఇట్లుండ సోమయా
జుల తెనుఁగుంగూర్చి యధిక్షేపించుట విరసంబు.

### తిక్కననన్నయల తారతమ్యము.

మహాకవు లగువీరిద్దఱిలో భేద మేర్పఱుచుట మిగులఁ గష్టము. అందులో
నొకఁడు శబ్దశాసనుఁడు మఱియొకఁడు కవిబ్రహ్మ. వారికి వారే తుల్యులు. అయి
నను దారతమ్య మరయవలె నని పరిశీలించి చూచినచో నన్నయకంటెఁ దిక్క
నయే యెక్కుడని తోఁపఁగలదు. భారతరచనను బట్టిచూచినచోఁ దిక్కన
యెక్కువగ్రంథము నాంధ్రీకరించినవాఁడు, కాన, నెక్కువశబ్దజాలమును బ్రయో
గించినవాఁడు. మఱియు నన్నయభట్టు భారతరచనయందు నారాయణభట్టు
పాకశాసనికి నారాయణునివలె సహాయ మొనర్చినట్టు చెప్పియుండుటచే నెంత
వఱకు సాహాయ్యము ప్రసరించెనో తెలియకున్నది. నన్నయకవనమునకు మె
ఱుఁగు వెట్టుచుండెనో లేక ప్రత్యేకభాగములను దెలిఁగించెనో తెలియరాకున్న
ది. తిక్కన యసహాయశూరుఁడు. ఏకముఖముగ తానే యంతయును నాంధ్రీ

కరించెను. తెనుఁగుపదములఁ గూర్చుటయందు నెక్కుడుపాండిత్యమును దిక్కన చూపియున్నాఁడు. నన్నయ రాజనరేంద్రునకుఁ గేవలము కుల బ్రాహ్మణుఁడుగను నాస్థానకవియై యుండెను. తిక్కన వైదికమార్గనిష్ఠాగరిష్ఠుఁడైనను లౌకికాధికార ధూర్వహుఁడై యుండుట యతనికావ్యంబునకు మఱింత మెఱుఁగుపెట్టెను. అందు చేతనే కాఁబోలు నన్నయభట్టు వ్రాసిన 'మదమాతంగతురంగ'యను పద్యము పై మెఱుఁగు పూసి పంపె నని వాడుక గల్గినది. కవిత్రయమువారిలో నొకరి నగ్గించి మఱియొకరి నధఃకరించుట త్రిమూర్తులలో భేద మేర్పఱింపఁ జూచుట యట్లయగు. అట్టిపని చేయం దగదు. అయినను మదీయచాపల్యంబును సూరి జనులు సైరింతురు గాత.

ఎట్టిమహాకవులకును గ్రంథములు వ్రాయుచోఁ బొరపాట్లుండును. మహాకవి కాళిదాసు కూడ "సుభగసలిలావగాహాః" అనుచో నశ్లీలము వచించె ననిరి. అట్టియశ్లీలము తిక్కన విరాటపర్వమునందు నొకచో స్ఫురించుచున్నది. కీచకుఁడు సైరంధ్రి యగుద్రౌపదిం జూచి విరహావస్థలఁ బరితపించు తఱి

సీ. దీనిజన్మంబునఁ దేజంబు నొందిన యింతియుఁ బతియును నెవ్వరొక్కొ

* * * * *

దీనివసించుటఁ దా నొప్పి పెంపున నేపారుమందిరం బెద్ది యొక్కొ

ఆ. దీనిఁబొందఁ గాంచుఁ దెఱఁగు నా కెయ్యది, యొక్కొ యిట్టిపనికి నూఱడిల్లి
తోడుకొనఁగ నిచట నీడగుచుట్టంబుఁ, దడవి యెట్టు లొక్కొ వడయువాఁడ.

ఇచ్చోఁ బొందఁగాంచు, అనునీపదము వ్యంగార్థద్యోతకము.

తిక్కన వంటిమహనీయుఁడే నన్నయభట్టు దధలప్రాసము చెల్లించుచోఁ దప్పువట్టక దానినె గౌరవించి పాటించెను.

ఉ. కాదన కిట్టిపాటియపకారము తక్షకుఁ డేకవిప్రసం
బోధనఁ జేసిచేసె నృపపుంగవ నీవు ననేకభూసురా
పాదితసర్పయాగమున భస్మముసేయుము తక్షకాదికా
కోదరసంహతిన్ వహుతవహాగ్రమహోగ్రశిఖాచయంబులన్. (ఆది)

క. ముద మొదవ రమ్యహర్మ్యము, తుదినిలువున నిష్టసఖులతోడ విహారా
స్పద మగు నెలవున మెలఁగెడు, సుదేష్ణ తజ్జాలకములఁ జూచెం బ్రీతిన్.

ఇచ్చోటఁ 'సంబోదన'యనియు 'సుదేష్ణ' యనియుఁగొందఱు సవరించిరి గాని యది సాధుసమ్మతము గాదు. 'బోదన'యను తెలుఁగునకు 'సం'అను సంస్కృ

తోపసర్గ చేరఁజాలదు. సుఘ్నేష యని సంస్కృతములోఁ బేరును నొత్తులేక తెలుఁగున మార్చుట సరికాదు.

### ఉపసంహారము.

ఇట్టిమహనీయునింగూర్చి వ్రాయఁగలవిషయము లెన్నియో గలవు. గ్రంథవిస్తరభీతిచేతను గాలవిళంబభయముచేతను, మదీయపరిజ్ఞానలోపంబుకతనను జెక్కు విషయంబులు లుప్తంబు లయ్యె. శాంతు లైన యీసభ్యులును బండితవతంసులును నాయెడఁ గరుణించి నాలోపంబులు గణింపక స్ఖాలిత్యములను సవరించి నన్నుఁ గృతార్థుని జేయుదురుగాక యని ప్రార్థించుచు నీవ్యాసము నింతటితో ముగించుచున్నాఁడ.

మా. నరసింహాచార్యులు.

---

## పరిషత్పుస్తకభాండాగారము.

### విష్ణుమాయానాటకప్రబంధము.—సంఖ్య 4203.

ఇది యైదాశ్వాసములు గల ప్రబంధము. ౯౦ పత్రములగ్రంథము, కాని నడుమనడుమ ౪౦ పత్రములులేవు, మొదటియాకు లేదు, కడపటి యాకులోగద్యము "ఇది శ్రీమదనగోపాలవరప్రసాదలబ్ధ కవితావిలాస భారద్వాజగోత్రపవిత్ర అయ్యలామాత్యపుత్ర అనంతయనామధేయప్రణీతంబైన విష్ణుమాయానాటకం బనుమహాప్రబంధంబునందు సర్వంబును బంచమాశ్వాసము" అనియున్నది. ద్వితీయాశ్వాసాంతమునగద్యము కనఁబడుచున్నది, కనఁబడినంతవట్టు కృతి గోపాలమూర్తికి నిచ్చినట్లు తెలియవచ్చుచున్నది. కాని, యేయాశ్వాసాంతపద్యములలోనైన నీగోపాలదేవుని దేయూరో తెల్పునని చూచినఁగనఁబడలేదు. మొదటిపత్రము లేనికతంబునఁగవివంశాదికమును దెలియరాలేదు. కథ చమత్కారముగానున్నది. వెలుగోటి బంగరేచవిభుని కంకితముగా రోసనూరి వేంకటపతికవి రచించిన విష్ణుమాయావిలాసము కథకు దీనికిని భేద మున్నది. దానియందు భాగవతాష్టమస్కంధములోని శ్రీహరిమోహినీరూపమునం జేసిన శంకరమోహాదికమే కడవెళ్ల వర్ణింపఁబడినది. ఇం దట్లుగాదు:—పరీక్షిన్నరేంద్రునకు విష్ణుమహిమలు చెప్పుచుఁ గృష్ణునకు ధర్మరాజనినఁ బాండవులనిన మిగులఁ బ్రేమయని తెల్పి దానికిఁ గలకారణముల నెఱింగించుటయు, వ్యాసుండు ధర్మజునకు విష్ణుమాయలు తెల్పుచున్నయవసరంబున నారదాదులు కృష్ణునికడకరిగి, నీస్నేహితుఁడును సాందీపునికుమారుఁడగుధర్మశీలునికొడుకు గోవిందశర్మయనువాఁడు నీ యింటఁ జనవుగ మెలఁగుచు నందు సత్యాపధూమణికి నతిప్రేమపాత్రుండై మెలంగువాఁడు నీమాయలన్నియు నాయావేళలయందుఁ గథలుగా నొక్కపుస్తకము వ్రాసియున్నట్లు విని వానిని వినవచ్చితిమి. గోవిందశర్మచే మాకాకథలను వినిపింపుమన నిక్కడ వినుట గాదు. వ్యాసమహర్షి విష్ణుమాయలు ధర్మజునకుఁ జెప్పుచున్నాఁడు. మీరెల్లరు నందేగి యాసభలో నీపుస్తకములోనికథలను వినుండని గోవిందశర్మతోఁగూడ గగనమార్గమున ధర్మరాజునొద్దకుఁ బంపుటయు నిఖిలమునులు దివ్యదృష్టి నీయుదంత మెఱింగి పాండవులయాస్థానమునకు వచ్చుటయు నుగా మొదలిడి, ధర్మరాజు—

గీ. అనఘ ఘనసురతనయ గుణాభిరామ, యచ్యుతుని యట్ల నీవు మా కరసిచూడ
నీదువృత్తాంత మంతయు నెలమితోడ, నాకు నెఱిఁగింపు మున్న వినంగవలయు.

క. అహితల్పునకుం దక్కఁగ, మహిమోజ్జ్వలపారిజాతమాల్య మొరునకు
న్మహిఁ దాల్పరాదు నీవు,న్వహింప నెట్లొదవెఁ జెపుమ వటుకులతిలకా.

అని యడుగఁగా:—

ఉ. ఆరయ సత్యభామహృదయం బెటులుండునో యంచు మాయవి
స్తారము చేసి శౌరి ప్రమదంబున రుక్మిణియాదియైన పం
కేరుహపత్రలోచనల కేళివనంబుల నొక్కటొక్కచో
పారఁగఁ బారిజాతనివహంబుల నిల్పె సమర్థ మేర్పడన్.

అనిపారిజాతప్రస్తావమున నష్టమహిషులుఁ బదాఱువేలగోపికలచరిత్రమును వారియెడఁ గృష్ణునిమాయాకేళియు బ్రహ్మాదులగర్వభంగము, పుండరీకచరిత్రము,నమృతమున కై సురాసురులు సముద్రమథనము గావించుట,

ఉ. నారదుపుంస్త్వ మీసరసునం బరిముక్తము సేసి యంగనా
కారము సేయ మాయసమకట్టిన వస్తుచయంబు నాఁగ సొం
పారుచుఁ జూడనొప్పెఁ జరణాదిశుభావయవాభిరామముల్
సారససైకతోర్మి పటుచక్ర నవోత్పలభృంగసంఘముల్.

అనుసందర్భముగా, పర్ణ్యమై పుణ్యమై చతుర్వర్గఫలదమైకరంబు జగత్సేవ్యమయ్యె నాది
విష్ణుఁ డచ్చోట యోగియై వెలయుకతన,సన్నుత క్షేత్రరాజ మాసర్పవరము.

అని సర్పపుర క్షేత్రమాహాత్మ్యమును లక్ష్మీతపస్సు లోనుగా ననేక కథలు తెల్పఁబడినవి. ఇంక నెన్నికథ లిందున్నవో సమగ్రగ్రంథము దొరకినంగాని తెలియదు. ఎవరియొద్దనైన నున్నం దెల్పఁ గోరెదము. శైలికి నాల్గుపద్యములు.

సీ. జమున పుంభావమై సాక్షాత్కరించెనో లలితమహేంద్రనీలముల ప్రోవో
నవ్యసాలగ్రామనగశృంగ మెసలెనో సుస్మేరకహ్లారసూనవనమొ
కోమలపల్లవాంకురితతాపింఛమో ఘనతరామృతమేఘఖండభరమొ
సామాదిదైవతోద్దామవిలాసమో హరిమూర్తి నచ్చోత్తినట్టిరూపొ
యనఁగ దూర్వాంకురశ్యామలాంగదివ్య, కాంతిచకచక లాశలఁ గడలుకొనఁగ
నెదుటఁ దోఁచినవ్యాసమునీంద్రుఁ జూచి......

ఉ. ఎయ్యెడనుండి వచ్చితివొ యీపురిదానవు గావొ యైతివే
నియ్యెడ మమ్ము నిట్లడిగె దేమది వార్తలు మంచి వన్నియల్
నెయ్యముతో జనార్దనుఁడు నేఁ డొక నూతనలక్ష్మిఁ దెచ్చినాఁ
డయ్యలనాఁగ విభ్రమమహత్త్వము లెన్నవశంబె యేరికిన్.

శా. తానుం బ్రహ్మను బద్మజాండము స్వజాతం బైనఁ దానొక్కఁ డే
కానన్యం బిఁక నొండు లేదనుచు సంకల్పించి యాస్రష్ట దు
ర్జ్ఞానశ్రీ వసలారె వైష్ణవమహామాయాకృతాబ్జాసనాం
డానీకమ్ము లనేకము ల్మతియు నయ్యైచోట్ల వర్తింపఁగన్.

మహా(స. కనియెం దీరానిజోత్కటకుసుమరజఃకాండధారాళవార్యు
ద్ధనవేగవ్యగ్రభృంగీగణచరణపతత్క్రమపుష్పప్రహార
స్వనదంభోభంగరంగజ్జలఖగపరిషచ్చారుసంచారలీలా
జనితోల్లాసామరర్షీశ్వరవరసుమనస్సారసంబుల్ సరంబుల్.

## వాసవదత్తాపరిణయము. సంఖ్య 4175.

సుబంధుమహాకవి సంస్కృతమున రచించిన వచనవాసవదత్తాకావ్యమునకుఁ దెనుఁగున వక్కలంకవీరభద్రకవి రచించిన వాసవదత్తాపరిణయ మొక్కటి గలదు. అట్టిదే యిది రెండవది. దీనిని రచించిన కువరవి రామకవి గద్యమందుఁ దన్నుగూర్చి "ఇది శ్రీరామచంద్రకరుణారసమరందధురీపరీవాహసంవాహసురభితసరససంస్కృతాంధ్రకవితావితాన కువరవ్యభిధానసంతానసందన వేంకటకృష్ణనందన రామాభిధానకవిప్రణీతం బైనవాసవదత్తాపరిణయంబు" అనిమాత్రము తెల్పియున్నాఁడు. గ్రంథపీఠికలో:—

వృషభగతిరగడ. నను నగస్త్యకులాన్వయాంబుధినవ్యచంద్రయశఃపవిత్రుఁడ
వినుతకువ్వివరాన్వయోత్తమ విమలకీర్తి నృసింహనప్తృఁడ
విదితవేంకటరామశాస్త్రివివేకభూషణవిప్రపౌత్రుఁడ
విదనభాగవతాగమాంచిత పాపనాహ్వయశాస్త్రి పుత్రుఁడఁ
బ్రకటశాస్త్రపురాణచణగోపాలసూరివరేణ్యు తమ్ముఁడ
సకలగుణఖనివాసుదేవుని సలలితమ్ముల గూర్మితమ్ముఁడ
వినయలక్షణపెద్దిభట్టుల పెంపుమీఱిన యగ్రజాతుఁడ
ననిశరామకటాక్షరాజిసురాపగాపరిగాహపూతుఁడ
నను మెఱుంగులు చెంగలించెడు నూఁగుమీసపుకట్టుగల్గిన
గొనబుప్రాయపుసొమ్ము కిమ్మగు కొల్వుకూటపుమేనుగల్గిన
కలితసూభయపూర్ణసాహితి... కళాఘనకీర్తిసాంద్రుఁడ

ఇత్యాదిగ వ్రాసికొనినాఁడు. గద్యములో వేంటకృష్ణనందనుఁడనని రగడలోఁ బాపనాహ్వయశాస్త్రిపుత్రుఁడనని తెల్పఁబడియున్నది. దీనిసంగతియేమో విచారింపవలయును. ఎట్లున్నను ఇతఁడు తనస్వప్నములో శ్రీరామచంద్రమూర్తి దర్శనమిచ్చి... చెంతనున్ననన్నుఁ । జారుతరభాషవిప్రకుమార నీదు । సత్ప్రబంధంబు విన నిచ్చనిలిచెననికోరిన దీనిని రచించినట్లు వ్రాసినాఁడు. ఇక్కవి సంస్కృత కవులను—

గీ. వ్యాసవాల్మీకిముని కాళిదాసబాణ,డిండిమమయూరభారవిదండిభాస
మాఘశంకరబిల్హణమల్హణాది,ప్రముఖులైనట్టి కవుల నేఁబ్రస్తుతింతు.

అని స్తుతించి యాంధ్రకవులపే రెక్కడ నెత్తలేదు. ఇంతలో నితఁ డతిప్రాచీనుఁ డనుకొనుటకు వలనుగాదు. నాలవయాశ్వాసముగద్య క్రింద—

క. కువరవికులకలశనీరధి,తరుణతుషారాంశువిభవ ధారాళధురం
ధరరామకవివినిర్మిత,వరవాసవదత్తపాల్చనారితమహిమల్.

చ. అరయఁగ శాలివాహనశకాబ్దగణంబున నేర్పరింపఁగాఁ

త్కరవివరాన్వయాంబుధివిధుప్రభుఁ డౌఘనరామసూరి ధీ
భరమునఁ దా రచించె నిది వాసవదత్త తెలుంగుబాసతోన్.

అనుపద్యములుగలవు దీనింబట్టి శా॥శ॥ ౧౭౧౨ క్రీ॥శ. ౧౮౦౦ నాటివాఁడగునని తేలినది. ఎందలివాఁడో తెలిసికొన నాధారము లేదు. మాకు దొరకినప్రతి యతిశిథిలావస్థలోనున్నది. విప్పిన పుస్తకము గట్టులోపల ముక్కలగుచున్నది. ప్రత్యంతర మెవ్వరికడనైనను న్నచోఁ బంపఁగోరెదము. దీనిని మ॥రా॥ వావిలికొలను సుబ్బరావుపంతులుగారిచ్చినారు. నడుమనడుమఁ గొన్నియాకులు వ్రాయకుండ విడిచిపెట్టినారు. అక్షరములకంటె ఘుణాక్షరములు మెండుగానున్నవి. కొన్ని తావులలోఁ జదువుటకే శక్యముకానట్లున్నది. కథ వాసవదత్తకథయే. కవియాంధ్రీకరణముశైలియుఁ గొంత తిలకింపుఁడు.

శ్లో॥ కరబదరసదృశ మఖిలం భువనతలం యత్ప్రసాదతః కవయః
పశ్యంతి సూక్ష్మమతయః సా జయతి సరస్వతీ దేవీ.

తెనుఁగు. శ్రీకరము యత్ప్రసాదవిశేషగరిమ, భువనతలమంతయును సూక్ష్మబుద్ధిఁ గవులు
...శమునుగాంతురు కరములోని,సరసురాలైనయాసరస్వతిని దలఁతు.

శ్లో. ఖిన్నోఽసి ముంచ శైలం బిభృమో వయమితి వదత్సు శిథిలభుజః
భరభుగ్నవితతబాహుషు గోపేషు హసన్ హరిర్జయతి

తెనుఁగు. అలసితివయ్య కొండ విడు మానెద మేము యటన్న నంతలో
పలఁ గతివేల్పు కేల్వదల భారముమిక్కిలి యోర్వలేక బా
హులు గడుఁ గ్రుంగ యాదవుల నొప్పఁగ లేఁజిఱునవ్వునవ్వు న
క్కలుములగొల్లపాపని నకుంఠితభక్తిని సంస్మరించెదన్.

ఉ. కారుమెఱుంగుఁజేఁకటుల గారవపున్నుసొగసైన క్రొ
క్కారున మీఱుకీలుజడ గాదిలిచిల్వఫణాతలంబుపైఁ
జారుతరంపుమానికపుఁజాయనఁ బాఁపటనంటు గుంకుమ
శ్రీరుచి బిందువు ల్గలుగుసీత యభీష్టము లిచ్చుఁగావుతన్.

ఉ. జక్కవగుంపుతీఱు నలుచక్కల మిక్కిలి యంచబారు మే
ల్చిక్కనికమ్మతావుల బలీయని తూఱు మధువ్రతంబు సొం
పెక్కవకారు చాలతమిగోరినతమ్మికొటారు నౌర యా
చొక్కపుబేఱు చూడఁ గడుశోభితమై యలరారు నెంతయున్.

గీ. ఓవయోజాప్తనీచెలులాపదలను,గుందఁగనుజేసి జాబిల్లికుటిలుఁ డడఁగెఁ
బట్టు, కట్టుము, కొట్టనిపలుక భంగిఁ,గూసె ముద్వితములఁ గోళ్లు కుదురుగాను.

వ. మఱియు నాతండు దశరథావనీతిలకుండునుంబోలె సుమంత్రసుమిత్రాంచితుండై వసంతుని బోలి నానారామానందదాయకుండై రాఘవునింబోలెఁ గుశలవయోరూపప్రకాశమానుండై పారిజాతమునుంబోలె నాశ్రితనందనుండై మందరమహీధరంబునుంబోలె భోగిభోగలాంఛితుండై శారదనీరదంబును బోలె నవదాతహృదయుండై కంసునిబోలెఁ గువలయాపీడభూషణుండై....

# చంద్రభాను చరిత్రము

## ప్రథమాశ్వాసము.

— గ్రంథావతారిక. —

*శా. శ్రీలీలావిభవాప్తి కాశ్రితజను ల్చింతింపఁగాఁ జేరుచే
సౌలభ్యం బనుచు న్నిజాగమనసంజాతస్మృతిం బొల్చుభ
క్తాలిం గోర్కు లొసంగి ప్రోచుటకు దత్తాత్రేయదివ్యాకృతిన్
శ్రీలాలిత్యము గన్ననిత్యకరుణాసింధున్ హరిం గొల్చెదన్. 1

సీ. తొడవులఁ దనరూపు దోఁప సేవాసన్నకాంతాంతరమునీమ [1]గప్పుకరణి
జగదంబ గాన భూజనుల కవ్యయసౌఖ్యవిభవంబు లిమ్మని వేఁడుకరణి
బలిబంధవేళ సంధిలు[2]ననంతాచంక్రమణభూరివిశ్రాంతి మడఁపుకరణి
నన్యాబ్జములు మాని యమృతకరప్రకాశోన్నతాబ్జములు గైకొన్నకరణి
నభినవదుకూలచేలాంకితాంకపాళి
నంబుజోదరుపదపల్లవంబు లుంచి
యెలమి సంవాహ మొనరించు కలిమిచెలువ
చిరతరైశ్వర్యములు మాకుఁ [3]జేయుఁగాత. 2

చ. కమలదళాక్షుభక్తుల కగాధభవార్ణవ మింతబంటి య
న్నమణఁ గటిస్థలంబునఁ గరం బిడి రాముఁడె సర్వదైవతో
త్తముఁ డని చాటుచుండెడి విధంబున దక్షిణపాణి నెత్తి ని
త్యమును బ్రతాపముద్ర నలరారు సమీరకుమారుఁ గొల్చెదన్. 3

మ. పరమప్రౌఢి నశేషవర్ణరచనాపారీణుఁడౌ భర్త హ్రా
త్సరణిం డాయుదు నేన యేఁగ యనునోజన్ వర్ణసంధానభా

---

క-పరిషత్పుస్తకభాండాగారములోని 14 సంఖ్యగల తాళపత్ర పుస్తకము.
చ-రాజకీయప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారములోని 12-7-8 సంఖ్యగల పుస్తకము. (తాళ)
ట-రాజకీయప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారములోని 14-4-4 సంఖ్యగలపుస్తకము. (కాగిత)
* ఇదిమొదలు 15 పద్యములకడవరకు క-ప్రతిలోఁబత్రములు విఱిగిపోయినవి.
1. చ-గలుపుకరణి, 2. చ-నసంతాధ్వసంక్రమణ భూరిశ్రాంతి కలుపుకరణి, 3. చ-జేర్పుఁగాత.

స్వరవృత్తి స్సమమూర్తులై యొరయు నాసంగీతసాహిత్యబం
ధురవక్షోజము లూను తల్లిని భజింతుం [1]దత్ప్రసాదాప్తికై. 4

సీ. శారదోన్మేషంబు జగతి నందించియుఁ బరమ[2]నారదమైత్రిఁ బరఁగుసుకృతి
నుపమైక ధన్యుఁడై యొరిఁగియు ననుపమప్రఖ్యాతిఁ గాంచినభవ్యచరితు
ననఘబాణాంకిత నలరారియు నలికనేత్రు మెప్పించిన నిర్మలాత్ము
ఘనశబ్దవిస్ఫూర్తిఁ దనరియు హంసనమాగమశ్రీఁ గాంచు ననఘశీలు
మఱియు నగణితసుమనస్సమాజమునకు
నక్షరామృతధారారసార్పణమున
నామెతల నిచ్చలు నొనర్చు నలఘుమహిమ
నెఱపినవిచిత్రసత్కళానిధులఁ దలఁతు. 5

గీ. ఏమహాత్ములుమువ్వురునిలఁద్రిమూర్తు,లట్లగుఱిమైత్రిలింగభాషాహ్వయముయ
థార్థమొనరించియలరించిరట్టిశబ్ద,శాసనునిదిక్కమఖిశంభుదాసుఁదలఁతు. 6

చ. సరసవిశుద్ధవర్ణగుణసంపదయు న్సుచి[3]వృత్తి భావభా
స్వరగరిమంబుఁ బూనని యసారవుమిన్కుఁగరల్గు సాహితీ
శరనిధిగర్భశో[4]భనకళావిముఖు ల్పచరింప వాని నె
ల్లరుఁ జెవిఁబెట్ట రింతయు నలంకృతివై భవధన్యతానిధుల్. 7

వ. అనియిష్టదేవతాపదాంభోజపూజనంబును సుకవిసభాసభాజనంబును సుకవిజ
నో[5]ద్వేజనంబునుం గావించి విరించిగురుకరాంచలసంచాలితామందమందరమ
థ్యమానదుగ్ధాంభోనిధానసంజాయమాన నవీనవర సుధారసమధురతాబం
ధురనవరసభావానుబంధంబును జతురజనశ్లాఘనీయచంద్రభానుచరిత్రవిచి
త్రానల్పచమత్కారయానిబంధంబును నగు[6]నొక్కప్రబంధంబు నిర్మింపంబూ
నుసమయంబున. 8

ఉ. కావ్యము సత్కవిప్రకరకర్ణసుధా[7]పరిపూరణక్రియా
భవ్యముగా నొనర్చుట తపఃఫల ముర్విఁ దలంప నట్టిస
త్కావ్య[8]ము నిష్టదైవతవతంసున కిచ్చి కృతార్థుఁడైన యా
యవ్యయభాగ్యరాశిఁ గొనియాడఁ దరంబె జగత్త్రయంబునన్. 9

---

1. చ-దప్రసాదాప్తికై. 2. ట-సోదరమైత్రి. 3. చ-వృత్త. 4. చ-దశా. 5. చ-వై
చిత్రికరానల్ప. 6. చ-నొక్కమహాప్రబంధ. 7. చ-రస. 8. చ-మభీష్టదైవ.

మ. అని యూహించి మదిష్టదైవతము భక్తాభీప్సితార్థోపపా
దనకారుణ్యకటాక్షశాలియు రమా[1]ధామావతారాగ్రగ
ణ్యనవోన్మేషపవిత్రమూర్తియును దత్తాత్రేయుఁడే కాన నా
ఘను నస్మత్కృతినాథుఁ జేయుఁగ నమోఘప్రీతితో నున్నెడన్. 10

సీ. ద్విజరాజకార్శ్యశ్రీయుఁ దీర్చు నీవిభుకీర్తి ద్విజరాజకార్శ్యశ్రీయుఁ దీర్చు టరుదె
యాజిభవస్ఫూర్తి నడచు నీనృపుశౌర్య మాజిభవస్ఫూర్తి నడచు టరుదె
యతిసురభిఖ్యాతి నలరు నీఘనునీగి యతిసురభిఖ్యాతి నలరు టరుదె
చంద్రగోత్ర[2]శ్రీఁ బొసంగు నీపతికల్మి చంద్రగోత్ర[3]శ్రీఁ బొసంగు టరుదె
యనుచు బుధు లెన్న వెలయు రాజాధిరాజ,రాజపరమేశసకలకర్ణాటకాంధ్ర
రాజధౌరేయతిరుమలరాయతనయుఁ,చంద్రుఁడగు వేంకటపతిక్షితీంద్రమణికి.

చ. అనుపమకార్యకర్తయును నగ్రజుఁడు న్మహనీయసత్కృపా
ఖనియు నఖండకీర్తికళికాసురభీకృతసర్వదిఙ్ముఖుం
డును నగుదత్తనార్యుఁడు నను న్వినయాన్వితుఁ బార్శ్వవర్తిఁ గ
న్గొని పలికె న్సుధారసనిగుంభనజృంభితవాక్యవైఖరిన్. 12

మ. గురువిద్వచ్చరణారవిందభజనాంకూరన్మహోదారధీ
గరిమ న్నీ వొనరింపఁబూను కృతికిం గైవల్యలక్ష్మీమనో
హరు నస్మత్కులదైవతోత్తముని దత్తాత్రేయయోగీశ్వరు
న్వరుఁ గావింపఁ దలంచి తెన్నఁ దరమే వత్సా భవద్భాగ్యముల్. 13

క. ఉపరమయత్న మఘని,ర్వాపణ[4]మనఘాస్మదీయవంశగురుతప
స్యా[5]పాకంబున నీమది, దీపించెన్ బళి కులప్రదీపక యనినన్. 14

ఉ. సంతసమంది యేను బితృసన్నిభుఁడున్ హితదేశికుండు న
శ్రాంతశుభప్రదుండు నయి రంజిలుదత్తనమంత్రివాక్య మ
త్యంతవినీతిఁ గైకొని కృతార్థుఁడనై బహుపుణ్యగణ్యత
ల్గాంతు నటంచుఁ గౌతుక[6]విలాసవిభాసితమానసంబునన్. 15

క. శ్రీమద్దత్తాత్రేయమహాముని ముద్రావిభూషితాత్మీయకృతి
శ్రీముఖభూషణముగ మ,త్స్వామిగుణస్తుతి యొనర్తు సమధికభక్తిన్. 16

---

1. క-ధారాప్రధారాగ్రగణ్యనగోన్మేష. 2-3. చ-శ్రీలొసంగు. 4. చ-ఘునను స్మదీయ. 5. ఛ-పాకంబున. 6. చ-వి కాస.

సీ. కోరి కన్నులనొత్తికొనుఁ బలితాభోగి యెదనుంచు సకలకళేశ్వరుండు
శిరమునఁ దాల్చు భాషితదేవి యుడుగెడఁ బాయంగనీఁడు కల్పకగురుండు
పూను సత్కూటమైత్రి బుధకుంజరముముఖంబుననుండఁ జూపు సత్పుంగవుండు
కంఠభూషణముగాఁ గావించు సర్వజ్ఞుఁ డంకమొందించు శేషాంశజాతుఁ
డెట్టియుత్కరవిఖ్యాతినెనసెనో యఖండజయ మూరురాయరగండబిరుద
వీరతిరుమలరాయపృథ్వీతలేంద్ర,తనయుఁ డగు వేంకటక్ష్మామాధవుని కీర్తి. 17

మ. క్షితి మత్తాత్మ సహాయశూన్యుని గృహచ్ఛిద్రంబు వాని న్సమా
హితతారుం గికురించి వేంకటపతిక్ష్మాధీశ్వరుం డెందఁ ద
ద్గతరేణుల్ తదధిష్ఠితాంబువులుఁ దద్గంధానిలంబుం దదం
చితభూజంబులు గాంచి యుండుదురు విశ్లేషార్తి వా రెవ్వరున్. 18

సీ. సర్వతోముఖవృత్తిఁ బర్వనౌర్వమహాగ్నియుదు టెల్ల సింధుదేశోద్భటంబు
దీర్ఘకాలస్ఫూర్తి దీపించువిలయాగ్నిబెడిద మెల్లను సమాపితశకంబు
భీమరోషోద్వృత్తిఁ బెనుపొందుఫాలాగ్నిపెం పెల్లను విదేహభీషణంబు
బహుసత్త్వభీకరప్రౌఢిఁ బొల్చుదవాగ్నితేజ మెల్లను విమర్దితవనాయు
వహహా యవి సింధుశకవిదేహాకవనాయు, లాదిగాఁగలనిఖిలదేశాళినెల్ల
రాయిడించునె తిరుమలరాయువేంక,టావనీంద్రభుజప్రతాపాగ్నిశరణి. 19

మ. రమణీయాత్మకరప్రరూఢవసుధారాలాభనందద్బుధో
త్తమనిత్యాన్నవితీర్ణి సర్వసు[illegible]నోదైన్యంబు వారింప భూ
రమణీధేనుగ జేశ్వరాత్మకబహుశ్రీలిచ్చు శ్రీవేంకటే
శమహీవల్లభుసాటియే విభుఁడుఁ దజ్జన్మక్రియాకర్తయున్. 20

సీ. మిథ్యాభిమానసమ్మిళితుల వివరణకలితోత్తరంగులఁగా నొనర్చుఁ
గలనైన ధర్మకౌశలము నేమఱినివారలకు హేమాద్రిమార్గంబుఁ దెలుపు
నతినయజల్పాభిరతుల వీక్షించి చింతామణి హస్తగతంబు సేయుఁ
బ్రబలతంత్రవిచారపారీణులగువారి దొరసి ప్రాభాకరసరణిఁ జూపుఁ
దత్తదధికారులకు నిట్ల[1]తదుపయోగ,గతులఁగఱపెడుగురువై యఖండసమర
విజయవేంకటపతిరాయ భుజకృపాణ,మఖిలదర్శనాద్భుతశక్తినతిశయిల్లు. 21

ఉ. ధీరవతంస వేంకటపతిత్రుటితారిసితాతపత్రముల్
భూరిజవంబునం దిరుగుఁ బోరులఁ దజ్జయలక్ష్మికిం దిగం

---

1 చ-తదుపయోగ్య

భోరుహనేత్ర లెత్తు తెలిముత్తెపుటారతిపళ్లెరంబు లై
చారుతదీయహేమకలశంబులు దీపము[1] లై వెలుంగఁగన్. 22

ఉ. వేంకటభూవరుం డెనకవీరులు నూఱుగనైన గంటతోఁ
బంకరుహప్రతిబింబము విభాసిలు నాజి సన్నద్ధరంబులన్
సంకులవృత్తిఁ దద్వరణసంభ్రమసంభ్రమదాదితేయతా
టంకవతీపదాంబుజహతచ్యుతనూపురరాజమానయున్. 23

క. ఆవేంకటపతినృపతి ద, యాపీక్షాగౌరవమున నతిశాశ్వతల
క్ష్మీవైభవంబుఁ గాంచిన, నావంశం బభినుతింతు నవమధురోక్తిన్. 24

శా. శ్రీవిద్యావిభవాస్పదం బయిన యాశ్రీవేలనాన్వాయంబునం
బావిత్ర్యాభినుతస్వతంత్రకపిసన్నామేంద్రగోత్రుల్ ధరా
దేవోత్తంసులు మించి రందు వెడఁగొండెన్ భూజనశ్రేణి సం
భావింపం దరిగొప్పులాంకుఁ డగు శ్రీమల్లప్రధానుం డిలన్. 25

చ. విముఖతఁ బూను మిత్రునెడ నే ఘనులం గని డాఁగు శుద్ధప
క్షమున వసుచ్ఛటల్ విడువఁజాలఁడు సారెఁ బ్రకాశితాంశుఁడై
తమి వెలయించుఁ గాని తనుదానమునం గడుఁ గుందు నేగతిం
గుముదహితుండు సాటి తరిగొప్పుల మల్లనమంత్రి కీగులన్, 26

[2]క. ఆతరిగొప్పుల మల్లను, ధీతిలకుఁడు గాంచె నరసధీనిధి నతిఖ
ద్యోతద్యుతి నతులితవి, ద్యాతతి నతిసుకృతి నాగమాంబికయందున్. 27

సీ. తననిశాతకృపాణియును బాణియును బతిశ్లాఘాధురానిరాసము ఘటింపఁ
దనకరుణాసారమును సారమును నరిశాసనస్మయవివాసనము చలుపఁ
దనసద్గుణనికాయమును గాయమును సుధాకిరణవిస్ఫురణ ధిక్కృతి యొనర్పఁ
దనమనీషాభోగమును భోగమును సుధాంధఃప్రధానావధూననము దెలుపఁ
దనప్రభావంబు భావంబు ధర ననంత
ధృతిసమాసాదనంబునఁ దేజరిల్ల
వఱలు నాశ్రితబాంధవావనపరుండు
మంత్రిమాత్రుండె నరసయామాత్యవరుఁడు. 28

చ. చతురాస్యాననపాళిక న్నెలఁగు సంచత్పాంసుపద్మాసన
స్థితి దీపించు వినిర్మలాంబరరుచిశ్రీ మించు హంసాళి న

1. చ-దీపియ. 2. ఇదిమొదలు "యానవాగ్రణి" యను పద్యమునఱకు ట-ప్రతిలోలేదు.

ప్రతిమానోన్నతిఁ [1]దోలియాడుఁ దిలకింప న్మధ్యవర్ణాధిదే
వత గాదే నరసప్రధానమణిదివ్యత్రీమూర్తి యశ్రాంతముల్. 29

చ. నరసామాన్యచరిత్రుఁడే ధర బుధానందప్రదానూనదా
నరసామాన్యయశోవిశోభితదిగంతశ్రేణి గంధర్వకి
న్నరసామాత్యభిరామశుద్ధతర [2]గాంధర్వైకసంస్తుత్యుఁ డా
నరసామాత్యవరుం డనంతపదచింతాపావనుం డెంతయున్. 30

గీ. వెలయు నాతని దేవేరి విజితభర్త్ర
దేవతాజననికురుంబ తిప్పమాంబ
బహుమహాభోగముల నుంచుభర్తకుఁ దల
వంపు లొనరించినధరిత్రి పెంపుఁ డెగడి. 31

సీ. సకలసన్నుతచర్య సద్గురుపరిచర్య పావనయదువర్యపదసపర్య
యన్నదానఖ్యాతి యనఘసాధ్వీనీతి నియతార్యజనతాతిశయవినీతి
బంధురదానశక్తి పరమధర్మాసక్తి నిత్యసూనృతయుక్తి నిర్మలోక్తి
యాశ్రితాశాపూర్తి యలఘుశీలస్ఫూర్తి బహుసతీముఖవర్తిభవ్యకీర్తి
యార్తసంరక్షణంబును నతులభాగ్య, లక్షణంబును గారుణ్యవీక్షణంబు
సహజసిద్ధంబు లీపుణ్యచరిత కని నుతింపఁబొగడొంకు నరసయతిప్పమాంబ.

చ. గురుపరిభూతి లేనిసతి గోత్రోద్ధరస్థితి లేనియుర్వి సో
దరపరిపాలనావిముఖధామవిహారము లేనిశర్మిబి
త్తరి యని బాంధవాశ్రితవితానము సన్నుతి సేయఁ బొల్చు నా
నరసయతిప్పమాంబ భువనస్తవనీయగుణావలంబయై. 33

శా. అత్రిప్రాభవుఁ డానృసింహుఁ డనసూయాత్యంతసంస్తుత్యచా
రిత్రశ్రీసతి తిప్పమాంబవలనం బ్రీతిన్ బుధానీకని
త్యత్రాణైకధురీణు నప్పవిభు నేత్రానందపూర్ణేందు ద
త్తాత్రేయాహ్వయు మల్లికార్జునుని నార్యానక్తుఁ గాంచె న్మహిన్. 34

శా. తారారాజి గణించుఁ జాలఁగఁ గళాధామాంశుమాద్యత్సుధా
పారావారతరంగరేఖలఁ దృణప్రాయంబుగా నెన్నుఁ దా
నౌరా యప్పయమంత్రిశేఖరుని సంఖ్యావత్త్వముద్రామహా
ధౌరంధర్యనిరూఢనిర్మలయశోధారాపరీవాహముల్. 35

1. చ-దోఁచపజాడు. 2. క-గాంధర్వైక. 3. చ-ధర.

చ. అనవరతాన్నదాననిధి యానరసప్రభుసప్పనార్యునీ
డనఁ దగునే సుతా[1]పరిణయంబున వేల్పుల లోకరాణ్ణఁడు భో
జన మతిక్షితలం బిడినసాగరరాజుఁ బదింట నైదిటన్
ఘనరుచి దక్కె నొక్కఁ డనిద్రానన మొసఁగుతుషారభానుఁడున్. 36

సీ. తనదిక్కుఁ జేరుమిత్రునకుఁ దేజము మించఁ దగుసర్వమంగళోత్పాదకుండు
ఘనుల నానాదిగాగతులఁ గైకొని పూర్ణజీవనం బొసఁగులక్ష్మీగురుండు
పరధర్మమున గోత్రవర్గంబుఁ [2]దగుతావు లెనయించి నిలిపినపృథుసమాఖ్యుఁ
డాశ్రితద్విజనాయకావనుం డై తనిష్ఠైకసంపదఁ గూర్పులోకబంధుఁ
డరయఁగఁ బ్రధానమాత్రుఁడే యఖిలవినుత
మాధ్వదర్శనధౌరేయమాననియమ
పరమహరిగురుచరణాబ్జభజనపరుఁడు
మంత్రినరసయ్యయప్పనామాత్యవరుఁడు. 37

చ. తదనుజరత్న మై వెలయు దత్తనమంత్రి మహావిపక్షదు
ర్మదబలమర్మదారణధురంధరసంగరచాతురీవిశా
రదుఁ డగు వేంకటక్షితిపురందరునప్రతిమానరాజ్య సం
పదలు [3]ఫలింప నాకు లిమభవ్యగతిశ్రితపారిజాత మై. 38

సీ. వర్ణంబులనె కాదు వరవృత్తతాస్ఫూర్తి సన్నుతోభయవంశజనులయందుఁ
బత్రంబులనె కాదు పంక్తిశోభ సదాప్రదీయమానాన్నభుగ్ద్విజులయందు
వాచికోక్తినె కాదు సూచితార్థబహుత్వమతులసత్కవిబుధాశ్రితులయందు
లిఖనక్రియనె కాదు లీలానుభావనం బొనరారాతిప్రధానులందుఁ
బొరయఁదిర్మలరాయేంద్రభూరిపుణ్య, రాశియగు వేంకటోర్వీశువ్రాయసములు
వ్రాయుచాతుర్యమున నిజస్వామిహితవి, ధానసురమంత్రి నరసయదత్తమంత్రి.

మ. అరుదార న్వరపత్రవృత్తి యయి దత్తాత్రేయసంస్పర్శనా
క్షురయోగోన్నతిఁ గన్న లేఖిని మహాగర్వాంధసామ్రాజ్యసం
హారణం బున్నతరాజ్యసంభృతియు ద్వీపాంతర్నృపాకర్షణ
స్ఫూరణంబున్ బహుదేశవస్తుభరణంబుం గాంచు నంచద్గతిన్. 40

సీ. యాదవాగ్రజునిపటాటోప మెల్ల [4]గారీవసుసుగ్రీవభావ మెల్లఁ
గుముదాప్తమండలక్రమణచిహ్నం బెల్ల నుడుపరంపర నుండునునికి యెల్ల

---

1. క-పరిచయంబున. 2. చ-తనతావులెనయించినిలిపినపృథుసమాఖ్యు. 3 క-భరింప. 4. చ-గారీవిభు.

సిరిఁగన్నతండ్రి దయాంతర మెల్లఁ బలుకులకొమ్మయుఁ దలమెత్తికొనుట యెల్ల
శేషపన్నగమును న్మేషవైఖరి యెల్లఁ జదలుద్రుమానికడిందిచాయ యెల్ల
నగి తెగడి మీఱి కేరి తృణం బొనర్చి, యుడిఁచి కారించి వారించి యడరు నేవి
వేకనిధికీర్తియుతుఁ డొప్పు [1]వేంకటేంద్రదత్తసామ్రాజ్యవిభవుండు దత్తమంత్రి.

మ. ఘనగోత్రోద్ధరణం బసంఖ్యసుకవిగ్రామప్రదానైకసా
ధనసద్భావధురంధరత్వము సుహృద్దర్పోద్ధతారిప్రధా
ననిరాసోద్భటపాటవంబు నిరవొందన్ దత్తనార్యుండు శ్రీఁ
దనరున్ వేంకట[2]రాయదక్షిణభుజాదండావిశేషస్థితిన్. 42

క. ఆదత్తమంత్రి యనుజుఁడ, శ్రీదత్తాత్రేయయోగిశేఖరసేవా
మోదితుఁడ సుధారసధా, మోదితుఁడ న్మధ్వమునిమతోద్ధారకుఁడన్. 43

[3]సీ. వరగంధచర్చిక ల్వాగ్విస్తరమచర్చికలు సూరిహృదయభాగములఁ గూర్చుఁ
గర్పూరమయపీటికవనాశుపదఘాటికలు రసజ్ఞసుహృన్ముఖములఁ జేర్చు
నతిచిత్రనేత్రముల్ యమకాదిచిత్రము ల్కావ్యసత్కవిజనాత్మల ఘటించు
మహితసువర్ణము ల్మధురసందర్భవర్ణములు ప్రాజ్ఞమహాశయముల నించు
గండభేరుండబిరుదవిఖ్యాతమతికి
రాయసము మల్లనికిఁ గవిరాయనికిని
మహిని గవిమానులును మంత్రిమాత్రులును స
మానమే యన వెలసినమానఘనుఁడ. 44

ఉ. నా కుపకర్త నాకుఁ జెలి నాకు సహాయుఁడు నాకుఁ బ్రాపి ల
న్నాకు బహుప్రసం డని మనంబున వేంకటరాట్సభాజనా
నీకము సంస్మరింప మహనీయగుణోన్నతిఁ గన్న యుత్తమ
శ్లోకుఁడ మల్లనామ్వయుఁడ సువ్రతు మత్కృతినాథు నెన్నెదన్. 45

* సీ. నిజగర్భగతజగన్నిచయు మాఁకయులీల నంతర్ముఖాపాంగుఁ డైనవాని
నలినజాండావృత్తి నాభిసిద్ధికి నేర్పరితి నతుసరంబుఁ ద్రిప్పువాని
శ్రుతులా త్మయందు నిల్పుటఁ దెల్పఁ దెఱఁగున నవరుద్ధనిశ్వాసుఁ డైనవానిఁ
దనపూనినధరిత్రికి నలోలత ఘటించుపగిది [4]జటిలవృత్తిఁ బరఁగువాని
బ్రాక్తనస్వీయదామోదరత్వ మెఱుఁగఁ
జేయుగతి యోగ[5]పట్టికఁ జెలఁగువాని

---

1. ట-వేంకటాద్రి. 2. చ-ట-రాజ. 3. ఈ సీసము ట-లో లేదు. * ఈ సీసము మొదలు, "ఏతాదృశ" యను షష్ఠ్యంతపద్యమునఱకు ట-లో లేదు. 4. చ-నిశ్చల. 5. చ. పటియ.

యోగముద్రికనూచితాచ్యుతచరిత్రుఁ
డైనవాని దత్తాత్రేయమౌనిఁ గొలుతు. 46

మ. యతిలీలాయితచిత్తవృత్తిఁ దగుపద్మాక్షుండు విశ్వావన
స్థితికిన్ రాజు కొనర్చి యాత్మభుజహేతిన్ సర్వసౌభాగ్యయో
గ్యత లెల్లం గరుణించు నాఁగఁ గృతవీర్యక్ష్మావనూతి న్నిరా
హతచక్రేశ్వరవృత్తి గా మనుచుదత్తాత్రేయుఁ గీర్తించెదన్. 47

మ. కమలాకాంతున కెంతసత్కృపయొ లోకశ్రేణిపై బ్రహ్మశ
క్రమహేశాదుల నమ్మ కీజగము యోగక్షేమముం గాంచునె
య్యమునం దానె చరించు నెల్లెడల దత్తాత్రేయయోగీంద్రవే
షమునన్ దీనులఁ బ్రోచుచున్ ఖలులయుద్వ్యాప్తియుంబు వారించుచున్. 48

సీ. ఈముని మునిశ్రేష్ఠ నెనయునక్షసరంబు పద్మాక్షవిస్ఫూర్తిఁ బరిఢవిల్లె
నీయతి యతిపుణ్యధృతిఁ గాంచుకుండిక తీర్థపదఖ్యాతిఁ దేజరిల్లె
నీయమి యమితసత్కృపఁ గన్న యజినంబు నీలవర్ణనిరూఢి నివ్వటిల్లె
నీశమి శమితాఘవృత్తి నూనినదండ ముదుతరానంతవైఖరిఁ దనర్చెఁ
దనపరికరంబు లెల్ల ని ట్లనుపమాచ్యు
తప్రభావంబు లై మించఁ దా ధరిత్రి
నరుదె యోగీశ్వరేశ్వరుం డగుట యనఁగఁ
బొలుచుధన్యు దత్తాత్రేయుఁ బొగడఁ దరమె. 49

మ. అను వొప్పం బరమాచలాత్మఘటితోద్యత్కుండలిస్ఫూర్తిచే
ఘనపంకాబ్ధి మథించి నిత్యతరయోగశ్రీనితాంతోపగూ
హనరోమాంచసమంచితాంగుఁ డగుదత్తాత్రేయనారాయణుం
డనవద్యామృతసారము న్విబుధలోకాధీనముం జేయుఁడే. 50

— షష్ఠ్యంతములు. —

క. ఏతాదృశబహుచరితున, కాతారకనిత్యనిజశుభాచరితునకున్
శ్రీతనయాధూతనయా, [1]పాతనయాపితభవర్షిపరిచరితునకున్. 51

క. అస్మత్కులదేవత కన,ఘస్మరఘస్మరవిరించిఘటితచటుశ్లా
ఘాస్మేరున కస్మయపర, మస్మృతి[2]గోచరునకును నమత్ఖచరునకున్. 52

1. చ-పాతనయాభితభవర్షి ; ట-పాతనయాపీతవర్షి, .. చ-రోచనునకును

[1]క. సద్యోజితతాపత్రయా, సద్యోజిత[2]భద్రమననచాతుర్యునకుఁ
విద్యోతితవిద్యోచిత, హృద్యోదితబోధితార్యహితచర్యునకుఁ. 53

క. మాహురపురకృతవసతికి, నీహానుత్తోన్నతికి నఖిలనిర్జరశుభసం
గోహదవరదోహదవర, దోహదయాశిశిరమతికి ధృతసంస్మృతికిఁ. 54

క. తత్త్వాదృశవిత్త్వాభృశ, కృత్త్వాదృశరాగయోగికృతచిత్తమహో
దాత్తమతిధ్యేయునకును, దత్తాత్రేయునకు నాశ్రితవిధేయునకుఁ. 55

వ. [3]అంకితంబుగా నాయొనర్పంబూనినచంద్రభానుచరిత్రం బనుమహాప్రబంధం
బునకుం బ్రారంభం బెట్టెదనిన. 56

—* ద్వారకాపురవర్ణనము *—

మ. సిరికిం బట్టయి యొప్పు ద్వారవతి యక్షీణాబ్జరాగోజ్జ్వల
ద్వరణాధిష్ఠితహీరకేసరికరద్వంద్వప్రభిన్నాభ్రసిం
ధురనిర్యన్నవమౌక్తికచ్ఛలసుమస్తోమంబులం గేతనో
త్కరము ల్వారెకు సాఁచి విష్ణుపద ముద్యల్లీలఁ బూజించుచుఁ. 57

మ. పరిఖావారిధి కూఁతు రైనసిరి కబ్జాతంపుటిం ట్లొక్కెడ
న్సిరియు న్నోచ్చు నొకప్పు డంచు మది వానిం జాల నిందించి సు
స్థిరతం బన్నిన సంతతోన్మిషిత మా చెందమ్మిచందమ్మునం
బరఁగుం బంగరుకోట పీటఁ బయికొమ్మల్ జేసు లై మించఁగఁ. 58

క. ప్రోల న్మతత్వవుఁగొమ్మల, చాలింపగు నమృతపూరసంగతపరిఖా
వాలయుతకర్బురాహిత, సాలంబున జెడనిననలు జనియించె ననఁ. 59

మ. వరశోంద్రోపలకాంతిశర్వరి నిజస్వర్ణంబు లెల్లం బయో
ధరముల్ ప్రముచ్చిలి మారుతత్వరఁ జనం దక్షియవారాశి గో
పురకేతుచ్ఛలన న్మహార్తినికరంబుల్ సాఁచి వేయఁ గళ
త్కరకాదంతములై భజించు నవి యుద్యన్నీరదాఖ్యానముఁ. 60

క. నరవరమణిహర్మ్యవిభా, కరబంధురకనకవరణకైతవజాగ్ర
త్పరిధియుతమధ్యతలమై, పరిఖాపుష్కరము తేటపడు నవ్వీటఁ. 61

ఉ. ఆపురి నిండువెన్నెలల నగ్రవిధూపలసంభవాంబుధా
రాపటలచ్ఛలామరతరంగిణి ఖేయపయోధిఁ గూడరాఁ

1. ఈపద్యమును దీనిక్రిందిపద్యమును ట-లో లేవు. 2. చ-మననభద్ర. 3. ట-సమర్పితంబుగా.

ప్రాపుగఁ గచ్చునిచ్చెనలు పన్నినకైవడి గోపురావళుల్
కైవుపహించె మెట్టుపలకల్వలెఁ బ్రాకిళు లుల్లసిల్లఁగన్. 62

ఉ. సారెకుసారెకున్ గవనిసందుల నప్పురి సొచ్చి యేగువాఁ
డై రజనీకళత్రుఁడు తదగ్రతలస్థితిరత్నవర్గముం
జేరి మొయిన్ సికాగుఱుతు చేకొనఁబోలును గాకయున్నచోఁ
బేరినవెన్నవంటిశశిబింబమునన్ మఱి[1] కందు దోఁచునే. 63

చ. కురుఁజులు సారె లచ్ఛమణికుట్టిమభాగము లిండ్లు మధ్యగో
పురము పణంబుగా నిడినభూరిసువర్ణము[2]గాఁ జతుర్దిశా
సరసిజనేత్ర లర్థిఁ జపుసారెల నాడఁగ నుత్కటాక్షసం
చరణము మీఱఁ బూన్పగడసాల యనం జనుపీథి చెల్వగున్. 64

చ. అలుగక దంపతుల్ గదిసి యర్థసతీశ్వరు పెక్కుమూర్తులై
యలరఁగఁ జూచి యాత్మవిశిఖావళు లొక్కెడ జైత్రకార్ముకం
బు లొకకడ న్మరుండు వెదప్రాఁకి కలంగుచుఁ జాఱవైచె నా
నలరులు నిత్యుదండములు నప్పురవీథుల నొప్పు నెప్పుడున్. 65

ఉ. తోరణగండ్లవెంట వెలజోటులు వీథులయొప్పుఁ జూచునా
య్యారపుఁజూపు లింపెసఁగు హర్మ్యపతాకలు రాయిడింపఁ బ్రం
దారకదీర్ఘికాంబుజవనంబులు పంపిన దూఁతలు సెప్పఁగాఁ
గోరి పురాబ్జగేహకడకుం బఱతెంచునళివ్రజం బనన్. 66

మ. రయగచ్ఛత్కమలాప్తఘోటకఖురాగ్రక్షుణ్ణకేళీహిర
ణ్మయసౌధాగ్రగళత్పరాగములు గప్పట్టుం బురీనీరజా
లయ యత్యున్నతసంపద న్సురపురీలక్ష్మిం దుటారించి తా
జయముం గాంచిన మెచ్చి బ్రహ్మ కనకస్నానంబు గావించె నాన్. 67

చ. తళతళ మించు మాడువులఁ దాచినవజ్రపుఁజెక్కడంపుఁగీ
ల్గలజలయంత్రహేమమయకాండము లింద్రునివీటఁ బొల్చు, మే
డలు సురసౌధము ల్గెలిచి ధాకగ నచ్చట గెల్పుఁగంబము
ల్నిలిపినరీతిఁ బై కెగయు నీరు యశోవిభవంబుఁ జూపఁగన్. 68

చ. చక్కనివింట నేగునెఱిచందురుజంక నవేందుకాంతపుం
జక్కటిఁ[4] దోఁచు రత్నమయసౌధములందుఁ గిరీటిపచ్చజా

1. చ - ట - కప్పు. 2. ఇక్కడనుండి "దానముగల్గి" యను పద్యమువఱకు క-లో లేదు.
3. బూనఁగడసాలె 4. ట-నున్న

మొక్కలఁడాలు పేరినసిమొత్తము నిచ్చలుఁ జొచ్చి మేఁతకై
ద్రొక్కనటంచుఁ బందిచొరఁదోలెఁ బురేందిర నాఁగ రాకలన్. 69

ఉ. ఆనినవేఁడ్క సారసవనౌఘవివర్ధనకృత్కరాగ్రసం
దానితనిర్మలామృతము నాకుల కిచ్చుచు నాత్మవల్లభుం
డై నకళాధినాయకునియట్ల మెలంగుఁ బురద్విజాళి రా
జానుమతంబు ధర్మ మనునర్థము డెందమునం దలంచుచున్. 70

చ. పురినరపాలనందనులభూరిభుజాభుజగాసిధారచే
నరిధరణీధవుల్ నిహతులై తనబింబముఁ దూఱిపోవఁగాఁ
దొరఁగినక్రొత్తనెత్తురులఁ దోఁగి సరోరుహిణీమనోహరుం
డరుణత పూని కాదె చరమాంబుధిఁ గ్రుంకెడు మాటిమాటికిన్. 71

చ. వెలయుఁ గిరాటకోటి గృహవీథుల మేటికిరీటిపచ్చరా
మళిగలకంబముల్ శుభరమారమణీయసమాగమంబునం
బొలుపుగ నిడ్డరంభ లన బోదెకుఁ గట్టినరత్నగుచ్ఛముల్
గెలలుగ నగ్రసంఘటితకేతనముల్ చిగురాకులై తగన్. 72

చ. అలవికి మీఱఁ బండ పురిహాలికవర్యులు వైచి కొల్చుతి
ప్పలతుదధాన్యము లెఱలనఁ బర్వవిభావసుహేతిఁ జిట్లి క్రే
వలఁ జెదరు న్వసుంధర నవగ్రహదోషహతాద్విరామముం
దెలుపఁగఁ జాలి సారె నలుదిక్కుల రాలునుడువ్రజం బనన్. 73

చ. తెలియక యావిమానములఁ దెచ్చి యమానము లంచు నెల్లరుం
బలుకుదు రింతెకా కవి సమానములై మహిమీఁద నెచ్చట
న్నెలఁగుట గాన మంచు నిజనేమిరవార్భటిఁ జాటిచెప్పుచు
న్వెలదభిజాతకేతుభుజవల్లరు లెత్తుఁ బురీశతాంగముల్. 74

ఉ. ఆనగరంబుకోట యిడునప్పుడు లోపలఁ జిక్కి పోవఁగా
లేనిఘనౌఘము ల్కరటిలీలఁ జరింపఁగఁ బోలుఁ గానిచో
దానముగల్గి పుష్కరము దాల్చి ఘనాఘనతావిజృంభణం
బూని ప్రభిన్నపద్మకసముజ్జ్వలభావమున న్వసించునే. 75

ఉ. ఆశుగతాగ్రహం బెనయు నమ్ములఁ దెమ్మెరలున్ స్వవేగవి
శ్వాశుగతాగ్రహంబు లయి హత్తి నిజోభయపార్శ్వవర్తితా

కౌశలిఁ జామరగ్రహణకర్మములూన జనాత్త లక్ష్మితా
వేశమునం దముం బొగడ వీటిహరుల్ నెఱపు [1]స్ఫుధారలన్. 76

చ. అరుణుఁడు సైంహికేయునకు నల్కి మణీమయఖేటకాకృతిం
గరముల వాల నుగ్రతరఖడ్గమివంబునఁ బట్టి తెచ్చి యా
సరసిజబంధుపౌత్రవసుని సారెకు నప్పరిమేటిజోదు ల
య్యిరువురఁ బంతమొప్పఁ గలయింతురు దడకుఁ [2]బూంచి సాములన్. 77

సీ. ఒకప్రొద్దుబిగిగూడియుండుచక్రములెంతయొకవంకఁబొగడొందుశకులియెంత
యొకవేళఁగాంతిచే గొప్పగుద్రుమమెంత యొకమూలఁదగుకుందనికరమెంత
యొకపూఁటవికసించునుడుసమూహంబెంత యొకచాయదీపించుముకురమెంత
యొకతఱి[*]సరిగూడనొదవినసుధయెంత యొక[†]పక్షమునరుచంద్రకళయెంత
గరిమ వీరల గుబ్బలు కన్ను లధర
ములు రదంబులు నఖములుఁ దళుకుఁజెక్కు
లలఁతినగవులు[3]మొగములుఁ దలఁచునెడల
ననఁగ వెలయుదు రచటిపణ్యాబ్జముఖులు. 78

సీ. లలితప్రవాళజాలపయోనిధానముల్ ధారిణీమృగమదద్రవరచనలు
నవ్యపతంగమండలనభస్స్థలములు రోదసీసురభి[4]ధూపోదయములు
నవలచ్చపలాళిజలదసందోహంబు లలఘుపురాబ్జగేహాకచకులు
చలదుదగ్రపలాశజాలతమిస్రముల్ హరిచేణనేత్రాసితాంశుకములు
కలితసుమధూళిసుమధూళి[5]వలయుమగుయు
నికటఘటమానపవమాననికరసుకర
చలితఘనసారఘనసారసహితమహిమఁ
దనరు నవ్వీట వాసనావనులు వసులు. 79

సీ. తావులు లేకున్నఁ దతరత్నశృంగచయంబులో లేమావు లరయు టెట్లు
స్రోఁతలు లేకున్న ముగ్ధేందుకాంతమార్గములలో సెలయేళ్లు గనుట యెట్లు
చలువలు లేకున్న శాతమన్యవమణిస్థలులలోఁ గొలఁకులఁ దెలియు టెట్లు
మలయుట లేకున్న మరకతోన్నతశిలాప్రతతిలో ననఁటు లేర్పఱుచు టెట్లు
జనము లన గొజ్జఁగుల[6]జాజి చఱుల కుమికి
దొనలఁ గ్రేళ్లుబ్బి కోనలఁ దూఁటి జంత్ర

1. క-చ-సువాలమున్ 2. ట-జూంచి *క-గిరిగూడ. †క-ట-యొకశన 3. చ-ట-మొగములు 4. ధూపోదయ 5. ట-వలయువలయ. 6 చ-జాఁది, ట-జాంచి.

ములు నిగిడి తుంపురుల్ చల్లు పూవునీటఁ
దనరువలిగొండ లనఁ గేళిధరము లచట. 80

ఉ. పచ్చనిరాజనంపుమడిపజ్జ బలాకలు చుట్టు నుండఁగా
నచ్చపుఁజెందొవ ల్వెలయు నాపురలక్ష్మికి భూతధాత్రి దా
నచ్చులపేరిహస్తముల నంచులముత్తెము లుంచి మెత్తుఁగ్రొం
బచ్చలపళ్లెరంబునను మం దగునారతిదీవెలో యనన్. 81

సీ. తనసమీరణవృత్తి తథ్యంబు గావింప గణికావశీకారగరిమఁ బూని
తనగంధవహరూఢి తథ్యంబు గావింప నలసయానప్రౌఢి నలవరించి
తనజగత్ప్రాణత తథ్యంబు గావింప జనుల కామోదంబు సవదరించి
తనపృషద్వాహాఖ్య తథ్యంబు గావింపఁ జలువ లంతంతకు సంతరించి
తనమరున్నామకంబు తథ్యం బొనర్ప, ననమసాయక[1]సాయకాత్యంతతాంత
విగ్రహులమీఁదనవపుష్పవృష్టిఁ గురిసి, యాపురంబున మెలఁగు[2]మందానిలంబు.

క. ఆనగర మేలు [3]దానవ, మానవతీకుచకురంగమదమకరీసం
తానతిరోధానవిధా, మానితతరవారి శౌరి మహిమోన్నతుఁడై. 83

క. ఆవనమాలికిఁ బట్టపు, దేవేరులు గలరు మదవతీమణు లెనమం
డ్రావెలఁదులలో మెఱుఁగుం, దీవెలవలెఁ దనరు రుక్మిణీసత్యలకున్. 84

గీ. శౌరి మిక్కిలి చనవిచ్చి సంతరించు, సవతు లందఱు లోఁగి యిచ్చక మొనర్తు
రందు రుక్మిణి గనియె ముకుందుకరుణఁ, జెఱకువిలుకాని సురలు జేజేలు వెట్ట. 85

ఉ. [4]ఇకఱఁగ ముజ్జగంబు నుతియింపఁగ బంధులు గారవింపఁగాఁ
జక్కనిముద్దులాని నెఱజాణని జెక్కుమెఱుంగుఁబచ్చజా
పక్కెరతేజి నెక్కు[5]నవపంచశరుం గని భోజకన్య యు
మ్మక్క యనంగఁ జాలు విభవాతిశయంబున విఱ్ఱ[6]వీఁగుచున్ 86

ఉ. ఆచెలిఁ జూచిచూచి కడుపారఁగ ముద్దులపట్టిఁ గానఁగా
నోఁచనియింతిజన్మము గనుంగొన [7]రిత్త యటంచు సత్యభా
మాచపలాయతాక్షి పలుమాఱును దాఁ దను దూఱుకొంచుఁ జిం
తాచలచిత్తయై యదవద న్మదిఁ గుందుచు[8]నుండ నత్తఱిన్. 87

1. (సంగరా), 2 ట-మందానిలుండు. 3. క-దుర్మదమానవతీ 4. చ-ఇక్కరణిం జగంబు 5. ట-నజభవ్యతరు చ-రతిభవ్యతరు. 6. చ-ట-వీఁగఁగన్. 7. ట-ఛింతే 8. చ-నుండునయ్యెడన్.

— * శ్రీకృష్ణుఁడు సత్యభామసౌధమున కేఁగుట. * —

క. ఒకనాఁడు నందకులనందనుఁ డా సత్యావధూటిధామంబున నా
హ్నికకృత్యంబులు నెఱిచి, యకలంకామోదమానసాంభోరుహుఁడై. 88

సీ. ఒకకొంత యొరఁగినసికమీఁది ముడిపువ్వుఁ బుత్తులదోరయుఁదామెతులఁ జుట్టి
పన్నీటిచినుకులఁ బద నైననికరంపుఁగస్తూరి పరతిలకంబుఁ దీర్చి
గంబూర మించి కదంబంబు చేసినపలుచనికుంకుమకలప మలఁది
చెక్కుటద్దములపైఁ జికిలివెన్నెలసోన లొలికెడుకట్టాణియొంట్లు దాల్చి
మెఱుఁగుఁజంద్రిక[1]గోణము చెఱఁగుడాలు
వలిపె[2]వలెవాటుదుప్పటివలికిఁ గ్రమ్మ
మినుకురవకెంపుఁబావలు మెట్టి యొక్క
యతివ కైదండ యొసఁగ నొయ్యార మెసఁగ. 89

చ. పవడపునిల్వుఁగంబములపై నెలకొన్నపసిండిబోదెలం
జివురుచుకెంపుడా ల్మదనచేతులఁ దార్చినపేల్పురాచతా
నవరనికేలుఁదామరలచాయలు సోరణగండ్ల ధూపపుం
బొవలుగమించుకేళిగృహముం బ్రమదంబున డాసి యచ్చటన్. 90

చ. అలఁతిగ నంటెనం బొలుచునారజపుల్ జగజంతరీరొదల్
గులుకుమెఱుంగుఁగెంపుతఱిగోళ్లనమర్చినవాగవాసపుం
గొలుకుల జాళువాగొలుసుగొళ్లఁ దగుల్కొని వ్రేలుపచ్చతా
చిలుకలతూఁగుమంచమున శ్రీరమణుండు వసించునత్తఱిన్. 91

చ. చికిలికిరీటిపచ్చరవిచెక్కడపుంబని కీలుఁజిల్కతో
రక మగుపైఁడియాకుపదరంబున నుంచినపండుటాకులి
చ్చకపుటొయారము ల్వెలయ సత్య కరంబునఁ బూని వేడ్క నొ
క్కొకమడు పొయ్య నిచ్చుచు మృదూక్తుల నిట్లనియె న్మురారికిన్. 92

సీ. వినవినయపరంజిబిరుదులయడపంబు గట్టఁ బాండ్యకుమారకాంతతనయ
కళ గలపచ్చకంకణములకాళాంజి దాల్పఁ గోసలమహీధవకుమారి
చకచక మించువజ్రంపుటీనెలకుంచె వీవఁ గర్ణాటభూవిభుతనూజ
తళతళ వెలుఁగు రేవెలుఁగుటానునుగిండి పూన మాళవధరాజానిపుత్రి

1. ట-గోణాము. 2. చ-దుప్పటిపలెవాటు.

యఖిల వైభవములు గిన్ని చినట్టివారికి, వాంఛిత మొకండు లేదైన[1] నలయుచుఁ దెలుప
విన్నవింపఁగఁ [2]దగినట్టిచిన్న దొకటి, మనవి గల దాలకింపుము మనుజనాథ.

క. అని పలికి తాప్పతుందల, న్ననుసిగ్గు దొలంకఁ దనుఁ గనుంగొనుసత్కా
వనితతలఁ బెట్టెంగి చూచ్చు లనను పము వాంఛితము లొదవ హరి కరుణించెన్.

క. జలజాతాక్షికి నంతట, నెల మసలెం జన్ను మొనల నీలిమ దోఁచెం
దెలు పెనఁగె మేనఁ గోర్కులు, జలజాక్షుల యెక్కు డుదరమిగులఁ దావలమయ్యెన్.

క. నవలావణ్యాకర మగు, నవలానెన్నడుము బలిసె నడ జడనయ్యెన్
లవలీపల్లవలీలల, నవలీల జయించెఁ జెక్కు లవదాతరుచిన్. 96

ఉ. నిద్దపునన్న నెన్నడుము నింగి పరిస్ఫుటవృత్తిఁ బూనె లే
నిద్దుర [3]పైకొనం దొణఁగె నిర్మలలోచనవారిజాతముల్
గద్దఱిచన్ను జక్కవ మొగంబులఁ గప్పు దొలంకసాగె న
మ్ముద్దియ చంద్రభాను నవమోహనసంపద మేనఁ దాల్పఁగాన్. 97

గీ. అంతరస్థితరాజహంసార్భకాప్తిఁ, గాంతనూతన మౌక్తికలు వహింప
[4]నార పద్మిని సరసాంతరంగసంస్థిసరణి శాంతదోహనము గల్గె నరుదుమెఱయ.

గీ. చంద్రభానూదయము సమాసన్నమైనఁ
బ్రాచిఁగనుపట్టు కాంతివైభవ మనంగఁ
జంద్రభానూదయము సమాసన్న[5]మైనఁ
బడఁతిమొగమునఁ గనుపట్టెఁ బాండిమంబు. 99

[6]శా. లోకప్రస్తుతచంద్రభానుకలితాలోకాత్మనాథానురా
గైకప్రౌఢిమఁ జంద్రభానుకమనీయాలోకసంపన్న యా
నాకశ్యాణికి సత్యకు న్నరయె నిర్వ్యాజైకచంద్రప్రభా
సాకల్యంబును బూనలే కెసఁగునాశర్వాణియు న్వాణియున్. 100

మ. ఒకనాఁ డంతట యాదవేంద్రుహృదయం బుబ్బంగ సౌభాగ్యసూ
చకనిక్షిప్రకగతిన్ శుభగ్రహము లుచ్చస్థంబులై భానుచెం
తకుఁ బోనుండెడునన్ముహూర్తమున నాతప్వంగి గాంచె న్సుతు
న్సకుమారు న్సురలోకదుందుభిరవస్ఫూర్తుల్ విజృంభింపఁగన్. 101

మ. కమలాధీశ్వరుఁ డంత గర్గముని యుక్తప్రక్రియన్ జాతక
ర్మము గావింపఁగ నాత్మసూతి కఖిలప్రహ్లాదకాక్షిణధా

1. చ-స్వామికెపుడు. 2. చ-ట-తగినది 3. చ-ట-గైకొనం 4. ట-ఔరవరపద్మినీరసనాంత
రంగ, చ-ఔరవురపద్మినీ. 5. చ-ట-మగుట 6. ఈపద్యము ట-లో లేదు.

మముకల్మిం దగఁ జంద్రభానుశుభనామం బుంచె ధాత్రీసురో
త్తమమిత్రప్రియబంధువర్గహృదయోత్సాహంబు దీపింపఁగన్. 102

కం. తలయంటి జలకమార్చి,కలకంఠీమణులు నునుటఁ గాటుక నిడి పొ
త్తులలోన నుంచి కూరిమి,చెలఁగఁగ నానాఁటఁ బ్రోదిసేయుచుఁ బెనుపన్

ఉ. భూరమణాత్మజుండు నునుఁబొత్తులఁ దలయెత్తి యాడుచున్
బోరగిలంగ నేర్చెఁ బువుఁబోణులు జోలలువాడ వీనులం
జేరుప నేర్చె నెన్నొసలి చెక్కడపుంబవిరావిరేక చే
సారెఁ దెమల్ప నేర్చెఁ గనుసన్నల నవ్వఁగ నేర్చె నల్లనన్. 104

[1]చ. పొలఁతులు మోవి నుల్కి కనుబొమ్మల నిక్కలు దోఁపఁ జూత్కృతుల్
చలిపి యుదల్చిన న్నగు నెలం జెయినన్నలఁ బిల్చుఁ దొట్లపైఁ
గొలఁదిగ వ్రేలురత్నమయగుచ్ఛముఁ దప్పక చూచు నక్కునం
గలపులిగోరు లాల దొలఁక న్వదనంబున నుంచు నెంతయున్. 105

శా. కేలం బట్టిన కెంపుతాగొలుసులం గించిచ్చలోరోజదో
ర్మూలచ్ఛాయలు కుందనంపురవగుంపు న్నింప బాలు న్వచో
లాలిత్యంబున నిద్రపొమ్మనుచుఁ దొట్లం బెట్టి జోకొట్టుచున్
లాలోలాలి యటంచు నూఁపుదురు జోలల్పాడి లీలావతుల్. 106

[2]మ. అలసత్కోర్వదితుఁ డొయ్యనొయ్యఁ గమనీయావ్యాజవాగ్వైఖరుల్
చిలుకన్నేర్చె ధరాప్రసాధనములై చెన్నొందుపాదాంకని
ర్మలలీలం దగఁ జంద్రభానుఁడు చరింపన్నేర్చె సద్వర్ణితో
జ్జ్వలవృత్తిం గళలెల్ల నేర్చె విధుసంజ్ఞాతుండు సౌమ్యస్థితిన్. 107

శా. నానాఁటం బురివొక్క నంగముల నందం బై యురఃపీఠి వి
ఖ్యానం జేతుంగఁ గండెముల్ దిరిగె లోనూహించె శృంగారలీ
లానందంబుల మానసంబు నడ నొయ్యారంబు దీపించెఁ గ॰
న్గోనల్ వింతలు[3]పూనె రాసుతునకు న్నానాఁగుబ్రాయంబునన్. 108

మ. కులుకుం జంద్రికపూరుమాలుకొనచుంగుల్దాల బంగారుచి
లుకలగోణా గుచెఱంగు మించుకటిసేలా గుప్పటిం గట్టి పొం

1. 2. ట-లోలేవు. 3. చ-ట నోరె

గళుకున్వజ్రపుఁగీలు చేసరపణిం గన్పట్ట నారామణీ
ఘులలోఁ దాళము పూని యాకొమరుఁ డాప్తుల్వెంటరాఁ బ్రద్యుమ్నరున్.

[1]చ. ఉడిగపువారు చేసగతు లూనుచుఁ బజ్జలఁ జేరి పాదపా
వడెయలిరా గెనాంగదలెస్వామి యహో జితనయా యంచు వెం
బడిఁ బలుమారు నెచ్చరిక పల్కుచుఁ గుల్కుచు రా హుమాయిత
త్తడి దుమికించుచుం జను నతండు పయాళి హయాళి గొల్వఁగన్. 110

క. తనకూర్మిసఖుఁడు సాత్యకి,తనయుం డగుపిజయులోలుఁ దగఁగూడి జగ
ద్వినుతుఁ డతఁ డట్లు మాధవు,నెనసినమకరాంకు[2]పగిది సొంపొందుతన్.

సీ. సర్వతోముఖమార్గసంచారియగువాఁడు తన ప్రజల్ దనివొందఁ దలఁచువాఁడు
భూదారవిఖ్యాతి భూషితుండగువాఁడు హితుప్రియక్కఱ డనునై యెసఁగువాఁడు
బలిగర్వసర్వస్వభంజనుండగువాఁడు పూని దప్పని రూఢిఁ బొల్చువాఁడు
ధర్మాభి[3]వర్ధనతత్పరుండగు వాఁడు పరువీటెసిగు లేటఁబఱుపువాఁడు
వినుతసర్వజ్ఞతాస్ఫూర్తి వెలయువాఁడు,హరిదువాళింప నేర్పరియైనవాఁడు
దనుజలోకాభియాతి సంతతవిభూతి,నవని యేలుచు నొకనాఁడహర్ముఖమున.

మ. పలుమారు న్సుముఖా యటంచుఁ బలుదబ్బ ల్పూని వేర్వేఱ ది
క్తులరాజన్యుల నెల్లఁ గంచుకులు పక్కాణింప సాత్రాజితీ
లలనాభర్త జగాహజారమున జాళ్వాసింహ[4]పీఠంబుపైఁ
గొలువుండెం గుఱు[5]పాండవప్రభులు కింకుర్వాణులై యుండఁగన్. 113

—* నారదాగమనము. *—

సీ. స్వర్గాపవర్గము ల్పవదరించినబిరుదము నాఁగ మహతి యంసమునఁ దనర
నమితతపోనిధానముఁ గాచుభుజగనాయకుఁడు నా యోగపట్టిక యెసంగఁ
దనుకాంతి వెడఁదహస్తమున వ్రాలిననిశానేత నా స్ఫటికకుండిక చెలంగఁ
గంజపిభ్రాంతిఁ జెంగట డాయు తేంట్లు నా వలకేల నళినాక్షవలయ మమర
నారదుఁడు గానఁ బెనఁగొన్న నవ్యచంచ,లాలతలకై వడి జటాకలాప మెసఁగ
నపుడు దివినుండి యుట్టిపడ్డట్లు వచ్చె,దివిజసంయమి హరిసభాభవనమునకు.

క. ఈరీతి నరుగుదెంచిన,నారదునకు నెదురుగాఁగ నడతెంచి నమ
స్కార మొనరించి యుచితా,చారంబుల నతిథిపూజ సలుపుచు నంతన్.

---

1. ట-లో నీపద్యములేదు. 2. చ-కరణి 3. చ-వర్తన. 4. చ-పీఠంబునన్ 5. చ. పాండవాధిపులు. ట-పాండవాదికులు.

గీ. స్వర్ణమయపీఠమున మునీశ్వరునినునిచి, యతనియనుమతిఁ దానునర్హాసనమును
నధివసించి కృతాంజలి యై మురారి, ప్రబలజలధరధీ[1]ర వాక్పటిమఁ బలికె.

సీ. మానిమార్తాండ నీమహితపాదనిషేవ మామకపంకసమ్మర్ద మడఁచె
యతిశక్ర నీదుకళ్యాణధామప్రసంగతి సుధర్మావాప్తిఁ గలిపె నాకు
ప్రతిలోకచంద్ర నీరాక మద్వీక్షణోత్పలముల కామోదములు ఘటించె
మునిసార్వభౌమ నీఘనహస్తలాలనం బసమదానసమృద్ధి నొసఁగె నాకుఁ
బారికాంక్షిహర్యక్ష నీభాసమాన, గుణసమున్నతి యున్నతకుంభినీశ
గర్వనిర్వాపణధురీణుఁగా నొనర్చె, [2]నన్ను భవదీయవైభవం బెన్నఁదరమె.

క. అన విని నారదుఁ డిట్లను, వనజోదర నీవు [3]నారుని వైఖరి నీచొ
ప్పున నన్ను వినుతిసేయం, జను నే నినుఁ బొగడఁ గమలసంభవువశమే. 118

గీ. అఖిలసంయమివరులు బ్రహ్మాదిసురులు, ప్రస్తుతింపఁగ వసుమతీభార ముడుప
యాదవాన్వయమునఁ బుట్టినట్టినీవు, మతిఁ దలంచిన నారమాపతివి గావె. 119

[4]మ. స్తనపానం బొనరించుచోఁ శిశువునోజం బూతనాక్షీరజీ
వనకీలాలవిషంబు లొక్కమొగి దుర్వారస్థితి న్నీవు గ్రో
లిన నేకార్థవిబోధకంబు లయి పొల్పెం గాదె తత్క్షీరజీ
వనకీలాలవిషంబు లన్పదము లవ్యాజప్రభావోదయా. 120

మ. సురలోకేంద్రదనీయుక్తకల్పజలదస్తోమంబు లొక్కుమ్మడిం
గురియన్ ధేనులఁ బ్రోవ నెత్తునపు డాగోవర్ధనోద్యద్ధరా
ధర మింపొందదె నీభుజార్గళమునన్ ధారాధరప్రక్రియన్
[5]హరి నీవెప్పుడు నాదివర్ణము గురుఖ్యాతిం గటాక్షించుటన్. 121

ఉ. క్రుంగినకాళియోరగము [6]కూఁకటివేరు భుజార్గళంబు లు
త్తుంగతరప్రకాండములు తోరపునవ్వులు పూలు నర్తనా
సంగచలచ్ఛిరోజములు షట్పదపంక్తులుగా సురద్రుమీ
లం గమలాక్ష కోరినఫలంబు లొసంగవె [7]మెట్టివారికిన్. 122

[8]క. ఏపట్టునఁ గువలయపీ, డాపహృతి యొనర్తు ననుచు యదువంశమునన్
దీపించియుఁ గువలయపీ, డాపహృతి యొనర్పఁ జెల్లునయ్య మురారీ 123

---

1. క-ట-వాక్ఫణితి. 2. ట-నన్న. 3. నరుని వైఖరియను-టలెస్స. 4. ఇదియు దీనిక్రిందిపద్యము-టలో లేవు. 5. క. హరినీ వెప్పుడు నాదివర్ణగురువిఖ్యాతిన్ 6. క. కొమ్మలునీదు. 7. చ. ట. తప్పిరియాళికిన్ 8. ట-లో నీపద్యములేదు.

క. అని విన్నవించి యతఁ డో, జనార్దనా యిప్పు డేను సవసవగా నే
ర్చినపాటి యొక్కగీతము, వినిపించెద నంచుఁ జేతి[1]వీణె చెలంగన్. 124

క. సరిగమపధనిసమాఖ్య, స్వరసందర్భంబు మెఱయ సారెలమీఁదం
గరమిడి గమకము లేర్పడ, మొరయించుచుఁ గొన్నిగీతములు వలికింపన్.

సీ. ఒకలేమ యతనికి నుద్ది లేదని యిచ్చుకరము నా మదు పొందుకడకుసాఁచె
గేయ మాఁ గాదన్న గెలువఁగొంగిచ్చెనాఁబావడయొకయింతిబయలొసంగె
నువిద యొక్కతె మెచ్చి యొసఁగూ నెనాఁజామరంబెత్తి వంచనేరకవసించెఁ
బరులవిద్యలు బరాబరిసేయు తెలుఁగు నా సుదతియొక్కతెమోడ్పుసురటివిసరె
నిట్లు కొలువుననున్న పూర్ణేందుముఖులు, సమహితాశ్చర్యపరవశస్వాంత లైరి
హరియుఁ గన్నుల చెవులుగా నాలకించె, నాతపోధనుమహతీరవామృతంబు.

శా. ఔరా మీటు బళీరె కంపిత మహో యాందోళితస్ఫూర్తి యో
హోరే మూర్ఛన బాపురే శ్రుతులు మే లుల్లాసితప్రౌఢి మ
ఝ్ఝారే లీనము చాఁగు రే స్ఫురితముల్ శాబాసు ధా లంచు న
త్యారూఢప్రమదోన్నతి న్మురహరుం డాలించి వర్ణించుచున్. 127

గీ. హృద్యతరతద్విపంచికావాద్యవిద్య, [2]నభ్యసింప మనఃకుతూహలము పూని
తనదు చెంగట [3]నలరువైదర్భికూర్మి, సుతుని సత్యా[4]తనూభవుఁ జూపి పలికె.

క. ఓవాచంయమి కొన్నాళ్ళిక్కడ నధివసించి యీబాలకులం
దావకశిష్యులుగా దయఁ, బ్రోవు మన న్ముఖసరోజముున నగవొలుకన్.

శా. అంగీకార మొనర్చి [5]మానివరహార్యత్ముండు వా రిర్వురన్
సంగీతాభ్యసనైకతత్పరులఁ జెంతం జేరఁగాఁ బిల్చి త
న్మాంగళ్యాచరణం బొనర్చి కవవీణ ల్గూర్చి కౌతూహలా
భంగప్రౌఢి నుపక్రమించె శుభదప్రఖ్యాతలగ్నంబునన్. 130

సీ. సప్తస్వరములమూర్ఛనలు తప్పకయుండ గుఱుతుపట్టుటకునై కొన్నినాళ్లు
సూళాదితాళము ల్సొగియ నలంకారగుంఫనం [6]బొనఁగూర్పఁ గొన్నినాళ్లు
వాగ్గేయకారవిరచితగీతంబులు [7]గ్రుక్కవట్టుటకునై కొన్నినాళ్లు
గౌళనాటవరాళికాముఖ్యరాగము ల్గొదలేక పలికింపఁ గొన్నినాళ్లు

---

1. చ. ట. వీణియచెలఁగన్ 2. చ. ట. అభ్యసింపఁగుతూహలమాత్మఁబూని. 3. చ. ట. నడరు. 4. చ.ట. తనూజుని 5. చ. ట. యామునికులాగ్ర్యత్ముండు 6. ట. బొనరించ. 7. చ-ట-గొంకులేకనహింపఁగొన్నినాళ్లు.

వన్నియప్రబంధములుమీఁటఁ గొన్నినాళ్లఁ
[1]గోరి గాయంబు లొదవింపఁ గొన్నినాళ్లఁ
గాఁగ వారల కాజగరాగతపసి
నిరుపమవిపంచికాప్రౌఢి నేర్పె[2]యపుడు. 131

శా. ఆలేఖవ్రతి మున్ను రుక్మిణికి సత్యాతన్వికిం బూలకై
కైలాటంబులు దా నొనర్చుట మొదల్గా నెక్కుడౌ జాతర
జ్వాలాశాంతి యొనర్పకున్కి మిగుల న్సంతప్తుఁడై యప్పుడ
బ్బాలుర్ దత్సుతు లాట నెమ్మనమున న్భావించి సోత్కంఠుఁడై. 132

ఉ. ఆహరిసూను లిద్దఱు మహామతిమంతులు గాన సంతతో
త్సాహముతోడ నొండొరులచందము మెచ్చక వల్లకీకళా
దోహలులై చెలంగఁ గని తోడనె వారికి వాదువెట్టఁగా
నూహ యొనర్చి యందు మఱ నొక్కనిఁ గైకొని వీణనేర్పుచున్. 133

—* నారదుని పక్షపాతము. *—

గీ. ఆకిటుకు గూటిపఱిఁ గయ్యాళితపసి,యెంతప్రియములు సెప్పిన నియ్యకొనక
చంద్రభానునిపేరన్న సైఁప కట్లు,పక్షపాతంబు మీఱ నుపేక్ష సేసె. 134

సీ. సారెలు బెళకినఁ జక్కఁజేయు మటన్న నిదెవత్తు నిలుమని నదికి నేగుఁ
దంత్రు లూడినయవి తగఁ గట్టి యిమ్మన్న జపవేళ యనుచు నిశ్చలతనొందు
శ్రుతు లెల్ల డిగ్గినచోఁ గూర్చి యిమ్మన్న దేవపూజావిధి దీర్చెద నను
నాలాపరక్తికి మేళవింపు మటన్న ధ్యానవేళ యొకింత తాళు మనును
మఱియు నేమాట యడిగిన మమత లేక,చెంగిచెంగి చరించునా చేష్ట లెల్ల
మానివరుపక్షపాతంబు గా నెఱింగి,చంద్రభానుఁ డసూయావిచారుఁడగుచు,

క. ఒకనాఁ డామునిసాగర,సికతాస్థలి నొంటి జపము సేయఁగఁ దనలోఁ
దుకతుకఁ దాళఁగలే కచ,టికి సత్యాత్మజుఁడు చని నొడివెను మృదూక్తిన్.

శా. అయ్యా నీవు లతాంతసాయకునిపట్టై వల్లకీవాద్యముల్
నెయ్యంబుం బ్రమదంబు నేరుపడ [3]నన్నిద్రస్థితిం దెల్పి న
న్నయ్యాటంబుల నిద్రవుచ్చితి రహస్యం బేమియుం దెల్పలే
దయ్యా యేనపకారినే తెలుపరాదా నాకు నాచందముల్. 137

1 ఈచరణము క-లో లేదు. 2. చ. ట. నేర్పె నేర్పి. 3. చ. ట. నిర్నిద్రుండవై తెల్పి

సీ. ఎదుటఁ బిమ్మట నైన నెప్పుడేనియు భక్తి సేయనే నన్నింత సేయనేల
యేయెడ నీ వానతిచ్చినదాస్యంబు సేయనే నన్నింత సేయనేల
[1]నిత్యకృత్యంబుగా నీపాదసంసేవ సేయనే నన్నింత సేయనేల
కలనైన నీమూర్తిఁ గనుఁగొన్న వినయంబు సేయనే నన్నింత సేయనేల
భావవాక్కాయకర్మము లీవశంబు, సేయనే నీవు నన్నింత సేయనేల
సవతిబిడ్డల కిట్లు మత్సరముఁ బెంచి, చివ్వ యొనరింప నింత సేసితివి గాక.

క. అని యిట్లు పలుకుపలుకు, ల్వాని తనయత్నంబు కడుఫలించె ననుచు న
మ్ముని యలరి రిత్తబొమముడి, గొని యప్పుడు తెచ్చికోలుకోపముతోడన్.

మ. తగు నయ్యా నను నిట్లు పల్కుటకు సత్యానందనా నీవు ము
న్నుగ నీవీణియ మీటి యీశ్రుతులసంధుల్ గూర్చి యాశుద్ధసా
ళగభేదంబు లెఱింగి యీసకలమేళప్రాప్తము [2]ల్నేర్చి యుం
టిగదా పెక్కులు పల్కనేల బళిరే నీశిష్యతల్ చేకుఱన్. 140

[3]మ. మఱుఁ డెంతేనియుఁ దెల్పినం దెలియు నీమార్గంబు నీకంటె మా
సరవిన్ బొమ్మున నమ్మఁగట్టుకొని యాసాయంప్రభాతంబు ని
ద్దురయుం గూడును మాని తెల్పినను నీదుర్బుద్ధి యిట్లయ్యె నెం
తుర మానేరమి గాఁగ నిట్టి వకటా ధూర్తస్వభావంబునన్. 141

క. తగ వెఱుఁగలేక యిటువలెఁ, దెగువరివై పలుక నీకె తీరెనొ కుసుమా
శుగునకును నీకు నిపుడీ, జగడంబులు సేయఁగా నిచట నిల్చితినే. 142

సీ. చెల్లఁబో నీచేతివల్లకీరత్నదండము దాల్ప యోగదండంబె మాకు
[4]నయ్యయో నీచేతియసమవిపంచికగవిసెన ల్కాషాయకములె మాకు
నకటా నీచేతియులపరివాదినీతంత్రీలతలు జన్నిదములె మాకుఁ
గటకటా నీచేతికచ్ఛపీణియకాయ సలిలపూరితకమండలువె మాకు
బాపురే నీకు విద్య నేర్పంగవలసి, పడినపాటెల్ల నుగ్రతపంబె మాకు
హరిహరీ నిన్ను నిట్టిదుష్టాత్ముఁ జేట, నెఱుఁగలేనైతి విడువు మిదేడగోడవ.

క. అనలినాత్ముఁడు నేర్పుము, గానమ్మని ప్రియము చెప్పఁగా [6]బాలుఁడుగా
వోనిమ్మని యే నిందుకుఁ, బూనినఫల మబ్బెఁ జాలుఁ బోపొమ్మనినన్. 144

---

1. చ. లో నీచరణము నాల్గవదిగా నున్నది. ట-లో నీచరణమునకు మాఱు 'పోరామి చెడకుండ గారాముతో భక్తిసేయనే నన్నింతసేయనేల' అని కలదు. 2. చ. చూచి యుం. 3. క-లో నీపద్యము లేదు. 4. ట. నయ్యారో. 5. చ-తంత్రిక ల్బలుజన్నిదములె 6. ట. మొకమోటన్.

ఉ. ఆయదురాజసూనుఁ డెదురాడఁగ నుల్కుచు విన్నఁబాటుతో
నాయెడ నుండఁగా నళికి యల్లన నైజనివాససీమకున్
డాయఁగ వచ్చి యాత్మనికటస్థితుఁ బ్రాణసఖాగ్రగణ్యు నై
నేయతనూజుఁ గాంచి మది నిండిననెవ్వగతోడ నిట్లనున్ 145

ఉ. లోకమునందు నోవిజయలోల కటా యిటువంటిదిట్టప
ల్లాకి[1]మునీశ్వరు న్వెదకికంటిమె యే నివు డేగి గానము
న్నా కొకయింత తెల్పు మనిన [2]న్మను జేసినపక్షపాతముం
గాక పొకాలు మంచుఁ గలఁకం బలికెం బనిలేనిపాటకున్. 146

మ. అరయ న్వీణకుఁ దానె బ్రహ్మకొడుకే హంకారము ల్గాక తుం
బురు విశ్వావసు శంబళాశ్వతరు లుద్భూతప్రభావోన్నతు
ల్పరికింపం దనుఁ బోలలేరె యిఁక నేనా యీవితాజోలి యే
వెరనై నం గని కాంతు నిందొకరిచే వీణాప్రవీణత్వమున్. 147

క. అని సాత్యకితనయుఁడుఁ దానును దుంబురువలన నఖిలనుతవీణావా
దనవిద్య నభ్యసింపం, జనుటకు మార్గంబు[3]వెదకుసమయమునందున్. 148

సీ. కాసారతప్తోర్మికాసారపరిఖిన్నసారసం బున్నాళసారసంబు
భానవజ్వలనోగ్రభానవజ్వలనార్తకువలయం బామ్లానకువలయంబు
ఘనసారసౌరభఘనసారరతవల్లవీజనం బుద్భ్రాంతవీజనంబు
వారణాసైరిభావారణక్షుభితనీరాశయం బలసనీరాశయంబు
పాటలలతాంతమంజరీపాటలంబు, దారుణధరాపరాగసదారుణంబు
ధూమలలితాటవీవహ్నిధూమలం బు,దగ్రతపనాతపము మించె నాతపంబు.

[4]చ. పుడమి మహోగ్రతాపమునఁ బొక్కఁగఁ బాదము లూఁది త్రొక్కఁగా
జడియుచు భానుఁ డేగ దివసంబులు దీర్ఘము లయ్యె నర్థితో
నడరె మరీచికాచయము లయ్యనునార్తిసహింపలేక వే
యడుగులకు న్మడుంగు లెనయన్ దివలక్ష్మి యొనర్చెనో యనన్. 150

[5]క. బీరెండల జలజంతులు, దారిన యాదోవరుండు తహతహచే ని
ట్టూరుపు పుచ్చెనన సెగం, బేరినప్రత్యగ్దిశాసమీరము విసరెన్. 151

1. ట. తపస్వియమున్వెదకి. 2. క. ట. న్మునిచేసిన. 3. చ. ట. నరయు. 4. 5. ట-లో నీపద్యములు లేవు.

క. మిటమిటనికటికియెండం,[1]బటపటపటఁ బగిలి పాయపడినవెదురులం
బుటమెగయుచు ముత్తియము, ల్చిటిలినగతి నాడె శాల్మలీతూలంబుల్. 152

[2]చ. అనలుఁడు రే లినప్రమద మైనప్రభం [3]గెడగూడి యుండి వే
గ నతఁడు దారుణాశుగముఖంబుల వేఁడిమిచూప భీతిచేఁ
గనలుచు ధూమదామమిషఁ గైశికము ల్చెదరంగఁ గానకుం
జనియె నవం దనర్చెఁ దరుసంధుల దావహుతాశకీలముల్. 153

చ. సవితృమయూఖము ల్నెఱెలసందులఁ దూఱుట యొప్పె దేహసం
భవ మగునట్టిడప్పి యడఁపన్ ధరఁ గల్గుమహానదీపదాం
బువు నెడఁగ్రోలియుం దనివిఁబొందక భానుఁడు ధారిణీతలం
బవిలిచి భోగవత్యుదక మానఁ గరంబులు సాఁచెనో యనన్. 154

[4]మ. తరణిగ్రాహహుతాశహేతి ఫణిఫూత్కారార్చిఁ గాంతారదు
స్తరవైశ్వానరకీలఁ దప్తపథికశ్వాసాగ్నిన ర్కాంశువి
స్ఫురణం గ్రూరతపంబు సైఁచి యచలాంభోజాక్షవాత్యావిస్పృ
త్వరధూళీపరిపాటి విష్ణుపదపద్యం బొందె నందంబుగన్. 155

చ. వికచముఖాబ్జము ల్నాగుల వేణులు దూలఁగ నూర్మికాంచిహం
సకవితతు ల్దొలంగ రవిబారి నజీవనలై తరంగిణీ
ముకురకపోల లెల్లెడ సముద్గతతాపము నెందఁ గ్రమ్మఘ
ర్మకణికలో యనంగఁ జెలమ ల్దగు నధ్వగకల్పితంబులై. 156

మ. ఘనతాపంబున జంతువు ల్నాగుల మేఘశ్రేణి [5]లే కెందునుం
జనునే పీనిమహార్తి యంచు విధి తత్సామగ్రిఁ గల్పించె నాఁ
దనరున్ దావమునం బొగ ల్వ్యజనబృందవ్యాప్తి వాతూలముల్
మనుజాంగంబుల ఘర్మతోయము లినాశ్మశ్రేణికా తేజముల్. 157

శా. ఆవర్తానిలముల్ పరిభ్రమణవిద్యాప్రౌఢి సన్మార్గము
ధ్యావాసంబులు గాంచుట ల్తెలిసి యాశావ్యాప్తి నుపరోర్వరువం
శాఖిద్యూతవిచిత్రభవ్యవనమం దావిద్య సాధింపఁగా
నావేశించినరీతి మందపవమానాంకూరముల్ ద్రిమ్మరున్. 158

1. చ. పటపటమని 2. ట-లో లేదు. 3. చ. జతగూడి. 4. 154, 155, 156, 157, 159, 160 పద్యములు ట లో లేవు. 5. చ గా కేమిటన్

క. ధారాగారప్రతిమా,కారార్పితయంత్రవారికణములు దనరెం
బోరెండ నచేతనులన్,శిరములను జెమటపడి కురియుచందానన్. 159

సీ. అత్తికాల సెగ సోఁకి చుఱుకు కనఁగాఁ జెట్లబడి క్రోవ నడిచిరి పథికు లెల్ల
బలుదప్పిచే నాలుకలు వెల్వడఁగఁ జాఁచి దగదొట్టి పడియుండె మృగము లెల్లఁ
బొదలలోఁ దలఁ దూర్చి యొదిఁగి సారెకు శీకరములుచిఁదెడుసింధురమ్ము లెల్లఁ
దరుకోటరములలో సుడిఁగి కన్నుఱమోడ్చి తలనిక్క రవిఁ జూచెఁ బుఱుఁగు లెల్ల
నుష్ణిమము లేచు కెంధూళిచప్పరములఁ
బాటలవిభావిభాసితాంబరము మెఱయ
నురిదిబలుగాడ్పు వేఁడినిట్టూర్పు లోలయ
క్రాంతలై యుండె రవుసు దిక్కాంత లెల్ల. 160

ఉ. చక్కెరచింతపండొడిని సందిట నేలకిచద్దిమాళిపైఁ
జెక్కినకానుగాకు వలచే జలకుండిక వీజనంబు వే
ఱొక్కకరంబునందుఁ బదయుగ్మమునం బిగివాళ్లు గల్గి న
ల్దిక్కుల నధ్వగుల్పడలి త్రిమ్మరి రట్టికడిందియెండలన్. 161

చ. పరఁటులపేరిపెన్బడియపట్టుల నీరము లుంచి యచ్చటం
దరుణులపేరిదీమములు దార్చి తదీక్షణరాజిపేరివే
గురులు ఘటించి పాంథమృగయూథము లోపఱుపం దలంచి క్రొ
వ్విరివిలుబోయ తావుకొను వేఁటపొలంబు లగుం బ్రపావళుల్. 162

చ. ఇరుగడఁ జిమ్ముధూమమునుపయిం దొలఁకం బువునీరు పచ్చక
ప్పురమును మేళవించి మెయిఁ బూసి చలద్వ్యజనానిలచ్ఛటల్
నెరయఁగఁ గేళికృత్రిమధునీతటబలం గలవట్టివేరుచ
ప్పరములఁ బవ్వళించి నరపాలురు నిద్దురఁ జెంది రయ్యెడన్. 163

శా. ఆవేళ న్స్మరవైరినందనుఁడు శైత్యాకాంక్ష నంభోధివే
లావిస్తీర్ణలవంగికాలవలికైలామాధవీకాయమా
నావాసాంగణసైకతస్థలములం దాలోలకల్లోలడో
లావిశ్రాంతమరుత్కిశోరజనితోల్లాసాప్తి నుండె న్రహిన్. 164

మ. ప్రణతాభవ్యవిదార దాఁకనకారజ్యత్పరీవార వా
రణసంరక్ష్యవతార శారధరస్థైర్యప్రౌఢిమాధార ధా

రణవన్నానససార సారసుహృద్రమోద్యజ్జ్వలాంకార కా
రణశూన్యోక్తివిహార హారహారవిభాసిజద్యశో వైభవా. 165

క. దహారాజితరాజితచిద్గ్రహరాజ హారాజనుత జరాజననరుజా
రహిత యజరహితయతిజను,రహితల్ప యనల్పధృతిజితాబహిరహితా.166

పృథ్వి. సదాశయ సదాశయాంబురుహసంస్ఫురత్తుండికా
మదచ్యుతిమదచ్యుతశ్రుతిశమప్రసన్నాత్మకా
పదానతపదానతత్పర యపారబోధోర్మికా
ముదాత్తసముదాత్తసత్త్వగుణ ముక్తికన్యాభికా. 167

గద్యము. ఇది శ్రీమద్దత్తాత్రేయయోగీంద్రచంద్ర చరణారవిందవందనసమాసాదిత సర్వసకవితాగసోదాత్త దత్తనామాత్యసోదర్య మల్లనమంత్రివర్యప్రణీతం బైన చంద్రభానుచరిత్రం బను మహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

శ్రీరస్తు.

# చంద్రభానుచరిత్రము.

## ద్వితీయాశ్వాసము.

క. శ్రీమాహురనగరోన్నత, భూమీధరశిఖరనిలయ భూరిసుగుణల
క్ష్మీమహనీయాభ్యుదయ సు,ధామధురకథాభిధేయ దత్తాత్రేయా. 1

వ. అవధరింపు మాసమయంబున.

సీ. చిలుకంపపాదికిఁ దార్చిననెమ్మిపురిజల్లి చేనెక్కడినచేగసెలసువిల్లు
గట్టిగా దట్టిగాఁ గట్టినపులితోలుఁ గుడివంక దోఁపినకుఱుచపిడెముఁ
[1]బేరెదఁ జేర్చినపికిలిపూవులచేరుఁ గుడిసంది గురిగింజకట్టుదండ
జుంజుఱుసికమీఁదఁ జుట్టినతలముల్లు దట్టిలోపల నటుపెట్టుచుట్ట
కోరమీసలుమిడిగ్రుడ్లుగునుకునడుపు, బెదరుఁజూపులుఁ గటిమేనఁ గదురుకంపు
పలుదయోరచ్చులును గల్గివచ్చె నెఱుకు పాళెగాఁ డొక్కఁ డాచంద్రభానుకడకు.

గీ. వచ్చి సాష్టాంగ మొనరించి తెచ్చినట్టి, కానికలు మ్రోలనిల్పి దాగలుగనిలిచి
సారెనవి యెల్ల వేర్వేఱఁ బేరుగ్రుచ్చి, ఘనఘటాఘుర్ఘురధ్వానగరిమఁ బలికె.

సీ. ఈవచ్చిబదనిక లేపాటి నూపినఁ దఱుముసింగం బైన వెఱచి పోవు
నీపిలిగఱికోల లేపాటి కాఁడిన గజములైనను జాఁపకట్టు గూలు
నీపాఁపతలకెంపు లేపాటి గన్నను గబ్బిబెబ్బులి యైనఁ గళవళించు
నీపెద్దవిలుమ్రోఁత లేపాటి విన్నను రొప్పుకోలం బైనఁ దప్పనుఱుకు
దేవ యీతకుఁ వానిలో నేవి పేరు, గ్రుచ్చినను జాలుఁ జనుఁగలగుండువడుచు
గండభేరుండవాహరిగవయశరభ, ఖడ్గములు నాఁగఁ గలుగుమెకంబు లెల్ల.

శా. సామీ దేవరపేరు సెప్పికొని యీసంద్రంపుఁ బెన్గోనలో
గీముల్ గైకొని చుట్టపక్కములతోఁ గీ డెన్నఁడు న్లేక మా
భూమిం గల్గినవేఁటతోడఁ గడుపు ల్బ్బారింతు మింతేనియుం
బూమె ల్మామదిలో నెఱుంగక దినంబుల్ ద్రోతు మిచ్ఛాగతిన్. 6

క. దేవరకు వేఁట వేడుక, గావలసిన నిపుడె రమ్ము కానలఁ దఱచై
యేవంకఁ జూచినను దగఁ, బోవఁగలే కాడనాడఁ బొరలుమెకంబుల్. 7

---

1. ట. పిరిదండఁ జేర్చిన.

[1]ఉ. ఏమని చెప్పవచ్చు జగతీశ్వర యీశ్వరుఁడే యెఱుంగు న
య్యామని బంటచేల [2]డిగి హావళిసేయు మహామహీజముల్
భీమనిశాతదంష్ట్రికల బిట్టగలించుచు నేకలంబు లా
హా మనవచ్చునే యవి మహారభటిన్ సెలగొట్టి రొప్పినన్ 8

క. మిలమిలని గోళ్లఁ జిలుపలు, గులగులలుగఁ గొట్టునచటి క్రోల్పులు గవిం
బొలవోలయ నెఱిఁగి యెలుకులు, పులిపులియన్నపుడకవిసి పులిపులిసేయున్.

ఉ. క్రెళ్లవు వాఁడిడొంకెనలఁ దీఱవు చిల్కలకోరికోలలన్
డొల్లవు బల్లకోలల మొడుంగవు మేటికటారిపోటులం
జెల్లవు చిప్పకత్తుల నశింపవు క్రేఁకవు బాఁకు తాఁకులన్
భల్లము లచ్చటన్ హృదయభల్లములై తగు భిల్లకోటికిన్. 10

[3]క. తఱిమి పయి నంటుకుక్కలఁ, గఱచు న్వడిఁ దిరిగి యెముకగవిసినకుందే
ళ్లెటిముఱి నే మని చెప్పుదు, నెఱి నెఱియలనూఱునాఱు నెలవై యుండున్.

గీ. చేత డేగఁబట్టి సెలకట్టె గైకొని, ప్రొద్దుపోక పొలముపోయెనేని
దినము వలసినన్ని తేవచ్చుఁ బులుఁగుల, వానితఱచుఁ జెప్ప వశమె నాకు.

సీ. మోటుదప్పకయుండ మూఁకనిల్పినఁజాలుఁ బలుతీవియలెయురు ల్పన్నఁగలవు
తెరువులఁ గుక్కల నిరవుకొల్పినఁ జాలు నెఱులె యోదంబులై నిలుపఁగలవు
చెంతల దీము లుంచినఁ జాలు సుడిగాలి నెగయుదుమ్ములె తెర లెత్తఁగలవు
మొనసి మాఱమ్ము లొడ్డినఁ జాలు నెండమావులెపోతనీరులై మలయఁగలవు
చో పిడినఁ జాలుఁ గారగ్గిసోఁకికనలి, మిగులుకొయ్యలె వసులయి మించఁగలవు
నీవు వచ్చినఁ జాలు ధాత్రీవరేంద్ర, వేఁట తనుదానె వేఁటఁ గావింపఁగలదు.

—చంద్రభానుఁడు వేఁటకేగుట—

క. అన వాని నరిదియొసఁగుల, ననిపి గృహంబునకు వచ్చి హరికి మృగయపై
ననురక్తిఁ దెలిపి యాతని, యనుమతిఁ బ్రియసఖునిఁ గూడి యధికోత్కంఠన్.

సీ. సవరని కెంబట్టుచల్లడంబు ధరించి గట్టిగాఁ [4]బైసూపుదట్టి గట్టి
సరిగె క్రొంబనికందుసాలెయంగియఁ బూని చలువచెంగావిపచ్చడము గప్పి
జిలిబిలిజల్లుపచ్చల క్రోఁగులు వహించి కమ్మఁగస్తురిఁ దిలకమ్ము దీర్చి
కుడివంకఁ బవడంపుఁ బిడివంకి సవరించి యఱుతఁ గెంపులతాళి యలవరించి

1. ఈపద్యము ట-లో లేదు. 2. చ-(బడియావళి 3. ఇది ట-లో లేదు 4. క-బైసపుదట్టి.

బెళుకుడాల్ జాళువా వాకిటఁ బేరోజంపుఁ
దళుకువన్నెకుళాయి యాందల సమర్చ
వేత్రధరహుంకృతు లెలర్ప విజయశంఖ
వితతులు సెలంగ సదనంబు వెడలుటయును. 15

[1]సీ. అమగంటఁద్రోకి నయహితప్రతాపకీలములు నాఁ బసిఁడిలాళ్ళములు మెఱయ
జవభీతనిజమృగసంరక్షణకుఁ బొదమొందిన శక్తి యన సందె సెలఁగ
మహనీయగళదేవమణిపార్శ్వఘటితముక్తావళి యన గవ్వదండ దనర
ఘనతార్క్ష్యతాదష్టకపిశాహినిర్మోకఖండంబు లన ఫేనకణిక లొలుకఁ
బట్టుపల్లంబుఁ గేడెంబుఁ బట్టియంబుఁ, దరకసంబును సింగిణి సిరిమితఱటు
జిగిదొలఁకు లేవ పాలాసి మెఱుగసరియును, బూరి సాహిణి యొకక త్తలానిఁ దెచ్చె.

గీ. తెచ్చినఁ దదీయముఖసముత్థితనితాంత, భద్రసూచకహేషకఁ బ్రమద మంది
ఫణిహరతురంగసుతుఁడు సాహిణులు సారె, [2]ధీరయుని సంస్తరింపఁగఁ దేజినెక్కె.

క. అపు డెత్తిననవబర్హాతపత్ర మవతంసబింబితంబుగ సత్యా
ధిపతనయుఁడు బాల్యాకల్పపరిస్ఫురితాత్మగురువిలాసముఁ దాల్చెన్. 18

గీ. త్రోపుత్రోపాడియుతనికుర్వీపతనయు, లెలమిఁ గత్తులతోఁ జేతులెత్తి మ్రొక్కఁ
బసిఁడిపరుఁజులు కోటీరపటలిఁ బొల్చెఁ, దత్ప్రతాపంబు శిరములఁ దాల్చి రనఁగ.

గీ. సకలసేనలు గొల్వ నాచంద్రభానుఁ, డిట్లు వేఁటకుఁ జనుదేర నెఱిఁగి పురము
నలుగడలనంత వెడలిరి నల్లప్రజలు, గాఢమృగయామహోత్సాహకలకలమున.

చ. వలలు నురుల్ సిడుల్ పిసులు వంకరదుడ్డులు పందిపోట్లు దీ
ములు గొరక త్రెరల్ జిగురు మోకులు బోనులుఁ గాలియుర్లుఁ [3]బోఁ
గులు మిడివిండ్లు [4]బండగులుఁ గొమ్ములుఁ బాదులు వల్లెత్రాళ్లుఁ జి
వ్వలతడికెల్ ధరించి యిరువంకలఁ జేరిరి కొంద ఱుద్ధతిన్. 21

గీ. కొమ్ముటురులుఁ గాలిగుంటలు చిలుమోర, లఱుతగవ్వదండ లలంతిగంట
లమర సారెఁ బెదవు లల్లార్చి గురగుర, మనుచు వేఁటయిఱ్ఱు లరుగుదెంచె.

చ. వెనుకరుమాలు లంసముల వ్రేలెడుకొంచెపుఁజల్లిచిక్కము
ల్పనుపయి కావిబొట్లుఁ బదిలంబుగఁ గట్టినదట్లు రొండ్లఁ జే

---

1. ఈ సీసము మొదలు "కొమ్ముటురు" లను పద్యమువఱకు ట-లో లేవు. 2. న-ధేయముచు మ న్నరింపఁగ 3. చ-బొంగులు 4. చ-బందములు

ర్చినతరిసిల్పు[1]దండలును జే నణుజు ల్లలశేగవేఁటగుల్
గునుకుచు రాజుమ్రోల సెలగోలలు సైకొని వచ్చి రుబ్బునన్ 23

ఉ. జాతర పుట్టచెండు నెఱజాణ గయాళి కరాళి దిట్ట చిం
బోతు తుపాకి జోగి సుకబోగి తుటారి తలారి మారి సం
గాతి లకోరికోల యనఁగాఁ జనుకుక్కలఁ గేలఁ బూని య
త్యాతతశృంఖలాఘులఘులార్భటి మించఁగ వచ్చె యుద్ధతిన్. 24

సీ. బోటుమాటలుగావు పాదరొప్పసింగంపుఁగోదమనైననుగూలఁగ్రుమ్మఁగలము
వట్టిమాటలు గావు పుట్టకూటికిడాయు నెలుఁగునైనను బట్టినిలుపఁగలము
పెక్కుమాటలుగావు గ్రక్కునఁ బైకొన్నపులినైనఁ జేయిచ్చిపొడువఁగలము
రిత్తమాటలుగావు హత్తికొమ్మునఁ జిమ్ముకిటినైనఁ జౌరఁబోటి కెడపఁగలము
వదరుమాటలుగావు దేవరపాలానఁ, గలుగుపుల్లుఁగులనన్నింటిఁబిలువఁగలము
చిత్తగింపుము మమ్మని సెలవువిండ్లుఁ, బలుకగోడ్డండ్లుఁగలబోయపోఁజుగొలువ.

క. రయబటుహపటహఢక్కా, జయకాహళభేరిపణవశంఖహుడుక్కా
భయదార్భటి దెసల ద్రువం, బయనం బయి యేగి చంద్రభానుం [2]డంతన్.

సీ. ప్రబలగంధావేశభద్రభేదిమృగేశమసృణకేసరమంజుమంజరితము
కుపితోగ్రచిత్రాంగఘోషభీతకురంగపటల[3]చారుకుడుంగపంజరితము
ఘనఘనాఘనలీలగాఢకాంతిస్థూలకుధరశిలాజాలకుంజరితము
దంష్ట్రిదంష్ట్రాభోగదళితపృథ్వీభాగపృథువిచిత్రపరాగపింజరితము
చటులరఘుంఝాప్రభంజనజవవికీర్ణ, [4]శాల్మలీకుజపుంజసంజాతతూల
[5]చక్రపలితపరీణాహసంజరితము, నైనవార్ధితటారణ్యమచటఁ గాంచె. 27

క. కాంచి యలయటవిఁ జొచ్చిన, చెంచులు మునుగలుగ నచటు సేరి నలుగడం
బొంచి వెలివెడలుకడ ల్యూహించి మృగౌఘముల నిగ్రహించుకడంకన్. 28

గీ. దుష్టమృగచయంబుఁ దూలించి వనసీమ, నాత్మవశము సేయనాటవికులు
చుట్టుతోరణంబు గట్టినచందానఁ, బ్రమద మొదవఁ బ్రోవువారి రవుడు. 29

క. తమగజముల నచ్చటిసింగముల లారడిపెట్టు ననుచుఁ గలుషించి దిశా
సముదయము వనముఁ జుట్టిన, క్రమమునఁ దెర లడరె లుబ్ధకనిబద్ధములై. 30

1. గుండులు. 2. చ-పు. ఎగురున్. 3. క-చారు 4. క-శాల్మలికుజాత 5. చ-చక్రపరిచిత
పరీణాహ.

గీ. నలుగడల నెత్తుకత్తెఱతాటివలలు సెలఁగ, నవుడు పటుపటహార్భటి నడరి చుక్క-
వెంకిచీలలు రాలఁ గ్రైనుండ కిటికు, డాసిన సరంక్ష గగనఖండము లనంగ 31

గీ. వనవరాహంబు లెదురుగా వని తలంచి, యాదికిటిపతిఁ బట్టుటకై కడంగి
తెరువు లెల్లెడఁ బలువురుగఁ దీర్చిరనఁగ, రవ్వ వేఁటరు లోదముల్ ద్రవ్విరపుడు.

వ. అత్తఱిఁ దండతండంబులై పండి రాలిన చింతపండు మెసవినకతంబున మెం
డుకొనుకండక్రొవ్వులు దండిపెండలఁ గరంగి వడియఁ బడియపట్లకు వచ్చి
యచ్చటనీరు గానక ఘోరఘర్ఘరధ్వానంబులు గర్జితంబులును నెత్తురు లో
లుకుతత్తరంపుఁజూపులు వటిబొత్తులును నాస్యగళత్ఫేనఖండంబులు కరకలును
గాఁ గటకునెఱిమెఱుంగు దొరయు నురవడి ధరియింపలేక ధరణీవివరంబుఁ
జొరఁబూను ఘనంబులగు ఘనాఘనంబులకిరణి ఖనిత్రక్రూరపోత్రకోటికల వీ
టికలు వడినవండు పెల్లగెగనెత్తి యుల్లన నూరుచిలుపచిలుపకలఁక నీట నా
నాకలు గడువు[1] సూకరనికరంబులకు నానాసదేశంబులగు నెడ నలుదిక్కు-లఁజు
ట్టువలలు గట్టి నియమించియు మఱియు, పట్టంబుగాఁ బుట్టిన పొట్టచిన్న
మట్టుపెట్టుటకునై పుట్టలకుఁ జేరి దట్టంబు లగుఖరనఖర ఘట్టంబుల నటిట్టు
త్రవ్వి నెఱసు లేఱుతెఱంగున నభంగపూత్కారభీషణభుజంగంబులఁ దివి
చివైచి మధుచ్ఛత్రాకావిభక్తంబులగు తదీయభక్తంబులు బుగ్గలకు నగ్గలం
బుగా మెసవి బుసకొట్టుచు నుసుగుకొనునన్నునఁ గన్నుఁగానక నిజనిలయ
నికుంజవలయంబుల నిదురించు మఱి సురసురఁ దినగు సురకి నవలిపరువులఁ
దరువుల రవులు నెరగలిసెగలు దిగదిగనఁ దగుల గగనమణికిరణములనిగని
గలు వెనుదగుల గవుల వెలువడు బెడిదంపు టిరుల గుంపులన మొల్లంబులై
వెళ్లఁబాఱు భల్లూకతల్లజంబులు క్రీళ్లుఱుకు దెసల వసులొడ్డి నియమించియు,
మఱియు నుజ్జృంభితగండప్రదేశనివేశంబులును నుదారదంతవిశంకటంబులు
నురుతరపాద ప్రకాండంబులు నున్నతవంశ దండంబులుం దనర దవదహన
దందహ్యమానతాపంబుల కోర్వలేక పర్జన్యదేవతకు నాక్రోశించు గిరీశం
బు లనఁ బ్రచండంబు లగు నెండల మెండున బెండువడి తుండంబు లెత్తి
ఘోషించుచు నీరాశ నీరాశయంబులకుం గ్రమ్ము[2] కొమ్ముటేనుఁగు పదువులు
మెదలుపదవుల నోదంబులు త్రవ్వి నియమించియు, సకలమృగపాళివా

1. చ-సేకచరానీకంబులకు. 2. కొమ్మేనుఁగని యన్నిప్రతులలోను.

తూలంబులఁ గ్రోలఁ దివురు విషమవిషవిస్ఫుటస్ఫుటావంతంబు లన వాలం
బులు మూల నఖర్వగర్వోత్తరంగంబు లగుతురంగంబు లప్పైఁ జెంగున దాఁటి
వడింగెడపి మెడల వెడలునుసుకునెత్తురు కుత్తుకలబంటి గ్రోలి యఱిగొని
గిరిదరులఁ దరలక యుండి మఱునాఁడు పేరాఁకట నేకటంబడుచుఁ బ్రబలత
మతమోగుణరేఖావిమిశ్రితోదారసశరీర వీరరసంబులచందంబున మురుబాం
కులమొఱచి కటిచి పఱచు శార్దూలసంఘాతంబుల సంకేతంబులఁ గ్రూరమ్ము
లగు మహాజిమ్ము లునుప నియమించియు మఱియుఁ గారుపోతు కణఁతి మ
నుబోతు దుప్పి మొదలగు మృగంబులకుఁ దెరువు లగునిరవులఁ దత్తదుచిత
సాధనంబులు సవరింపఁబంచియు, గాలి పరికించి యెగువదిక్కునకు నడిచి
యక్కడక్కడ మిట్టు గలపొదలచాటునఁ బోటరుల నెదురుపాటు గా
కుండ నిలిపి పార్శ్వంబుల జాగిలంబులతోడి వాగురికుల నునిచి పటహాఢ
క్కాదివాద్యంబులు చఱపించియుఁ దుపాకి మొదలగు నగ్నియంత్రంబులు
ముట్టించియుఁ బోవుడు వెట్టించి తాను దగుపట్లు నుచితక్రమంబుల నాఖేట
కార్యసాధనసన్నద్ధుండై విజయకోలాహలంబు గడఁగి యుండి సంచరించుచుండె నట్టి
యెడ. 33

శా. త్రస్తైణంబు పతద్వలీముఖము నృత్యత్ఖడ్గ మత్యాహిత
గ్రస్తక్రోడము శోకమానశశ మాక్రందన్మృగేంద్రంబు వి
ద్రస్తద్వీపి పలాయమానకరి నిష్క్రద్వ్యావహావిద్వేషి వ్య
త్యస్తక్రోష్టృక ముద్భ్రమద్గవయమై యక్కానన స్ఫూర్జిల్లఁగన్. 34

[1]సీ. జాగిలాలపసింపఁజేసి సరిపెణ ల్సడలించి పట్టెడ ల్దుయ్యుముడి గట్టువారుఁ
జాఁటునఁ గమఁగొని మోటు తప్పక నిల్చి తెగనిండఁగా విండ్లు దిగుచువారుఁ
వదలించి బిరుదున నెదుకేగి పందిపో ట్లుగ్గటంబుల చాయ నొడ్డువారుఁ
దెరలకు డాయ నిబ్బరపుబొబ్బల వేఱుపఱచి మోదములకుఁ దఱుము వారు
[2]నగుచు నానావిధమృగప్రహారఘోర
సన్నహనసావధానులై శబరభర్త

---

1. ఇదియు దీని తరువాయిపద్యమును క-లో లేవు. 2. చ-నగుచు నానావిధమృగవ్యవ్యసను లగుచు, విపినతల మెల్లఁ దామయై వెల్లివిఱిసి యొకని నొక్కనిఁ జీరుచు నోహటించి, భుగుభుగపరాక్రమయుక్తులై మెరసి రపుడు

లధిప మమ్ముఁ జూడు మనుచు మహామృగవ్య
విపినతల మెల్లఁ దామ రైమె వెలసి రపుడు. 35

సీ. పక్కనఁ జొరఁజాలి పాలచేఁగలు పట్టి బలిమిమైఁ జదికిలఁ బడఁగఁదిగుచు
దిగుచుచోఁ గ్రక్కునఁదిగి కొమ్ముగాఁజిమ్మఁ దోలఁగియల్లంతనె నిలిచివదరు
వదరి పోవఁగనీక వచ్చి యస్థము చేరి కెరలి [1]యల్లంతనె తెరువు గట్టఁ
గట్టి యస్నియు మాలెగట్టికొప్పకముస్నెకదుపులోఁజొరఁబడిచెదరఁద్రోలుఁ
ద్రోలిగుబ్బున వెనుకొనితోఁకఁగఱచుఁ,గఱచి వెనుద్రొక్కి పెడతలగంటిసేయుఁ
జేసియిటు లేకలంబులఁజక్కఁ వఱచు,శబరుతారారయునఁగొన్నిజాగిలములు.

గీ. దట్టికొంగు మెడకుఁ జుట్టి మెల్లన పొద,చాఁటుబడిన తెచ్చి శబరుఁడొకఁడు
బయలురొప్పుపంది పైఁ గాటు మరిగిన,వేఁటకుక్క నంటవిడిచి పొడిచె. 37

క. వడి నెక్కఁ డేకలము వెం,బడిఁ జను చో వెనుకఁ గవిసి పైఁ బడినపులిం
బెడమరలి కెరలి తనమొల,పిడియమ్మునఁ గడుపు చించి పెళపెళ సార్చెన్

[2]సీ. జాఠరశిఖిశిఖాజాతధూమంబులచాడ్పున నల్లనిచాఱ లెసఁగఁ
గ్రోధద్రుమాగ్రసంరూఢపల్లవములచెలువున నికరన చెవులు దనర
సకలమృగానీకశాసనోద్ధత వేత్రవల్లికచందాన వాల మమర
నాస్యగహ్వరరసనాహీంద్రవిమలతాచ్ఛటలు నాఁ గఱకుమీసలు వడంక
నావులించుచుఁ గబ్బునకడరునీఁగ,మూఁకఁగమియుచుసెలవులునాకికొనుచు
భూరిభీకరభాంకృతుల్పొదలఁగొన్ని,పొదలనడుచక్కి బెబ్బులిగదిసె[3]నొకటి.

క. ఆపులి నిజతురగదిదృ,క్షాపరత న్నిగుడ దానిఘనపరుషరుషా
చాపలతం దూపు భుజా,చాపలతం దొడిగి శౌరిసంభవుఁ [4]డడిచెన్. 40

క. శూలమ్మున నొకఁడు సరి,తూలమ్మున ఖడ్గి నేసి కో యని యార్చెన్
వాలమ్మున నొకచమరీ,వాల మ్మఱిఁ జేసి యొకఁడు వడిఁ బొగడొందెన్. 41

గీ. కడిమిఁ గదియుకుక్కఁ బడఁగొట్టె యొకకిటి,మోటువెట్టె రొప్ప నోటినురువు
సెలవులందుఁ బొలిచెఁ దళుకుదంష్ట్రికలకు,సరవి నిడ్డబిరుదుజల్లులనఁగ. 42

గీ. ఒకఁడు పొదలుతూఱి యుఱికెడుకుందేటిఁ,గూడ నేయ బల్లకోల ధనరె
గలిమినుండి కృశతఁగడ కేగె నిది యని,యలుకఁదఱుము చంద్రకళ యనంగ.

క. హరిసుతుఁ డొకహరిణముపై,హరి నడ్డమునూఁకి యేయ నాశుగ మధిక
త్వరఁ బఱవఁజేసె దానిం,జరమాంగకమై నిజాఖ్య [5]సఫలతఁ బొందన్. 44

1. చ-యంతంతనె, 2. దీనిఁతో గ్రింది 4 పద్యములు ట-లో లేవు. 3. చ-నొకఁడు. 4. చ-నేసెన్. 5. చ-సఫలముగాఁగన్.

[1]గీ. గాలివంక గాలు గని యీరములు చేరి, తారిలంగ నెల్ల మూరుకొనుచుఁ
గాలు ద్రవ్వియునికిఁ గనికొమ్ముటుదుములఁ, గఱచితిగి చెఁగొన్ని మొఱసడములు.

గీ. యముసిగడనిడ్డలోహఖడ్గచువిధమునఁ, జేతఁదగుతోఁచిగానికిఁ జెమటప్రాంత
యొత్తుగా ముష్టి నమరించియొకఁడు వైచెఁ, గట్టెఁబొద సోపి వెలిచె పైగజ్జగదల.

గీ. పొట్టిగుట్టులు గుట్టుగా [2]మట్టిమట్టి, గట్టిపట్టులు ముక్కునఁ గుట్టికుట్టి
యిట్టునట్టును రెట్టలఁ గొట్టికొట్టి, పట్టెఁ గుందేటి నపుడొక్క దిట్టలగుడు.

గీ. ఇట్లు తాము నిగ్రహించిన మెకముల, నెల్లఁ దెచ్చి యెదుట నిడినఁ జూచి
చంద్రభానుఁ డపుడు చాల మెచ్చి పుళింద, వరుల కొసఁగె నుచితవస్తుసమితి.

క. అట్టియెడఁ గఱకుమేనులఁ, బుట్టిచబడలికలతోడ బోయలు వేఁటల్
మట్టుపఱిచి యాచెంతల, పొట్టెము లగుపొదలఁ జేరిపొదలెదు వేడ్కన్. 49

సీ. కొందఱు మునుమున్న గూలినమెకములఁ గా్రేనికర్పింపఁ గడఁగి రపుడు
కొందఱు మనుబిళ్లఁ గోసి కుప్పలువైచి పాలు దప్పకయుండఁ బంచి రపుడు
కొందఱు బలునెల్లికొయ్య నింగలములు గల్పించి కఱకుట్లు గాల్చి రపుడు
కొందఱు తేఁకుటాకుల దొప్పగమిలోనఁ బస గలనంజుడు లైనవి రపుడు.
విపినతలమున నీరీతి వేఁటకాండ్రు
సముచితోత్సాహములు మించ శౌరిసుతుఁడు
శివిఁ బురినుండి బోనపుట్టికలురా ని
జాప్తపరిజనయుతుఁ డయి యారగించె. 50

చ. చలువలు చిందుకందువలఁ జంద్రశిలోపలసాంద్ర[3]వేదికన్
జలజలఁ జాలుగా సెలలు జాఱునొకానొకకోనలోనఁ బా
టలపటుకోరకోదరవిటంకనటత్పవమానకందళుల్
చెలఁగెడునొక్క పూవుఁబొదఁ జేరి సుఖంబున నుండె నయ్యెడన్. 51

—చంద్రభానునికడకు సిద్ధుఁడు వచ్చుట.—

సీ. ముడిపిడుకుటుంచు కెంజడలతో నిద్చిందుకఱపట్టుకుచ్చులిగంతతోడ
వలచేతిజలకమండలువుతోఁ బేరెద నిట్టలం బగుయోగపట్టెతోడఁ
బెఱచేతి జెత్తముమురువుతోఁ గళమునఁ దాల్చినసింగినాదంబుతోడ
[4]మూలికెల్లలకకపాలతో సందిటఁ గదియు కేదారకంకణముతోడ

1 ఇదియుఁ గ్రిందిపద్యమును క-లో లేవు. 2. చ-ముట్టిముట్టి 3. చ-ట-సీమలన్ 4. క-మాలికల్.

భసితచర్చికతోఁ దిమ్మపంటిచాయ,దొరయునెమ్మనితోడ సిద్ధుం డొకండు
మిగులవేడుకఁ జెట్టున దిగినయట్టు,వచ్చె గొబ్బున నయ్యదువర్యుకడకు. 52

గీ. వచ్చుటయుఁగాంచి యెదురేగి తెచ్చి యొక్క
సితకరోపలసీమ నాసీనుఁ జేసి
యర్ఘ్యపాద్యాదిసత్క్రియ లాచరించి
యతిలలితవాక్యముల నేమ మరసి పలికె. 53

సీ. తఱిమినారలు నిరంతరతమఃపటలంబు మస్తచంద్రప్రభామర్శనమున
యడఁచినారలు మహోదగ్రరజోరాశి విజ్ఞానధారాభివృష్టికతన
నాఁగినారలు సముద్యద్వాయువలనంబు లీలమైఁ గుండలి మేలుకొలిపి
తొలఁచినారలు తనూమిళితపంకచయంబు లనితరసాధ్యామృతౌఘమహిమ
గణుతికెక్క తపస్స్ఫూర్తిఁ గాంచినార,లనఘుతరశీలహంసు లీ రగుటఁజేసి
యట్టిమిముబోంట్ల వినుతిసేయంగఁ దరమె,భవునికైనను బద్మసంభవునికైన.

క. భూచక్రభరణమదకృత,నీచతచేఁ జాల నెఱగొనినమాదృశులన్
వాచంయమి మీరు కృపం,జూచినఁ గా కేల కలుగు శుభవైభవముల్.

1గీ. అనిన మందస్మితము కనుంగొనలఁ దొలఁక,సర్వసర్వంసహాభారసహనదక్ష
బాహుశాలికి నాసత్యభామసుతున,కనియె యతి మత్తకేసరిస్వనము మీఱ.

సీ. ప్రతిమానసాంభోజసతతవికాసశీలనవిచక్షణుఁ డెన్న నినుఁడు గాఁడె
యభ్యుపగతభక్తమోహాంధక్రియావిదారణసమర్థుం డెన్న రాజు గాఁడె
జటిలాపదహిగర్వసర్వస్వవిదళనధుర్యుఁ డెన్నఁగ నరేంద్రుండు గాఁడె
శమిరాజనిర్వ్యాజసౌఖ్యవాసవిధాయకుం డెన్న నచలేశ్వరుండు గాఁడె
యఖిలయతిమానసోత్తరాశావలంబ,ముఖ్యుఁ డెంచిన సార్వభౌముండుగాఁడె
కాన మముబోంట్ల నీవును గారవింప,వలయు ననవిని యదువంశవల్లభుండు.

సీ. సంయమిమీకటాక్షమున నెచ్చోటతిసౌమ్యమై రమ్యమై గమ్య మయ్యె
మహాని నీసంస్థానమహిమ నెచ్చోటస్తదైన్యమై మాన్యమై ధన్య మయ్యె
యతి నీపదాబ్జసంగతుల నెచ్చోటు సత్సేవ్యమై దివ్యమై భవ్య మయ్యె
వ్రతి నీమనఃప్రసన్నతల నెచ్చోటు వరేణ్యమై పుణ్యమై గణ్య మయ్యె

1. ఈ పద్యము మొదలు "జాలువాగోణపుఁ జెఱంగు" అనునఱకు క-లో లేదు.

జటిలశేఖర నీకృపాసక్తి నెచటు,పాత్రమై చిత్రమై యఘదాత్ర మయ్యె
సట్టినెలపులఁ గలవింత లానతిచ్చి,ననుఁ గృతార్థుని గాఁ జేయు మన నతండు.

ఉ. భూవర సర్వపుణ్యపురము ల్దిలకించుచుఁ గుండినంబునం
గేవలరూఢి నారదుని గెల్చినగద్దఱిఁ దుంబురుం గళా
కోవిదుఁ గాంచి యందు నొకకొన్నిదినంబులు నిల్చి రంగధా
త్రీవిభుఁ గొల్వఁ బోవుచు సుధీజనసేవిత నిన్నుఁ గాంచితిన్. 59

చ. అన హరిసూనుఁ డద్భుతమునంది మునీంద్ర సుధాశనాధినా
థుని నెఱిమెచ్చఁగాఁ దగుతుంబురుఁ డిత్తఱిఁ గుండినంబునం
దని శేము నునిర్ కేమికత మానతియి మ్మన సావధానత
న్విను మని పల్కె సంయమి నవీనవచోరచనాచమత్క్రియన్. 60

మ. కలఁ డున్నిద్రజయప్రయాణపటిమాగ్రగ్రాహ్యవాహ్యాళికో
త్కళికాభంగతరంగసంఘపటురింఖాపుంఖసంఘాతని
ర్దళితక్షోణిరజోవ్రజావిలసముద్రస్వర్ధునీవ్యక్తదో
ర్బలసన్నాహుఁడు రుక్మబాహుఁడు కుభృత్పర్జన్యవాహుం డిలన్. 61

క. అతనికి సుతుఁడును సుతయును,వితతయశుఁడు వీరసేనవిభుఁడుఁ గుముదినీ
సతియును గల రామకొరుఁడు,శతిమఖముఖవినుతనిజభుజాబలుఁ డనఘా.

సీ. పుష్కరప్రౌఢిమ పొలఁతికేలన కాదు బెళుకునెన్నడుమునఁ గలిగియుండు
సజ్జవిభ్రమము తన్వంగిగ్రీవన కాదు కలికినెమ్మొగమునఁ గలిగియుండు
విషధరప్రఖ్యాతి వెలఁదివేణిన కాదు మెలఁతలేయారునఁ గలిగియుండుఁ
జక్రవిలాసంబు సతిగుబ్బలన కాదు ఘనజఘనంబునఁ గలిగియుండు
నలప్రవాళప్రభావంబు చెలియపాదములన కా దధరంబునఁ గలిగియుండు
ననుచు వినుతింపఁదనరునయ్యధిపుపుత్త్రి,దివ్యవనితావతారైకభవ్య గాన.

క. ఆరాజబింబవదన క,వారితసంగీతవైభవము నేర్ప సుధాం
ధోరాజు వనిచె వీణా,సారస్యధురంధరాగ్రసరుఁ దుంబురునిన్. 64

గీ. అనిన విని మహాత్మ యారుక్మబాహుభూ,కాంతమణికి నెట్టు కన్య యయ్యె
నమరకాంత యిదిమహాద్భుతంబెఱిఁగింప,వేయుటన్నసంయమీంద్రుఁడనియె.

వదరువట్రువహారివాణంబు గలమేటిబండికం ల్లేయూరిపారిబంట్లు
లిబ్బిరాచూలి నేలినచాన మొదలైనపడఁతుక లేయూరిపడుపుఁగొమ్మ

లెడకాఁపురము వానికడయమునుం దమ్మి తేనియ యేయూరి తేటచెలమ
జేజేలకోరికల్ చేఁపెడివిచ్చయామసిగిడ్డి యేయూరిమందపసర
[1]మిచ్చమానిక మేయూరిరచ్చతాయి
పెట్టెలుఁగుమ్రాఁకు లేయూరిపెరటిచెట్టు
లట్టిసుర[2]పురి యేలుచునమరపతి మ
హోన్నతైశ్వర్యధుర్యుఁడై యొక్కనాఁడు. 66

చ. సిరులఁ దనర్చుదివ్యసభఁ జేరఁగవచ్చి పరాకు జియ్య యె
చ్చరిక యహో యటంచు సరసధ్వనితో నిరువంకలన్ బరా
బరు లొనరించుచుం బసిఁడిబ్రద్దలవారలు దెల్ప వేలుపుల్
దొర లిరుగేలుఖడ్గములతో మకుటంబుల నుంచి [3]కొల్వఁగన్. 67

గీ. వచ్చి మించులు వెదచల్లునిచ్చమాని
కములగద్దియఁ గూర్చుండి యమరగురుఁడు
కవియుఁ బార్శ్వద్వయంబునఁ గదిసి బహుళ
యస్థితులు దెల్ప నాలించునవసరమున. 68

సీ. సేనాని చిత్రవాజివిహారములఁ జేరె వలమానహేతియై వహ్ని వచ్చెఁ
జండాంశుతనయుఁ డుద్దండవైఖరి డాసె ఘనతమస్స్ఫూర్తి డగ్గఱెఁ బలాశి
వాహినీశ్వరులతో వరుణుండు సను దెంచెబహువాసనలగంధవహుఁడుగదిసెఁ
జెందె మహారాజసేవ్యుఁడై ధనపతి గౌరీశుఁ డేతెంచెఁ గళ దొలంక
వెండియును దక్కినయశేషవిబుధవరులు, నిర్నిమేషప్రభావసందీప్తు లగుచు
నరుగుదెంచిరి సకలలోకాధిరాజ్య,రమ్యవిభవాభిరాము సుత్రాముఁ గొలువ.

సీ. బహులక్షణానురూపప్రభావంబులఁ గనుపట్టుసుకవివాక్యములచేత
నరిదరకరమహిమాధాయకంబు లై తనరెడుగురునిమంత్రములచేత
శాస్త్రాధికరణచర్యాభీతవిమతమై కొఱలునూతనబుధగోష్ఠిచేత
శ్రుతహితవర్ణవిస్ఫురణమాధురిఁ జాల సొగయువిద్యాధరస్తుతులచేత
నుబుసుపోవఁ బురందరుఁ డూర్వశీశ
శిప్రభాహారిణీఘృతాచీతిలోత్త
మాప్రధానాప్సరోవధూమణులు గొలువ
నొనరి యొడ్డోలగంబయి యుండునపుడు. 70

1 ట-ఇచ్చమానిక. 2. ట-పురమేలుచు 3. ప్రొక్కఁగన్.

గీ. చారుఁ డొకఁడు వేగ సముఖమ్మునకు వచ్చి నమ్రుఁ డగుచు నాననమునఁ గేలు
దోయి చేర్చి యొరఁగు డాయంగఁ జని నిక్కి, విన్నవించె నేమొ విబుధపతికి.

క. ఆమాట కులికిపడి యే, మేమీ యని తెలియ నడిగి యించుకవడి నె
మ్మోము మఱి వంచి సశంకము, గా మరుదాచార్యనెమ్మొగము గనుఁగొనియెన్.

క. కనుఁగొనఁ దత్కార్యము తన, మనమున నూహించి దివిజమంత్రి సుధాంధో
వనితామణు లుండఁగ నీ, యనుతాపముఁ జెందనేల యమరాధీశా. 73

సీ. బతిమాలఁ జేయరే ప్రతిసృష్టి గల్పించి యడరు విశ్వామిత్రునంత వానిఁ
బనిబందఁ జేయరే పరమేష్ఠి నిష్ఠ చే నతకరించిన కణ్వునంత వానిఁ
బాలుమాలింపరే పంచేంద్రియోద్వృత్తి నడఁచిన శాండిల్యునంత వానిఁ
గకూర్కార్తిపఱుపరే గాఢతపోరూఢుఁ డగు మందకర్ణునంత వాని
నితఁ డనఁగ నెంత యెంతటి యతులకైన
వెరువిత్తులు గారె యీ విపులనయన
లీ వెలందులలో నొక్క యిగురుఁబోణి
ననుపు మనసమాస్త్రితోఁ గూర్చి యనిమిషేంద్ర. 74

చ. మఱచితె నీవు తొల్లి పురమర్దనుచిచ్చుఱకంటివెచ్చఁ బెం
పఱిన మరుం దదీయకరుణామృతనూతనవర్షధారఁ గ్ర
మ్మఱ మొలపించి మామకసమంచితమంత్రబలాప్తి సాంగుఁడై
పరఁగఁగఁ జేసి మానిజనవంచన కుంచుట యెల్ల వాసవా. 75

క. అనుగురుని వాక్యములు విని, యనిమిషపతి వనుప వేత్రహస్తుఁ డొకఁడు వే
చని యఖిలంబును దెలుపఁగ, వనధిసూతాతనయుఁ డధికవైఖరితోడన్.

సీ. వలెవాటు వైచినవలిపెదుప్పటి పసపంటి బంగరుఁబ్రాఁత నతకరింప
నొరగుఁ జంద్రికయొంటిపొరగుడ్డ కెంబట్టు చెంగులుకినలయశ్రీల నేలఁ
బేరెద నందంద సూరుఘుర్మకణాలి హారమౌక్తికముల నసదు నేయఁ
దనువున రవసందిదండయొత్తులతఱుల్ కస్తూరిరేకులఁ బ్రస్తరింప
జాళువాగోణపుఁ జెఱంగు నేలఁ జీరఁ, దలిరుసమ్మాళిగెలు మెట్టి లలన యొర్తు
చేరి కైదండ యీఁ బ్రొద్దఁ దేరుకన్నుఁగవ నలరుబంతి యొత్తుచుఁ గంతుఁ డంత.

గీ. చావడికి వచ్చి యొసపరికీవి మెఱయఁ, గొలువుసింగారమై వెంటఁ గొలిచి చైత్ర
కాబ్జమందానిలప్రముఖాప్తు లరుగుదేరఁ [1]జనుదేరు లక్ష్మీకుమారుఁ జూచి.

1 క-దనుజేరు.

ఉ. కట్టికవారు సారె సముఖా యన వామపదంబు కేల్పురా
మట్టిక నిల్పి గద్దెపయి [1]మార్పడ వేఱొకజాను ప్రూఁది యా
పట్టపువేల్పు గొంతమురిపంబున నించుక లేచి కంతుఁ జే
పట్టిటు రమ్మటంచుఁ దనపార్శ్వమున న్వసియింపఁ జేయుచున్. 79

చ. పరమకుతూహలం బడరఁ బల్కు సుఖస్థితి నీదికాంతపా
లురు నితరాహరుల్ కడుపలోపలిచల్ల దొలంకకుండ ని
ర్భరులయి దండి దాడి యనువల్కు లెఱుంగక నీడఁ బట్టుచున్
దొరలయి యుండు రెల్ల హరిదోర్బలకీర్తిన కాదె మన్మథా. 80

చ. అతనికిఁ బట్టి పీవగుట నాపద లీసురరాజ్యవైభవ
స్థితి కితరంబు లేమి చును దెంచిన నన్నియు మాన్ప విక్రమా
ప్రతిహత నీకునుం బడినభారము గావున రూపవిభ్రమాం
చితసురచంచలాక్షులు భజింపఁగ నేగి కవేరజాతటిన్. 81

మ. వ్రతసంపత్తిఁ దపంబు సల్పెడుభరద్వాజాఖ్యమౌని న్భవ
చ్ఛితభల్లంబులపాలు సేసి లలనాశృంగారలీలాకళా
న్వితుఁ గావించి మదీయచిత్తజనితోద్వేగంబు మాయింపు మో
యతులపాభ్రవ దేవకార్యఘటనాయత్తప్రయత్నంబునన్. 82

[2]క. విను మింక నేమునినిఁ బ్రియం, బొనరించుట దోఁచు శక్తియుక్తుల నీయో
పినరీతిం బాటులుపడి, యునిమిషరాజ్యంబు నిలుపుమయ్య మనోజా. 83

గీ. అనుచు ననునయించి యగభేది రంభాది, దివిజవనజముఖులదిక్కు చూచి
వనితలార యిందు మునినాథువలపింపఁ, బడఁతి యొకతె యేఁబువడుడటన్న.

క. వారలలో నతిలలితా, కారద్యుతిసాంద్రచంద్రకళ యనుసతి జం
భారాతియెదుట నిలిచి[3]యు, దార స్మితమాధురీసుధారస మెసఁగన్. 85

చ. పలుకుల కేమి దేవ బలభంజన నీకృపపెంపున న్మహో
జ్జ్వలగతిఁ [4]జేరఁబోయి యలసన్నుతిశాలి మహర్షిధూర్జటిన్
సలలితనిష్కళంకరుచిసంపదఁ గైకొని ముజ్జగంబు “లీ
యలికులవేణి చంద్రకళ యౌరా” నని మెచ్చ ఘటింతుఁ బంతముల్. 86

---

1. చ-మార్కొన జానువునూఁది యంతనా. 2. ట-లోనిది లేదు. 3. ట-దారస్థితి మధురమధుసుధారసమెసఁగన్. 4. చ-మమ్ముఁబ్రోవనలసన్నతి.

గీ. సభ నహంకారములు పలుకఁజనదు కాక, విబుధవర్యభరద్వాజవిభ్రమంబుఁ
గోరి యిప్పుడె విటపాళిఁ గూర్చుకున్న, ననువిలాసిని యనుచు నెన్నంగవలదు.

సీ. చవిచూచునే కదా సారెఁ గెంజిగురులు నాలేఁదొగరుమోవిఁ గ్రోలఁడెట్లు
సరవి నుండునె కదా సైకతస్థలముల[1] నానితంబము డాయ మాను నెట్లు
తానమాడునె కదా తడయ కెప్పుడు నీట నాకమ్మఁజెమటల నానఁ డెట్లు
కలసియుండునె కదా వలపుఁబూఁదీవెల మత్తనూసంగతి మఱగఁడెట్లు
ముట్టునేకద మెట్టతమ్ములు మదీయ, చరణసంవాహనము నేయ మఱగఁడెట్లు
పలుపలుకు లాడనేల మత్ప్రౌఢి నేఁడు, చిత్తగింపు మటన్న శచీవరుండు.

గీ. మలినజలజాతమేని నీలలితకరస, మృద్ధి నలరదె గడుసుతాలేని నిన్నుఁ
గాంచినఁ గరంగవే చంద్రకళ ధరిత్రి, వ్రతుల వలపించు టెంతభారంబు నీకు.

క. అని యనిమిషపతి తను దయఁ, గని తనచేఁ బసిఁడితట్టఁ గప్పురబాగా
లునుదోడవులొసఁగి యాసతిఁ,[2] బనిచినఁ దత్కార్యభారపరుఁడై మరుఁడున్.

ఉ. గ్రక్కున లేచి గద్దియ డిగన్ దివిజేంద్రుఁడు తోన డిగ్గి పే
రక్కున జేర్చి నాలుగయిదజ్జలు వెంటనె యేగుదెంచి నీ
వొక్కఁడ వుండ మేము సుఖముందుదు మెప్పుడు నేఁడు ప్రోవుమీ
దిక్కయి పంచబాణ యని దీవన లిచ్చిన సంతసంబునన్. 91

గీ. అమరనాథునివీడ్కొని యాలతాంగి, మొదలుగాఁగల తెఱఁగంటిముదితలుదిత
ధృతులయి భజింపఁబచ్చని తేజినెక్కి, వెడలెఁగలకంఠకంఠ కాహళులు మొరయ

సీ. నిగనిగ మను గొప్పనిడుదయొంటులచాయ చెక్కుటద్దములపైఁ జేరువాఱఁ
జెమటచేఁ గరఁగి పూసినకదంబముచాయ యురచట్టలో నుండి పరిమళింపఁ
బలుకుఁగప్రపుఁదావి వలుచపీడెము కెంపు తేనెకెమ్మోవిపై నీనె చూపఁ
బరిజనంబులు వీచుసురటి తెమ్మెరల బంగరువ్రాఁతకుళ్ళాయి కళలు గదలఁ
జడిచెమట జిల్గుపావడఁ దుడిచికొనుచుఁ, గిరుదువాళినె పోనిచ్చు గెరలనీక
సంతరించుచు తనవాజినము తెఱింగి, యెక్కియాడుచుఁ జనియె నాచక్కనయ్య.

మ. విరిసెం బువ్వులు తేఁటిజోఁటిగమి యుర్విళ్లూర సందండ గా
డ్పురసెం దావులు చిల్వచెల్వ పదువ ట్టాడంగ లేవెన్నెలల్

1. క-మన్నితంబము. 2. చ-బనిచెఁదత్కా.

గురిసెం గోరికతోఁ జకోరమహిళల్ గ్రుక్కిళ్లు మ్రింగన్ ధను
ర్ధరుఁడై పంచశరుండు భూతలముఁ జేరన్ దిక్కులం దొక్కటన్. 94

చ. తొలఁకులఁ దేలి పుప్పొడులఁ దూలి మరందముఁ గ్రోలి కన్నెతీ
వలపయి సోలి క్రొన్ననఁ బ్రాలి హిమంబుల నేలి వాసనల్
గలయఁగఁజేయఁ జాలి చలిగాలి తగ న్హరిచూలిమీఁదటం
బొలసె మరుద్రథానికటభూరుహకేళిఁ జలాళిపాళియై. 95

ఉ. క్రేవఁ గవేరకన్య లహరీపవనోద్భవహంసారసారసా
రావవిశేషమాన్య నళిరాజరథాంగకరాజరాజిరా
జీవకుటీరధన్యఁ బరిశీలితవారిభరాజరాజిరా
జీవకిశోరసైన్యఁ గని చిత్తజుఁ బల్కె వసంతుఁ డయ్యెడన్. 96

—కావేరీవర్ణనము.—

మ. సుడిమోదమ్ములఁ దమ్మిపూబొదలు నాచున్బగ్గము ల్పూంచి న
ల్లడ సారంగపుదీము లుంచి దురితౌఘప్రౌఢ సారంగముల్
పడఁ దోడ్తోఁ దెరలెత్తి మ్రోయఁ దొణఁగెం బైపై శరప్రౌఢి చొ
ప్పడ నీసహ్యధరాధరప్రభవశుంభద్వాహినిం గంటివే. 97

చ. ఘనలహరీవినాదములు గర్జితము ల్వని భీతిఁబొంది పైఁ
జనుకలహంసమండలముజాడ గనుంగొను మంగజాత యీ
యనుపమపుణ్యసింధుమణి యచ్ఛజలంబుల మున్గి ధన్యులౌ
మనుజులఘోరపాతకసమాజము వెల్వడురీతిఁ దెల్పెడున్. 98

మ. తెర సంధించి ప్రఫుల్లహల్లకశిఖాదీపచ్ఛట ల్నించి లోఁ
గర మర్థిన్ జలమానుషీప్రతిమలం గైనేసి యీసింధువుం
దరి గంగావతరప్రసంగతికథానాట్యంబు సూప న్సురల్
సరవిన్ వైచునొసంగులో యనఁగ నంచల్ బ్రాలెడిం జూచితే. 99

సీ. కవులకు జీవనక్రమమొసంగినయట్టియీసరస్వతి నుతియింపఁదరమె
పరరాజహంసాళి భంగంబు నొందించునీవాహినీలీల లెన్నఁదరమె
యనిమిషప్రతతికి నమృతంబు లొనఁగూర్చు నీసింధువాళినూహింపఁదరమె
కాదంబపితతి నుత్కలికలఁ దేలించు నీప్రవాహినిమహత్త్వ మెన్నఁదరమె

సూనసాయక తా మెంత సుడులఁబడిన,సాటిసేయంగఁ దగునెయసహ్యాగోత్ర
జాత తానన్యనదుల నీసహ్యాగోత్ర, జాతకుననంతభువన విఖ్యాత కరయ.

గీ. తను విగాహించిహాతులై నజనులకొసఁగ,శంఖచక్రశతంబులీసహ్యతనయ
సంతరించినగతిఁ బొల్చె సరసశరక,నుంగొను విని_ర్మలాబ్జరథాంగతతుల. 101

చ. కలమవనాళి పండి యొరఁగంబడి యెన్నుల నీరెడల్చుటల్
గలయఁగ వంక లైన మడికట్టల బీటలసందు దూఱఁగాఁ
జెలువు వహించె నెల్లెడలఁ జిత్రము పూవిలుకాఁడ వ్రేళ్లనుం
గొలుచుగఁ బండినట్లు కనుఁగొంటివె యీతటినీతటంబులన్. 102

శా. సారె న్నారికెడంపుబొండలము లీక్ష్మాఁ ద్రెళ్లి తో వ్రీలుటన్
నీ శ్రేత్రై తొరఁగ న్స్వపర్ణపటలీ నిర్యన్నవస్థూలము
క్తారాజి న్నవబుద్బుదాళి నిలిపెం గాంతారకాంతారకాం
తారంబు ల్తిలకింపు మయ్య రతికాంతా రమ్యదేశంబులన్. 103

మ. ఫలభారానతనారికేళ వనరంభాపూగభూజావళీ
కలమారామచయంబుచే నతతరంగత్తుంగభంగాంబుని
_ర్మలవాతంబులచేఁ దటస్థులకుఁ బ్రేమన్భ_క్తియు న్ము_క్తియుం
గలుగంజేసి తనర్చునీతటిని వర్ణింపఁగా శక్యమే. 104

సీ. సరసరాజీవాజిచలరాజిరాజినినాద భేదములు సంమోద మొసఁగ
సమసమాలీనాళిసుమధూళిపాళికారామసీమములు సంభ్రమముఁ గూర్ప
దరవరాళీకేళివరబాలికాళీవిహార తీరములు నెయ్యమున ముంపఁ
దటతటాకానీకపటుసైకతాకర మంజుమంజరులు సమ్మదము దన్ప
సతతతతభంగసంగసంచారివారి, కరటిరటితాబ్దశబ్దసంఘాతభీత
సకలకలహంససంసత్ప్రచారసార, యమితమితవాతపోతంబు లందగింప. 105

క. శ్రీరంగభర్త యీనది, తీరంబున నున్నవాఁ డదె తదీయశుభా
గారంబుఁ జూడు మణిరుచి, పూరంబుల నకృతచిత్రములు గలదానిన్. 106

—* శ్రీరంగపురవర్ణనము. *—

సీ. ప్రాతరాశుగమిళత్ప్రబలగోపురగవాక్షధ్వను లఱల్యశంఖస్వనములు
రవిరథ్యఖురహతప్రాసాదనాదముల్ మధ్యాహ్నఘంటాసమక్వణములు

హర్మ్యతతటీకులాయావిశత్కలరవపక్షోద్భటులు సాంధ్యపటహరుతులఁ
జంద్రద్రుతాబ్జాశ్మసౌధాంబునినదంబు లార్ధరాత్రికతమ్మ్రారవములఁ
గలసి శ్రీరంగధామమమంగళమహోత్స,వాచరణవైభవంబుల నతిశయిల్లఁ
పౌరసంఘాతమతిలోకభావనాస,మంచితాశ్చర్యగరిమ నాలించు నిచట. 107

లయగ్రాహి.

కాంచితవె పైబిరుదుపించెము లనంగ బరు లించుకచలింపవసనాంచలపతాకల్
మించమణిఘంటలురహించఁగటిచక్రములునంచలనమానఁగనుమించుటలుగుల్దీ
పించఁగుచఖేటకములుంచిబొమసింగిణులునించిజయమీవుగననంచలరథంబుల్
పంచెమునుమున్నసురసంచయమనస్మెజసిరంచనడనిందుసతులించువిలుకాఁడా.

శా. వీరల్ తైర్థికవైష్ణవు ల్గనుము పూవిల్కాఁడ సద్భక్తిఁ గా
వేరిం దాన మొనర్చి రంగవిభు సేవింపం దమిం గాంచి యు
న్నా రున్మస్తకయుక్కరాబ్జు లయి "భో నాగేంద్రశాయి న్నమ
స్తే రంగేశ" యటంచు దేహాళుల నొంతే నిక్క వీక్షింపుముర్. 109

[1]ఉ. ముప్పిరి గొన్న వేడుకఁ దముం జనము ల్గన మోక్షచింత లోఁ
దప్పక చేతికందు చిటితాళపుమ్రోఁతలఁ బాయ కెవ్వడుం
జప్పటులన్ బుధోత్తములు సందడి సేయుచు మూఁక గూడ రం
గప్పను బాడుచుం జనుమహాత్ములఁ జూడుము సూనసాయకా. 110

చ. మడవ ల్మార్పుచుఁ దీర్చుచు న్లతలకుం బాదు ల్దగం జేసి యుం
డెడ తొఁచోటుల నంట్లు నిల్పుచును నీరెత్తించుచుం గ్రొవ్విరుల్
దోడిమ ల్విచ్చి సరాలు గట్టుచును నెందుం దార యై పాటులం
బడుధన్యాత్ములఁ గంటివే మదన యీమాల్యార్చనాధీశులన్. 111

[2]శా. వీణావేణుమృదంగనాదముల కువ్విళ్లూరుచు న్మండప
స్థాణుల్ ప్రాఁకియు మెట్టు లెక్కియును నచ్చోఁ గేళిక ల్సల్పున
య్యేణీనేత్రలఁ జుట్టువారుకొని కంటే కాంచుచున్నారు గ్రా
మీణుల్ నిశ్చలలోచనాబ్జులయి లక్ష్మీగర్భముక్తామణీ. 112

[3]మ. మునుముందాన మొనర్చి పుండ్రములు శ్రీముద్రాంకము ల్పూని నూ
ననికుంజావృతసైకతస్థలుల గంటల్ మ్రోయఁగాఁ గేశవా

---

1. ఇదియు దీని క్రిందిపద్యమును క-లో లేవు. 2. ఇది ట-లో లేదు. 3. ఇదియు దీనిక్రింది రెండు పద్యములును క-లో లేవు.

ర్పనముల్ చల్పి స్వపార్శ్వవర్తులకుఁ దీర్థం బిచ్చి సేవార్థమై
చనువారిం గనుఁగొంటివే మదన సాష్టాంగాద్యసమానీశులన్. 113

ఉ. శ్రీవన దృష్టి నిల్పి తడిదోవతి మూఁపునఁ దాల్చి స్తోత్రపా
ఠావళి తాస్యులై శయచయంబులఁ జెంబులఁ బూని యేగునీ
కేవలపుణ్యమూర్తుల నకించనవృత్తుల రంగనాథస
ప్తావరణప్రదక్షిణపరాయణులం గనుఁగొంటె మన్మథా. 114

సీ. అగ్రహారముల మాన్యక్షేత్రములఁ బండుగరిసెలకొలు చక్రకాండ్రు నింప
సతతంబుఁ బైరుపచ్చలుఁ దోఁటదొడ్డులుఁ గావలు లరసి రక్షణ మొనర్పఁ
గీలార్లు పెరుఁగునుం బాలు మందలనుండి వడి తేపుమాపుఁగావడులఁ దేరఁ
బై వెచ్చమునకుఁ దప్పక రూకపాతికల్ ప్రియశిష్యతతి సమర్పించి యొసఁగ
నతిథిసంతర్పణం బె నిత్యవ్రతంబు,గాఁగ వ్యాఖ్యానమునఁ బ్రొద్దుఁ గడపి గేహ
దేవతార్చన మఱవక భావశుద్ధిఁ,దనరునచటిగృహస్థులఁ గను మనంగ. 115

సీ. అక్కున వనమాలికాగతభృంగమో శ్రీవత్సమో విభజింపరాదు
జఘనసీమ సువర్ణశాటీద్యుతియొ నాభినలినపరాగమో తెలియగాదు
పదమున దేవతాపగవీచియో నఖరేందుమరీచియో యెఱుఁగరాదు
తనువున నర్చనాదత్తసూనంబులో పాఁపమేహారలో యేర్పఱుపరాదు
కాంచితె మనోజ కించిదాకుంచితాంఘ్రి,యుగ మిలారమలో త్తఁగానొ త్తిగిల్లి
కటినొకకరంబు సాఁచియొక్కటితలాడ,నమరఁ బవళించియున్న రంగప్పనిపుడు.

క. ఈరీతిఁ జెలువు మెఱసిన,శ్రీరంగాధిపునినగరి చెంత మధురసా
సారసపారసమున్నత,సారసపారసరుతుల్ దిశాతతిఁ గప్పెన్. 117

—* భరద్వాజాశ్రమవర్ణనము. *—

క. అదె కనుఁగొంటివె మదనా,మదనాగకిశోరవదనమంజులరదనా
రదనాళకమలసదనా,సదనాహతవారికరిణి శశిపుష్కరిణిన్. 118

సీ. దరసముదళసముద్గతనాళసితకంజగణములు పుండరీకంబు లనఁగ
నురుమీనమత్తరం ధ్రోత్థితానధారానికాయంబులు ప్రకీర్ణకంబులనఁగ
రయశాలిమారుతప్రచలత్తరంగజాలము లుత్పతద్బహులహారు లనఁగ
నంబుపూరాంతరబింబితజలకదంబంబు ఘనాఘనౌఘం బనంగ
సమదకవిరాజహంసచక్రములుచేరి, సతతము భజింపఁ దీర్థరాజప్రసిద్ధి
నెఱపునీచంద్రపుష్కరిణీసరోవ,రంబు వినుతింప శక్యమే బ్రహ్మకైన. 119

క. సతిఁగనునీసరసియుదూ,రతరక్షితిఁ జూచితే భరద్వాజమహా
యతిభవనం బతిభువనం,బతినవనంబునకుఁ బాత్ర మై కనుపట్టెన్. 120

సీ. కలికాలవిప్రసంగతపలాశశ్రేణిఁ బటుశిలీముఖములపాలు సేసి
నిర్గళత్స్మధుమదోన్నిద్రపున్నాగాళి ధీరాశుగశ్రేణిఁ దెరలఁ జేసి
నిశితకంటకశరాన్వితమన్మథస్ఫూర్తి సమితమహాజిహ్మగముల నలమి
చటులశాఖాగదాసాంద్రశారికదళంబులఁ బత్రముఖసమాకలనఁ ద్రుంచి
చతురగుణయుక్తధర్మసంసక్తిఁబొదలి, బహుమహామహసన్నాహభాసితమగుచుఁ
గనుము చెలి కాఁడమునితపోవన మొనర్చు,వలసినిలిచినగతిఁదపోవనముదనరె.

చ. అలయజుఁ డాకసంబునకు నాదట నేమియు లేమిఁ బ్రాపుగా
నిలిపినకన్నగంబములనీటుల సధ్వరధూమముల్దగ
న్నలినపదుండు మానులసముక్షమునన్ శుచి యాట నాతనిం
బాలయుక పాసి పోయెడుతమోగుణపుంజము బోలె నిచ్చలున్. 122

సీ. పుండరీకముల పెంపునఁ బొల్చుసారంగ మూహింపఁగా నిది యోగ్య మనఁగ
నలరుపంచాననైకాప్తినాగశ్రేణి యరసికాంచిన నిది యర్హ మనఁగ
నకులానుబంధసంధానంబుఁ గను చక్రి దర్శింప నిది యుచితం బనంగఁ
బరఁగుఁ గౌశికయుక్తిఁ జిరజీవివర్గంబు తలఁచిచూచిన నిది తగు ననంగ
విషమసాయక యిచ్చటివిబుధవర్య,లలఘుతరశబ్దశక్తి నాత్మార్థగతవి
రోధములుమాన్చి మనుప నారూఢమైత్రి,యావహిల్లుటచిత్ర మేయహోరహంబు.

గీ. ప్రోడినీసత్తులై కరకాభిరాములై యనంతపదాధీశులై నితాంత
వారితాహంకృతులు నై సువారలిచటి,మునులు దఁ బోసిచూచినఘనులుగారె.

చ. కళికలు చాలఁ జాలుకొనఁగాఁ దగుపాళెలఁ జాలుకీలకాం
చలములు నిండ ముత్తియపుజల్లుల మొల్లమిసూపఁ బూగముల్
వెలఁగెడుఁ గంటె శంబరవిజేతృకశాసనసుస్థితాత్ములై
యలరెడుమానిరాజులమహాతపవారణరాజులో యనన్. 125

సీ. శ్యామలు సౌరభ్యశాలిమధూళిచేఁ దైర్థికావళికిఁ బాద్యము లొసంగఁ
గొమ్మలు పాకానుగుణఫలప్రతతిచే నభ్యాగతులకు నాహార మిడఁగ
లతకూన లనిలలోలప్రవాళములచే వైదేశికులకు వీవనలు విసర
మహిళలు కుసుమకోమలదళశ్రేణిచేఁ బాంథసంతతికిఁ దల్పములమర్ప

ఘనరసాశయపద్మినుల్ కలితభృంగ,ఘోషభాషల నతిఘులకుశల మమగ
నంగసంభవ నిర్భరు లగుచు నిచటఁ,దపము సలిపెడుతాపసోత్తములఁగంటె.

సీ. అజిరతోరణములకై యుంచితినిజుమీ యతివ నీపీచిగు ళ్లలమఁబోకు
మగ్రవేద్యర్చనకై యుంచితినిజుమీ యబల నీ వీమొగ్గ లంటఁబోకు
మజ్జనాభసపర్యకై యుంచితినిజుమీ కొమ్మ నీ పీవిరు లోయఁబోకు
మతిథిసంతర్పణకై యుంచితినిజుమీ తరుణి నీ వీపండ్లు దడవఁబోకు
మనుచు నొండొరుఁ బలుకుచు నలసగతులఁ
గౌను లసియాడఁ గుచములు గదలఁ గురులు
చెదరఁ బనఁటులు మూఁపునఁ జేర్చి లతల
కర్థి నీరార్చుమౌనికన్యకలఁ గంటె. 127

వ. మఱియు నీవనంబు నీవనం బుపోవర్ధితశంబరం బైశంబరప్రవాహంబులీల విహారమాణహంసం బై హంసబింబంబులాగున వశీకృతగోప్రచారంబై గోప్రచారంబుంబోలె నవలంబితవృషం బై వృషపట్టనంబుకై వడిఁ బూర్ణసుమనోజాతి యై సుమనోజాతిచందంబునఁ బవిత్రితగోత్రం బై గోత్రధరుకారుణ్యంబుకేవ దేవదత్తామృతం బై యమృతాకరంబుతీరున ననంతసముద్భూతోత్కలికం బై యుత్కలికలు సుమధూళిపరంపరలఁ గురియ సుమధూళిపరంపరలు కదళికల నెరయఁ గదళికలు విమలస్థలసారసవనంబుల మొరయ విమలస్థలసారసవనంబులు శిఖికలాపంబుల మురియ శిఖికలాపంబులు మరున్నికరంబుల నొరయ మరున్నికరంబులు పున్నాగవర్గంబులఁ బొరయఁ బున్నాగవర్గంబులు కుసుమభారంబుల విరియ సిరి యొసంగెఁ గనుంగొను మనుంగుఁ జెలీ! యన ననవిలుకాఁడు తత్తపోవనంబు సొత్తెంచి. 128

— మదనసైన్యము భరద్వాజునిగదియుట. —

సీ. సహకారసహకారసాంద్రలతావృతాభోగయాగగృహాళి పొసఁగుచోటఁ
గరకాంతకరకాంతరరసార్ద్రభూమిభూమానిమానితతరు ల్మలయుచోట
ఘనసారఘనసారకలితానిలాకులాళిందకుందరసంబు చిందుచోట
వనజాతవనజాతవలితాపగానుగానేకకోకధ్వను లెసరయుచోటఁ
గేళికాశాలికాయితోత్తాలసాల,పాలికాశాలికాసారపద్మసద్మ
ఘూలికామాలికామదోత్తుంగభృంగ,బాలికాడోలికారతు ల్పరఁగుచోట.

గీ. తొగరువన్నె గుజ్జుచిగురుమామిడినీడఁ, జేరి కేలఁ బూలకోరికోల
మెఱయఁద్రిప్పుకొనుచుఁ బెఱ[1] కేలఁదియ్యవి, ల్లూఁతగాఁగ నిలిచియుండుటయును.

సీ. నిడుచాలు వెనుచాయ నడకనిద్దపుఁదేఁటిగమి వీరజడలతో గంధవహుఁడు
చెలువంపు మైకప్పుజిగిసురమావింతవగజగబిరుదుతో మృగధరుండుఁ
జొకరంపుఁదుదిఱెక్కసోఁకుపుప్పొడిరేకపసుపుఁబావడలతోఁ బక్షి[2]కులముఁ
దొగరువన్నియమావిచిగురుమొత్తంబుక్రొంబగలుపంజులతోడమాధవుండుఁ
బ్రకటగతి వచ్చి యహమహమికల మాక
మాక యుత్తరు వనుచు సంభ్రమ మొనర్ప
వారిఁ గరుణార్ద్రదృష్టిచే గారవించి
మునివరుని మీఁద సెలవిచ్చి పనుపుటయును. 131

ఉ. చొక్కపుఁబువ్వుఁజొంపములసొంపున భ్రమ్మరులు విఱ్ఱవీఁగ నల్
దిక్కుల సావితావి నెలదేఁటులపాటల నీటుమూపెఁ బ
ల్పక్కుల కాకలీకలకలధ్వని మీఱెఁ జకోరకోరికల్
నెక్కొనఁ బండువెన్నెలలు నిండె యథోచితవృత్తి నయ్యెడన్. 132

క. కనుఁగవ మోడ్చి నిదిధ్యా, సనతత్పరుఁ డగుచు మస్తచంద్రసుధాసే
చనమునఁదనుఁదానెఱుఁగని, మునిఁ గనుఁగొని యేముదాముముందనికడఁకన్.

సీ. ఉడురాజు నిజనిశితోత్తాలకిరణసంఘము పేరిబలుచివ్వఁగడలఁజిమ్మి
మధుఁడు శాఖాన్యోన్యమర్శననిష్పతజ్జాలకావళి పేరి ఱాలఱువ్వి
పవనుండు పేఱంబువాఱి గంధాయాత భృంగనిధ్వానంబు పేరఁ బిలిచి
శుకపికాదులు గరుత్ప్రకటధ్వనులపేర వివిధవాద్యంబుల రవళిఁజూపి
కేశవపదాబ్జచింతారసావేశయాంత, రాళగతమానిహృదయశుండాల మవశ
మగుట వెలిఁ దార్పఁగా లేక హత్తియిట్టు, లమితనిజశక్తిమీఱఁబోరాడునపుడు.

సీ. తమ్ముఁబైకొనుకన్నుఁ దమ్ముల శ్రుతు లవతంసాళి రుతి పేరఁ దఱచుదూఱఁ
గరకంజరమణఁ గంకణము లంతర్మణి స్వనముల పేర నెచ్చరికఁ దెలుప
ఘనతరస్తనభారమున కుల్కి లేఁగౌను మొలనూలిరొద పేర మొఱలుపెట్ట
నడుగుఁదామరలకు హంసకంబులు చిఱుగంటమ్రోఁతలపేర గతులు దెల్ప
నడరు చంద్రకళాభిధానాప్సరోల, లామ లావణ్యవైభవాలంక్రియాభి
రామ యామన్మథునియగ్రసీమ నిల్చి, చిత్తగింపుము నన్నని సెలవుఁ బూని.

---

1. చ-చేత. 2. చ-గములు-ట-బలము.

క. మానిసిఁడ కేగె నతఁడును, మానస మానంగబలసమాగతివలనన్
ధ్యానంబు వదలఁ గాంచెన్, నానాదిక్కులను దక్షిణంబున నదియున్.

గీ. చెలులు సేవింప రత్నకాంచికలు మెఱయ, నల్లనల్లన[1]నతని డాయంగనేగి
గహనమునుసీటునుశిఖంబుఁగలికితనము, నారజంబును మెఱయఁదదగ్రసరణి.

సీ. తరులకోయ్యాన నిక్కిచిరులందు నెపమున బాహామూలద్యుతుల్ప్రయులువఱచి
ముంజేతిచిలుకకు ముద్దిచ్చు నెపమునఁ దావి కెంజిగురాకు మోవి సూపి
చెమటలార్పమలంచి చెఱఁగూను నెపమునఁ నిఱిగుబ్బచనుదోయి మెఱుఁగుఁబుచ్చి
యలులు మోమునఁ జేరమలఁగెడు నెపముననను వాలుఁగొప్పుగన్గొనఁగఁ జేసి
కినుక నుడిగంపుఁజెలి నల్గి కను నెపమున
గొనబు నెలవంకబొమల జంకెనలు దెల్పి
యనుఁగుబోటులతోఁ గూడి యామ్య గాలి
సముచితవిలాసముల డాయుసమయముననను. 138

శా. కేలంబంగరుగచ్చుకోల బమరన్ గీర్వాణబాలామణుల్
శ్రీలీలావతిపట్టికట్టికల వారింబోలి తజ్జైత్రవి
ద్యాలాలిత్యము లుగ్గడించి మృదులాలాపంబులం బాడుచుం
గోలాటంబులు వైచి రాయతి తమిం గుంర్నం గటాక్షింపఁగన్. 139

క. మలఁచి వలమూఁపుపైఁ గ్రేల్కలిపిన పాదంబుమీఁదఁ గోమరగులికుచం
బలఘూర్ణాళాంభోరుహా, తలకర్ణకఁ దెగడనొకతె తాండవమాడెన్. 140

[2]గీ. పాంథమృగయుకుఁ జనుఁనుపజ్జఁ ద్రిప్ప
భక్తమయుదండబర్హాతపత్ర మనఁగ
మెఱుఁగుమొయిదీఁగ వలగొనఁ దూఱుము బొదలఁ
దెలిపగొకతె బిఱబిఱఁదిరుపుగట్టె. 141

గీ. తముఁ గలసి యష్టభూతు లింతకును గొనరు
వేల్పు లని తెల్పుగతి బొటవ్రేల నెనయఁ
దర్జనిఁ జెఱగుఁ లించి తక్కువ్రేళ్లు
మించి నిక్కంగ దేశినటించె నొకతె. 142

---

1. క-మాని. 2. ఇదియుఁ గ్రిందిగీతమును ట-లో లేవు.

మ. ఉరుభోగోన్నతి మారుతాశనులు సొంపూనన్ శిలాను గ్రహిం
గరఁగ న్నిర్వికటపా ప్తి నిశ్చలతరు ల్గాఢానురాగాంకుర
స్ఫురణం బొందఁగ హంసరాజగతి నొప్పు ల్దప్పఁగా నొక్కసుం
దరి గీతంబులు పాడె నాత్మహృదయోత్సాహానుకూలంబుగన్. 143

చ. అరుమఁగఁ జంద్రరేఖ యట నచ్చటె కన్గొనినట్టు లందియల్
మొరయఁగ మేను సోలఁ గుచము ల్పొదల న్నెఱివేణి జాఱఁగా
సరభసవృత్తి నేగి యొకసంజఁగి క్రొవ్విరి మొగ్గ సిగ్గునం
గరకమలంబు సాఁచి కయికానుక గాఁగ నొసంగి యత్తఱిన్. 144

గీ. ప్రసవబాణుని నీయింటి బంటుగాఁగ, నిలువఁ జేసెద ననుచు నందియమదిఁజా
నానయిడి చాల నమ్మింపఁబూనినట్టు, లస్మునీంద్రుని పాదంబులంటి మ్రొక్కె.

ఉ. మందసమీరలోలలతమాడ్కి నొకింత వడంకు నూనుచున్
ముందఱ కేగి యాజటిలముఖ్యుని డాయఁగఁ గొంకి డెందమున్
డింకువడంగఁ జేయుచు వడిం బురికొల్పఁగ బుజ్జగించుచున్
టెం దరళస్ఫురతుల్యచతటీఘటితాంజలి యై నయంబునన్. 146

సీ. తోడుకుబాబాకాతుజడదాల్పువాడనిపూ వేలతాంగులపుట్టినిల్లు
జేజేలకఱవు మాన్చినవదాన్యునిగన్న వనధి యే లేమలజననసీమ
మున్నీటనిల్లటంబువసించు దొరయూను కాండ మేకాంతలఁగన్నకడుపు
వెన్నుపొకిటిట్టిమ్మినున్న వేలుపుమానసం బే వెలందులజన్మభూమి
నలువతలకోరగలు మేటినెలవు మొదలు, [1]గాఁగలపదంబు లేసీలకచలయునుకు
లట్టియచ్చరకులమునఁ బుట్టినట్టి, దాన ననుఁ జంద్రకళయండ్రు మానివర్య.

సీ. కమనీయతరగానగాంధర్వలాస్యతాండవకలాదూష్టిఁ బ్రౌఢ నగుదాన
సకలసౌఖ్యముల కాస్పదమైన దివినేలు బలభేదిసవిధంబు కొలువుచెలువు
చిత్రరేఖా ఘృతాచీ ధాన్యమాలినీ రంభాదిసతులు నాప్రాణసఖులు
శ్రీరంగనాయకు సేవింప నిటకు నిచ్చలు రాకపోకలు సలుపుచుందు
నిన్ను సేవింపవచ్చితి నేఁడు దివ్య
మానివర తావకాలోకమహిమవలన
నలఘుసాత్త్వికభావంబు గలిగె నాకుఁ
దలఁపెఱిఁగి నన్నుఁ గరుణింపవలయు ననుడు. 148

1. చ-గాఁగనచలంబు.

క. కదలక మెదలక పైపైఁ,బొదలెడు గాంభీర్యధైర్యములతో యతి యు
మ్మదవతిఁ దదనుచరుల న,య్యదనం గైకొనక యచలుఁడై యుండుటయున్.

సీ. చవిమెఱుంగవుగాక యవుదలచంద్రామృతంబుతో య్యాలియధరంబుసరియె
విన నెఱుంగవుగాక విశదనాదానుభావంబు పైఁదలిమణితంబుసరియె
తగ నెఱుంగవుగాక యగణితాసననిబంధము లింతిసురతబంధములసరియె
తలఁ పెఱుంగవుగాక దహరోద్గతారవిందమ్ము భామినివదనమ్ముసరియె
కానఁ దనుయోగమునకు సమాన మగునె
కానఁ దనుయోగమునఁ జెందఁగలసుఖంబు
మదనుమత మింత తలపోసి మాని యింక
మదనుమత మాత్మ వదలక మనఁగదయ్య. 150

ఉ. తేరకుఁ దేరఁగా భవదదృష్టవశంబున నేఁడు చెంతకుం
జేరిన మమ్ము గారవముసేయ నెఱుంగవుగాక యాత్మలో
నారసిచూడు మేమిఫల మందుట కుంకువలై తనర్చునో
ధారిణిఁ జేయుజన్నములు తాపసవృత్తులు వీరకృత్యముల్. 151

సీ. ఏడాకులనఁటుల నెనయుక్రమము గల్గ బూది నెమ్మేయినిండఁ బూయనేల
వైణవమాత్తికవ్రాతమ్ము గలుగంగఁ బటికంపుఁబేరుఁ జేపట్టనేల
పూచినగురివెందపాదరుటింములు గల్గఁ గాఱాకుగుడిసెల దూటినేల
మృగనాభికాగళన్మృగనాభి కలుగంగ బిల్లవేలిమిబొట్టు వెట్టనేల
[1]జడనుబూని కటా సదసద్వివేక,చాతురి మనోజ్ఞమునఁ బూనవైతిగాక
తెలియనేర్చిన నీకానఁగలిగినవియె,యరసిసుఖియింపఁగారాదె సరసులకును.

మ. అనుధావద్వైరహంసమండలము మాయానంబు దాస్యావలం
బనసోత్కంఠవనప్రియప్రకరము ల్మాపాట లింతేల మా
యనుఁగుంబ ల్కనుభాషమాణశుక మాహాయిట్టిమాబోంట్లకా
తనరీతూరుచిధార క్రమమె భరద్వాజా నినుం బైకొనన్. 153

క. కిలికించితలీలాగతిఁ, దిలకింపవు మృదుమదీయదేహాసక్తిం
బులకింపవు లేనగవులఁ, జిలికింప వి దేమి ఱాఁతఁ జేసిరె నిన్నున్. 154

క. అని చంద్రరేఖ యీగతి,మునిపతిఁ గొసర న్విసంతమున్ఘుఖ్యలు గడిమిన్
మొనసి తమతమకతమకం,బునఁ గదియుచు మరున కేదియెపోసం దనినన్.

1. చ-ట-జడత

ఉ. కాయజుఁ డల్లిపూబొమిడికం బిడి గేదఁగిఱేకుబాఁకుదా
రా యమరించి కల్వలజిరావయి లేఁజిగురాకుచొక్కపుం
జాయల జాళువాకమరు చాల బిగించి ద్విజాళి మ్రోల జే
జే యన మందగంధవహశీతకరాదులు సందడింపఁగన్. 156

ఉ. తెక్కల తేజి నెక్కి ననఱేకుమిటారపువంకి సూటిగాఁ
జెక్కి బళీ యనం దరటునేసి ఘడాఘడి రెండువీథులం
జకరుఁగ నూఁకినం జెమట జాఱ నొకించుక వన్నె పోఁకినం
ద్రొక్కినచోట్లు ద్రొక్కనిమరుం గని పల్మఱు మస్తరించుడున్. 157

ఉ. తోడన నూఁకె మల్లెనవతూపులఁ గూడఁగ నేసి మర్మముల్
గాఁడఁగ మొల్లపూగొఱికలం జుఱుకంటఁగ నొంచి తమ్మిపె
న్గేడెము చాఁటుచేసి తొవనేజముకొల్దికిఁ గ్రుమ్మి దిక్కుల
ల్లాడఁగ జాజిపూసబళ మంది ఘనధ్వని మీఱ నార్చుచున్. 158

ఉ. పూవిలుకాఁడు కీరహయము న్మని నంటఁగఁ దోలి నిల్పి తాఁ
బావడ లూఁది త్రొక్కి పరిపాటిగ ముందఱ సాఁగి నిక్కి ముం
జేవడిఁ జూఁపి యాఘునిచిత్తము లక్ష్యము చేసి వైచె గా
త్రావళి నిర్గళన్మధుపరంపర నెత్తురు వోలెఁ గ్రమ్మఁగన్. 159

క. మారుం డంతటఁ బోకస,దారుణగతి మించుమావితలిరాకుఁగత్తా
చూరిఁ గొని నఱకి పచ్చని,వారువముం డిగ్గి కదియ వచ్చి కడంకన్. 160

క. పేరెంబువాఱి హల్లక,కోరకకుంతంబుఁ గేలఁ గొని భీషణహుం
కారంబు మీఱ నదలిచి,క్రూరత నమ్మానిమది చుఱుకుఱనఁ బొడువన్.

గీ. అంబరాంచలభాగదృశ్యంబు లగుచుఁ
దనరుతత్కాంతపృథుపయోధరము లపుడు
లలితనవచంచలాలోకములఁ బెనంగి
పొదలి యూహాంసుఘనతమస్ఫురణ మడఁప. 162

సీ. అడరి జాలైనఘర్మాంబుపూరంబుచే వదలఁజాలనిధృతి వదలిపోయె
దట్టంబుగాఁ బర్వనిట్టూర్పుగాడ్పుచే నెడల నేరనిశీల మెగసిపోయెఁ
బెనఁగొని యుందంద యొనయుకంపంబుచేఁ జనలేనిమార్దవ్యంబుజాఱిపోయె
వడిఁ బట్టు లేక వెల్వడుపులకాళిచే విడువ నోఁపనిలజ్జ [1]విడిచిపోయె

---

1 చ. ట - వీటిపోయె.

సకట యింతటిలోనె యొండొకటి మీఱి
తత్తఱము మోహమును దిట్టతనము గాఁగ
సఖులవారాసులు వెఱగంద నపుగుదెంచి
ధరణీతలనాథ మునిఁ గఱకటి యొనర్చె. 163

క. అతనుశరవర్షధారా, హతి నిట్లు మహాజడాశయుం బవిసిన నా
యతి యతులబోధసేతు, ప్రతినవయత్నమున నిల్పి పటువిస్మయుఁడై. 164

మ. తనవిజ్ఞాననిరీక్షణస్ఫురణ నత్యంతంబు నూహించి త
ద్వనితాసన్నిధిదోషరోషభరనృత్యద్భ్రూయుగాభీలుఁడై
ముని[1]కన్దోయి మిడుంగుఱు ల్గురియ సంభూతశ్రమాంభోనిగుం
భనగర్జాయుతవాఙ్క్రియార్భటి జనింపం గంపమానోష్ఠుఁడై. 165

ఉ. త్రాస మొకింత లేక సవిధంబునఁ గారులు పల్కెదేల యో
సోసి మదాంధురాల తలపోసి భవ[2]న్నుతజాతిగర్వరే
ఖాసముదగ్రవై భవవికారకము లిష్ట యడంతు నంచుఁ జే
రీసువడి న్శపించె నల యింతి నరాంగన వై జనింపఁగన్. 166

క. ఈకరణి నమ్మహర్షివి, భాకరునెఱిమినుకుల న్నవబంధురకాంతి
శ్రీకామనీయకవిశా, న్యాకృతి యై చంద్రరేఖ యడలుచుఁ జనియెన్. 167

సీ. అరయ ననగ్నికుండాహుతిస్తోమమై బూదిఁ గూడె సుమాస్త్రుఁ బోఁడిమెల్లఁ
జర్చింప నూషరస్థాపితబీజ మై ధూళిఁ గూడె సమీరుహాళి యెల్లఁ
జింతింప వఱదఁ గూర్చినచింతపం డయి నీటఁగూడె హిమాంశునేర్పు లెల్లఁ
గనుఁగొన నడవినిగాచినవెన్నె లై చెట్లఁగూడె వసంతుచెల్వ మెల్ల
నకట చిత్రాతిపై వాన యగుచుఁ జెదరి పఱచె నలువంకలకుఁ బక్షిబలములెల్ల
విశ్వభూనాథ విను పదివేలమంది, మన్మథులకైనవానిదె మల్పవశమె. 168

క. ఆవేళ వాలుఁ బోవం, గా వైచి లతాంతశరుఁడు కట్టా మునుము
న్నీవిధ మరయక [3]యిట్టులు, రావచ్చునె మనసుకావరంబుననుచున్. 169

క. వెనువెనుకకుఁ జని యొకపూ, చినసంపెఁగకొమ్మ రెండుచేతుల నవలం
బనముగ నొనరిచి పదముల, నెనయించినదృష్టి మస్తమెత్తక తనలోన్.

---

1. క-కన్దోన. 2. చ-భవత్సురజాతి 3. చ-ట-నాకున్.

క. సమదగతినిగిడిచిన వ్యర్థములై శతధాసహస్రధా నానాళీ
కములెల్లన్ జనియెను దళి, తములై చట్రాయి వానితలఁపు కటకటా. 171

సీ. [1]వెలవెలఁ బాఱెడు వేళఁ జెన్నట్టు క్రేవలఁ బట్టికుందెడువాని నమ్మి
వనములపాలయి మునుపున్నదళముల వదలి జాతికిఁ బాయువాని నమ్మి
తనరాకపోకలు గననీక మాయమై పడఁకుచు వర్తించువాని నమ్మి
కొమ్మలలోఁ డాఁగి కొదికి లావులు డాఁచి వంచినతల లూఁచువానినమ్మి
కటకటా దేవసభలోనఁ గండక్రొవ్వు
మాటలాడితిఁ గాని యీపాటివారె
యీ పుత్రులనియెంచలేనైతి [2]నపజయంబు
పాల్పడితి నంచుఁ జనియె నాభావభవుఁడు. 172

క. ఆచంద్రరేఖయును ద,ద్వాచంయమిశాప మొనసి వసుధ నవసుధా
రోచి యగురుక్మబాహు, క్ష్మాచక్రేశ్వరునకుం గుమారిక యయ్యెన్. 173

శా. ఆవృత్తాంత మశేషము న్విబుధలోకాధీశుఁ డేతద్వయ
స్యావాక్యంబుల నాలకించి సురకార్యాపన్న కావేలుపుం
బూవుంబోణికి ధాత్రి నామరపురీభోగోన్నతు ల్గల్గఁ జే
తోవీథిం గరుణించి పంచె శుభగీతు ల్నేర్పఁగాఁ దుంబురున్. 174

శా. ఆగంధర్వుఁడు వచ్చి నాఁ టగోలె నత్యానందసంయుక్తుఁడై
రాగప్రౌఢిమ మీఱ గీతములు నేర్ప న్వేడ్క నే నమ్మహా
భాగుం గన్గొన నేగి యిప్పు డతఁ డంపన్సహ్యకన్యాతటీ
భాగావాసుని రంగనాయకుని సంప్రార్థింపఁగా నేగెదన్. 175

క. అని పలికి విజయలోలువ, చనముల నాచంద్రభానుచర్య సకలమున్
విని ముని సమ్మదయుతుఁడై, పనివినియెం బిదప సత్యభామాసుతుఁడున్.

మ. సకలక్ష్మాతల[3]పుణ్యగణ్యపురవీథీపాదక్షుఁ డైనట్టిమహా
నికులోత్తంసను వాగ్విలాసములు విందే నెచ్చెలీ యెందు ని
ట్టికృతార్థుం గనుఁగొంటిమే యితనిసాటిం బల్కనిద్ధాత్రిలో
నొకసిద్ధుండును లేఁడు పో యనుచు నత్యుత్కంఠితస్వాంతుఁడై. 177

---

1. ట-వెలవెలఁబాఱుచు వేగఁబెనఁగట్టుక్రేవంబడి. 2. చ-ట-నపయశంబు. 3. ట-చత్ర పుణ్యాపుర.

క. చెలికాని కేలునం గేల్, నిలిపి కొలిచి వచ్చు జనుల నిలునిలుఁ డనుచుం
బలుమాఱు మానిచర్యలు, పలుకుచు వేఁడ్క పువ్వుఁబందిలి కరిగెన్.

శా. గాంభీర్యాంబుధిరాజ రాజధర వాక్ప్రాణేశపత్రిప్రభా
శుంభత్కీర్తిసమాజ మాజనక చక్షుర్వై ఖరీవంచితా
హంభావాసురభూజ భూజననికాయస్వాంతభృంగావళీ
సంభావ్యాంఘ్రిపయోజ యోజకవిధాసంప్రీణితారణ్యకా. 179

క. అక్షీణయోగశిక్షా, దక్ష జగత్త్రితయసాక్షితా దీక్షిత దు
ర్లక్షచిదక్షహృదక్షను, దక్షపణక్షమఘురాపద క్షాంతినిధీ, 180

తరళము. స్వరధిరాజసదనరాజసఖముఖజనాతిభా
స్వరశిరోజనవసరోజసరసమాజసంతతా
చరితపూజ సవితృతేజ జపితృయాజకచ్ఛటా
సురధరాజ శుచిధరాజశుభసభాజనోన్నతా. 181

గద్యము. ఇది శ్రీమద్దత్తాత్రేయ యోగీంద్రచంద్రచరణారవింద వందన సమాసాదితసరసకవితారసోదాత్త దత్తనామాత్యసోదర్య మల్లనమంత్రివర్యప్రణీతంబైన చంద్రభానుచరిత్రంబనుమహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

# పరిషత్పుస్తకభాండాగారము.

## (4) వజ్రాభ్యుదయము — గ్రం. సం. 3523.

ఇది యొకపద్యకావ్యము. కవిగద్యము ప్రథమాశ్వాసాంతమున నిట్లున్నది.

"ఇది శ్రీమదుదుతరాభంగకరుణాతరంగిత తురంగముంగళ మంగళాపాంగ వీక్షణదాక్షిణ్యసమాసాదితవితతకవితావిచిత్ర కౌండిన్యసగోత్రపవిత్రాచార్యామాత్యపుత్ర సూరిగణవిధేయ నారాయణాభిధేయ ప్రణీతం బైనవజ్రాభ్యుదయంబనుమహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము," అని.

సీ. సము లెవ్వ రీసువిజ్ఞానరాశి కటన్న ప్రశ్నకుఁ బ్రత్యుత్తరంబు గాఁగ
సకలకళాప్రవేశత నీయనకు ధాత తక్కువ యనుట కర్థంబు గాఁగ
ఘనమానులై పైఁబడినభగ్నవాదులు తమకు మారుత మన్వర్థంబుగాఁగ
శమదమాదిసమస్తసద్గుణస్థితి కాంధ్రిమున పరాకాష్ఠ యౌననుట గాఁగఁ
గోనశబ్ద మేమహానూనవిభవున, కన్వయార్థ మగుచు నతిశయిల్లు
నక్కుమారకోనపార్యు నస్మత్కులా, చార్యుఁ గొలుతు వాత్సల్యజాతధుర్యు.

అనుపద్యముంబట్టి యిక్కవియింటిపేరు కోనవా రని తేలుచున్నది. తండ్రి యాచార్యామాత్యుఁడఁట.

సీ. వేదాంతవిజ్ఞానవిషయ మేమహనీయుకడ నారదుఁడు చిక్కువెడలఁ గోరు
వజ్రశుంఠియు నైన వచ్చి యేఘనునొద్ద సంచికఁ బట్ట బేస్వతి తలంకు
ధృతచతుష్కళ యదంతేవాసిసంతతినుతి కనంతుఁడు వేయినోళ్లు గాంచె
నేధీరమణికవితాధార భాగీరథీరయమధురతాధార మయ్యె
యత్కృపాపాంగపాత్రుఁడనగుచుధన్యు, తన్భజించితినమ్మహోదారమహి
హారి బోమెనపల్లెకులాబ్ధినలిన, హారి నరసింహసూరి నుపాశ్రయింతు.

దీనింబట్టి కవిగురువు బోమెనపల్లె నరసింహసూరి యని తెలిసినది. ఈకవి వైష్ణవసంప్రదాయములోనివాఁడని గ్రంథమునందలి పద్యములన్నియుఁ దెల్పును. కవిత్వము చక్కఁగా నున్నది. సంస్కృతపాండిత్య మసమాన మని కొన్నిఘట్టములు సూచించుచున్నవి. ఇందలికథ, ధ్యానస్థితుండై యున్నతనతో శ్రీహరి సెలవిచ్చినట్లున్న. —

చ. హయవదనావతారమున నస్మదనుగ్రహలబ్ధవిస్తృతా
వ్యయకవితామతల్లికుఁడ వౌట సమర్థుఁడ వీవ మత్కథా
శ్రయుఁ డనిరుద్ధుఁ.... పావనిత న్వరియించువృత్తి మా
ద్వయమునకుం గుమారుఁ డయి వజ్రుఁడు గల్గెడుదాఁ గొనర్పుమా.

ఉ. ..,నయ్యనిరుద్ధచరిత్రకిం కవ, వ్రజాభ్యుదయుంబటన్నయభిధాంతర మొప్ప నొనర్పు మీకృతిన్.

అనుపద్యములంబట్టి యుషాకళ్యాణము లేక యనిరుద్ధచరిత్ర మనియును వీరికి వజ్రుఁ డనుతనయుఁడు గలిగెననియు స్పష్టమగుచున్నది. ఈగ్రంథములో రెండవ యాశ్వాసము కొంతవఱకే మాయొద్ద నున్నది. సమగ్రముగా లేదు. శైలికై కొన్ని పద్యములు.

మ. కమలాకాముకసర్వకాలపరిరక్షారక్షితాదీక్షుఁడై
విమలస్వర్ణనగేంద్రసారయుతమై పీఠాక్రియామాత్రభీ
తమృగాశేషనిశాట మై ప్రణుతచింతారత్న మై యొప్పను
త్తమకామోదకి మా కఖండశుభసంతానంబు లీనుం గృపన్.

క. హరుఁ జేరి "యన్యథా మే, శరణం నాస్తి త్వమేవ శరణం మమ త్వ
త్కరుణాభావే నాభవ, భరి పాహి త్రాహి" యనుచు బాణుఁడు మ్రొక్కెన్.

చ. హరియును బంచబాణవిశిఖాంకులుఁడై వలనొప్పనిండుచం
దురునకుఁ గప్పుఁ దెమ్మెరకుఁ దోరపుఁగోయిలకూఁత కెంతయున్
మొఱలిడు తేంట్లకుం జిలుకమ్రోఁతలకున్ మెఱుఁగుంచనికిం
గరము దలకుంచున్ మిగులఁ గాఁతియనొందుచు నుండి వేల్మిడిన్.

ఈగ్రంథము మట్టివాడలో దొరకినది.

(5) సుగ్రీవవిజయము—గ్రం. 3680.

ఇది యొకయక్షగానము. కందుకూరిజనార్దనస్వామి కంకితముగ రుద్రకవిచే రచియింపఁబడినది. నిరంకుశోపాఖ్యానమును రచించిన కందుకూరిరుద్రయయు నీతఁడు నొకరే కావచ్చును. నిరంకుశోపాఖ్యానగద్యము.

"ఇది శ్రీమత్కాళీవరప్రసాదలబ్ధలబ్ధవర్ణ వర్ణనీయకవిత్వతత్త్వధారేయ పెదలింగనార్యగర్భార్ణవపూర్ణిమాతేయ గురువరాచార్యపదారవిందమిళిందాయమానమానస సకలవిద్వజ్జనవిధేయ రుద్రయనామధేయ." అని.

ఇందలి గద్యము.

ద్వి. అని సమస్తుని పేర నఖిలేశు పేర । నిగమగోచరు పేర నిఖిలేశు పేర
కందుకూరిజనార్దనుని పేర । అంకితంబుగఁ గాళి కాంబా ప్రసాద
సంకలిత...... వెదలింగనార్యకుమారు । కోవిదవిస్తారగుణసముద్రనీర
విరచితసుగ్రీవవిజయంబునకును.

మొదటిపద్యము.

ఉ. శ్రీవిభుఁ గొల్చి శంకరు భజించి చతుర్ముఖు నెంచి వారిధి
గ్రావసుతాసరస్వతులఁ బ్రార్థన చేసి గణేశుపాదపూ
జావిధి సల్పి దిక్పతుల సంస్తవముం బొనరించి కావ్యవి
ద్యావిదులం గణించి.................. వేమరున్,

అంకితంబుగా నా యొనర్పంబూనిన సుగ్రీవవిజయంబునకు యక్షగానంబున కుఁ గథాక్రమం బెట్టిదనిన.

సీ. శ్రీరామచంద్రుఁడు సీతామహాదేవిఁ గాననంబున వెదకంగ వచ్చు
పంపాసరోవర ప్రాంతభూములయందు సౌమిత్రియును దాను సంచరింప
నావేళ సుగ్రీవుఁ డధికసమ్మదమున ఋశ్యమూకమున వర్తించుచుండెఁ
జూచి యీ ఘనుల తేజోవిశేషమునకు వెఱఁగంది మంత్రికోవిదుల కనియె
వీరు మనలను వధియింప వేషమంది, వాలిపంపున వచ్చిన వారు గాఁగ
నాకుఁ గాన్పించుచున్నది కాక యిట్లు, తాపసుల కేల శరచాపధారణములు.

దీనింబట్టి సుగ్రీవవిజయకథ యెంతవఱకున్నదో తెలిసికొనవచ్చును. ఇందు త్రిపుటలు, యేలలు, ద్విపదలు, అర్ధచంద్రికలు, ......... మొదలగు రాగతాళ జ్ఞానమునం జదువవలసినభాగ మెక్కుడుగా నున్నది. వ్రాంతతప్పులు మెండుగా నున్నవి. ౧౩ పత్రముల సమగ్ర గ్రంథము. బాపట్లతాలూకా పదుమూరులో దొరకినది.

(6) ఆంధ్రచింతామణి (వైద్యశాస్త్రము) గ్రం. సం. 3685.

ఇది ౨౨ పత్రముల గ్రంథము. ఇందు ౧౩ పత్రములు పద్యాత్మకము మిగిలినది గద్యపద్యాత్మకము. సంస్కృతశ్లోకములునుం గలవు, ప్రారంభము.—

క. శ్రీభూనీలాశ్రితయుత, శోభితనవరత్నహేమసుందరపీఠా
శ్రీభరిత వరద వేంకట, భూభృద్గ్రహవాస దానపోషణ శౌరీ.

పద్యములు బహువిధములఁ దప్పులు గల్గియున్నవి.

గీ. తైలకాథనస్యకలికఘృతాదులు, చూర్ణములు బహువిధశుద్ధక్రియలు
పరమహంసక్రియలు బాగుగా నొకకొన్ని, తేటపఱుతు నిపుడు సూటిగాను.

గీ. పరఁగఁ దంగేడురస మొక్కపావుసేరు, మూఁడుతులములపంచదారతోడఁ
గలిపి, మూఁడుదినములు సేవింప వీడు రసము.

ఈ పుస్తకములో రసవిరుగుళ్లు, మహాకుష్ఠువులు, పాండువులు, గ్రహణికవాటము, పంచగవ్యఘృతము, సర్వరోగకషాయము, శూలలకు గామతచూర్ణము, సహదేవితైలము, (శీతజ్వరములకు) మహాకుమారీతైలము, లాక్షాదితైలము, అంతర్దాహకు, కళ్యాణఘృతము, బలురక్కసతైలము, నారాయణతైలము, వాతచికిత్స, ముద్దవాయువులకు, భగేంద్రానకు, గండమాలకు, వెఱ్ఱికుక్కకఱచినందుకు, చూర్ణయోగాలు, కబ్బులయోషము, తాపజ్వరకషాయములు, గర్భిణీస్త్రీల జ్వరకషాయములు, నీరుకట్టువ్యాధికి, తాళకభస్మము, ఇట్లనేకవిధము లగు చికిత్సలు వ్రాయఁబడినవి.

దీనికి ముందుఁ మూఁడాశ్వాసములభాగము లేదు, ఇదినాల్గవయాశ్వాసము, కడపటను జాలభాగము లేనట్లు తోఁచును. గ్రంథకర్త దేవులపల్లి వేంకటనరసయ్య. ఆతఁడు గద్య యిట్లు వ్రాసికొనియెను.

ఇది శ్రీరంగనాయకప్రసాదలబ్ధకవిత్వవైభవ కాశ్యపగోత్రపవిత్ర దేవులపల్లి చిననరసన్నమంత్రిపౌత్ర శ్రీనివాసమంత్రివరతనూభవ శ్రీమహాభాగవతదాసానుదాస వేంకటనరసప్రణీతం బైన యాంధ్రచింతామణి యనువైద్యశాస్త్రము.

బల్లలకుమందు.

గీ. నరుని పేరు నొడివి నయమాను యనుచును, ములుకచెట్టువేఱు ముట్టఁబెఱికి
దూరమునను వేయఁ బాఱుబల్ల, యనుచు నొడివి రిడియు నార్యజనులు.

గీ. ముదురువెంపలివేరును విదియనాఁడు, తెచ్చిమూఁడుమాడలపొడి దిట్టపఱిచి
యందులో సురాకారంబు పొందుపఱిచి, సేవచేసిన బల్లలు శిథిలమగును.

నర్సారావుపేటతాలూకా కోనంకిలో దొరకినది. వెనుక నీచింతామణియే, ఇంద్రకంటివల్లభార్యవిరచిత మొకటి గ్రం. సం. 3527 గలదని దెల్పియుంటిమి. ఈ రెంటికిని బూర్ణప్రతులను వైద్యవిశారదులు సంపాదించుట మిక్కిలి యవసరము.

(7) వేదాంతగ్రంథము—గ్రం. సం. 3690.

ఇందు వేదాంతము సీసపద్యములలోఁ దెల్పఁబడినది. ఇది రెండుగ్రంథములు కలసి యొకటిగా నైనది. మొదటిది రహస్యోపదేశము. రెండవది ప్రణవగిరివాన

(శతకము). పుస్తకమును వ్రాసికొనినవారు పత్రసంఖ్య యొక్కవరుసనే వేసికొని పోవుచు మొదట రహస్యోపదేశప్రథమభాగమును దరువాత ప్రణవగిరివాస పద్యములును మూఁడవనాల్గవభాగములు మరల రహస్యోపదేశమును వ్రాసికొనినారు.

రహస్యోపదేశము, కవిపేరు తెలియకుండఁ జివరభాగము నెలుకలు కొట్టి వైచినవి. గద్య మిట్లున్నది.

ఇది శ్రీహనుమత్ప్రసాదలబ్ధకవిత్వ నారాయణగురుచర....రాయమాన అద్వైతబ్రహ్మవిశారద బ్రహ్మానందానుభవధురీణ వేదాంతగ్రంథపారీణ సకలతత్త్వవిద్యావిశారద పరమానందవిభవ....బైన రహస్యోపదేశం బను మోక్షగ్రంథంబునందుఁ గర్మయోగప్రవర్తనమాత్రత్రయస్నానజపతపోనిర్వర్తన ప్రకారంబును దారీమణపుత్రీమణ...సంపూర్ణము.

ప్రారంభము లేదు, రహస్యోపదేశమునందును ప్రణవగిరిపద్యములయందును గూడ భాగప్రారంభమున

క. శ్రీమత్ప్రణవగిరీశ్వర, కామాదివినాశవిభవ కారుణ్యనిధీ
　　కామితపుణ్యఫలద నిష్కామా నిరపేక్ష మోక్షకాంతాధినుతా.

అనుపద్యమే కలదు. రహస్యోపదేశము సీసపద్యములచివర మకుటము ప్రకట॥ అనిమాత్రము కలదు. ప్రణవగిరివాసపద్యములకుఁ బ్రథమపద్యమున "మేరుస మధీరభక్తమంచారవీర, ప్రణవగిరివాస ప్ర.. అని యెత్తుగీతి 3-4 చరణములున్నవి.

ప్రణవగిరివాసశతకము కవి శంభునార్యుఁడు, తండ్రి బిల్వేశ్వరామాత్యుఁడు, గద్యముం దిలకింపుఁడు.

ఇది శ్రీమత్ప్రభునిరంజనసద్గురువరప్రసాదలబ్ధకవితావిలాస వేదాంతజ్ఞాన నిర్ణయ హారితసగోత్రపవిత్ర బిల్వేశ్వరామాత్యపుత్ర బుధజనవిధేయ శంభునార్య ప్రణీ...గ్రంథంబు నన్నది ద్వితీయభాగము సంపూర్ణము.

వ్రాఁతకాఁడు మొదటిభాగము రహస్యోపదేశము వ్రాసి దీనిని రెండవ భాగ మని వ్రాసినాఁడు. ఇది యొక్కభాగమే యని తోఁచుచున్నది.

రెండుగ్రంథములలోను విషయ మొక్కటియే. పద్యము లన్నియు సీసములె రాజయోగనిర్ణయము, పంచకోశనిర్ణయము మొదలగువిషయభాగములు సమానమే. అన్నియుఁ జేరి నాలుగుభాగములు కలవు.

ఈగ్రంథమును వ్రాసికొనిన యాతనికి విషయమే ప్రధానమాటచే రెండు గ్రంథములును జేర్చి వ్రాసికొనియుండును. కవులకవిత్వము సాధారణమైనది. ఉదాహరణము, రహస్యోపదేశములో.

సీ. అమరపరబ్రహ్మమైనయోంకారంబు....
కననకారంబును గలిగె దానికి రాజసము దానను జ్ఞానశక్తి గలిగె
అజ్ఞానశక్తికి నాబ్రహ్మ యుదయించె సత్యలోకమునకుఁ గర్తయయ్యెఁ
గాన నాతఁడు విశ్వఁ గల్పించె నంతలో....నిలిచె ।
సారిది జాగ్రత్తు భోగించుచును నిరంత ।
రమును సత్తున నుండును గ్రమములోడఁ బ్రకట ॥

సీ. వేదంబులో కర్మవిధిప్రకారంబునఁ జలుపుట ధర్మ....
....శివమయం బని తలపోఁత క్షితిలోకధర్మంబు శైవులకును
జగము లన్నియు ఘనశక్తిమయం బని తెలియుధర్మంబు శాక్తేయులకును
......
క్షితియు మూఁడుమతంబులు శివమతంబు
లోనిభేదంబు జగమునఁ బూనియుండు బ్రకట ॥

సీ. పాదంబు లతలంబు పాదంబుమీఁదను వితలంబు జంఘల సుతల జాను
వులసుతలము...
పాతాళమును నాభి పరఁగ భూలోకంబు లోజఠరము భువర్లోక మయ్యె
కలయు స్వర్గము హృదికంఠ మహర్లోక ముఖమున జనలోక...
శిరమునను సత్యలోకంబు చెలఁగుచుండు
నిట్టిలోకంబు లోనరెను హితవుమీఱ బ్రణవ ॥

మిద్దిమీఁదఁ బడుగెత్తునట్లు రెండుమూఁడుకుగులలో గ్రంథపాతము కలుగుచుండుటచే నీగ్రంథమునుండి నిందుపద్యములు వ్రాయఁజాలమైతిమి.

(8) రాఘవయాదవపాండవీయోపాఖ్యానము. గ్రం. సం. 3699.

బాలసరస్వతికృత మగుత్ర్యర్థిప్రబంధము. సవ్యాఖ్యానము. ప్రథమాశ్వాసము లేదు, రెండు, మూఁడు, నాలుగాశ్వాసములు కలవు. వ్యాఖ్యాతపే రిందుఁ దెలియరాలేదు. ఒకగద్య మిట్లున్నది.

ఇది సకలకవితాస్వతంత్ర భట్టార బాలసరస్వతి మహోపాధ్యాయ ప్రణీతంబైన రాఘవయాదవపాండవీయ మహాప్రబంధవ్యాఖ్యానము.

పద్యమును దానికి వ్యాఖ్యానమునుగా వ్రాయఁబడినది. బాలసరస్వతి నెల్లవారు నెఱుఁగుదురు. ఒకరు పద్యమును దానియర్థములు నిందుఁ జూడఁదగును.

సీ. పాయక నునుగమించి యాయతి పూజ్యయశోదమగు వసుమతి సూరిజనము
వినుతి సెలఁగ లోకవిభుఁ గూడికొని యేఁగె, దివికి వచ్చి చూడ దివిజగణము.

రాఘవార్థమున—పాయక, అనుగమించి=కూడననుసరించి, ఆయతి=మునీశ్వరుఁడైనవిశ్వామిత్రుఁడు, పూజ్యయశోః=పూజ్యకీర్తియై, దమగు=ఇచ్చుకట్టడియగు, వసుమతిసూరిజనము=భూమియందలి పండితుల, వినుతి సెలఁగ, లోకవిభుం గూడి, దివిజగణము దివికి వచ్చిచూడ నేగెను.

యాదవార్థమున—పాయక, అనుగమించి=శ్రీకృష్ణుని విడిచిపెట్టకయె వెంటఁబోయి, ఆయతిపూజ్య=మిక్కిలి పూజ్యురాలైన, యశోద=మగువయశోదాదేవి, సుమతి సూరిజనము సెలఁగ, వినుతి సెలఁగ, దివిజగణము దివికి వచ్చి చూడ, లోకవిభుఁ గూడి—కృష్ణునికలసికొని, కొని యేగె=తోడుకొనుచుఁ బోయెను.

పాండవార్థమున—పాయక. అనుగమించి=సహగమనము చేసి, ఆ, అతిపూజ్య; యశః=కీర్తిని, ద=ఇచ్చునట్టి, మగున=మాద్రి యనుట. సుమతి=మంచిబుద్ధి గలది. సూరిజనమువినుతి సెలఁగ=విద్వజ్జనులస్తోత్రములు మించునట్టులు, లోకవిభుఁగూడికొని=పాండురాజుఁగూడి, దివికి=స్వర్గమునకు, ఏగె=పోయెను.

వ్యాఖ్యానము కొన్నితావుల సంక్షేపముగా నున్నది. వ్యాఖ్యానరీతి సంభాషణరీతిగా నున్నది.

ప్రతి రాక్షసనామసం॥ భాద్రపద బ. ౧౪ అంగారకవారమున పాటిబండ పిచ్చయ్యగారు వ్రాసినది. గోవిందపురములోని రాయసము వీరభద్రయ్యగారు రంగనాయకులుగారు నొసంగినది.

(9) వివిధపద్యములు—శ్లోకములు, గ్రం. సం. ౩702.

ఇందనేకవిధము లగుపద్యములు వ్రాయఁబడినవి. ప్రబంధసారము మొదలగువానివలెఁ బెద్దది గాదు. ఉదాహృత పద్యములైనను బ్రసిద్ధకవులవి కావు. కొన్ని నృసింహశతకము మొదలగు శతకములలోనుండియు వ్రాయఁబడినవి.

“చిన్మయాకార జానకీచిత్తచోర। రమ్యయోగీంద్రవరవంద్య రామచంద్ర” యనుమకుటముతోఁ బెక్కు పద్యములుఁ గలవు, పుష్పదంత విరచితము మహిమ్నస్తవము గలదు.

సీ. సరిజమిాందార్లు మెచ్చఁగ భూమి పాలించి జనులఁ బోషించు రాజాకీతాబు
గడిదుర్గములకు లగ్గలకెక్కి సాధించి శగ మెచ్చురాజభూధర కితాబు

అమగుద్రిప్ప కరాతిహంవీరులను గూర్చి ధట్టించికొనుబహద్దరు కితాబు
అర్థికోటుల కభీష్టార్థంబు లొనఁగూర్చి జగ మెచ్చు రాజభూషణ కితాబు
నిఖిలశేఖరుఁడవగుచున్నుఁ జెంది, పుష్పగంధాను రూపఁబుఁబూని మెఱసె
వాసిరెడ్డికులక్షీరవార్థిచంద్ర, రక్షితోపేంద్ర రామనాథ క్షితీంద్ర.

ప్రియవ్రతచరిత్రములోని పద్యములు కొన్నిగలవు. నర్సారావుపేఁట తాలూ
కాలో దొరకినది.

(10) సుధీరంజనము—గ్రం సం. 3799.

గోదావరిజిల్లా, కాకినాడకు సమీపమునఁ బూర్వము మహోన్నతదశ
యందుండిన నీలపల్లి పురవాసి యోగిరాల రంగనాథ కవీంద్రునిచే రచియింపఁ
బడిన శీఘ్రధారాప్రబంధము.

ఈరంగనాథకవిగారు శేషశకటశేషములపై నొకగ్రంథము వ్రాసియున్నారు.
ఈయాశుప్రబంధము నొక్క దినమున రచించెనఁట. ఇందలికథ ధ్రువ
చరిత్రము.

శా. భారద్వాజసగోత్రుఁడన్ ఘనయశోభవ్యోగిరాలాన్వయ
క్షీరాంభోనిధిజాత వేఁకసుమన శ్శీతాంశుపుత్రుండ శ్రీ
శ్రీరామాంఘ్రి సరోరుహైకరతుఁడన్ శ్రీరంగనాథాఖ్యుఁడం
బ్రారంభించితిఁ గావ్య మొక్కటి యొనర్పన్ శీఘ్రధారాగతిన్.

ఉ. వేంకటరామపండితుఁడు విద్వదభీష్టసవార్థదాసని
శ్శంకమతిప్రకాశ కృతసంస్కృతకావ్యసుధాభిషిక్తతా
స్త్రాంతులు ప్రేమ నన్నుఁ గని యానతియిచ్చిరి యొకనాఁటికిం
గొంతక కావ్య మీవు సమకూర్పు మటంచు సుదుష్కరక్రియన్.

క. నను నమ్మికాదు విబుధులు, వినుఁడు ముకుందాంఘ్రియుగము వేంకటరామా
ర్యనిరంతరకరుణ మనం, బున నమ్మి కృతిన్ రచింపఁ బూనినవాఁడన్.
అని తనప్రతిజ్ఞఁ దెలిపికొనియెను.

క. ఘనుఁ డగువిదురుఁడు మైత్రేయునిచే ధ్రువచరిత వినఁగ నుత్సుకుఁడై వేఁ
డిన మునికులపుంగవుఁ డా, తనితో నిట్లనియె నతులతాత్పర్యమునన్
అని కథం దెలిపినాఁడు,

ఇది శ్రీనీలపురిధామ సీతారామకరుణాభూమ సమాసాదితకవితాధార
శ్రీమద్యోగిరాలాన్వయ క్షీరపారావారపూర్ణిమారాజ వేఁకసుధీరాజకుమార విన

యవిద్యాసనాథ రంగనాథప్రణీతంబైన సుధీరంజనంబను నాశుకృతప్రబంధంబు సర్వంబునేకాశ్వాసము. ఇది యిక్కవినాథుని గద్యము.

ఆసుప్రబంధమైనను నిందలిపద్యముల రెండింటిం దిలకింపుఁడు.

చ. శ్రుతిపథసీమఁ గన్గొనియుఁ జూడ దహా నను నీమలోచన
ద్వితయము నీవు దీని కుపదేశముఁ జేయఁగరాదె లక్ష్యప
ద్ధతి నని రాఘవుం డలుక దప్పఁగఁ జేయుచుఁ బల్కఁగా దర
స్మితము వహించుమైథిలి వసించుత నాదుమనోంబుజంబునన్

ఉ. ఏమని చెప్పవచ్చు ధరణీశ్వర యాలలితాంగి మోముతో
సోముఁడు సాటిరాఁ డనినచోఁ దదపాస్తనికాన మైనయా
తామరసంబుపోలునొకొ దంతికరంబులు సాటిగాంచ న
క్కోమలియూరుయుగ్మమునకుం దదపాకృతరంభ లొప్పునే.

క. అసమాంబక కుసుమాయుధ, విసరపరిస్ఫూర్జ్జవగుణవిరహాతిశయ
ప్రసభప్రశాసనంబై, వసుధాస్థలిఁ గారటివాకపరవం బడరెన్.

మాపాటి శేషాచార్యులుగారు వ్రాసినది, కాగితపుఁబ్రతి.

(11) ప్రగడపువారికందములు. గ్రం. సం. 4110.

ఇది యించుమించు 80 కందపద్యములు గల తెనుఁగు నిఘంటువు. ఈ ప్రగడపువా రెవ్వరో యేయూరివారో తెలియదు. సంపూర్ణగ్రంథ మెంత యుండునో యెఱుఁగరాదు. ఆంధ్రనామసంగ్రహముఁ, దచ్ఛేషములవలెనే కవి వ్రాసియున్నాఁడు. వర్గవిభాగము లేదు. కొన్నిపద్యములు చిత్తగింపుఁడు.

క. కోణి గన్న మదనకైనా, సోనరుం గోపానసికిని నుర్వీస్థలిఁ జూ
రనఁగ వలీకంబున కగుఁ, గనదుస్త్రీలాంబుజాక్ష కౌస్తుభవక్షా.

క. నెరి సూడిగంబు ముంగా, మురి పోచీ పారిహార్యమునకుం బెరుం
గరమన బటువన నూర్మిక, ధరణిం బాసికము పారితథ్యంబు హరీ.

క. కణిక కలము పేనా యనఁ, గను దూలిక యండ్రుఁ బేరు కంపం బనఁ గొం
కన వణఁకు వడఁకు చెల్లును, ఘనతప్తసువర్ణచేల కరిరాట్పాలా.

క. దళ మనఁగా నిబిడంబును, దళ మనఁగా సేనపేరు దనరుచునుండున్
గల మనఁగా దూలికయును, గల మనఁగా దరణమునకుఁ గంజదళాక్షా.

క. సింగిణు లనఁ జాపంబులు, సింగిణు లనఁ గోళకములు చెలు వలరంగా
సంగళ్లనంగ మండులు, సంగళ్లనఁ గాను విపణు లంబుజనేత్రా.

అపూర్వములగు కొన్ని యచ్చతెనుఁగు పదముల క్రిందఁ బూర్వనిఘంటుకారుల మతానుసారముగ సంస్కృతపదములు వివరింపఁబడియున్నవి. భాషాభిలాషుల కవి చాల నాధారములు. ఇట్టిదియే చౌడప్పసీసము లని ముప్పదిసీసములు గలవు. అదిపూర్తిగ్రంథము. అదియు నీరీతియే దీనికంటె విలక్షణమైనది. ముందు దానింగూర్చి వ్రాయుదము. శుద్ధప్రతి వ్రాయవలయును.

(12) చాటుపద్యముల పుస్తకము. గ్రం. సం. 3597.

ప్రాఁతపుస్తకము. కొండపల్లి పీఁచుకాగితములమీఁద వ్రాయఁబడినది. వ్రాఁతమోడి హైదరాబాదుప్రాంతముది. నీటిలోఁ బడియో వానకుఁ దడసియో సగముభాగము (అన్నిపుటలలోను) వ్రాఁతయుడుకొని పోయినది. నూఱు పద్యము లుండును. ఇందుఁ గొన్నిపద్యములు.

గీ. ధార్తరాష్ట్రసమూహంబు దక్షిణాశ కభిముఖంబయి చనుసమయంబునావె
ప్రబలపాండవహంసలు పట్టు వదలి, యచ్చ్యమానసవైకల్య మనుభవింప.

ఉ. నాఁటికి మోక్ష మిత్తునని నమ్మ మటంటివి నాఁటిదాక నా
కూటికిఁ జీర కేదిగతి కూరిమిపుత్త్రులఁ బ్రోచుటెట్లు ము
మ్మాటికిఁ జేరఁదీసి నను మన్ననచేసియు నన్నమిచ్చినన్
నాఁటికి మోక్షమిత్తువని నమ్మఁగవచ్చును నిన్ను మాధవా.

చ. సిరిచెడి దెంచి మానవుని జేసినయప్పుడె పాపపానిగా
నిరవుగ లచ్చిసోదరుఁడు నేఁపున శ్వాసము లై చనిక్కఁగాఁ
బొరిఁబొరి నేత్రరంధ్రములఁ బొంగుచు వీడులు వర్తిలుంచునన్
గురుతుగఁ జూడనుండ పసకెండ సుభాషిత పుస్తకంబుగన్.

(13) ఆముక్తమాల్యద. గ్రం. సం. 3800.

గట్టుపల్లి శ్రీనివాసకవి రచియించిన టీకతో నున్నది. కాగితపుఁబ్రతి.

ఉ. శ్రీకరగట్టుపల్లికులసింధుసుధాకరుఁడన్ సురూపదే
శాకలితోరు శాస్త్రహృదయప్రథితుండను శ్రీనివాసుఁడన్
లోకహితం బిదౌననుచు లోఁ గణియించి రచించితి న్నహా
టీక మనీషికోటికిఁ బఠించుపథం బొడఁగూడునట్లుగన్.

ఉ. శ్రీయుతుఁ డబ్జనేత్రుఁడు విరించి గుణాంచితుఁ డీశ్వరుండు న
త్యాయత మోదయుం గనఁగఁ దాలిమి ప్రాసెడు గట్టుపల్లివం
శీయుఁడు శ్రీనివాసకవిధీరుఁడు చేసిన సారవిష్ణుచి
త్తీయపుటీక మల్లయసుతేజుఁ డుదారహారద్విజుం డొగిన్.

రుధిరోద్గారి సంవత్సర మార్గశిర బ. ౧౪ శుక్రవారమునాఁటికి మంత్రిప్రెగడ వెంకన్నవల్ల వ్రాయఁబడినది యని కలదు, ఈ జట్టిలో ప్రతి హరిద్విజుండు మల్లయ్య వ్రాసికొనిన ప్రతికిఁ బ్రతియని తెలుచున్నది. లవణపురీవేంకటేశ్వరాయనమః అనునొకమాటచే నిది యుప్పలూరిలో వ్రాయఁబడినట్లు స్పష్టము. టీక యను పేరుగాని ప్రతిపదమునకు లేదు తాత్పర్య మనవచ్చును.

మ. పునుఁగుందావి నవోదనంబు మిరియంపుంబాళ్లతోఁ జట్టి చు
య్యనునాదారనికారగుంపు ముకుమంగై యొచుఁగా నావం జిగు
ర్కొనువచ్చళ్లును బాయసాన్నములు నూరుంగాయలుం జేచుఱు
క్కనునెయ్యుం జిరువాలు వెల్లువగ నాహారం బిడుం జీతునన్.

టీక. పునుగుందావి పునుగు వాసనకలిగిన కృష్ణనీలపు బియ్యపు అన్నమున్ను మిరియపుపాళ్లతో చట్టి మృత్పాత్ర చుయ్యుమనేధ్వని యెడ తెగకుండా పక్వముచేసిన శాకములున్ను నస్యము చేసినట్టులు శిరస్సుకు వ్యాపించే ఆవచేత చిగిర్చే పచ్చళ్ళున్ను క్షీరాన్నములున్ను ఊరుగాయలున్ను చెయ్యి చురుక్కుమనే నెయ్యిన్ని చిరువాలు చిక్కగాగాచినపాలు వెల్లువకట్టేటట్టు శీతకాలమందు భోజనము పెట్టును.

అంతట విశ్లై యున్నది. ఈ ప్రతిని వెంకన్నగారు 57 సంవత్సరముల క్రిందట వ్రాసిరి, మల్లయ్యగారు వ్రాసినప్రతి దీనికిఁ బూర్వపుది కావచ్చును. ఇట్టి యూహలచేనీటీక చాలఁ బురాతన మైనదని తలంపవచ్చును. వ్రాఁత స్వచ్ఛముగా నున్నది.

(14) హనూమద్రామాయణము. గ్రం. సం. 3834.

నిమ్మగడ్డ రామకృష్ణకవివిరచితము. శ్రీమద్రామాయణమువలెనే కాండములుగ విభజించియును గాండములలో నాశ్వాసములు కల్పించినాఁడు. గ్రంథము పూర్ణముగ లేదు. హనుమంతుఁడు లంకాదహనము చేయుటతో ముగిసినది. 197 పత్రములుమాత్రము కలవు, ఇందలిగద్యము.

ఇతి శ్రీరామభద్రపాదపద్మమకరందమాధుర్యపానానంద లోకనందితమానస సదయశ్రీయాంజనేయవరప్రసాద కరుణాకలితకవితామృతపూరిత సహజపాండిత్య నిమ్మగడ్డనారాయణాహ్వయనందన రామకృష్ణదాసప్రణీతము...

నిమ్మగడ్డ వెంకన్నకుమారుఁడు నారాయణుఁడు, నారాయణునికుమారుఁడు రామకృష్ణుఁడు ననిమాత్రము పీఠిక తెల్పుచున్నది.

గీ. ఆద్యగురుఁడిమెళ్ళలక్ష్మణాచార్యవర్యు, పాదపద్మార్చనలు చేసి
యనియొక గురువును,

చ. సురుచిర మైనకీర్తులను సొంపు వహించినధర్మమూర్తినిఁ
విరచిత మొప్పఁగాఁ బరస వెత్తయదీక్షితులం దలంచెదన్
అనియొకగురువును,

గీ....అనఘచారిత్రుఁ డరయంగ నవనిలోన, సుగుణి సన్నకనరసన్నసుజనులెన్న
నతనిఁ బాయకనుతియింతు హితుఁ డటంచు
నని యొక హితుని స్తుతించియున్నాఁడు.

పూర్వసంస్కృతాంధ్రకవులను పేరుకొని నుతింపక, సంస్కృతకవులను సన్నుతించి, తెనుఁగుకవులను బ్రహుతించి యని తేల్చివేసినాఁడు.

షష్ఠ్యంతములలో "గోపాలకనగరమత, ల్లీపాలకతావిభూతి" యని యాంజనేయుల నివాసస్థానమో తన నివాసస్థానమో గాని యొక గోపాలనగరముం బేర్కొనినాఁడు, కవిత్వ మంతరసవంతముగా లేదు. కవియు నంతపూర్వుఁడుగాఁ డనవచ్చును.

సీ. వరదబోయెడువాఁడు దరిగనుఁగొన్నట్లుగహనంబులోఁ దోఁవ గలిగినట్లు
వరులును నమృతంబు గరిమతోఁ గన్నట్లు నంబురాశికిఁ బర్వమైనయట్లు
మొదలగువిశ్వామిత్రవాక్యములచే భాస్కరరామాయణము చదివినకవి
యని చెప్పఁదగును.

వాల్మీకిరామాయణ మన్నట్లు హనూమద్రామాయణ మను పేరే గాని కథాసంవిధాన మంతయు వాల్మీకిరామాయణానుసారముగానే కనఁబడుచున్నది. ఇందును సంక్షేపరామాయణము గలదు.

"దండకారణ్యంబు ప్రవేశించి విరాధుని వధియించి చని శరభంగునిం గాంచుటయు నక్షయతపోధనాఢ్యత్వుం డగుసుతీక్ష్ణముని నీక్షించుటయు పారావారగర్వనివారకపాణిపంకజుం డగుకలశసంభవునిం గనుంగొనుటయు పతత్రిపతి యగు జటాయువు నుపలక్షించుటయు" నిట్లుగా హనుమంతుఁడు వాల్మీకిరామాయణములోని యగస్త్యభ్రాతచికురనుండి తప్పుకొన్నాఁడు. హనూమద్రామాయణమని యేల చెప్పెనో కాని యిది హనుమంతుఁడు చెప్పినది కాదు. రామకృష్ణకవి చెప్పినదియే, భాస్కరరామాయణపుత్రికయే యని చెప్పుట కిందు "ఉత్తరకాండసహితంబుగా సప్తకాండంబులు పూర్వకాలంబున వాల్మీకి శ్రీమద్రామా

యణంబు రచియించెఁ దత్కథాక్రమం బెట్టి దనిన'' అని యే కథాప్రారంభము చేయఁబడినది. హనుమంతునికిఁ గృతియిచ్చుటచేతనే దీనికి హనూమద్రామాయణాఖ్య యుక్తమైనది. కాని పూర్వము హనుమద్రామాయణముం గూర్చిచెప్పుకొన్న నైతిహ్య మిచటఁ బనికిరాదు. శైలికై కథకై కొన్నిపద్యములు :—

శా. శ్రీమద్భాసురహృద్యమందిరజయశ్రీదివ్యగాత్రామర
స్తోమస్తోత్రచరిత్రపావనరఘుక్షోణీశ్వరామోదనీ
నామంబుం బఠియింతు నాదుమదిలో నాట్యంబు గావింపవే
స్వామీ శ్రీహనుమంత నీసుకృతులన్ సంతోషమొప్పన్ భువిన్.

ఇది మొట్టమొదటిపద్యము, రెండవపద్యము,

ఉ. భూనుతకీర్తిధామమును బుణ్యపవిత్రము పాపహంతమున్
మానుగ జానకీలలసమంజులధర్మము సత్యశీలమున్
దానవచక్రసంహరము దారుణరావణభేదనంబు నై
జానుగఁ బద్యకావ్యమునఁ జక్కఁగఁ జేయఁ దలంచి నెమ్మదిన్.

క. అందఱు విని యాత్మల నానందింపఁగఁ బలికినాఁడు నరనాథుఁడు తా
నిందుముఖితోడఁ గ్రీడామందిరమున నాడినట్టిమాటలు నిజమే.

క. ఈమాటలు నామాటలు, భూమీశ్వరు లేరు విన్నఁ బోరిపోరి నగరే
భూమిజాతాధీశ్వర,రామ ధరాపాల దేవరాజస్తుత్యా.

గీ. తండ్రి నియతితోడఁ దప్పక చెప్పిన,వినఁగవలయు ధర్మవిధిఁ దలంపఁ
దగవుగప్పి మదిని దప్పఁ జెప్పినమాట,లరసి వినఁగఁదగునె యనఘచరిత.

## (15) చిల్లరపుస్తకము—గ్రం. సం. 3862.

ఇందు ఛందస్సు (కవిజనాశ్రయాదు టీకలతో) ప్రబంధములలోనిపద్యములు (టీకతోఁగూడ) తెనుఁగు, సంస్కృతకీర్తనలు చిల్లరపద్యములు బట్టురాజులతిట్టు దండకములు మొదలైనవి వైద్యముచిటికెలు గలవు. ఇందు సంపూర్ణముగా వినుకొండమహిరావణచరిత్ర యనుయక్షగానము వంటిపుస్తకము చిన్నది కలదు. కవి పేరు తెలియదు.

విని రావణుండంత విస్మయం బంది,యనుపమచింతతో నసురులఁ బిలిచి
ద్రోణగిరి గొనియిప్పుడతో యబ్ధిదాఁటి,పూనిహనుమంతుఁడిదెపోవుచున్నాఁడు
అతనిభంగముచేయునట్టివారలకు,ప్రతిలేనివస్తువుల్ పరఁగ రాజ్యంబు,లిచ్చెద,
నని చెప్పుటతోఁ బ్రారంభించి "వినుకొండ నెలకొన్న విజయరామునికి. నోడి

నట్టుగఁ దోఁచె నోరిచెఱ్ఱాగ్గా. ఇది శ్రీమద్వినుకొండమహిరావణచరిత్రము సంపూర్ణము, అని ముగించినాఁడు. కీర్తనలలో నంకితము వినుకొండవిజయరామస్వామికిచ్చుచున్నాఁడు. కవిత్వము బాగుగా లేదు. మూఁడేఁడు.

గీ. మచ్చుగలిగె....మర్కటోత్తమునకు, మత్స్యమునందు నేడ మర్కటేడ
జాతిగానిజాతిసంభాషణములేల, కోతికేల యిట్టికొడుకు పుట్ట.

ఇతరపద్యములు కొన్ని.

చ. కవి యేతెంచినఁ జూచి జీవనము వేడ్కం గొల్చెఁగాఁ దా ఘనుం
డవునే యింతటిమాత్రలో ననుచు సౌఖ్యాయత్తుఁడై నత్కవీం
ద్రవితానంబుల కెల్ల జీవనము తారా యింత్లేఁ గల్పింతు వా
హావజైత్రా కొలిపాకవంశజ నృసింహా రాయమంత్రీశ్వరా.

ఉ. తావకకీర్తిభవ్యవనితామణి చంద్రుఁన కకుర్కరాచియై
రావణగండము ల్దుడిచి రాజతశైలపుగొంతు దిద్ది బ్రా
హ్మీవిమలాంగికొప్పు నవరించి హలాయుధు వల్వ చల్వగా
భావితమయ్యెనయ్య కొలిపాకనృసింహ చమూపశేఖరా.

ఇం దనేకకీర్తనములు గలవు. రామదాసు తూమునరసింహదాసును జెప్పినవియే గాక, శ్రీభట్లపెనుమర్తి వేణుగోపాలా! యనియు, 2. ప్రణవమందిరావాసా, 3. వెలినావుల కృష్ణదాసు నేలుటయే కష్టమా తండ్రీ 4. రాయభాట్ట వీరరాఘవకవికిఁ ! బాయని భద్రాద్రిపతిమీఁదిపాట 5. పెదగార్లపాటిలో పేరుగా వెలసిన మదనగోపాల 6. కోరి తాటికొండ కృష్ణగోపాలా 7. మంజుభాషా వినగడప పట్టణభూషా పాములపాటి శేషశాయిసమవేషా "ఇట్లుగా ననేకులపేరులతోఁ బలు పాటలున్నవి. ముప్పదియిద్దఱు మంత్రులపద్యములు గలవు. ఒత్తుపత్రముమీఁద యాదలరామచంద్రరాజుగారి నైషధమని యున్నది గాని లోపలఁ బైన జెప్పఁబడినవిషయములు గలవు.

## (16) రుద్రాక్షమాహాత్మ్యము.ద్విపద-గ్రం. సం. 3749.

పింగళసంవత్సరమున 240 పుటలో పర్వతమంత్రి లింగనామాత్యుని వీరమాహేశ్వరాచార సంగ్రహమునుగూర్చి వ్రాయుటలోఁ బ్రథమోల్లాసము మాత్రమె యున్నది యని వ్రాసియుంటిమి దానిలోనిదే యిది రెండవయాశ్వాసము. పింగళవత్సరమునఁ బద్యకావ్యమని వ్రాయుట ప్రమాదము. పర్వతరాజులింగనామాత్యుఁ డని యిందుఁ బేరు కనఁబడుచున్నది. ఈయాశ్వాసము కేవల రుద్రాక్షమాహాత్మ్యవిషయమే.

అని యిట్లు శ్రీశంభుఁ డారాఘవునకుఁ,జనవున బోధించె సకలశాస్త్రములు
రాజిల్లుపద్మపురాణంబునందు,

అని యీశ్వరునిచే శ్రీరామునకు జెప్పఁబడినట్లును నీకథ పద్మపురాణాంతర్గతమైనట్లును స్పష్టముగా నున్నది.

వికారినామసం॥ నిజజ్యేష్ఠశుద్ధ ౧ లవణకు ముకర్ల మల సుబ్బయ్య వ్రాసిన మాతృకలో నున్నట్లు చూచి కాజ అప్పయ్య నీలిమిల్లిప్పకు సంపూర్ణముగా వ్రాసి యిచ్చినది.

నర్సారావుపేటతా॥ మాగ్టూరులోని గన్నెపూడి వేంకటాచలముగా రిచ్చినప్రతి.

## (17) వైద్యపుస్తకము-తెనుఁగువచనము-గ్రం. సం. 3811.

ఇది యొకవైద్యపుస్తకము. తేలికమాటలతో శాస్త్రపరిచయము గ్రంథశోధనము లేనివారికై వ్రాయఁబడినట్లు తోఁచుచున్నది. ఇందు నూటులకొలఁది రోగములకు వైద్యము తెల్పఁబడినది. ఆయారోగమునకు చికిత్సకై కావలసిన వస్తువులు, వానిని నౌషధముగాఁ జేయువిధానము, ప్రయోగించురీతి, పథ్యాపథ్యములుఁ జక్కఁగాఁ దెల్పఁబడినవి. పల్లెటూరివైద్యులలో నెవ్వరో బుద్ధిశాలి యనుభవజ్ఞుఁడు దీనిని సంగ్రహించినాఁడు. నడుమనడుమ శ్లోకములును బద్యములు నక్కృత్తుగాఁ గలవు. కడపటఁ గొంత దోష్ములు, మలివిడి, మొదలైనపశువైద్యమును గలదు.

శిరోరోగానకు—హేమాత్మికం। ఆ౧ అడ్డుగమెత్తునూరి బ్రహ్మరంధ్రానకు వాట్లు వేసి పట్టిస్తేను కొంతసేపటికి తుమ్మితేను పురుగు వెళ్లిపడును-శిరోరోగము మానును.

తలనొప్పికి—గలిజేరువేరున్ను ఉత్తరేణివిత్తులున్ను నూరి నస్యం కాయను మానును.

అపస్మారానకు—మేకపాలు మానెడు కాచగాను। మారేడువేరుపొడుం। మానెడు పోసి। లెస్సగా కాచి। పంచదారమానెడు పోసి। లెస్సపాకాన వండి। రేపువుశిరికాయంత మాపు వుశిరికాయంత। తినిపించ్చేది। పత్యం। తియ్యకూరలు। నెయ్యి। మజ్జిగ। పుచ్చుకునేది.

గీ. నీరుదావకుండ నిర్బంధముగఁ జేసి,కాఁకనీరు ద్రావ కరుణఁ బోసి
కొఱ్ఱిగంజి కాచి కోమటోపఁ బెట్టుఁడీ.మాడమలయు గొను [illegible]

(18) రాధామకుందము—గ్రం. సం. ౩978.

ఇది యొకపద్యకావ్యము. 2½ యాశ్వాసములు మాత్రము కలదు. ఈ సంపుటమునందు మొదట నిరోష్ఠ్యనలరాజచరిత్ర మున్నది. ఈ నలచరిత్రవిషయమై రాక్షససం॥సంపుటములో 15 పుటలో నొకసారి వ్రాసియుంటిమి, అందుఁగృత్యాది లేనిపుస్తకమునుబట్టి వ్రాయఁబడినది. ఇందుఁ గృత్యాదికలదు. ధనంజయగోత్రమునందు రుద్రరాజాన్వయాభరణ ధనంజయగోత్రపవిత్ర కూనన్నృపాలపుత్ర నిరర్గళకవితావిలాస....తిరుమలరాజప్రణీతం బని యున్నది. ఈరాధామకుందమును రుద్రరాజుకూనన్నృపాలపుత్రుఁ డైనసింగభూవిభున కంకితముగా—

సీ. శ్రీకంఠపదపద్మసేవాధురీణుండ నాత్రేయగోత్రభవ్యాంకశాలి
నాగమజ్ఞానమార్గారూఢచిత్తుండ నఖిలార్యసుతుఁడ భద్రార్యసుతుఁడ
సంగనామణి యైనసింగమాంబికగర్భచారుదుగ్ధాంభోధిశశధరుండ
శుభగుణాచారుండ నుభయగోదావరీమధ్యాగ్రహారసన్మాన్యపరుఁడ
నాశ్వలాయనసూత్రవిఖ్యాతయశుఁడ,ఘనుఁడ నార్వేలవంశాగ్రగణ్యమాళి
సకలభూపాలకాస్థానచతురమతిని,మల్లనార్యుండ సుకవితామందిరుండ.

అనియు, ఇది శ్రీవాగీశ్వరీప్రసాదలబ్ధసారస్వతపవిత్ర భద్రార్యసుపుత్ర సకలబుధవిధేయ మల్లికార్జుననామధేయవిరచితం బైనరాధామకుందము అని గద్యమునను జెప్పుకొనిన మల్లికార్జునుఁడు రచియించెను.

నలరాజకథకృతికర్త రుద్రరాజ కూనన్నృపాలపుత్ర తిరుమలరాజు. రాధాముకుందకృతిభర్త రుద్రరాజుకూనన్నృపాలపుత్ర సింగభూవిభుఁడు. నలరాజుకథకృతికర్త తిరుమలరాజు—

సీ. వాసిష్ఠగౌతమీభాసురవీచిభుజాసమాలింగితసాగరంబు
నిత్యతపోయోగనిశ్చలాత్మకమహాసిద్ధర్షిసముదాయసేవితంబు
దర్శనీయారామతరుజాతవ....ప్రత్యక్షసంతానపాదపంబు
బ్రహ్మాదిసంశ్రితప్రకటభాగ్యోదయసముదగ్రగృహమేధిసంకులంబు
వెలయు నిజమహత్త్వవీక్షణాశాభర,వ్యగ్రకనకగోపురాగ్రవిహృతి
కామగమనచరము శ్రీమదంతర్వేది,పురము నిత్యసౌఖ్యపుణ్యకరము.

గీ. అమ్మహాపురరాజంబునందు నిజప,దాశ్రితశ్రేణిరక్షణై కాగ్రబుద్ధి
నభికన్యాసహాయుఁ డైయనుదినంబు,శ్రీనృసింహుండుసాక్షాత్కరించియలరు

అని యంతర్వేదిని వర్ణించియున్నాఁడు కావున నాతనిదియు నంతర్వేదియో

తత్సమీపగ్రామమెూ నై యుండును. మల్లికార్జునకవి తా నుభయగోదావరీ మధ్యమునందలి యగ్రహారికుండనని (వాసిష్ఠగోత్రమిూభానుకవిచి)యుఁ దనకృతిభర్తను షష్ఠ్యంతములలో—

క. సురుచిరవిక్రమరేఖా,వరపాణికి రుద్రరాజవంశాగ్రణికిన్
సరసున కంతర్వేది,నరసింహాపదారవిందనందితమతికిన్.

అవియును నంతర్వేదిని పేరుగ్రుచ్చుటచేతను వీరికందఱకు నత్యంతసన్నిహితసంబంధ ముండితీరవలయును.

మా కిపుడు దొరకిన యీశిథిలగ్రంథములంబట్టి యారయుట కొంతశ్రమకరముగా నుండును. కావునఁ బ్రస్తుతము విరమించుచుఁ గవికవిత్వాదికము తెలియుటకై కొన్నిపద్యముల నుదాహరించుచున్నాము.

మొదటిపద్యము.

ఉ. శ్రీరుచి మించఁగాఁ దనువుచెల్వము యామునవారిలీల వి
స్తారత మీఱ నిందిరకుచంబులుఁ గన్గవ మోము వేణికా
భారముఁ జక్రమీననవపద్మమధువ్రతభంగిఁ జెందఁగాఁ
గూరిమిఁ గ్రీడసల్పుహరి కూనయసింగన్నపాలుఁ బ్రోవుతన్.

రెండవపద్యము.

చ. అమరులకూటిమేటి తల నక్కఁజక్కనిగాలికూటిమే
టిమహిాతలీఁ మించఁ బలుకొలఁముసన్ వెలిగిబ్బమేటి హ
స్తమునను లేటిమేటి తనుసంగతి నింతులమేటి గొప్పగాఁ
గొమరగువేల్పుమేటి దయఁ గూనయసింగన కిచ్చు భద్రముల్.

మూఁడవపద్యము.

చ. నిజవదనాబ్జముల్ పలుకునెచ్చెలికిం జతురంగమింపుగా
నిజతనుయష్టికిం గలికినిద్దపుఁదామర పుట్టినిల్లుగాఁ
గ జగము లీలతో నెపుడుఁ గల్పనసేయువిరించి బ్రోచు భా
వజనిభు రుద్రరాజకులవర్యుని గూనయసింగభూవిభున్.

చ. అచట సహస్రగోపుఁ డనుయాదవభర్తకుఁ బుత్రి యై వధూ
నిచయములోన సంతతవినీతకళానవరూపరేఖలన్
బ్రచురత మీఱి తన్ సఖులు రాధిక నా నుతి గాంచి మించి యా
విచికిలగంధి యొప్పను నవీనవయఃపరిపాకలీలలన్.

ఈశృంగారప్రబంధమును, నిరోష్ఠ్యనలరాజచరిత్రమును వైజయంతీవిలాసమును గలసంపుటము మాకు గుంటూరుజిల్లాలో దొరకినది. ఈగ్రంథమునందు చంద్రవంశమునందు విష్ణువర్ధనుఁ డుదయించెననియు, నతనివంశమున "హరిసీమకృష్ణరాజాధిపుండు" పుట్టె ననియు నతండు—

సీ. కురియించె నేరాజు కుంభినీతలముపైఁ దఱచుమిఱాజినయట్టిధాన్యవృష్టిఁ
గావించె నేరాజు ఘనతరప్రౌఢిచేఁ దపనీయమణులపేటి ధాన్యవాటి.

అనుమాటలంబట్టి ధాన్యవాటి (ధాన్యకటకము)ను పాలించెననికలదు. నలసంవత్సరసంపుటము 319 పుటలో మార్త్రియోపాఖ్యానమునుగుఱించి వ్రాయుచు—

"కురియించెఁ బహుధాన్యవర్ష మఖిలక్షోణీప్రదేశంబునన్
హరియించె స్వమతాంధకారముల బాహాగ్రాసిసూర్యప్రభన్
సిరిమించెన్ నృపవర్యులెంచ ఘనుఁడై శ్రీధాన్యవాటీపురీ
చిరసామ్రాజ్యరమాసమాశ్రయమహాసింహాసనాసీనుఁడై.
అహరిసీమకృష్ణునికులాబ్ధి జనించెను భీమరాజు."

అని వ్రాసియుంటిమి. హరిసీమకృష్ణరాజు వీరందఱకు వంశకర్త యగుటఁ జై మూఁడుగ్రంథములకు మిక్కిలి సంబంధ మున్నది. కావున భాషాభిమానులు చక్కఁగా యోజింపఁదగును.

శ్రీరస్తు.

# ఓపిలిసిద్ధిచోడరాజు కొణిదెన శాసనము

(శ. స. ౧౧౪౫)

ఈశాసనము గుంటూరిమండలములో నరసారావుపేట తాలూకాలోఁ జేరిన కొణిదెన గ్రామమునందు శ్రీశంకరేశ్వరస్వామివారి యాలయములో ముఖ మండపమునకు సమీపమందుఁ బాఁతఁబడియున్న యొకపెద్దశిలా స్తంభముమీఁదఁ జెక్కఁబడియున్నది. నే నిదివఱలో మాతృకను జదివి దానికిఁ బ్రతియొకటి స్వయముగ వ్రాసియున్నాఁడను. ఈప్రతినిబట్టియు నిటీవలఁ దీసిన ప్రతిబింబమునుబట్టియు మూలపాఠము నిర్ధారితము చేయఁబడినది. శాసనపులిపి మిక్కిలిఁ జక్కఁగా నున్నది. శిలాస్తంభము నున్నగను, అక్షరములు లోఁతుగను నుండుటచేత శాసనము నిన్న మొన్నఁటఁ జెక్కఁబడిన ట్లున్నది.

## వర్ణక్రమము.

వర్ణక్రమములో నక్కడక్కడ స్ఖాలిత్యములు గలవు గాని మొత్తముమీఁద శాసనము శ్రద్ధాపూర్వకముగా నే చెక్కఁబడిన దని చెప్పవచ్చును. ప్రాచీన శాసనములలో ననుస్వారపూర్వకడువర్ణకము వచ్చినపు డనుస్వారమునకు గుఱుతుగాఁ బరసవర్ణ మయిన "ణ"కారమే కనఁబడుచున్నది. ఈశాసనమం దట్లు కాక బిందువు ప్రయోగింపఁబడినది. బిందువునకుఁ బరమందు "అంద్దు (౯) ఒంద్దు (౧౭) శబ్దములందువలె దవర్ణమునకును, గండ్డండు (౩౮, ౬౯) ఉద్దండ్డండు (౭౦) దండ్డు (౭౬) పదములందు వలె డవర్ణమునకును, లత్తాంత్త (౩) బలవంత్తులు (౯౨) సింత్తామణులు (౧౧౪) జయంత్తు (౧౨౧) పదములందువలె, తవర్ణమునకును, విరించ్చి, (౧౦) జనించ్చె (౧౦) శబ్దములందువలె, చవర్ణమునకును ద్విత్వము తఱచుగా నగపడుచున్నది. కాని, తవర్ణచవర్ణములకువలె నితరవర్ణములపట్ల నిది నియతముగా లేదు. అఱసున్నకు బదులుగా నెల్లెడల నెఱసున్నయే కనఁబడుచున్నది. దీనివలన "నానాఁటి కర్ధానుస్వారోచ్చారణ మున్నను దానికి గుర్తు కల్పింపఁబడ లే"దని స్పష్టపడుచున్నది. కావుననే యీశాసనకాలమునందే పుట్టినయాంధ్రభాషాభూషణములో "సున్న యఁదిపలికిన నెఱసున్న యుఁ దేల్చి పలికిన నఱసున్నయు నగు"నని. విధింపఁబడినది. శాసనములలో నేమి, వ్రాఁత పుస్తకములలో నేమి పూర్ణానుస్వారమునకుఁ బరమం దున్నవర్ణములకుఁ దప్పక ద్వి

త్వ ముండు నని కొంద ఱందురు గాని యది నియమముగాఁ బాటింపఁబడ లేద నియు నర్థానుస్వార మేదియో పూర్ణానుస్వార మేదియో సందర్భమునుబట్టి నిర్ధారణము చేయవలయు ననియు నీశాసనమువలనఁ దేలుచున్నది. ౫౦ పంక్తియందుఁ దుడిచెన్, ౫౪, పంక్తియందు ఇలన్, ౫౭, ౫౯ పంక్తులందు దశవర్మల్, అని హలంతములుగా నుండవలసియుండ, దుడిచెను, ఇలను, దశవర్మలు, అని యజంతరూపములే కనఁబడుచున్నవి. ఇట్లే మఱికొన్ని స్థలములందుఁగూడ నున్నవి. వ్రాఁతపుస్తకములందుఁ దఱచుగా నీప్రకారమే యుండును. పూర్వకాలమున నుచ్చారణమునకును వ్రాఁతకును గలభేదములలో నిది నొకటి.

వ్యాకరణకార్యవిశేషములు.

ప్రథమావిభక్తిపైఁ బరుషములకు గసడదవ లించుమించుగ నన్నిచోటులఁ గన్పట్టుచున్నవి. ''ముల్లోకవిభుండునక్రి'' (౬,౭) యనుచో విభుండు, చక్రి, యనునవి రెండును సంస్కృతశబ్దములే యగుటచేఁ జవర్ణమునకు సవర్ణము రావచ్చునని వైయాకరణులమత మయినను నిచ్చట సవర్ణము శ్రుతికటువుగా నున్నది. మఱియుఁ జవర్ణము తాలవ్యము, సవర్ణము దంత్యోచ్చారణము గలది. ''ఇచ్చు దీనురకియొ్యపిలిసిద్ధివల్లభుఁ'' (౧౧౫, ౧౧౬) డనుచో బహువచనలకారమునకు రేఫాదేశము లోపథంబు లగు పదములకు మాత్రమే యిట్టియాదేశము వచ్చు ననువ్యాకరణసూత్రమును బాధించుచున్నది. ఇల రేఫాదేశము కవ్యుద్దిష్టమే కాని ప్రమాదజనితము కాదు గదా? తమ్ముఁడు అనుటకు ''తమ్మ'' అనియును (౯౦, ౬౯), చోడుఁడు అనుటకు చోడు (౫౫) ''అనియును రూపములుగలవు. మల్లిదేవండు, (౭౩, ౭౪, ౮౦, ౯౧, ౯౪,) సోమేశ్వరదేవండు (౮౭, ౮౮,)అనుచో దేవశబ్దాంత్యాకారమున కుకారము రాకుండుట విశేషము. నీచార్థమందకార మిప్పుడును వ్యవహారములోఁ గనఁబడుచున్నది. ఉదాహరణము.—రామఁడు, సోమఁడు, భీమఁడు ఇత్యాదులు. కరికాలుఁడు—నిర్వచనోత్తరరామాయణమును బరిష్కరించినపండితు లీశబ్దమును కలికాలుఁడని మార్చిరి. ఇది కరికాలశబ్దమే కాని కలికాలశబ్దము గాదని యీశాసనమువలనఁ దెలిసికొనవలసియున్నది. ''తాన్'' అతనికిఁ దాఁబుట్టిరి'' (౫౫, ౫౬) అనువాక్యమందు తాన్, శబ్దము బహువచనార్థమందుఁ బ్రయోగింపఁబడినది.

విశేషశబ్దార్థములు.

ప్రల్లాటము, ఇదిప్రల్లాటము ప్రల్లదనము?) రూపాంతర మని తోఁచెడిని. ''కొల్లభిగొని (౬౭) ధార (౭౧) వీని యర్థములు. చింత్యములు.

ముల్లోకవిభుండు, (౬౯) శ్రీమహాదేవి (౧౦౬) వీనిసాధుత్వము చింత్యము. తాటకనారాయణు (౧-౩౪, ౧-౩౫) భావము చింత్యము. పాటకవ్రాత పుత్రకు (౧-౩౭) పాఠకశబ్దమునకు మాఱు పాటక యని పొరపాటునఁ బడి నది. పాఠకు లనఁగా స్తుతిపాఠకు లయినవందులు. పాఠకవ్రాతపుత్రకుఁ డనఁగా వందులను బుత్రులవలెఁ బోషించువాఁ డని యర్థము. "వందిప్రియత్వంబు వ ర్ణింపఁగా నేల పాఠకపుత్రాఖ్య పరఁగుచుండ" నని నిర్వచనోత్తరరామాయణము (౧-౩౫) పేరుకొని (౪౧) అనఁగా బ్రసిద్ధినిబొంది యని యర్థము.

చరిత్రాంశములు.

ఈశాసనకర్త యగు నోపిలిసిద్ధిదేవచోడుఁ డాంధ్రచోడవంశములోనివాఁ డు, తొలుతఁ జోళులు తిరుచనాపల్లికి సమీపమం దున్న ఒఱయూరుప్రాంతదేశ మునుఁ బాలించి పిదపఁ బల్లవుల జయించి వారిదేశము నాక్రమించి కంచి రాజధా నిఁగాఁ జేసికొనిరి. చోళరాజుల కందఱకు వంశకర్త కరికాలచోడుఁడు. ఈతఁడే పల్లవరాజయిన ముక్కంటి (త్రిలోచన) పల్లవుని జయించినట్లును గావేరి కిరుప్రక్క ల గట్లు కట్టించినట్లును, బ్రస్తుతశాసనమందును, మఱి యనేకము లగునితరశాసన ములయందును వర్ణింపఁబడినది. నిర్వచనోత్తరరామాయణములోఁ దిక్కనసోమ యాజి యీరీతిగా వర్ణించెను.

శా. చేనేతం బృథివీశు లందుకొనఁ గాళీసింధుతోయంబులం
    జేసె న్మజ్జన మొంగుటంబున హరించెం బల్లవోర్వీశును
    ల్లానం బొందఁగ ఫాలలోచనము లీలం గట్టెఁ గావేరి హే
    లాసాధ్యాఖిలదిఙ్ముఖుండు కరికాలక్ష్మావిభుం డల్పుఁడే.

చోళులకుఁ బూర్వము పల్లవవంశరాజు లాంధ్రదేశంబును ద్రావిడదేశం బులోఁ గొంతభాగంబును బాలించుచుండిరి. ఈరాజులలో ముక్కంటి కాడువెట్టి ముక్కంటిపల్లవుఁడు, త్రిలోచనపల్లవుఁడు నను పేళ్లు గలరాజు సుప్రసిద్ధుఁ డొకఁ డుండినట్లు పెక్కుశాసనములలో నున్నది. ఆరా జయోధ్యనుండి చాతుర్వర్ణ్య ముువారిని బిలిపించి శ్రీశైలప్రాంతదేశమందుఁ బ్రతిష్ఠించె నని కొన్నిశాసనముల లో నున్నది. కాని, యారాజు కాలమునాఁడు పుట్టినశాసనము లెవ్వియు నింతవఱ కుఁ గానరాలేదు. పల్లవరాజులలో, ప్రథమమహేంద్రవర్మ యనుసుప్రసిద్ధుఁ డగు రా జొకఁ డుండెను. త్రిలోచనుఁ డనునది యాతనిబిరుదనామ మని కొందఱ యూహ. త్రిలోచనుఁ డనుపే రుండుటచే నాతనికి మూఁడుకన్ను లుండినటుు

మూఁడవకంటిని గరికాలచోడుఁడు గిల్లివేసినట్లును శాసనములు రచియించినకవులు కల్పించిరి. కరికాలుఁడు ముక్కంటిపల్లవుని జయించె ననుటయే యిందలివాస్తవార్థము. ఆకరికాలుని మనుమఁడగు రెండవ కరికాలునివంశమందుఁ దెలుఁగుచోడులకు వంశకర్తయనఁదగు బిజ్జన పుట్టెను. అతనికిఁ దెనుఁగుబిజ్జన యనియు, చోడబిజ్జన యనియుఁ బేరులు కలవు. ఈతఁడు కడు శౌర్యవంతుఁడై బల్లహుఁడను రాజుతో నిరువదియేడుయుద్ధములుచేసి జయము నొందినట్లును, పదుమువ్వుర జయించుటచేతఁ నాతనికిఁ బదుమువ్వురగండఁ డను బిరుదు వచ్చినట్లును గనఁబడుచున్నది. రాష్ట్రకూటరాజులకును హొయిసలరాజులకును బల్లహు లను పేరు గలదు. బిజ్జననుగూర్చి నిర్వచనోత్తరరామాయణమం దిట్లున్నది.

చ. పరుషపరాక్రముం డగుచు బల్లహుపీటనుదగ్రుఁడైనప
న్నిరువుర నాతనింగలియ నెన్ని యనర్గళమత్సరంబుమై
మురరిపుసన్నిభుండు పదుమువ్వురగండఁడఁగంగఁ బెట్టెఁ దా
బిరుదు వెలుంగబిజ్జఁ డరిభీకరభూరిభుజాబలంబునన్.

(ఈపద్యము ప్రథమపాదమునందు బల్లహు అనుటకు మాఱుగాఁ బల్లవు అని యచ్చుపుస్తకములో నున్నది.)

బిజ్జనమనుమఁ డగు మల్లిదేవనిసంతతిలోనివాఁడే ప్రస్తుత శాసనకర్తయగు నోపిలిసిద్ధిదేవుఁడు. ఈవంశమువా రందఱును పొత్తపి రాజధానిగాఁ బాఁకనాఁటిదేశములోఁ గొంతభాగము పాలించినట్లును, ఓపిలిసిద్ధిదేవుఁడు కమ్మనాడును, ఆఱువేలదేశమునుగూడ జయించియేలినట్లును శాసనము తెలుపుచున్నది.

బిజ్జనసంతతివారిలోఁ గొందఱు విక్రమసింహపుర మనునామాంతరము గల నెల్లూరు రాజధాని గాఁ బాఁకనాటిలోఁ గొంతభాగముఁ బరిపాలించిరి. నిర్వచనోత్తరరామాయణకృతిపతి యగు మనుమసిద్ధిదేవుఁ డీవంశమువాఁడే. తూర్పుపాకనాడు, పడమటిపాకనాడు నని పాకనాడు రెండుభాగములు. కడపమండలము రాజంపేటతాలూకాలోని పొత్తపిప్రాంతదేశము పడమటిపాకనాడు. నెల్లూరిప్రాంతదేశము తూర్పుపాకనాడు. ఈదేశమునకుఁ గొన్నిశాసనములలో "పూ(ం)గీవిషయ"మను సంస్కృతనామము గలదు. పూగీ యనఁగా, పోఁక(చెక్క). దీని నఱవములో "పాక్కై" యందురు. నెల్లూరువఱకును బూర్వ మఱవభాష వ్యాపించియుండుటచే నెల్లూరిలో నున్నపూర్వశాసనము లించుమించుగా నన్నియు నఱవభాషలో నున్నవి. వానిలో నీదేశము "పాక్కైనా" డని వర్ణింపఁబడెను

దానికిఁ దెనుఁగుసేయగాఁ బాఁకనా డయినది. పాఁకనా డనుటకు మాఱుగ "ప్రాజ్నా"డని, పాకనాటిలోని బ్రాహ్మణులు వాడుచున్నారు. కాని యిది సంప్రదాయము తెలియక కల్పించినయపశబ్దము, ప్రాజ్నాడనుసమాసముండదు. ప్రాజ్నాడనఁగాఁ దూర్పుదేశ మని కదా యర్థము. ఇది పడమటిపాఁకనాటికిఁ జెల్లదు. పూర్వశబ్దమునకుఁ దెనుఁగు పోఁక. "పోఁకనా" డని పాఁకనాటి కాఁపులు కొందఱు చ్చరింపఁగా నే వినియున్నాఁడను ఇదియు సాధువే.

ఆంధ్రచోడవంశములో నొకశాఖవారు తూర్పుపాఁకనాటిని నింకొకశాఖవారు పడమటి పాఁకనాటిని బాలించిరి. ఎవరిమట్టునకు వారే పాఁకనా డంతయు నేలినట్లు వ్రాసికొనిరి, గాని, యది సత్యమని తోఁపదు. పడమటిపాఁకనాటిరాజయినయోపిలిసిద్ధి కమ్మనాడు నాఱువేలదేశము నాక్రమించుకొన్నట్లు శాసనము చెప్పుచున్నది. ప్రథమకరికాలచోడునిమనుమఁ డగుదశవర్మసంతతివారుగూడఁ బాఁకనాడును గమ్మనాడును బాలించినట్లు చెప్పికొన్నారు. కుమారసంభవకృతికర్త యగునన్నెచోడుఁ డీశాఖలోనివాఁడే. దీనివలన నాంధ్రచోడవంశంబులో మూఁడుశాఖ లున్నట్లేర్పడినది. వీరందఱును బాఁకనా డేలినట్లె వ్రాసికొనియున్నారు. వారిలోఁ గొందఱు కమ్మనాటినిగూడ నేలినారు. ఓపిలిసిద్ధి కాకతీయరాజయిన గణపతిదేవుని సాహాయ్యముచేఁ గమ్మనాడు స్వాధీనపఱుచుకొన్నట్లీశాసనము చెప్పుచున్నది. నిర్వచనోత్తరరామాయణకృతిపతి యగు మన్మసిద్ధి దాయాదులవలన రాజ్యభ్రష్టుఁడై తిక్కన సోమయాజిమూలముగ గణపతిదేవునిదయ సంపాదించి తిరిగి రాజ్యమును సంపాదించినట్లు సిద్ధేశ్వర చరిత్రమువలనఁ దెలియుచున్నది. మన్మసిద్ధి మనుమఁ డయిన మనుమగండగోపాలుఁడు ప్రతాపరుద్రునికృపచే వర్ధిల్లిన ట్లొకశాసనమువలనఁ దెలియుచున్నది. దీనినంతను బట్టిచూడ నీయాంధ్ర-చోడులు దమలోఁ దాము పోరుకొనుచుఁ గాకతీయరాజుల సాహాయ్యమునుఁ బొంది వారికి భృత్యులయి యొకప్పుడువీరు నొకప్పుడు వారును నా దేశమునే పాలించుచున్నట్లు కనఁబడుచున్నది. వర్తమానకాలమందు గుంటూరిమండలములోని బాపట్ల,వినుకొండ, నరసారావుపేట తాలూకాలును,ఒంగోలుతాలూకాలోఁ గొంతభాగమును గలసిన దేశమునకుఁబూర్వము కమ్మనా డని పేరు. పాఁకనాడు, వెలినాడు, ఆఱువేలనాడు, పల్నాడును దీనికి సరిహద్దులుగా నుండెను. సత్తెనపల్లితాలూకా, గుంటూరుతాలూకాలోఁ గొంతభాగమును గలసిన దేశమునకుఁ బూర్వ మాఱువేల దేశమని పే రుండెడిది. ఈ దేశమునుబట్టియే యాఱువేలవా రనుసంజ్ఞ యాఱువేలనియోగులకుఁ గలిగినది. గోపరాజు రామప్రధాని యాఱువేలమందిని గరణములుగా నియమించుటచే నాకరణములసంతతివా రాఱువేలవా రయినారన్న జనశ్రుతి కేవలకల్పితము.

# శాసనమూలము.

(యథామాతృకము).

మొదటివైపు.

1. శ్రీమత్కౌస్తుభర
2. త్నభూషణరుచిస్ఫురద్వక్షస్థ
3. లుం । దామందారలతాంత్తదామనవ
4. దివ్యామోదపాదాబ్జజా । తామేయా
5. మరసింధువారిక్రీతపూతాశేష
6. లోకుండుసాం । గాములోకవిభుండు
7. సక్రికగలండై కవ్యాపిదానాద్యుండై ॥
8. ఆతరిదాల్పునాభిదలితాబ్జము
9. నంద్దుదియించ్చెబ్రహ్మసం । ప్రీతి
10. గనావిరించ్చికిమరీచిజనించ్చెమ
11. రీచికన్వయు । ఖ్యాతుండుపుట్టెం
12. గస్యపుండు గస్యపుండనుముని
13. కుద్భవించ్చెలో । కాతతరమ్యమూర్తి
14. గమలాప్తుండు సూర్య్యాంశువం
15. శకర్త్రైయై ॥ ౧ ॥ ఘనుండాసూర్య్యానక
16. న్వయాదిజుండనంగ్గారాజధర్మ్మంబతా ।
17. దనువైశ్వతరాజయోగమునవోంద్దం
18. బుట్టివైవశ్వతుం । డనఘుండాతనికు
19. ద్భవించ్చెమనువుద్యద్వేదశాస్త్రార్థతా । త్వ
20. నిజాచారసమస్తధర్మ్మనయశాస్త్రప్రో
21. క్తికాచార్య్యండై ॥ ౨ ॥ గద్దె ॥ ఇట్టిమనువ
22. ంశంబుననిక్ష్వాకుపుట్టెనిక్ష్వాకువం
23. శంబునంగకుత్స్థుండుపుట్టెనాతనికి
24. ంబ్రిథివిదనపేరంజేసినంబ్రిథు
25. ంశుపుట్టెంబ్రిథువంశంబునమాంధా

26. త్సృండుపుట్టెమాంధాతవంశంబునం బు
27. రుకుత్సుండుపుట్టెం బురుకుత్సవంశ
28. ంబుననాగరంబుదనపేరం జేసినస
29. గరుండుపుట్టెసగరవంశంబునదిలీ
30. పుండుపుట్టెదిలీపవంశంబునభాగీ
31. రథిదనపేరుగాం దెచ్చిన భగీరథుండు
32. పుట్టె భగీరథవంశంబుననతీతానా
33. గతవంశకర్త్తయైన రఘువుపుట్టెర
34. ఘువంశంబుననారాయణావతారుం
35. డైన శ్రీరాముండుపుట్టెశ్రీరామ
36. వంశంబున నలుచక్రవర్త్తిపుట్టె నలు
37. నికిం బుండరీకుండుపుట్టె పుండరీక
38. వంశానుక్రమంబుననాదిరాజులకం
39. ట్టెంబ్రసిద్ధుండై కరికాలచోడచక్రవ
40. ర్త్తిపుట్టె భానువంశంబుగరికాలవం
41. శంబునాంబేరుకొనిచతుస్సాగరపరి
42. యంత్తమహీచక్రంబునిర్వక్రంబుగా
43. వాలివాతంబాలించ్చి ॥ కరికాలచోడ
44. నరపతి । వరగంగనిజలాంఛనము
45. లు బలువిడిహిమవ । ద్గిరితటముల
46. నేతుమహీ । ధరతటములనిలిపెంజక్ర
47. ధరతుల్యుండై ॥ ౪ ॥ కావేరితరులుగట్టంగ । వేవే
48. పల్లవుండుదనదువెట్టికిరామినిం । దావా
49. నినుదిటికనువోం । గావడింగరికాలవిభు
50. ండుగాలందుడిచెను ॥ ౫ ॥ ఇనుపాదముల
51. చ్చిక్కంప్పంగం । జనుచోజనిఅఘ్యక్షామంత్రజ
52. లపాత్రలుదా । పినువీధినాంగంబంచెను ।
53. ఘనముగందనయానవోడిచికరికాలు
54. ండిలను ॥ ౬ ॥ అట్టికరికాల। నిపతికిం । బు

55. స్థైనుమహిమాన చోడుభువినతని
56. కిందాం । బుట్టిరిగరికాలుండుసిరి । కట్టన
57. నుంగులుందొండమాన (ఘ్ను)నదశోవమ్మ
58. లు ॥ ౭ ॥ ఆకరికాలనరేంద్ర । ప్రాకటవంశో
59. మునంబుట్టిభాస్కరకులర । త్నాకరచం
60. ద్రుండురిపున్రిపభీకరుండధికుండు
61. చోడబిజ్జనబిరుదై ॥ ౮ ॥ రూఢిగబిజ్జనద
62. నురెం । డాడినభూపతులశిరములసిము
63. ఖమునంజెం । డాడుచుంగయ్యములిరువ
64. ది । ఏడెన్నంగం బొడిచెజయమహీవల్ల
65. భుండై ॥ ౯ ॥ బల్లహుతోఘునబిజ్జన । ప్రల్లాట
66. మునవచ్చుపాముంబట్టినంగనియా । బల్ల
67. హుండిచ్చెగుణాంకము । గొల్లభిగొని జ
68. నులుగండగోపాలుండనను ॥ ౧౦ ॥ దండి (జగ)
69. దొబ్బగండ్డండు । గండ్డరగండ్డండువీర
70. ఖణిబిజ్జనయు । ద్దండుండుందాంబదు
71. ముప్వర । గండ్డంతనుధారనిలిపెంగట
72. కములోనను ॥ ౧౧ ॥ ప్రి ॥ బిరుదసంజన్నయా
73. తెలుంగు బిజ్జనమనుమండుమల్లిదే
74. వండ । చ్చెరువగుచున్నపొత్తపియచన్న
75. గు వీరుగవాలిపాకనాం । టిరువదియు
76. కలవేయింజననేలుచు బల్లహుదండ్డగె
77. ల్చిత । తలరివరకుంభముక్తికలతాతతిం బూ
78. (ం)చెనిజాసిపుత్రికను ॥ ౧౨ ॥

రెండవవైపు.

79. అతనికింబుటిరొప్పమధురాంత్తక
80. పొత్తపిచోడసిద్ధిభూ । పతియును మ
81. ల్లిదేవండును బాహుపరాక్రమవిక్ర
82. మక్రములు । నతనరనాథబాలకమ

83. ణస్థిరపాదసరోజనై భవులు । వితత
84. సముద్రకాంచీపరివేష్టితభూపరిరక్ష
85. ణక్షములు ॥ ౧౩ ॥ క॥ ధరంబో త్తపిసిద్ధినరే । శ్వ
86. రునికినుదయించ్చి భూమినననేలి
87. రిస । చ్చరితులువో త్తపిసోమే । శ్వరదే
88. వండుమల్లిదేవవసుధాధిపుండు
89. ను ॥ ౧౪ ॥ క్రి॥ భూపదిలీపుండై పరగు పో త్తపి
90. సిద్ధని తమ్ముమల్లధా । త్రీపతికిని సమ
91. స్త జగతీపతికినిసుతులుద్భవించ్చిరా ।
92. శాపరిపూర్ణకీర్తులు భుజాబలవంతు
93. లునై నతొంట్రిండు । ఘోటపిలిసిద్ధియుంగు
94. లసముద్ధరణుండగు మల్లిదేవండు
95. ను ॥౧౫॥ క॥ తపో త్తపిసోమేశ్వరి । భూపతికి
96. ందమ్ము మల్లభూపాలునకు । నొప్పపి
97. సిద్ధికిందమ్ముండు । దీపితసితకీర్తి
98. మల్లిదేవండువరగెను ॥౧౬॥ క్రి॥ పరగినమ
99. ల్లిదేవజనపాలుంపు పో త్తపితోడ
100. వంశజే । ఖరుండినవంశకర్త యనంగా
101. గమవాలిపిరోధిరాజసం । హారణుండు
102. దొంటితాతలక్రియం దగుపో త్తపిరాజ
103. ధానిగా । ధరసకలంబునేలె విదితంబగు
104. బాహుపరాక్రమంబునను ॥౧౭॥ క॥ అమల్లిదే
105. వనికింగుల । కామాతిలకంబుపుణ్య
106. భాగినిగౌరీ । శ్రీమహదేవికింబుట్టెంద ।
107. ప్రేమహిమఫలముదాన పొడవైన
108. గతిని ॥౧౮॥ ఇనుండుదయమైనయట్ల । మనువు
109. దయంబైనయట్లు మజిరఘురాములు । జ
110. నియించినట్లుగులవ । ర్ధనుండోపిలిసిద్ధివిభు
111. ండుదానుదియించ్చెను ॥౧౯॥ క్రి॥ కరికాలో త్తమరా

112. జవంశమునందా గౌరీమహాదేవికిని । సుర
113. భులుగల్పకుజాతములు రసనదితోయ
114.* సింత్రామణులు । ధరనేకాక్రితింబుట్టె
115. నోయనజగదాంక్గుండయిచ్పదీ । నుర
116. కిరొయ్యోపిలిసి(ద్ధి)వల్లభుండు గన్నఁంద
117. న్నవన్నిఁంపంగాను ॥ ౨౦ ॥ ఓపిలిసిద్ధివల్లభు
118 జమోన్నతుండేంక్గణచక్రవత్తిఁనా । జ్ఞాపరి
119. రక్షితాఖిలదిశావలయును ఘునదా
120. నకన్నఁలీ । లాపరిపూన్నఁరషుర్యశుభలక్ష
121. ణమూత్తిఁజయుంత్తునశ్వసి । షాపురు
122. హూంతుంబేరుకొనంగాంజనుం జోడకులై
123. కభూషణను ॥ ౨౧ ॥ సకలాధీశసతోత్తమాంగ్గ
124. మణిభూషారమ్యపాదాంబుజుండా । టకనారా
125. యణుభానువంశనిపచూడారత్నసిస్ఫే
126. ష్టబం । ద్ధుకవీంద్రద్విజరక్షుంగాన్యపనుగో
127. త్రుంబాటకవ్వాతపు । త్రకుమారొపిలి
128. సిద్ధింజెప్పందగునుద్యద్గండ్డగోపాలుని
129. ని ॥ ౨౨ ॥ త(న)నిజప్రవిత్తిమిందవిదతంబుగనో
130. పిలిసిద్ధివిన్నసి । ద్ధనసునన్గుందమ్ముండు
131. ప్రతాపమునంజనిక్షమ్మనాండునే । కొనిగ
132. ణపతిశుదయంగూడి తదాజ్ఞవహించ్చి
133. యెలెంబా । వనమగునాఱువేలునునవక్ర
134. పరాక్రమవిక్రమంబునను ॥ ౨౩ ॥ ఇట్లేలిసత్తసం
తానంబులు దేవబ్రాహ్మణదత్తులు సమస్త
135. ధమ్మఁంబులుం బ్రతిపాలించ్చి ॥ స్వస్తిచరణ
136. సరోరుహావిహితవిలోచనత్రిలోచ
137. నప్రముఃఖాఖిలప్రిథివీశ్వరకారిత కా
138. వేరీతీరకరికాలకులరత్నప్రదీపాహిత
139. కుమారాగజాంక్గశయొఃఅయూరిపుర

140. వరాధీశ్వరసూర్య్యవంశోద్భవకాశ్యప
141. గోత్రతెంక్కణాదిత్యజగదొబ్బగండ్డకీర్త్తి

మూఁడవవైపున.

142. నారాయణ
143. సమస్తప్రశస్తిసహితంబుశ్రీమను
144. మహామండలేశ్వరమోపిలిసిద్ధనదే
145. వచోడమహారాజులు స్వస్తిశ్రీశకవర్షం
146. బులు ౧౧౪౬గు తారణసంవత్సర
147. కార్త్తికశుద్ధశ్రీయేకాదసి శుక్రవార
148. మునంగమ్మనాంటిలోననిజరాజధా
149. నియైనకొట్టియదొన శ్రీశంకరేశ్వర
150. శ్రీమహాదేవరకు గణపతిదేవమ
151. హారాజునకుధర్మ్మగా మావిబలియ
152. చ్చ్వనలకునంగభోగరంగభోగాలకు
153. నందులమొగడచెఱువుదేవభోగ
154. మాచంద్రార్క్కతారకము సర్వకారప
155. రిహారముగానిచ్చితిమి మంగ్గళమహా.
156. శ్రీశ్రీ॥ స్వదత్తాంపరదత్తాంవా। యోహరే
157. తివసుంధ్ధర। షష్టివర్షసహస్రాణి
158. విష్టాయాంజాయతేక్రిమి॥

శాసనమూలము.

(ఆధునికవర్ణక్రమము ననుసరించి వ్రాయఁబడినది.)

శ్రీమత్కౌస్తుభరత్నభూషణరుచిశ్రీరమ్యవక్షస్స్థలుం
డామందారలతాంతదామనవదివ్యామోదపాదాబ్జజా
తామేయామరసింధువారికృతపూతాశేషలోకుండు నాఁ
గా ముల్లోకవిభుండు చక్రిగలఁ డైక్యవ్యాపి దా నాద్యుఁడై.
అతరిదాల్పునాభిదళితాబ్జమునం దుదయించె బ్రహ్మ సం
ప్రీతిగ నావిరించికి మరీచి జనించె మరీచి కన్వయ
ఖ్యాతుఁడు పుట్టెఁగశ్యపుఁడు గశ్యపుఁ డన్మని కుద్భవించె లో

ఘనుఁ డాసూర్యున కన్వయాదిజుఁ డనంగా రాజధర్మంబ తాఁ
దనువై శాశ్వతరాజయోగమున నొందం బుట్టె వైవస్వతుం
డనఘుం డాతనికుద్భవించె మను వుద్యద్వేదశాస్త్రార్థత
త్త్వనిజాచారసమస్తధర్మనయశాస్త్రప్రౌఢి శాచార్యుఁడై. 3

ఇట్టిమనువంశంబున నిక్ష్వాకు వుట్టె నిక్ష్వాకువంశంబునం గకుత్స్థుండు వుట్టె నాతనికిం బృథివి దనపేరం జేసినపృథుండు వుట్టెం బృథువంశంబున మాంధాతృండు వుట్టె మాంధాతవంశంబునం బురుకుత్సుండు వుట్టెం బురుకుత్సవంశంబున సాగరంబు దనపేరం జేసినసగరుండు వుట్టె సగరవంశంబున దిలీపుండు వుట్టె దిలీవంశంబున భాగీరథిఁ దనపేరుగాఁ దెచ్చినభగీరథుండు వుట్టె భగీరథవంశంబున నతీతానాగతవంశకర్త యైనరఘువు వుట్టె రఘువంశంబున నారాయణావతారుండైనశ్రీరాముండు వుట్టె శ్రీరామవంశంబున నలచక్రవర్తి వుట్టె నలునికిం బుండరీకుండు వుట్టె పుండరీకవంశానుక్రమంబున నాదిరాజులకంటెం బ్రసిద్ధుండై కరికాలచోడచక్రవర్తి వుట్టె భానువంశంబు గరికాలవంశంబు నాఁ జేసికొని చతుస్సాగరపర్యంత మహీచక్రంబు నిర్వక్రంబుగా బాలివాతం బాలించి.

కరికాలచోడనరపతి, వరగఁగ నిజలాంఛనములు బలువిడి హిమవ
ద్గిరితటముల సేతుమహీ, ధరతటముల నిలిపెఁ జక్రధరతుల్యుండై. ౪

కావేరి తరులు గట్టఁగ, వేవే పల్లవుఁడు దనదు వెట్టికి రామి౯
దా వాని నుదుటికనువోఁ, గావడిఁ గరికాలవిభుఁడు గాలం దుడిచె౯.

ఇనుపాదము లర్చింపఁగఁ, జనుచోఁ జనియర్ఘ్యమంత్రజలపాత్రలు దా
వినువీథి నాఁగఁ బంచెను, ఘనముగఁ దనయాన వాడిచి కరికాలుఁడిల౯.

అట్టికరికాలనృపతికిఁ, బుట్టెను మహిమానచోడు భువి నతనికిఁ దాఁ
బుట్టిరి గరికాలుఁడు సిరి, కట్టనుఁగులుఁ దొండమాన(ఘు)నదశవర్మల్. ౭

ఆకరికాలనరేంద్ర, ప్రాకటవంశమునఁ బుట్టె భాస్కరకులర
త్నాకరచంద్రుఁడు రిపునృప, భీకరుఁ డధికుండు చోడబిజ్జన బిరుదై. ౮

రూఢిగ బిజ్జన దను రేం, డాడినభూపతులశిరము లసిముఖమునఁ జెం
డాడుచుఁ గయ్యము లిరువది, యే డెన్నఁగఁబాడిచె జయమహీవల్లభుఁడై.

బల్లహుతో ఘనబిజ్జన, ప్రల్లాటన వచ్చుపాముఁ బట్టినఁ గని యా
బల్లహుఁ డిచ్చె గుణాంకము, గొల్లభి గొని జనులు గండగోపాలుఁడన౯.

దండి(జగ) దొబ్బగండఁడు, గండరగండండు వీరఖని బిజ్జన యు
ద్దండుఁడు దాఁ బదుమువ్వుర, గండండను ధార పలిపెఁ గటకములోనన్.

బిరుదనఁ జన్న యా తెలుఁగుబిజ్జనమన్మఁడు మల్లిదేవఁ డ
చ్చెరు వగుచున్న పొత్తపియు చెన్నగువీడుగ వాలి పాకనా
టిరువదియొక్క వేయిఁ జన నేలుచు బల్లహుదండు గెల్చి త
త్కరివరకుంభమౌక్తికలతాతతిఁ బూన్చె నిజాసిపుత్రికన్. ౧౩

అతనికిఁ బుట్టి రొప్ప మధురాంతక పొత్తపి చోడసిద్ధిభూ
పతియును మల్లిదేవఁడును బాహుపరాక్రమ విక్రమక్రముల్
నతనరనాథఫాలకషణస్థిరపాదసరోజవైభవుల్
వితతసముద్రకాంచిపరివేష్టితభూపరిరక్షణాయుతుల్. ౧౪

ధరఁ బొత్తపిసిద్ధినరేశ్వరునికి నుదయించి భూమి నన నేలి త
చ్చరితులు పొత్తపిసోమేశ్వరదేవుఁడు మల్లిదేవవసుధాధిపుఁడున్. ౧౫

భూపదిలీపుఁడై పరఁగు పొత్తపిసిద్ధనితమ్ముమల్లధా
త్రీపతికిన్ సమస్తజగతీపతికి న్సుతు లుద్భవించి రా
శాపరిపూర్ణకీర్తులు భుజాబలవంతులు నైనతొంటియ
య్యోపిలిసిద్ధియుం గులసముద్ధరణుం డగుమల్లిదేవుఁడున్. ౧౬

ఆపొత్తపిసోమేశ్వర, భూపతికిం దమ్ముమల్లభూపాలున క
య్యోపిలిసిద్ధికిఁ దమ్ముఁడు, దీపితసితకీర్తి మల్లిదేవుఁడు పరఁగెన్. ౧౭

పరఁగినమల్లిదేవజనపాలుఁడు పొత్తపిచోడవంశశే
ఖరుఁ డినవంశకర్త యనఁగాఁ గడు బ్రాలి విరోధిరాజసం
హారకుఁడు దొంటి తాతలక్రియం దగు పొత్తపి రాజధాని గా
ధర సకలంబు నేలె విదితం బగు బాహుపరాక్రమంబునన్. ౧౮

ఆ మల్లిదేవునికిఁ గుల, భామాతిలకంబు పుణ్యభాగిని గౌరీ
శ్రీమహాదేవికిఁ బుట్టెఁ దపోమహిమఫలమ్ము దాన పొడవైనగతిన్. ౧౯

ఇనుఁ డుదయమైనయట్టులు, మను వుదయంబైనయట్టు మఱి రఘురాముల్
జనియించినట్లు గులవర్ధనుఁ డోపిలిసిద్ధివిభుఁడు దా నుదయించెన్. ౨౦

కరికాలోత్తమరాజవంశమునఁ దా గౌరీమహాదేవికిన్
సురభుల్ గల్పకుజాతముల్ రసనదీతోయ(ంబు) సింతామణుల్

ధర నేకాకృతిఁ బుట్టెనో యన జగదాం....కుఁడై యిచ్చు దీ
నుర కిమ్యోపిలిసిద్ధివల్లభుఁడు గణ్యుం డన్ను వర్ణింపఁగాన్. ౨౧

ఓపిలిసిద్ధివల్లభు జయోన్నతుఁ జెంకణచక్రవర్తి నా
జ్ఞాపరిరక్షితాఖిలదిశావలయున్ ఘనదానకర్ణు లీ
లాపరిపూర్ణరమ్యు శుభలక్షణమూర్తి జయంతు నశ్వశి
క్షాపురుహూతుఁ బేరుకొనఁగాఁ జనుఁ జోడకులైకభూషణున్. ౨౨

సకలాధీశనతోత్తమాంగమణిభూషారమ్యపాదాబ్జుఁ దా
టకనారాయణు భానువంశనృపచూడారత్ను శిష్టేష్టబం
ధుకవీంద్రద్విజరక్షుఁ గాశ్యపసుగోత్రుం బాకశాసితపు
త్రకు మా మోపిలిసిద్ధిఁ జెప్పఁ దగు నుద్యద్గండగోపాలునిన్. ౨౩

తననిజవృత్తి మీఁద విదితంబుగ నోపిలిసిద్ధి విన్నసి
ద్ధనకు ననుంగుఁదమ్ముఁడు ప్రతాపమునం జని కమ్మనాడు సే
కొని గణపావనీశు దయఁ గూడి తదాజ్ఞవహించి యేలెఁ బా
వన మగునాఱువేలును నపక్రపరాక్రమవిక్రమంబునన్. ౨౪

ఇట్లెలి సప్తసంతానంబులు దేవబ్రాహ్మణదత్తులు సమస్తధర్మంబులుం బ్రతిపాలించి. స్వస్తిచరణసరోరుహ విహితవిలోచన త్రిలోచనప్రముఖాఖిలపృథివీశ్వర కారిత కావేరీతీర కరికాలకులరత్నప్రదీప సాహితకుమారగజాంకుశ యొఱయూరి పురవరాధీశ్వర సూర్యవంశోద్భవ కాశ్యపగోత్ర తెంకణాదిత్య జగదొబ్బగండ కీర్తినారాయణ సమస్తప్రశస్తిసహితంబు శ్రీమన్మహామండలేశ్వర యోపిలి సిద్ధనదేవ చోడమహారాజులు స్వస్తిశ్రీ శకవర్షంబులు ౧౧౪౬ గు తారణసంవత్సర కార్తిక శుద్ధ శ్రీయేకాదశి శుక్రవారమునం గమ్మనాటిలోన నిజరాజధాని యైనకొట్టియదొన శ్రీశంకరేశ్వర శ్రీమహాదేవరకు గణపతిదేవమహారాజునకు ధర్మువుగా హవిర్బలియర్చనలకు నంగభోగరంగభోగాలకు నందులమొగడచెఱువు దేవభోగ మాచంద్రార్క తారకము సర్వకరపరిహారముగా నిచ్చితిమి. మంగళమహా. శ్రీశ్రీ.

స్వదత్తాం పరదత్తాం వా యోహరేత వసుంధరామ్ ।
షష్టిర్వర్షసహస్రాణి విష్టాయాం జాయతే క్రిమిః

# పరిణామ మన నేమి ?

జగన్మండలమున సర్వమును నిరంతరము మాఱుచుండును. శక్తి యెచ్చో నైనను స్థావరం బగుచు జడం బగునే? ఇది సర్వాత్మకం బగుచు లోకప్రసారము నకుం గారణం బగును. శక్తియొక్క వ్యాపారమువలననే లోకోత్పత్తి యగును. దీనివలననే యందలి లోహంబులును, వృక్షములును, బశుపక్ష్యాదులును, మానవులును, వేయేల, నానావిశ్వము నుత్పత్తియగును.

ఎల్లెడలందును బ్రజ్వలించుటయె శక్తిస్వభావము. ఇది యెచ్చోనైనను నిమ్నమయినట్టు తోఁచెనేని ప్రతిపక్షము లగుశక్తులు (opposing forses) తీక్ష్ణము లగుటవలన, దీనికార్యము వెలువడకున్నది గాని, యది నశించె ననరాదు. ప్రతిపక్షంబులకు ననుసరణమో, లేక వానిపై నాధిపత్యమునో చెందుచు, శక్తి నిరంతరము క్రియలు సల్పుచుండును. ఎప్పుడును నశింపదు.

లోకమున సర్వకాలసర్వావస్థలయందును మన కీవిషయము గోచరించును. ప్రతిపక్షంబు లగుశక్తు లతీతంబు లయినప్పుడు తాము నిమ్న మగుటయు నవి సుసాధ్యము లయినప్పు డాధిపత్యమును బొందుటయు లోకన్యాయ మనుట సుగోచరము. ఇదియే లోకస్వరూప మనియుఁ జెప్పవచ్చును. దీని లోకస్పర్థ యనుట వాడుక.

ఆత్మసంరక్షణముకొఱకు, నభివృద్ధికొఱకును సర్వజీవములును నిరంతరము ప్రయత్నపడుచున్నవి. జీవము లనేకములు, పదార్థములు మొదలు, ఇంతియకాదు. ఆత్మసంరక్షణము గావించుకొనుటతోఁ గోర్కెలు నిలుచుటలేదు. భోగేచ్ఛ కల్గు, సుఖంబులకైఁ చేయిఁజాఁచి వాని గ్రహింపఁబోవుట సిద్ధించును. పిదప సంతానాభివృద్ధి, దానివెనువెంటఁ గోర్కెలు వేనవేలుగాఁ గల్గును. వీని నన్నింటిని సాధించి, తమకోర్కెల నెఱవేర్ప వలయు నన్న నెంతపోరాటము సలుపవలయునో యది సుగోచరము.

సర్వజీవములును, నిరంతరము నావరణముతోఁ బోరాటము సలిపి యాత్మసంరక్షణము నభివృద్ధియుఁ బొందవలయు. అన్నిజంతువులును దమభోజ్యములను వెదకుచు, వానిని గ్రహించుచు, నతివృష్టి యనావృష్టికాలములం దాత్మసంరక్ష

ణోపాయముల నెదకుచు, వాని నిర్మించుచు, నెప్పు డేమి యిక్కట్టు కల్గినను దాని జయింప సిద్ధపడి, సర్వకాల సర్వావస్థలయందు జాగరూకతతో మెలఁగుట శ్రేయస్కరమే, కాని, మైమఱచి, తనంతటఁ దాను స్వేచ్ఛమై, జీవింపవచ్చు నని యజాగ్రత్తతో నుంట ప్రాణత్యాగముకొఱకే. ఇట్టిప్రతిమనుష్యుఁడును ప్రతి నిమిషమును, దనచుట్టునున్న సర్వపదార్థముల ననుసరించియె వర్తింపవలయును. జీవముకొఱకై, భక్ష్యముల వెదకవలయు. ఇవి శాకంబు లయ్యేనేని వర్షాదులను మృగంబులయ్యేనేని వీనిస్వభావములను, లెస్సగ, గమనించి, వలసినప్పుడు వాని గ్రహించుటకై యుపాయములఁ బన్నవలయు. పిదపఁ దన సంఘము ననుసరించి, కష్టముల కోర్చి సాంఘికధర్మముల కొడంబడవలయు. పిదప, జరామరణంబు లతిత్వరితముగ నవతరింప కుండుటకై, దేహపరిశ్రమా ద్యుపాయంబులచే నిరంతరము పోరాటము సల్పవలయు. ఇతరశత్రువుల (మృగములు, చోరులు మున్నగువారు) నుండి యాత్మసంరక్షణముఁ గావించుకొనుటకుఁ గావలసిన ప్రయత్నములఁ జేయవలయు. వృక్షములు నిల్లె, నీరు, గాలి, సూర్యరశ్మి వీనిఁ గొనుటకై, నిరంతరము ప్రయత్నపడుచుండును. తుపాను, మంచు, శాకభక్షకులు, మున్నగుశత్రువులనుండి సురక్షితము లగుటకై యుపాయముల వెదకవలయు. లేదేని, ప్రాణచ్యుతి సిద్ధము. విస్తరింపనేల, సర్వస్థితిగతులందును సర్వజీవములును దమయావరణముతోఁ బోరాడుచు నాత్మసంరక్షణము నభివృద్ధియుఁ గాంతురు. లేదేని, యనివార్యమగునీలోకస్పర్ధయం దపజయంబు నొంది, నశింతురు.

సర్వజీవములును, నిట్టి సంరక్షణాభివృద్ధులకొఱకుఁ దమ యావరణముతోఁ జల్పుపోరాటమునకే, లోకస్పర్ధ యని పేరు.

ఈలోకస్పర్థం జేసి, సర్వజీవములును మార్పుఁ జెందుచుండును. ఆవరణమునకుఁ దగినట్లు తమశక్తులను, రూపములను మార్పుఁ జెందించుచుండును. ఇట్లు జగన్మండలము సర్వము నిరంతరము మాఱుచుండును. సర్వమును గ్రమముగ మార్పుఁ జెందుచుండుఁ గాని, సుస్థిరంబుగ నేదియు నిలువఁజాలదు. ఇట్లు జగత్ప్రసారము కల్గుట, యీస్పర్థవలననే. ఇందువలన, జగత్ప్రసారము విన్యాయముగు (lawless) కలవర మనరాదు. ఆవరణము ననుసరించి జంతువును, జంతువు ననుసరించి, యావరణమును గ్రమంబుగ మార్పుఁ జెందుచుండును. శాస్త్రవేత్తలు గెడ్డిస్ థామ్సన్‌గార్లు, చెప్పునట్లు "క్రమంబగు మార్పులు మాఱుచున్న

క్రమమిదియె. చేతనాచేతనమండలములయందుఁ బ్రకటితం బగున్యాయము. మార్పులను దెల్పుట కేర్పడినపరిభాషయే, పరిణామము.”

[*Evolution P. 7. Home University Library Series.*]

పరిణామ మనఁగా నభివృద్ధి యని యర్థముచేసికొనుట వాడుక. ఈయర్థము శాస్త్రసమ్మతము కాదు. జగత్ప్రసారమునఁ బ్రవృద్ధి కల దనుట నిజమే. అయినను క్షీణతయును గలదు శాస్త్రీయుఁడు లోకప్రసారరీతి నున్నది యున్నట్టు తెల్పవలయుఁ గాని, తోఁచినసిద్ధాంతముల సాధింప నమకట్టుట ప్రశస్తము కాదు. ప్రవృద్ధియు, క్షీణతయును రెండింటిని లెస్సగ గమనించి వాని పరిమితిని, ఉత్పత్తిని జక్కఁగ శోధించి తేటపఱుచుటకు బద్ధుఁడు.

పరిణామమునుగుఱించి మఱియొక తప్పుటభిప్రాయము కలదు. పరిణామవాదముయొక్క పరిమితి యెఱుఁగక, కొందఱు దీనిని హేళనము చేయుదురు. “ఆవరణము ననుసరించిన జీవము ప్రవర్ధిల్లును, విరుద్ధ మగునది క్షీణించును, స్నేహితు లనేకు లుండిరేని సుఖము, శత్రువులు హెచ్చయినఁ గష్టము; ఇది యెవ్వ రెఱుఁగరు, సర్వసామాన్య మగు నీసత్యమును బాశ్చాత్యశాస్త్రవేత్త డార్విన్ మహాశయుఁడు పరిశోధించి, కనిపెట్టి వెదచల్లె ననుటయు, సూర్యునివలె నిది జ్ఞానమండలమును దేదీప్యమానము గావించె ననుటయు, వృథాకంఠక్షోభము కాదె” యని వాదింతురు. పరిణామవాదముయొక్క నిజరూపము నెఱుఁగమిచే నిట్టిహేళనము కల్గును. ఇది జంతువులు సుఖమును సంపాదించురీతిని దెల్పునది దీని యుద్దేశ్యము కాదు. ఇది జగత్ప్రసారమున జాత్యుత్పత్తివిధానమును దెల్పు మహాసిద్ధాంతము. దీని స్వరూపమును విచారింతము.

లోకమున జీవు లుండు చోట్లివి యవి యని లేవు. పర్వతశిఖరాగ్రంబులందును, సముద్రాంతరంబునందును గుహాలలోను నన్నిదిక్కులందును, వృక్షములలో, మృగములలో జీవించుచున్నవి. సర్వజీవులకును బ్రాణాసక్తియు, సంతతీచ్ఛయుఁ గలవు. సాధ్య మగునేని యత్యమితాభివృద్ధిం జెంది, లోకమంతయుఁ బర్వును. జీవులు గుణోత్తరశ్రేణిపై (geometric progression) యభివృద్ధిఁ జెందును. సర్వస్థలముల నాక్రమించుకొనుచు, నాహారము నిష్టానుసారముగఁ గైకొనుచు, నభివృద్ధి చెందుటకు యత్నించును. ఇట్లు సర్వజీవములును నిరంతరము ప్రయత్నపడుచుండును. ఇందుచే స్పర్థ కలుగు ననుట ముందే విచారించితిమి. ఈలోకస్పర్థయందుఁ గడతేఱవలయునన్న, బలిష్ఠులు నుపాయవంతులును గా

వలయు. లేదేని, జీవము లడుగంటి నశించును. ఇందు మంచిచెడుగులు, ధర్మా ధర్మంబులు లేవు. వేనికిఁ దగినసాధనములు కలవో యవి తరించును. లేనివి తమ కనుగుణంబు లగుపరస్థలములకుఁ బోవలయు. ఇది యు సాధ్యము కాదేని, తా మున్నచోటనే నిలిచి యభివృద్ధికైఁ బోరాట వదలి, దీనవృత్తుల నవలంబించి, దీనాకారంబులఁ బడయుట కర్తవ్యము, లేదేని వినాశ మనివార్యము.

ఇట్టిపోరాట సల్పుట, యితరమృగములతో మాత్రము కాదు. శీతోష్ణ స్థితులు మున్నగు భౌతికాదివికారంబులఁ దరించి, వానినుండి యుపాయములు కల్గకుండునటులు తమనిర్మాణమునో, స్వభావమునో మార్పు చెందించుచుండ వలయు.

ఈస్పర్థ యెవ్వాడైనను నిలుకడ చెందు ననుట లేదు. తమతమ నెలవులకుఁ దగినట్లు, జీవము లనుదినంబును మాఱుచుండవలయును. లేదేని, పదభ్రష్టంబో లేక విగతజీవులో యగుట సిద్ధము. ఇదియె జగత్ప్రసారరీతి. ఇది లోకస్పర్థచేఁ గల్గును. దీనం జేసియే, ప్రతిమృగమును శక్త్యనుసారముగఁ దనయునికిపట్టుల వెదకికొనుచు, వాని ననుసరించి తమస్వభావమును, నిర్మాణమును శ్రేయస్కర ముగ మార్చుకొనుచుండును. ఇట్లు కలిగిన మార్పులు, శ్రేయస్కరములు గావున, నానాఁట నభివృద్ధిఁ జెందును. వంశపారంపర్యముగాఁ బోవుచు, సుస్థిరంబగు ను. ఈయంశములు గలజంతువు లన్నియు నొక్కయుపజాతి యగును. ఇట్లే, వివిధము లగుమార్పులు స్థిరపడుచు, వివిధజాతులు పరిణమిల్లును. ఈవిధముననే జీవమండలమున నున్నసర్వజాతిభేదములును వెలువడును. తొల్లింటి జీవకణ ములు యుగాంతరములనుండి మార్పుఁ జెందుచు, వృక్షములుగను, జంతువులు గను వానిలోని వివిధజాత్యుపజాతులుగను, బరిణమించినవి.

లోకమునఁ గన్పట్టు సర్వభేదము లేకోత్పత్తిస్థానమునుండి, లోకస్పర్థ యొక్క తీక్ష్ణతచే వ్యతిరేకింపఁబడిన శాఖోపశాఖలు గాని, యొండొంటితో సంబంధములేని ప్రత్యేకసృష్టములు కావు. ఇదియె పరిణామసిద్ధాంతము.

ఇది మొదట జీవశాస్త్రమున, డార్విన్ మహాశయునిచేఁ బ్రయోగసమేత ముగా దృఢపఱుపఁబడెను. దీనికి ముందే, లాప్లేసు, హార్షెల్ మున్నగు శాస్త్రిలు జ్యోతిర్మండలమునఁ బరిణామమును గనిపెట్టి ప్రకటించిరి. లయల్ అనుశాస్త్రి (డార్విన్ సమకాలికుఁడు) భూగర్భంబున లోహము లెట్లు పరిణమించునో శోధించి తెలిపె. మాల్థూస్ అను నర్థశాస్త్రివేత్త మనుష్యసంఘములలో జీవమునకై

కల్గుస్పర్థయు, దాని ఫలమును విశదీకరించుచుఁ బుస్తకము రచించె. (డార్విన్, ఈ పుస్తకమువలనఁ బ్రోత్సాహపఱుపఁబడెను.) హంబోల్ట్ అను జర్మన్ జీవశాస్త్రిజ్ఞుఁడు, జంతువులు తమ దేశముల ననుసరించి రూపములఁ జెందియుండుట వర్ణించి చెప్పెను. డార్విన్ మహాశయుఁడు సర్వవిషయంబులఁ బరిశీలించి, పరిణామసిద్ధాంతమును దేటతెల్లముగఁ జేసెను. పిదప, సర్వశాస్త్రిములు నిది లోకన్యాయ మని దీని నంగీకరించినవి. జ్యోతిశ్శాస్త్రిము, భూగర్భశాస్త్రిము, జీవశాస్త్రిము, వీని నుండి, మానవశాస్త్రిము, సాంఘికశాస్త్రిము, ధర్మశాస్త్రిము, నీతిశాస్త్రిము, అలంకారశాస్త్రిము మున్నగు శాస్త్రిము లన్నింటను, బరిణామసిద్ధాంతము పర్వుచున్నది. జోసెప్ మకాబి గారు 'పరిణామాంశములు' (Principles of Evolution) అను తమ యాంగ్లగ్రంథమునఁ జెప్పిన ట్లీసిద్ధాంత ముదయించు సూర్యునివలె బ్రవృద్ధమాన మగుచు జ్ఞానమండలము నంతయు వెలుఁగు పరుపుచున్నది.

ఈలోకన్యాయమునకుఁ బ్రమాణము లెవ్వి? లోకపరిణామరీతినిఁ బ్రత్యక్షముగఁ గనుఁగొనవలయు నన్న, బుద్బుదప్రాయం బగుమనుష్యజన్మము చాల దనుట సువిదితము. ఇట్టి ప్రత్యక్షప్రదర్శక మసాధ్యమయిన నేమి? దీనికిఁ బ్రమాణములు వేనవేలుగాఁ గలవు. లోకన్యాయ మగుటచే నిది యెల్లెడలందును రచితమై యున్నది. గెడ్డీసు థామ్సన్ గార్లు తమ 'పరిణామము' అను నాంగ్ల పుస్తకమున వ్రాసినట్టి "పరిణామసిద్ధాంతము లోకప్రసారమును విశదీకరించుటకై యేర్పడిన శాస్త్రిసమయము. ఇది యొక్కటియే, సర్వవిషయములను దేటపఱుచుచు, శాస్త్రీయమై యొప్పుచున్నది. ఇది యెన్నివిషయములను విశదీకరించునో యవి యన్నియు, దీనికిఁ బ్రమాణములే."

పి. నరసింహయ్య.

# సూర్యమండలము.

ఏమహాతేజమునందు బుధశుక్రాంగారక భూమండలములును, గురు, శని, వరుణ నభస్థూణాది గ్రహములును, మహాసముద్రాంతరంబులఁ గన్పట్టు చిన్న చిన్న బొమ్మరాలపోలిక మునిఁగియున్నవో, యేప్రభాపటలము, మానవ మానసాతీతదూరములకు నంతకంతకు బలుచపలుచనై నక్షత్రములనుండి మనకుఁ గనిపించు లేఁత వెలుఁగులఁబోలెఁ బ్రసరించుచున్నదో, యామహాతేజఃప్రచారమునకు మూలాధార మగు సూర్యమండలమును గుఱించి యీచిన్నవ్యాసము వ్రాయఁబూనితిని.

తొలుదొలుతఁ దీవ్రమై బుధమండలమును ముంచి, శుక్రగోళము నెల్లనలమి భూమండలముపై వ్రాలి సకల చరాచరప్రపంచమునకుఁ బ్రాణాధారమై యీసూర్యరశ్మి వెలుఁగుచున్నది. వృక్షములఁ బెంపను, శరీరముల సరియగు నారోగ్యస్థితియందు నిలుపను, వస్తుపరిణామములఁ గలిగింపను, సూర్యరశ్మియే కారణము. ఈసూర్యకిరణము లగాధావకాశము నెల్ల సముద్రమునందుఁ దరంగములు పొంగుచుఁ గ్రుంగుచు ఖండఖండాంతరంబులఁ జేరునటులు కెఱటములు కెఱటములుగా సూర్యావబద్ధ గోళముల కెల్ల వ్యాపించుచున్నవి. సముద్ర తరంగముల మనము చూడఁగలము. వానియున్నతి కొలువవచ్చును. కెఱటమునకుఁ గెఱటమునకుఁ గల యెడము గ్రహింపవచ్చును. తేజస్తరంగము లన్ననో సూక్ష్మమునకు సూక్ష్మములై యుండుటవలన మన స్థూలనేత్రములకుఁ గాదు కదా, యొకపాటి యంత్రములకును గోచరము కావు. అవి యెంతయుఁ గ్రొవ్వాఁడి యంత్రములచే శోధింపవలయును. అట్టి శోధనలవలన నీ తేజస్సముద్రమునందలి కెఱటములు నానాప్రమాణములును, నంతరములును గలిగియున్నట్లు తేలినది. తేజస్సును నేత్రములచే గ్రహింతుము. ప్రకాశజ్ఞానము నేత్రమునందలి నరములకుఁ గలుగు సంస్కారమువలనఁ బుట్టుచున్నది. నానావర్ణములు నట్టి సంస్కారభేదముల వలన నగును. ఎఱుపురంగు కానిపించిన నొకవిధమైన సంస్కారమును, బసుపున వేఱొకటియు, గౌరమున వేఱొకటియు, నీలిమచే మఱొకటియుఁ గన్నులలోని నరములయందుఁ బుట్టుచున్నవి. ఇట్టి సంస్కారభేదములకుఁ దేజస్తరంగప్రమాణ భేదములె కారణములు.

మఱియు సూర్యరశ్మియందు నానాప్రమాణగత తరంగములుఁ గూడి యున్నట్లు సామాన్యముగా బాలకుల కందఱకును దెలిసినవిషయమె. ఈవిషయము ప్రత్యక్షముగా నెట్లు తెలియునదియు వివరింపనిచో ముందు ముందు చెప్పఁబోవు విషయములు గ్రాహ్యములు కావు గావునను, నివన్నియు నీకాలపు వారి భ్రమ లని కొందఱు త్రోసివేయుట కవకాశము గలుగుం గనుకను దిఙ్మాత్రంబుగ నావిధము సూచించెద.

ధనికులగృహములందు దీపముల చుట్టుఁ జేరునై వ్రేలాడుచుండు గాజు కణిక లందఱును జూచియేయుందురు. అట్టి గాజుకణిక నొకదానినిఁ గంటికిఁ బెట్టుకొని చూచినచో నన్నియు రంగులురంగులుగఁ గానిపించుచుండును. ఆ రంగులు సామాన్యముగ వస్తువుల పంచలను మాత్రము స్పష్టముగను, దక్కుంగల చోటుల నవ్యక్తముగను గ్రమ్ముకొని యుండును. అట్టి కణిక నొకదానిని సద్దముగఁ గోసినచో నాకోన త్రిభుజాకృతిగ నుండును. ఆకణిక నీచివర నిలుచుండఁ బెట్టిన ట్లూహించుకొనవలయును. ఆవిధమున నిలువఁబెట్టిన పట్టకము పలకలలో నొకదానిపై సూర్యకిరణములను బ్రసరింపఁజేసినచో నాకిరణములు గాజులోనికిఁ జొచ్చి యావలకు వెలువడును. ఆవల నొక కాగితమును బట్టిన దానిపై నొక్కపాడమాత్రమే కానఁబడక, చిత్రవర్ణసంకలిత మగుపఙ్క్తి కనఁబడును. మొదట సూర్యరశ్మి తెల్లగనే యుండినను, పట్టకములోనికిఁ బోయినతరువాత ననేకవర్ణములుగఁ జీలిపోయినది. నానావర్ణములును, భిన్నభిన్నప్రమాణగతము లగు తేజస్తరంగములు కంటికిఁ దాఁకుటవలనఁ గలుగున ట్లింతకుఁ బూర్వమే చెప్పియుంటిని. ఈకెఱటములు వానివాని ప్రమాణములఁబట్టి గాజులలోఁ జొచ్చి వెడలునపుడు భిన్నభిన్నములుగఁ బోవుచుండును. ఆకారణమువలన బయటికి వచ్చునరికి నే తరంగముల కాతరంగములు విడిపోయి యన్నిరంగులును బ్రత్యేకములుగఁ గనఁబడును. మఱియును శోధించుకిరణములు సన్నములైనకొలఁదిని రంగులు స్పష్టముగఁ గనిపించుచుండును.

పైని వివరించిన పట్టకముం దెచ్చి దానియెదుట సన్ననిచీలిక గలతెరను నిలిపి సూర్యరశ్మిని దానిపై వ్యాపింపఁజేసినచో సన్నని కిరణపుంజ మొకటి గాజుకణికపైఁ బడును. ఆవల నొకకాగితముఁ బట్టిన దానిపై నెల్లరంగులును గానిపించును. ఏరంగున కారంగు, మొదటికన్నము నంత వెడల్పుగ నుండును. కొన్ని సందర్భములయందుఁ గన్న మెక్కువ వెడల్పు గలిగి యుండుటవలన రంగులపఙ్క్తి

లన్నియు స్పష్టముగఁ గానిపింపక నడుభాగమున సంకీర్ణములై పోవును. సంకీర్ణములు గాకుండునట్లు కన్నమును సన్నగించుచుండవలయును. వేఱొక కణిక యైననుఁ బట్టవలయును. ఈధర్మములఁ బురస్కరించికొని కిరణశోధినీయంత్రము నిర్మింపఁబడినది. సమగ్రమగు నొక కిరణశోధినీయంత్రమునందుఁ బైవర్ణించిన రంగుపట్టెలను బరీక్షించినచో రంగు సమానముగ వ్యాపించియుండక పట్టెలనడుమనడుమ నల్లనిగీఁతలు కానిపించును. ఈగీఁతలకుఁ గారణ మేమియో యని జిజ్ఞాసువులు కడుఁబ్రయాసమునఁ బరీక్షింపఁదొడఁగిరి.

కరఁగిన లోహములనుండి వచ్చు వెలుఁగును, వైద్యుతప్రకాశమును, బరీక్షించిచూచిరి. మఱియు ననేకవిధములఁ బుట్టు వెలుఁగును, శోధించిరి. అందు లోహములవలన వచ్చువెలుఁగున రంగుపట్టెలు సమానములుగ నుండి రంగంతటను వ్యాపించియుండెను. వైద్యుతతేజమువలన వచ్చుపట్టెలు విద్యుత్తుచెణకు రేఁచు లోహాగ్రములఁబట్టియు రెండగ్రములకు నడుమఁ గలవాయువిశేషమునుఁబట్టియుఁ బట్టెలరంగులును, రంగులకు నడునుండుగీఁతలును మాఱునట్లును తెలిసికొనిరి.

మఱియు నంతట నాఁగక లోహములను వాయురూపములుగఁ జేసి గాజుబుడ్లయం దుంచి వానిని విద్యుత్తుచేఁ బ్రజ్వలింపఁజేసి దానివలనఁ బుట్టువెలుఁగును బరీక్షించి చూచిరి. అట్లుచేయుటవలన నొక్కొక్కలోహమున కొక్కొక్కమాదిరి వెలుఁగు వచ్చుచుండు నని కనుఁగొనిరి. కనుక, కనఁబడువెలుఁగునుబట్టి యీవెలుఁ గేలోహముచే, నేపదార్థముచేఁ గలుగుచున్నదో చెప్పుటకు వీలు కలిగెను.

ఇన్ని చేసినను సూర్యతేజమునందలి రంగులు విడి యేర్పడినపట్టెలయందుఁ గనిపించురేఖ లేమైనది తెలియునుపాయము గనిపింపదయ్యె. పనియంతయు నైనది కాని యిఁకఁ గొంచెముమాత్రము లోపముగ నుండెను.

ఆరహస్యమునుగూడ 1859 సంవత్సరమునందు కర్హాఫు తలఁపనితలంపుగాఁ దెలిసికొనియెను. అతఁడు కిరణశోధినీయంత్రముతో సూర్యరశ్మిని శోధించుచో నాకిరణములు, సోడియపుటావిరి యుంచిన బుడ్డిలోనుండి పోవుట సంభవించెను. అట్లు పోవుటవలన సూర్యరశ్మిచే నేర్పడిన రంగుపట్టెలయం దొకానొక నల్లగీఁత మఱింత నలుపై కనఁబడెను. ఆనల్లగీఁత కనఁబడినచోటనే సోడియపుటావిరిచేఁ గలుగు వెలుఁగును బరీక్షించునపుడు పసుపుపట్టెయొకటి కనిపించెను. సోడియపుటావిరిచేఁ బుట్టువెలుఁగు సోడియపుటావిరిలోనుండి పోవలసినచో నదియుం దణఁగు

ననియుఁ దెలిసెను. దీనినిబట్టి సూర్యరశ్మియందు సోడియపుటావిరిచే బయలు దేఱు వెలుఁగు కలదనియు, నాకిరణములు సోడియపుటావిరిలోనుండి పోవుటవలన పసుపుపట్టె యుండవలసినతావున నల్లగీత యేర్పడె ననియు నతఁడు గ్రహించెను. మఱికొన్నిశోధనలు చేసి తెల్లగాఁ గాలి మెఱయు ప్రతివస్తువును రంగున సమాన ముగా నుండుపట్టెలు కలిగించువెలుఁగు నిచ్చు ననియు, మెఱయుచుండు ప్రతి యావిరియుఁ బ్రత్యేకముగ నొక్కమాదిరి పట్టెలు వచ్చు వెలుఁగు నిచ్చుననియు, వెలుఁగునుబట్టి యేయావిరివలన నావెలుఁగు కలిగినదియుఁ జెప్పవచ్చుననియు, తేజఃకిరణము లేయావిరియందైనఁ జొచ్చినచో, నాయావిరియందు వ్యాపించు దూరమునుబట్టి యాయా యావిరివలనఁ గలుగు రంగులకుఁ దుల్యస్వభావము లగు కిరణము లణఁగిపోవుచుండు ననియు నతఁడు తెలిసికొనెను.

ఈనూతనమార్గ మవలంబించి సూర్యరశ్మిని శోధింపఁ బ్రారంభించుటయు, ననతిచిరకాలములో సూర్యరశ్మిచేఁ గలుగు రంగుపట్టెలయం దున్న యట్టి నల్లగీత లలోఁ గొన్నిటియర్థము సువ్యక్తమయ్యెను. సూర్యరశ్మియందును, ఇనుము, రాగి, ఖటకము, సోడియము మొదలగు లోహములచేఁ గలుగు వెలుఁగును బోలిన కిరణ ములు కల వనియు, నవి సూర్యునిచుట్టు నావరించుకొనియుండు నాయా లోహ ధూమములయందుఁ గొంచెమో, సర్వమో యణఁగిపోయిన వనియును దెల్లమయ్యె ను. మనల సర్వకాలముల నావరించుకొనియుండు నీసూర్యరశ్మి యం దిన్నివింత లును, నిన్నిమర్మములును గలవు.

సూర్యమండలమునందు సోడియము, రాగి, యినుము మొదలగులోహము లన్నియు నావిరిరూపములై యం దావరించి యున్న వని నంతనే, లోహసముద్ర ములును, మఱుఁగుచుండు నాధాతువులనుండి వేఁడినీళ్లనుండి వచ్చు గాలివలె లేచు ధూమములును, ధూమములవలన నేర్పడు లోహమేఘములును, లోహమేఘ ములనుండి కురియు లోహవర్షములును మనశ్చక్షువునకు గోచరించును. సూర్య లోక మెంతయద్భుతము !

పైని జెప్పినదానిబట్టి సూర్యరశ్మి కాలి, కరఁగి, మఱిఁగి, తళతళ మెఱయు లోహములవలనఁ గలుగుచున్నట్లు తేలినది. అయిన సూర్యమండల మెంతవేఁడిగ నుండవలయునో! ఈవిషయమును దెలిసికొనుటకు ననేకప్రయత్నములు చేసిరి. కొందఱు శాస్త్రజ్ఞులు 4,000 † శతప్రమాణాంశము లనియుఁ గొందఱు 6,000

† మఱుఁగుచుండు నీరు 100 శతప్రమాణాంశములవేఁడి కలిగియుండును.

శతప్రమాణాంశము లనియుఁ జెప్పియున్నారు. ఏది యెటులున్నను సూర్య
మండల మెంతవేఁడిగ నున్నది యూహించుట మన కలవిగాదు.

సామాన్యముగ మనమందఱమును భూమి మిగుల విశాలమైన దని యను
కొందుము. భూగోళము వెడల్పు 8,000 మైళ్లు మాత్రమె. సూర్యమండలమో
8,50,000 మైళ్లు వెడల్పు గలది. భూమికి మాఱుగ నొకపెద్ద నిమ్మపండు పెట్టు
కొందము. దీనికి సమానముగ సూర్యుని జూపవలయు ననిన, 25 అడుగులు
వెడల్పుగల యొక పెద్దమట్టియుండ చేయవలయును. సూర్యునికిని భూమికిని నంత
యంతరము కలదు. మఱియు, నది భూమికన్న నెంతపెద్దదో యెట్లు చెప్పవచ్చు
ను? సూర్యునిచుట్టుఁ దిరుగుగ్రహము లన్నియుఁ జేరినను సూర్యుఁ డింకను 750
రెట్లు బరువుగ నుండును. ఆకృతిచేతను, బదార్థమువలనను, నంతపెద్దది కావుననే
గ్రహగోళము లన్నియుఁ జుట్టు దిరుగుట కర్హముగా నున్న దనవచ్చును.

సూర్యునిగొప్ప బరువునందు నాకృతియందుమాత్రమె కాదు; ఎన్నిలోక
ములకు సూర్యరశ్మి ప్రాణాధారమై యున్నది! ఎన్నిలోకములఁ దనతేజస్సున
ముంచుచున్నది! ఎన్నిలోకములఁ గళకల లాడించుచున్నది! ఎన్నిగోళములు
సూర్యుని యాకర్షణముచేఁ జుట్టుఁ దిరుగుచున్నవి.

300 సంవత్సరములకుఁ బూర్వము సూర్యమండలమునుగుఱించి విశేషముగ
నెవ్వరికిని దెలియదు. దూరదర్శినీయంత్రసాహాయ్యమునఁ గొందఱు జ్యోతిష్కులు
సూర్యునిపైని గొన్నిమచ్చలఁ జూచిరి. ఆమచ్చ లేమై యుండునదియుఁ దెలియు
టకుఁ జాలఁ బ్రయత్నములు జరిగినవి. అవి యున్నచోటున స్థిరముగ నుండక
మహావేగమునఁ దిరుగుచుండుటవలన, సూర్యుఁడును భూమివలెనే గిరగిర బొంగ
రమువలెఁ దిరుగుచున్నట్లు తెలిసికొనిరి. ఆమచ్చలు మాఱుచుండుటనుబట్టి
సూర్యుఁడు తనచుట్టుఁ దా నిరువదియాఱు దినములలోఁ దిరుగు నని నిశ్చయిం
చిరి. సూర్యుఁ డిరువదియాఱు దినములలోఁ దనచుట్టు దాను దిరిగివచ్చినచోఁ
దన్మండల మధ్యభాగములు గంటకు 4,300 మైళ్లు చొప్పునఁ దిరుగుచుండును.
అనఁగా, మహావేగమునఁ బోవు విమానములకంటెను, నిరువదిరెండింతలవేగ
మున సూర్యమండలమధ్యభాగములు తిరుగుచున్నవి.

మచ్చలఁ బ్రారంభమునఁ జూచినవా రవి సూర్యమండలములోని వెలుఁగు
పొరపై డాగులవంటి వని యనుకొనిరి. కాని యామచ్చలను బరీక్షించినకొలఁది,
సూర్యమండలము కొంచెముకొంచెముగా నడ్డము తిరిగినకొలఁది మచ్చలు డాగు

లు కావనియుఁ, బెద్దపెద్దగోతులవలె నున్న వనియుఁ దెలిసెను. అట్టిగోతు లేల కలిగె నని యాలోచింపవలయును.

కొందఱు సూర్యమండలము లోపలిభాగము చల్లాఱి యొక పెద్దబాతివలె నున్నదనియు దానిచుట్టు భూమిని మేఘము లావరించినట్లు ధాతుమేఘములు పరివారించినవనియు నవియే మెఱయుచున్నవనియు నామేఘములయందుఁ గన్నములు పడుటచే లోపలిభాగములు నల్లగఁ గనిపించుచున్న వనియుఁ జెప్పిరి.

ఐనను మచ్చలను బరీక్షించినకొలఁది నంతకంతకు విశేషములు గానిపించెను. ఎండలో నెవరైనను నిలుచునపుడు నీడను శ్రద్ధగాఁ జూచుకొనినచో, నీడయంతయు సమానముగా నుండక మధ్యమున నెక్కుడు నల్లగను జివరలఁ గొంచెము తేలికగను గనిపించును. నల్లనిభాగము ఛాయ యనియుఁ, దేలిక ఛాయ ఖండచ్ఛాయ యనియు వాడెదరు. ఈ విధముగనే యామచ్చలయందును ఛాయలు ఖండచ్ఛాయలుగనిపించినవి. ఈ రెండుతెఱఁగులనీడలు కానిపింపవలయు ననిన సూర్యమండలముచుట్టు నొకపొరమాత్రమె కాక యధమము రెండుపొరలైన నుండవలయును. ఆరెండింటియందును బైపొర ప్రకాశాధిక్యము కలిగి యుండవలయును. మఱియుఁ గొన్నిపరీక్షలుచేసి యీమచ్చలు చుట్టు గల తావులకన్న నెక్కువ వేఁడిగా నున్నట్లు తెలిసికొనిరి. అంతేకాక యీమచ్చలు సూర్యబింబములోనిమధ్యను జివరను గనిపించుట లేదు. మధ్యరేఖాధృవాంతరిత ప్రదేశములయందుమాత్రము కనిపించుచున్నవి. ఈసంగతుల నెల్ల సంగ్రహించి కొందఱు శాస్త్రజ్ఞులు మనభూగోళమునందు నిరక్షరేఖాభాగములఁ గలుగు నుష్ణతాధిక్యమువలనఁ బెద్దపెద్దతుపానులు బయలుదేఱి సమశీతదేశముల విజృంభించునట్లే సూర్యమండలమునందును మధ్యభాగమున వేఁడి యెక్కువగా నుండుటవలనఁ బెద్దతుపానులు బయలుదేఱి బింబాపరార్ధమునందుఁ గల లోహమేఘముల సంచలింపఁజేయుటవలన నీమచ్చలు గలుగుచుండునట్లు చెప్పిరి. అదియె నిశ్చయమును గానోవును.

తరువాత:—ఈమచ్చలయందు వృద్ధిక్షయములును గనిపించుచున్నవి. ఒకానొకకాలమునందుఁ బెద్దపెద్దవిగ, ననేకసంఖ్యలుగ బయలుదేఱి, క్రమముగా నసంఖ్యాకములై, యింక హెచ్చక, యచ్చట నుండి యొకదానివెనుక నొకటి యదృశ్యమై చిట్టచివర కొకటైనను మిగులదు; సరిగదా; సూర్యబింబముచుట్టు పంచలయందుఁ దేజ స్సెక్కువ యగును. అటుపైని మరల మచ్చలసంఖ్య క్రమ

క్రమముగాఁ బెరుఁగనారంభించును. తిరిగి యీమచ్చలు పరమసంఖ్యాప్రమాణములను జెంది క్షయమును జెందుచుండును. ఈ విధమున వృద్ధిక్షయములు యథా క్రమముగ నడుచుచుండును. పదునొకండు సంవత్సరముల కొకమాఱు సూర్యమండలమునందు మచ్చ లమితములై కనిపించుచుండును. మఱి పదునొకొండుసంవత్సరములకు సూర్యబింబము స్వచ్ఛముగఁ గళంకశూన్యముగ నగపడుచుండును. ఈమధ్యకాలమునందు మధ్యప్రకాశమును గలిగియుండును. మనము భూమిపైనుండి గ్రహములను బరీక్షించుచుండునటులె యల్లమహాగంభీరావకాశమునం దేమండలమునం దేని మేధాసంపన్ను లగు గణితజ్ఞు లుందురేని, వారు సూర్యమండలమును దమయంత్రములతో శోధించుచుందురేని యట్టి వారికి సూర్యుఁ డొకానొక కాలమునందుఁ గొంచె మధికప్రకాశవంతుఁడుగను వే ఱొక్క-కాలమునందుఁ గొంచెము న్యూనప్రకాశవంతుఁడుగను గనఁబడుచుండును. ఈవృద్ధిక్షయములు స్వల్పములె యయ్యును, స్పష్టముగ యంత్రములలో నగపడుచుండును.

ఈమచ్చల వృద్ధిక్షయములు పదునొకండేండ్ల కొకమాఱు కలుగుచుండు నని పైని జెప్పియుంటిమి. గ్రహగతులను గమనించిచూచినచో గురుఁడు పదునొకొండేండ్ల కొకమాఱు సూర్యునిచుట్టు తిరిగివచ్చుచుండునట్లు తెలియవచ్చును. అట్లగుటవలనఁ బదునొకొండేండ్ల కొకమాఱు గురుఁడు సూర్యునికి మిగుల సమీపమునఁ దిరుగుచుండును. గురుఁడు సమీపమునఁ దిరుగునపుడె యీమచ్చల లోఁ బెద్దమచ్చ కనిపించుచున్నది. ఈసందర్భమునుబట్టి గురుచారమునకును సూర్యకళంకమునకు నొకసంబంధము తోఁచుచున్నది. సూర్యావబద్ధగోళములం దెల్ల గురుఁడె మిగులఁబెద్ద. ఆపెద్దగ్రహము సమీపమునకు వచ్చినపుడె సూర్యుని యందుఁ బెద్దమచ్చ కనిపించుచున్నది. గురునికిని సూర్యునికిని గలయాకర్షణమే యీమచ్చకుఁ గారణ మని స్పష్టమగుచున్నది. ఆవిధముగనే తక్కిన మచ్చలును దక్కినగ్రహములవలనఁ గలుగుచున్న వని చెప్పవచ్చును. ఒకొ్క-క్క-గ్రహము సూర్యుని సమీపమునకు వచ్చినపు డొకొ్క-క్క-మచ్చ కనఁబడుచుండును.

సూర్యునియం దీమచ్చలు గనిపించునపుడు భూమండలమునందును వింతలు పుట్టుచున్నవి. ఉత్తరదక్షిణధ్రువములందు విద్యుత్తేజములు విజృంభించుచున్నవి. సారంతసంక్షోభములు బయలుదేఱుచున్నవి. నక్షత్రశాలలయందు సా్కంత

సూచిక లుంచియుందురు. అవి సర్వకాలములయందు భూసాకాంత *ధ్రువముల ననుసరించుచుండును. చిరకాలశోధనములవలన నీస్కాంతసూచికలును జలించుచుండునట్లు తెలిసినది. తొలుదొలుత స్కాంతధ్రువరేఖ మధ్యాహ్నరేఖకుఁ దూర్పున నున్నను క్రమముగా 160 సంవత్సరము లగుసరికి బశ్చిమమునకుఁ బోవును. మఱియు 160 సంవత్సరము లగుసరికి దూర్పునకుఁ దిరిగివచ్చును. ఈ మధ్యకాలమునందు నడుమ నెచ్చటెచ్చటని కాలమును బట్టియుండును. అట్లగుటవలన సంవత్సరసంవత్సరమునకుఁ గొంచెము మార్పు కలుగుచున్నది.

ఈ వార్షికచలనము మాత్రమె కాక ప్రతిదినమునఁ గొంచెము వెనుకకును గొంచెము ముందునకును జరుగుచున్నది. సూర్యుఁ డుదయించునపుడు ప్రొద్దున సూచిమధ్యస్థితియం దనఁగా, సాకాంతధ్రువరేఖయం దుండును. పూర్వాహ్ణము నందుఁ గొంచెము ముందునకు జరుగును. మధ్యాహ్నమునకుఁ దిరిగి మధ్యస్థితికి వచ్చును. ఆలాగుననే సాయాహ్నమునందును గొంచెము వెనుకకుఁ బోయి సూర్యాస్తమయమునకు దిరిగి మధ్యస్థితికి వచ్చును. ఆవిధముననే మార్పులు జరిగి యర్ధరాత్రమునకు మఱియొకమాఱు మధ్యస్థితికి వచ్చును. ఇట్లు దినమునకు నాలుగుపర్యాయములు సాకాంతసూచి మధ్యస్థితిని జెందుచుండును. దీనిం బట్టి యాలోచించి చూచినచో సూర్యమండలము స్కాంతసూచి నాకర్షించుచున్నట్లు స్పష్ట మగును. సూర్యమండలమునందలి స్కాంతశక్తి మాఱినప్పుడు సూచీచలనమును మాఱవలయును. సూర్యుని స్కాంతశక్తి యెక్కువైనయెడల సూచీచలన మెక్కువగ నుండవలయును; తగ్గినఁ దక్కువగ నుండవలయును.

సూర్యునియందు మచ్చలు విశేషముగఁ గనిపించు దినములయందు, సాకాంతసంక్షోభములు సంభవించుచున్నట్లు పైనిఁ దెలిసికొని యుంటిమి. అట్టి స్కాంతసంక్షోభములు కలుగునపుడు, నక్షత్రగోలాయంత్రములందలి స్కాంతములందును సంక్షోభములు పుట్టుచున్నవి. నల్లమచ్చలు కనిపించునపుడె కాక, తెల్లనిమచ్చలు కనిపించునపుడు నిట్టిసంక్షోభములు కలుగవచ్చును. 1859 సంవత్సరమునం దొకానొకప్పుడు "కారింగ్టను" అను గణితజ్ఞుఁడు సూర్యమండలమునందు మహాప్రకాశమాన మగు నొక తెల్లనిమచ్చను జూచెను. దాని తేజస్సునకు

* భూమియం దొక పెద్ద స్కాంతమువంటిది. ఈ ఉత్తరదక్షిణధ్రువములును, ఈ భూస్కాంతధ్రువములు నొకటి కావు. అందుచే మధ్యాహ్నరేఖలకు స్కాంతధ్రువరేఖలకుఁ గొన్ని యంశ లంతరము గలదు. ఈ యంతరముం గొలుచుటకే యీ స్కాంతసూచిక నుపయోగింతురు.

యంత్రమునందలి యవరోధఫలకము పగిలినట్లయ్యెను. ఆసమయముననే “హార్స్
ను” అను మఱియొకజ్యోతిర్విదుఁడు సూర్యమండలము శోధింప సంభవించెను.
ఆతఁడును సూర్యమండలమునందు మహాతేజము కనిపించెనని వ్రాసియున్నాఁడు.
తరువాత, ప్రపంచమునం దనేకభాగములయందు స్కాంతసంక్షోభచిహ్నములు
కనిపించినవి. తంత్రీవార్తలు నిలిచిపోయెను; విద్యుద్ఘటములు మండిపోయెను.
మఱునాఁటిరాత్రి యుత్తరదక్షిణధ్రువములయందు విద్యుత్తేజములు ప్రజ్వలించె
ను. నక్షత్రశాలాస్కాంతయంత్రములు ఝుళుక్కు రనియెను. ఒక్కమాఱు భూ
గర్భమంతయు, లోకాత్మయగు నాతేజోమండలమందుఁ గలుగుసంక్షోభమున
కనుగుణముగా నదరి సహధర్మత వహించి వడవడ వడంకెను. సూర్యమండలము
నుండి, 9,30,00000 మైళ్ల దూరము నందున్న భూమియందె యాసూర్యుని
తేజశ్ఛాదనమునందుఁ గలుగు మార్పులకు సమానముగా మార్పులు కనిపించు
చుండు నేని నింతకన్నను దగ్గఱగనున్న శుక్రమండలమునం దిట్టిచిత్రము లెంత
విశేషముగ నుండవలయును? శుక్రునికన్నను మఱియు సమీపమున నున్న బుధ
మండలమం దెంతతీవ్రముగ నుండవలయును? అంతేకాక, యీసంక్షోభతరంగ
ము సూర్యునియందు బయలుదేఱి బుధమండలము నెల్ల నూఁచి శుక్రలోకము
నల్లలాడించి, భూమండలము నదరఁజేసి, యంతట నాఁగె నని యెవరు చెప్పఁ
గలరు? అంగారకగ్రహ మెంత యదరెనో; గ్రహములం దెల్ల మేటియైన గురుఁ
డెట్లు కదలెనో, శనియు నెట్లు మెల్లగ నత్తమిల్లెనో, యటుపైని వరుణ నభ
స్తూణు లెంతెంతయుచ్ఛ్వసించిరో యెట్లు తెలియ నగును? ఈగ్రహమండలమె
కాక మహావకాశమం దజ్ఞాతమార్గముల సంతతభ్రమణాయమానములగు ధూమ
కేతూల్కాసంతానములును జగత్కేంద్రమగు నాతేజఃపిండమునం దేమాత్రము
చలనముకలిగినను దాము ననుకంపితములు గా వని యెవరు చెప్పఁగలరు?

ఈచిన్నవ్యాసమునందు, సూర్యమండలమును గుఱించి తెలిసినవిషయము
లన్నియును వ్రాయుట కవకాశము లేదు. అయినను మఱొక్కవిషయము మాత్ర
ము చెప్పనిదె, సూర్యమండలమును గుఱించి, యేమియుఁ జెప్పనిదె యగును
గావునఁ, గొంచెము వ్రాయవలయును. సూర్యగ్రహణము లప్పుడప్పుడు పట్టుచునె
యుండును. అయినను సంపూర్ణసూర్యగ్రహణములు మాత్ర మెప్పుడోకాని
మనదేశమునఁ గనిపింపవు. అట్టి సంపూర్ణసూర్యగ్రహణములను జూడవలయు
నన్నచో నవి పట్టుచోటునకు వెళ్లవలయును. ఆగ్రహణము పట్టినప్పుడు సూర్యు

మండలముఁ బరీక్షించినయెడలఁ బెద్దపరివేష మొకటి కానిపించును. ఈపరివేషము సూర్యుని కిరువంకలను, 8,50,000 మైళ్లవఱకును వ్యాపించునట్లు చెప్పుచున్నారు.

చాలకాలమువఱకు నీపరివేషము లేమైనవియు నెవరికిని దెలిసినదికాదు. కొంద ఱది భూమిచుట్టును మనకు గాలి యున్నట్టులే సూర్యునిచుట్టును గల గాలి యని యభిప్రాయపడిరి. సూర్యమండల మెక్కువ వేఁడిగా నుండుటవలన దాని చుట్టునున్న యీ వాతావరణము వేఁడిమిచే మెఱయుచున్నదని యనుకొనిరి. మఱియు సూర్యోపరిభాగములయందు వెలుఁగునది "ఉదజని" యను నొకగాలి యని నిశ్చయముగఁ దెలిసినది. ఈపరివేషములును సూర్యమండలము నంటుకొని యున్నచో మనభూమిపై గాలి యానుకొని యున్నటులే యీయుదజనియు సూర్యునిపై నానియుండును. గాలి భూమిపై బరువు మోయునటులే, సూర్యునిపై యుదజనిగాలియు నొత్తుచుండవలయును.

ఉదజని మొదలగు వాయువులు జ్వలించునపుడు గలుగు వెలుఁగు కిరణశోధినీయంత్రముచేఁ బరీక్షింపవచ్చును. అట్లు పరీక్షించినచో నావాయువులు పలుచగా నున్నపు డొకవిధ మగురంగుపట్టెలును దట్టముగా నున్నపుడు మఱి యొకవిధముగను గనిపించును. కనుక వర్ణప్రాధాన్యమునుబట్టి యుదజని యెంత పలుచగ నున్నది, యెంతయొత్తుగ నున్నది గుర్తింపవచ్చును.

సూర్యపరివేషకాంతిని బరీక్షించిచూచిన నందుదజని వెలుఁగుచున్నట్లు తెలిసెను. వెలుఁగునుబట్టి యుదజని యొకమాత్రపు టొత్తుగనే యున్నట్లు తెలిసెను. మఱియు నీపరివేషము సూర్యుని కీవలావల 8,50,000 మైళ్లవఱకు వ్యాపించి యున్నకారణమువలన, నది సూర్యమండలము నంటియే యున్న దని నిశ్చయించినచో, నంత గాలివలనఁ గలుగు నొత్తు డాసూర్యోపరితలమున నుపద్రవముగా నుండవలయును. ఉదజని యంతయు ద్రవావస్థయందె కాక ఘనీభవించియు నుండవలయును. అయినను సూర్యమండలము విశేషము వేఁడిగ నుండుటవలన నీయుదజని ఘనీభవింపక పోయినను సూర్యమండల మంతయు మనభూమివలెనే గట్టిపడి యుండవలయును. అట్టిచిహ్నము లేవియు నింతవఱకుఁ గానిపింపని కారణమున నీయుదజని సూర్యమండలము నంటియున్న వాతావరణము కా దని తేలుచున్నది.

అంతేకాక పరివేషతేజస్సువలన వచ్చినరంగుపట్టెలు సర్వసామాన్యముగా సూర్యకాంతివలన వచ్చురంగుపట్టెలవలెనె యున్నవి. వానియందు నచ్చటచ్చట నల్లని యంతరాయములును గలవు. నడుమ నడుమఁ జుట్టుపట్టులకన్న స్పష్టముగ నుండు పట్టెలును గాన్పించినవి. ఇవి ధ్రువవైద్యుతకాంతులను బోలి యుండుట వలన, ధ్రువవైద్యుతకాంతికినిఁ బరివేషకాంతికిని హేతుసామాన్యము కల దని నిశ్చయింపవచ్చును. కాని, ధ్రువవైద్యుతకాంతులకుఁ గారణముభూమినుండి వెలువడి సమీపగత ధూమకేతూల్కాదులలోని విద్యుత్తుతో లయించు విద్యుత్తేయని సామాన్యముగఁ దెలిసిన విషయమె. సూర్యునితోఁ బోల్చిన నెంతయో చిన్నదగు భూమండలము సమీపమునందె సర్వకాలములయందు నుల్కాదికములు చేరియున్న యెడల గ్రహరాజ మగు సూర్యమండలము సమీపమున నింక నెన్ని యుండవలయును? సూర్యమండలమునకు నట్టి యుల్కాసమూహములకును విద్యుత్సంపర్కము నెంతవిస్తారముగ నుండవలయును? అట్టి యుల్కాసంఘము లున్నను బ్రతిదినము మనకుఁ గనఁబడవేల? యనిన సూర్యరశ్మి విశేషముగ నుండుట వలన వాని వెలుఁగు మాటుపడి యుండును. సంపూర్ణసూర్యగ్రహణము కలిగినపుడు మాత్రమె యవి స్పష్టపడుట కవకాశము కలుగును.

ఈవిధముగ సూర్యమండలము కోట్లకొలఁది సంవత్సరములనుండి వెలుఁగుచున్నది. అవిచ్ఛిన్నముగ నుష్ణము తేజస్సులు లోకలోకములకు వ్యాపించుచున్నవి. సూర్యమండలమునుండి ప్రతినిమిషమును గణనాతీతమైన తేజస్సీవలకు వచ్చుచున్నది. అయినను నష్టముమాత్రము కన్పించుటలేదు. ఇంతవేఁడి యెట్లు కలుగుచున్నది? ఎన్నఁటికైనను సూర్యమండలము చల్లాఱునా యనుసందేహము కలుగక మానదు.

క్రమక్రమముగా సూర్యుని తేజస్సు తగ్గుచునేయున్నను దిరిగి పూర్తియగుటకు నవకాశములు గలవు. సూర్యునిచుట్టు నసంఖ్యాకములగు నుల్కాసంఘములు తిరుగుచున్నవి. ప్రతి నిమిషమున వేనవేలు సూర్యునిలో లయించుచున్నవి. వీనివలన వేఁడిమి హెచ్చుచుండును. అట్టి యుల్కలు సూర్యునియందుఁ జేరుచున్నను సూర్యమండలములోని పదార్థము విశేషము వృద్ధిఁ బొందినట్లు పైకిఁ గనఁబడదు. దీనితోపాటు సూర్యమండలము కొంచెము కొంచెము

సంకోచించును. ఇట్టి సంకోచమువలనను, వేఁడిమి పుట్టును. ఇదియే సూర్య మండల మింతవఱకుఁ జల్లాఱకుండుటకుఁ బ్రబలకారణము.

ఇంతవఱకును సూర్యమండలముఁ గూర్చి మనము నేర్చికొనిన దానింబట్టి భూమియందుఁ గలపదార్థము లన్నియు సూర్యునియందుఁ గలవనియు, సూర్యునికిని భూమికి నెడలేని సంబంధము గలదనియు, సూర్యునియం దేమాత్రము మార్పు కలిగినను భూమియందును దానికిఁ దగినమార్పు గలుగుచుండు ననియుఁ దెలిసినది. ఇంతేకాక, దీనింబట్టి యాకాశమందు లక్షలకొలఁది గాన్పించు నక్షత్రము లన్నియు నన్నిసూర్యమండలములె యగుటవలనను, సూర్యునితో సామ్యము భూమికిని గ్రహములకును మాత్రమె కలిగి తక్కినవానికి లేదనుట సమంజము గాదు కావునను, దన్నక్షత్రములందు సహితము మనభూద్రవ్యము లన్నియు నుండఁదగు నని యూహింపఁగలము. సూర్యునిచుట్టు నిన్నిమండలములు తిరుగుచున్నటులె మన కందరానివై కేవల ధర్మముచే నాకాశమునందు నిలిచియున్న యానక్షత్రస్వరూపసూర్యమండలములచుట్టు, యంత్రదుర్గ్రాహ్యములై యెన్నెనిలోకములు సంచరించుచున్నవో, యాలోకములందు భూమియందు మనమువలె, నెంతెంత కుశాగ్రబుద్ధులైన ప్రాణులు నివసించుచున్నారో, కన్నులుమూసి యొక్కమాఱు ధ్యానించుకొనినయెడల నెవ్వనిశరీరము ఝల్లుమనకుండును ?

ఢేవము - వేంకటాచలపతి.

# అనుబంధము

## శ్రీ సిద్ధార్థిసంవత్సర పరిషత్పత్రికలోఁ బ్రకటింపఁబడిన వ్యాసములయొక్కయుఁ దత్కర్తలయొక్కయు నామములు.

# ఆంధ్రసాహిత్యపరిషత్పుస్తకభాండాగారము.

(TELUGU ACADEMY)

# అకారాద్యముద్రితగ్రంథసూచిక

మొదటిభాగము.



చెన్నపురి:

శ్రీనివాసవరదాచారి కంపెనివారిచే ముద్రింపఁబడినది.

1920

వెల రు. ౧-౮-౦.

శ్రీ

# ఆంధ్ర సాహిత్యపరిషత్పుస్తకభాండాగారము.

## ఆంధ్రాముద్రితగ్రంథములు.

### అకారాది విషయానుక్రమణిక.

| ప్రతుల సంఖ్య. | గ్రంథనామము. | | గ్రంథకర్తృనామము. |
|---|---|---|---|
| | **పురాణములు—ఇతిహాసములు.** | | |
| 2 | అచ్చతెనుఁగురామాయణము | ... | కూచిమంచి తిమ్మకవి. |
| 2 | అతికాయయుద్ధము (ద్విపద) | ... | రంగనాథుఁడు. |
| 2 | అధ్యాత్మరామాయణము | ... | పరశురామపంతుల లింగమూర్తి |
| 2 | అధ్యాత్మరామాయణము | ... | నాగయామాత్యుఁడు. |
| 1 | ఆదిత్యపురాణము | ... | పినయాదిత్యుఁడు. |
| 1 | ఆంధ్రమాఘపురాణము | ... | రామదాసప్రధానుఁడు. |
| 17 | ఉత్తరరామాయణము | ... | కంకంటి పాపరాజు. |
| 2 | ఉత్తరరామాయణము (ద్విపద) | ... | కాచరాజు, విఠ్ఠలరాజు. |
| 17 | గజేంద్రమోక్షము (భాగవతములోనిది.) | | పోతరాజు. |
| 1 | గరుడపురాణము | .. | వరదరాజకవి. |
| 1 | గోపికాగీతలు (భాగవతములోనిది) | ... | పోతరాజు. |
| 1 | ఘోషయాత్ర (భారతములోనిది) | ... | తిక్కన సోమయాజి. |
| 3 | జైమినిభారతము (పద్యము) | ... | పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి. |
| 1 | దేవీభాగవతము | .. | ములుగు పాపయ్యకవి. |
| 2 | నారదీయపురాణము | ... | అల్లాడి నరసింహాకవి. |
| 5 | నిర్వచనోత్తరరామాయణము | ... | తిక్కన. |
| 1 | నిర్వచనోత్తరరామాయణశేషము | ... | జయంతి రామభట్టకవి. |
| 3 | పద్మపురాణోత్తరఖండము | ... | మడికి సింగన్న. |
| 2 | బసవపురాణము (ద్విపద) | ... | పాల్కురికి సోమనాథుఁడు. |
| 2 | బసవపురాణము (పద్యము) | ... | |
| 1 | బృహన్నారదీయపురాణము | ... | క్రొత్తలంక మృత్యుంజయకవి. |

